శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే కూరనాథగురవే నమః



కూరేశులు అనుగ్రహించిన

# పంచస్తవి

( తాత్పర్య విశేష సహితం )

**"పండితరత్న"**
**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు**

కూరనాథ సహస్రాబ్దిస్మారక ప్రచురణము
2011

**పంచస్తవి** (తాత్పర్య విశేష సహితం)

**"పండితరత్న". ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు,**

ద్వితీయముద్రణ : ఫిబ్రవరి, 2011
విక్రుతి - త్రైమాసం - హస్త

ప్రతులు : 500

వెల : అమూల్యం



ముఖచిత్రం : కూరత్తా ళ్వాన్, కూరం.

ఆవిష్కరణము : కూరత్తా ళ్వాన్ తిరునక్షత్ర మహోత్సవం, 25-1-2011

వేదిక : సత్సంప్రదాయపరిరక్షణ సభ, వరంగల్

ఈ గ్రంథము

**నాలాయిర దివ్యప్రబంధ పారాయణగోష్ఠి**
**(హనుమకొండ, వరంగల్లు),**

మరియు

**చాత్తాద శ్రీవైష్ణవ సంప్రదాయ పరిరక్షణ సమితి**
**(హనుమకొండ, వరంగల్లు)**

సమర్పించిన పవిత్ర ద్రవ్యంతో ముద్రింపబడింది.

ప్రతులకు : **1)** చాత్తాద శ్రీవైష్ణవసంప్రదాయ పరిరక్షణ సమితి
**4-7-35**, కుమారపల్లి, హనుమకొండ-**506 001**
ఫోన్ : **0870-2550081**, సెల్ : **92966 01726**

డి.టి.పి. : శ్రీమతి ఏ.ఎస్. జయలక్ష్మి, తిరుపతి
శ్రీ ఎస్.చంద్రశేఖర్, తిరుపతి

ముద్రణ : సి.ఎస్. ప్రింటర్స్, తిరుపతి

**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే ।**
**యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥**



శ్రీసూక్తిః జయతాత్తరాం సువిమలా శ్రీకూరనాథస్య యా
శ్రుత్యంతద్వయతత్త్వసార మధురా విద్వజ్జనానందినీ! ।
లక్ష్మీనాథసురూపవైభవగుణస్తోమస్వరూపాదికాన్
సుస్పష్టం విశదీకరోతి వివిధైః తర్కైః ప్రమాణానుగైః ॥

విశిష్టాద్వైతసిద్ధాంతతత్త్వసర్వస్వదీపికా ।
కూరనాథోదితా పంచస్తవీ భక్తరసాయనమ్ ॥

వాచామగోచరమహాగుణదేశికాగ్ర్య-
కూరాధినాథగురుశేఖరసంప్రణీతా ।
పంచస్తవీ నిగమతత్త్వమధుప్రపూర్ణా
భక్తాళిమోదజననాయ సమర్ప్యతైషా ॥

కూరనాథసహస్రాబ్దిస్మృతి ర్భక్త్యా సమర్ప్యతే ।
వాచికీ వరివస్యేయం సవిధే తత్పదాబ్జయోః ॥



## ఈ గ్రంథముద్రణకు కైంకర్యము చేసిన భాగవతోత్తములు

| నామధేయము | నివాసము | కైంకర్యము |
|---|---|---|
| కీ.శే. శ్రీమాన్ శ్రీపెరుంబూదూరు కూరత్తాళ్వార్ | ఖమ్మం | 11000/- |
| శ్రీమాన్ యదుగిరి మురళీధర్ స్వామి | హైదరాబాద్ | 5001/- |
| శ్రీమాన్ యదుగిరి వేంకటకృష్ణ | హైదరాబాదు | 5001/- |
| శ్రీమాన్ తిరునగరి వేంకటేశ్వర స్వామి | హన్మకొండ | 3001/- |
| శ్రీమాన్ తిరుక్కోవళూరి వేంకటయ్య స్వామి | వరంగల్ | 3001/- |
| శ్రీమాన్ తాడూరు వేంకటేశ్వర స్వామి | హన్మకొండ | 3001/- |
| శ్రీమాన్ రేబెల్లి వెంకటేశ్వరస్వామి | హన్మకొండ | 3001/- |
| శ్రీమాన్ సూరినేని శ్రీమన్నారాయణ | హన్మకొండ | 3001/- |
| శ్రీమాన్ తిరునగరి శరత్‌బాబు | హైదరాబాదు | 3001/- |
| శ్రీమాన్ పుల్లఖండం వేంకటేశ్వర స్వామి | భద్రాచలం | 5116/- |
| శ్రీమాన్ పుల్లఖండం ఉపేంద్రస్వామి | హైదరాబాద్ | |
| శ్రీమాన్ పుల్లఖండం పాండురంగస్వామి | హైదరాబాద్ | |
| శ్రీమతి యాదుగిరి పుష్పమ్మ | హన్మకొండ | 1500/- |
| శ్రీమాన్ దాస్యం వేంకటేశ్వరస్వామి | హైదరాబాదు | 1000/- |
| శ్రీమతి & శ్రీ పెరుంబూదూర్ రాధాలక్ష్మి | ఖమ్మం | 1116/- |
| కీ.శే. శ్రీమతి సుజాత & శ్రీ శ్రీనివాసస్వామి | ఖమ్మం | 1116/- |
| శ్రీమాన్ తిరుక్కోవళూరు మురళీధర్ స్వామి | ఖమ్మం | 1000/- |
| శ్రీరంగపురి అరుణ్‌మోహన్ | ఖమ్మం | 1000/- |
| తాళ్ళూరి సీతారామస్వామి | ఖమ్మం | 1000/- |
| శ్రీమాన్ శ్రీ పెరుంబూదూర్ భాస్కర్ | ఖమ్మం | 501/- |
| శ్రీమాన్ తిరునగరి ఉపేంద్రస్వామి | ఖమ్మం | 501/- |
| శ్రీమాన్ తాళ్ళూరి సత్యనారాయణస్వామి | ఖమ్మం | 501/- |
| శ్రీమాన్ తిరునగరి పాండురంగస్వామి | ఖమ్మం | 501/- |
| శ్రీమాన్ తిరునగరి నరసింహస్వామి | కొత్తగూడెం | 501/- |
| శ్రీమాన్ తిరునగరి రామచూడమ్మ, పురుషోత్తంస్వామి | ఖమ్మం | 501/- |
| శ్రీమాన్ త్రిదండపాణి సుదర్శనస్వామి | హైదరాబాద్ | 501/- |
| శ్రీమాన్ తిరునగరి మురళీధర్‌స్వామి | హన్మకొండ | 501/- |
| శ్రీమతి వి.కమలకుమారి, విజయకుమారి | హన్మకొండ | 501/- |
| శ్రీమాన్ తిరునగరి అమరేందర్ | ఖమ్మం | 100/- |

మహామహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, శాస్త్రరత్నాకర
**ఉ.వే. శ్రీమాన్ డా॥ శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యస్వామివారు**
అధ్యక్షులు, సత్సంప్రదాయ పరిరక్షణ సభ
శివనగర్, వరంగల్-506 002

# మకరహస్త ప్రశస్తి

ఒక వేయి సంవత్సరాలకు పూర్వం తుండీరమండలము అను ద్రవిడదేశ ప్రాన్తమున కూరము అను అగ్రహారమున పవిత్రశ్రీవైష్ణవకుటుంబమున అప్పటి సౌమ్య సంవత్సరమున మకరమాసంలో హస్త నక్షత్రమున శ్రీవత్సచిహ్నమిశ్రులనే నామధేయం గల మహాచార్యులు అవతరించినారు. వీరినే కూరత్తాழ்వాన్ అని శ్రీవైష్ణవ సంప్రదాయస్థులు వ్యవహరిస్తారు. భగవద్రామానుజులవారిని ఆశ్రయించి, వారివద్ద పంచసంస్కారములను పొందిన ఈ మహాచార్యులు స్వాచార్యులకు సిద్ధాన్తసంరక్షణలో కుడిభుజముగా వ్యవహరించి వారి పూర్ణాభిమానపాత్రులైన ప్రథమశిష్యులు. ఇప్పటికి వీరి అవతారము జరిగి వేయి సంవత్సరములు నిండిన సందర్భముగా శ్రీవైష్ణవమండలి సహస్రాబ్దిమహోత్సవమును ఆనన్దముతో జరుపుకొనుచున్నది. ఏతన్నిమిత్తముగా వారు ప్రసాదించిన పంచస్తవిని ఆన్ధ్రసంగ్రహవివరణముతో ముద్రించి ప్రకటింపవలెననే సద్భావనతో మా ప్రియమిత్రులైన శ్రీమాన్ పి. గోపాలకృష్ణమూర్తిగారు సంకల్పించుట, తదనుసారముగా పండితప్రకాండులైన శ్రీమాన్ ఇ.ఏ. శింగరాచార్యులు ఆ గ్రంథమునకు అన్యూనాతిరిక్తముగా లఘువ్యాఖ్యను లలితమధురభాషలో వ్రాయుట, వెంటనే దానిని సహస్రాబ్దిసందర్భము నరసాపురంలో ప్రచురించుట జరిగినది. సహస్రాబ్దిపూర్తి అయి ఒక మొదటి సంవత్సరము గడచిన సందర్భమున వరంగల్ నగరవాసులైన **నాలాయిర దివ్యప్రబంధ పారాయణ గోష్ఠివారికి, శాత్తాద శ్రీవైష్ణవ సంప్రదాయ పరిరక్షణ** సమితివారికి దీనిని పునర్ముద్రణ గావించి శ్రీవైష్ణభక్తులకు అందించవలెననే కోరిక కలుగుట, వారి ద్రవ్యసహాయంతోనే ఇపుడు మరల ఇది మాత్రమే విచారమునొందుట అత్యంత ప్రహర్షణీయమైన విషయము. ఈ పవిత్రకైంకర్యమునకు తలపెట్టిన దివ్యప్రబంధపారాయణగోష్ఠి వారికి, పునర్ముద్రణ కొరకు దీనిని సిద్ధపరచి ఇచ్చిన శ్రీమాన్ పండితరత్న ఇ.ఏ. శింగరాచార్య స్వామివారికిని శ్రీవైష్ణవలోకము కృతజ్ఞతాబద్ధమై యుండవలెను.

శ్రీవైకుంఠస్తవము, అతిమానుషస్తవము, సుందరబాహుస్తవము, వరదరాజస్తవము, శ్రీస్తవము - అను పేర్లు కలిగిన స్తోత్రముల సమాహారరూపమైన ఈ పంచస్తవి శ్రీమన్నారాయణుని పరత్వమును, సమస్తకల్యాణగుణగణములను సమగ్రముగా తెలుపుతూ, ఆ స్వామియే సర్వసంరక్షకుడని, ఆశ్రయించి తరింపుడని సప్రమాణముగా తెలుపు మహాగ్రంథము. సంస్కృతభాషలోనున్న ఇది అందరికీ సులభగ్రాహ్యము కానందున ఆంధ్రభాషలో సులభశైలిలో వివరించి శ్రీమాన్ శింగరాచార్యులుగారు లోకమునకు అందించుచున్నారు. బహుద్రవ్యసాధ్యము ముద్రణ కనుక, అందులకు తమ ద్రవ్యమును సద్వినియోగమొనర్చి ధన్యులైనవారు శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తి గారు. పునర్ముద్రణావసరమును గుర్తించి జిజ్ఞాసువులకు అందరికిని అందించుటకు ముందుకు వచ్చినవారు వరంగల్ నగరంలోని శ్రీవైష్ణవసంప్రదాయనిష్ఠులు. నాలాయిర దివ్యప్రబంధపారాయణ గోష్ఠివారు, శాత్తాద శ్రీవైష్ణవసంప్రదాయ పరిరక్షణ సమితివారు. మాకు అమితానందమును కలిగించిన వీరికి అందరికినీ సిద్ధాంతప్రచారమునందు ఇతోధిక భక్తిశ్రద్ధలను పెంపొందించి శ్రీ శ్రియఃపతులు, ఆళ్వారులు, ఆచార్యపరం పరయును సమస్తసన్మంగళములను ప్రసాదించెదరు గాక అని హృదయపూర్వకముగా ఆకాంక్షించుచున్నాను.

ఇట్లు

**శ్రీ న.చ. రఘునాథాచార్యులు**
**మహామహోపాధ్యాయ**
**అధ్యక్షులు, సత్సంప్రదాయపరిరక్షణసభ**
**వరంగల్**

# కృతజ్ఞతావిష్కరణ

శ్రీవైష్ణవసంప్రదాయంలో ఆచార్యస్థానం చాలా ఉన్నతమైనది. మాతాపితరులు భౌతికజన్మను ప్రసాదిస్తే, ఆచార్యులు జీవునికి జ్ఞానజన్మ నిచ్చి పాపపంకిలమైన ఈ శరీరాన్ని సంస్కరించి, పూజాయోగ్యమైన పుష్పంగా మార్చి, ఆ పరమాత్మ సన్నిధిని ఆత్మసమర్పణ చేసుకొనే అర్హతను అవకాశాన్ని కలిగిస్తాడు. ప్రణవము మూడక్షరాల కలయిక. అవి **"అ+ ఉ+మ్"**. ఈ మూడింటి సంగమమే ఓంకారము. **"అక్షరాణా మకారోఽస్మి"** అని భగవానుడు శ్రీమద్భగవద్గీతలో తన ఉనికిని తెలియపరచాడు. 'అ'కారవాచ్యుడు పరమాత్మైతే, 'మ్' కారవాచ్యుడైన జీవుడు శేషభూతుడని ప్రణవములోని మధ్య అక్షరమైన 'ఉ' కారం తెలుపుతుంది. ఆ 'ఉ'కారవాచ్యుడైన ఆచార్యుడే తన పురుషకారంతో జీవుడు పరమాత్మకే శేషభూతుడే సత్యాన్ని తెలిపి జీవుని ఉద్ధరిస్తాడు.

మనకెంతోమంది పూర్వాచార్యులున్నారు. అందు ఆచార్యస్థానానికి పరిపూర్ణ నిదర్శనం శ్రీకూరత్తాళ్వానులు మాత్రమే. ఒకవేళ ఆచార్యస్థానానికి ఒక రూపు కల్పిస్తే ఆ రూపానికి శ్రీకూరత్తాళ్వాన్ మాత్రమే సరితూగగలరు. సచ్ఛిశ్యుడు కానివాడు సదాచార్యుడు కాలేడేమో అన్నసత్యానికికూడ పరిపూర్ణత శ్రీకూరనాథులవల్ల మాత్రమే సాధ్యమైనవి.

ఈరోజు విశిష్టాద్వైతప్రవర్తకాచార్యులైన శ్రీభగవద్రామానుజులను స్మరిస్తున్నా మంటే, వారి ఉనికికి కారణభూతులు శ్రీకూరనాథులే. **'గురుం ప్రకాశయేద్ధీమాన్'** అన్నట్లు శ్రీరామానుజుల వైభవాన్ని ప్రకాశింపజేయుటయేకాక, ఆచార్య ఆజ్ఞ నుల్లంఘించిన శ్రీరామానుజులను తమ సంబంధంతో ఆ అపచారంనుండి ముక్తులను చేసిన శిష్యరత్నం శ్రీకూరేశులు. మర్యాదాపురుషోత్తముడుగా ప్రస్తుతించబడిన శ్రీరామచంద్ర స్వామిలోనైనా వెతికితే ఒకటో రెండో లోపాలు దొరకవచ్చునేమో కాని, శ్రీకూరనాథునిలో దివిటీ పట్టి వెతికినా ఎలాంటి దోషాలు కనిపించవు. కేవలం ఆచార్య, శిష్యస్థానాలకే కాదు, పరిపూర్ణ మానవతా విలువలకు కూడ శ్రీకూరనాథులే పరిపూర్ణ నిదర్శనమని మన పూర్వాచార్యులంతా ముక్తకంఠంతో లోకానికి చాటిన పరమ ప్రామాణికమైన సత్యం. శ్రీరామానుజుల అపరావ తారమైన శ్రీమణవాళమామునులు కూడ తమ **'యతిరాజవింశతి'**లో శ్రీకూరనాథులవైభవాన్ని ఈ శ్లోకంద్వారా ప్రకటించారు.

**వాచామగోచరమహాగుణదేశికాగ్ర్య కూరాధినాథకథితాఖిలనైచ్యపాత్రమ్ ।**
**ఏషోఽహమేవ న పున ర్జగతీదృశస్తత్ రామానుజార్య! కరుణైవ తు మద్గతి స్తే॥**

ఓ రామానుజా! వాచామగోచరమై, వర్ణింప శక్యం కాని కళ్యాణగుణాల కాస్పదమైన ఆచార్యులైన కూరత్తాళ్వాన్‌లు అనుగ్రహించిన సమస్తనైచ్యమునకు నేనే పాత్రుడను- అని కూరనాథుల వైభవాన్ని తమ యతిరాజవిశంతిలో ప్రస్తుతించారు.

శ్రీకూరనాథులు మనపై అపారమైన అనుగ్రహంతో ఐదు స్తవాలను అనుగ్రహించారు. అవి - **(1) శ్రీవైకుంఠస్తవము, (2) అతిమానుషస్తవము, (3) సుందర బాహుస్తవము, (4) శ్రీవరదరాజస్తవము, (5) శ్రీస్తవము.** ఈ ఐదు స్తవాలు శ్రీవైష్ణవ సంప్రదాయంలో విశేషప్రాచుర్యం పొందడమేకాక, ద్వయమంత్రవివరణగా పెద్దలచే ఆమోదింపబడినవి. శ్రీకూరనాథులు తమ పంచస్తవిని మాంగల్యంగా పరమాత్మచే వేదమాత గళసీమ నలంకరింపజేసిన ఆచార్యశిరోమణి.

**పండితరత్న, ఉభయవేదాంత వాచస్పతి, సాంప్రదాయశిరోమణి, ఉ.వే. శ్రీమాన్ డా॥ ఇ.ఏ. శింగరాచార్య స్వామివారు** శ్రీకూరనాథ సహస్రాబ్ది సందర్భముగా పంచస్తవాలకు తాత్పర్య విశేషాలను గ్రహించారు. ఒక భక్తుడు దానిని గ్రంథరూపంలో ముద్రించి కూరనాథుల సహస్రాబ్దిప్రారంభంలో నరసాపురంలో గత సంవత్సరం ఆవిష్కరణ జరిగి భాగవతోత్తములకు వితరణ చేయుట జరిగింది. ఈ సహస్రాబ్ది ముగింపుగా మరికొన్ని ముద్రించి భాగవతకైంకర్యాన్ని చేయాలనే మా ఆకాంక్షను మన్నించి, అనుమతి నివ్వడమేకాక ఆ గ్రంథములో సముచితమైన కొన్ని విశేషాలను మా కోరిక మేర చేర్చి ఆ గ్రంథముద్రణభారాన్నికూడ మా అభ్యర్థన మేర తమపై వేసుకున్న ఆచార్యులు, అపరకూరనాథులుగా అభివర్ణించతగిన కృపామాత్రప్రసన్నాచార్యులు మా స్వామివారు. వారికి వాచికకైంకర్యంతో అంజలిబద్ధులమై కృతజ్ఞతను ప్రకటించుకోవడమే తప్ప ఎలా తీర్చుకోగలం వారి ఋణం? ఒక సదాచార్య సమాశ్రయణం ఒక అజ్ఞుణ్ణి ఎలా మార్చి వేయగలదో అందుకు ప్రత్యక్షఉదాహరణం మేమే. **మహామహోపాధ్యాయ కవిశాబ్దిక కేసరి, శాస్త్రరత్నాకర, ఉ.వే. డా॥ శ్రీమాన్ న.చ. రఘునాథ దేశికుల సమాశ్రయణం,** అనేకమంది ఉ.వే. పండితగోష్ఠితో పరిచయం కలగడం మా పూర్వజన్మ సుకృతంగా భావిస్తాము. అందునా, **ఉ.వే. శ్రీమాన్ డా॥ ఇ.ఏ. శింగరాచార్యస్వామి** గారంటే ఏదో అనిర్వచనీయమైన పూజ్యతాభావం. సంప్రదాయనిష్ఠులుగా వారి ఆణిముత్యాల్లాంటి గ్రంథాలను సంపాదించుకుని శ్రీవైష్ణవసంప్రదాయవైభవాన్ని ఆస్వాదించాను. ఈ మధ్య వారనుగ్రహించిన **"కూరేశగాథామృతలహరి"** దాసునికి నిత్యానుసంధేయగ్రంథమైనది. అపరకూరనాథాంశసంభూతులైన మా శింగరాచార్య శ్రీచరణసన్నిధిని స్వరూపాను రూపంగా అవనతశిరస్కులమై అంజలి బంధంతో స్వామివారు పల్లాండు పల్లాండుగా శతాధికవసంతాలు ఈ లీలావిభూతిలో వేంచేసి యుండి, ఇంకా ఎన్నో సంప్రదాయ

గ్రంథాలను అందించడానికి వలయు ఆయురారోగ్యాలను ప్రసాదించాలని ఆ తిరుమలేశుని ప్రార్థిస్తూ మా కృతజ్ఞతను ప్రకటించుకొనుచున్నాము. ఇంతటి మహత్తర కార్యనిర్వహణకు మా అర్హత ఏమి? అని ప్రశ్నించుకుంటే ఇచట శ్రీరామానుజులు హృదయనిర్వేదంలోనుండి జనించిన ఈ శ్లోకం అవశ్యం అనుసంధేయం.

**శ్లో॥ యత్పాదాంభోరుహధ్యాన విధ్వస్తాశేష కల్మషః ।**
**వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్ ॥**

ఈ తనియన్ భగవద్రామానుజులు తమ పరమాచార్యులైన యామునాచార్య స్వామి పాదపద్మములు సేవించుకుంటూ సర్వపాపములనుండి ముక్తుడనై ఒక వస్తువుగా మనగలిగితిని - అని తమ పరమాచార్యులై యామునమునులయెడ శ్రీమద్రామాను జులు కృతజ్ఞతను ప్రకటించుకున్నారు. అంతటి ఆచార్యులే తమ పరమాచార్యుల సన్నిధిని సేవించడంద్వారా ఒక వస్తువుగా మనగలిగినారంటే వారిముందు మా అర్హత ఎంత? అని ప్రశ్నించుకుంటే, మా అర్హతకేమి కొఱత? **అపరరామానుజాంశ సంభూతులు, మహామహోపాధ్యాయులు, కవిశాబ్దికకేసరి, శాస్త్రరత్నాకర, గజారోహణ,** బ్రహ్మరథాది గౌరవసమ్మానితులు అయిన ఉ.వే. శ్రీమాన్ డా॥ న.చ. రఘునాథాచార్య స్వామి శ్రీచరణ సన్నిధిని శిష్యులుగా వారిని సేవించుకుంటూ, వారి అనుగ్రహతరు చ్ఛాయలోనున్న మా అర్హతకేమీ కొఱత లేదు.

మా ఆచార్యస్వామికి, శ్రీమాన్ శింగరాచార్యస్వామి శ్రీచరణసన్నిధిని మఱొక మారు కృతజ్ఞతాంజలులను సమర్పించుకుంటున్నాము.

ఇట్లు

**శ్రీరఘునాథదేశికశ్రీచరణరేణువు**

తిరునగరి వేంకటేశ్వర్లు
నాలాయిర దివ్యప్రబంధ పారాయణ గోష్ఠి
శాత్తాద శ్రీవైష్ణవ సంప్రదాయ పరిరక్షణ సమితి
4-7-35, కుమార్‌పల్లి, హన్మకొండ, వరంగల్-506 001
ఫోన్ ల్యాండ్ : 0870-2550081
సెల్ : 9296601726

# అభినందనం

గత ఏడు నరసాపురంలోని శ్రీ ఆదికేశవ ఎమ్బెరుమానార్ స్వామివార్ల కోవెలలో ప్రపన్నాగ్రేసరులు, ఎంతో శ్రమను, ద్రవ్య వ్యయాన్ని వెచ్చించి ధార్మిక ప్రచారాన్ని పెద్దల, ఆత్మీయుల మంగళాశాసనాలతో అప్రతిహతంగా సాగిస్తున్న మిత్రమణులు శ్రీమాన్ పి. గోపాలకృష్ణమూర్తిగారి పవిత్ర ద్రవ్యంతో శ్రీకూరనాథుల సహస్రాబ్ది మహోత్సవాలు ఫిబ్రవరి నెలలో ఐదురోజుల పాటు వైభవంగా నిర్వహింపబడ్డం సువిదితం. ఆ ఉత్సవాల స్మృత్యకంగా శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తిగారు ఈ పంచస్తవిని తాత్పర్య విశేషాలతో ముద్రించారు. ముద్రించిన కొద్దినెలలోనే ఈ గ్రంథ ప్రతులు చెల్లిపోయినందున, మలిముద్రణకు చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఈ విషయాన్ని గుర్తించిన **భగవద్భాగవత కైంకర్యనిష్ఠులు, మహామహోపాధ్యాయ, శ్రీమాన్ రఘునాథాచార్య స్వామివారి (వరంగల్లు) శ్రీపాద సంబంధాన్ని కలవారు. అయిన శ్రీమాన్ టి. వెంకటేశ్వర్లు గారి** ప్రయత్నంతో ఇప్పుడు ఈ పునర్ముద్రణ **నాలాయిర దివ్యప్రబంధ పారాయణగోష్ఠి, హనుమకొండ, వరంగల్లు, చాత్తాద శ్రీవైష్ణవ సంప్రదాయ పరిరక్షణ సమితి, హనుమకొండ వరంగల్లు వారు** అందించిన ఆర్థిక సహాయంతో చేయబడుతున్నది. ఈ గ్రంథాన్ని ముద్రించడం ద్వారా పరమవైదికమైన శ్రీవైష్ణవసిద్ధాంతానికి, శ్రీకూరేశులకు, భాగవతులకు స్వరూపానురూపమైన కైంకర్యాన్ని చేసుకొంటున్న ఈ రెండు సంస్థలకు, వీరిని ప్రోత్సహించిన శ్రీమాన్ వెంకటేశ్వర్లుగారికి అనేక మంగళాశాసనములు. **శ్రీమాన్ వెంకటేశ్వర్లుగారికి** మార్గనిర్దేశం చేసి, ప్రోత్సహించిన **మహామహోపాధ్యాయ, ఉ.వే. శ్రీమాన్ డా॥ రఘునాథాచార్యస్వామివారి** సన్నిధిలో కృతజ్ఞతా పూర్వకంగా ప్రణమిల్లుతున్నాను. భవిష్యత్తులో ఈవిధంగానే మరిన్ని సద్గ్రంథాలు ఈ సంస్థల ద్వారా ముద్రింపబడాలని, ఆ విధంగా శ్రీనివాసుడు వారిని కటాక్షిస్తాడని ఆశిస్తున్నాను. ఈ గ్రంథం **గురువర్యులైన శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారి శ్రీహస్తాల ద్వారా** ఆవిష్కరింపబడడం కూడా అత్యంతం సముచితం. పూర్వం వలెనే ఈ ముద్రణ కూడా పలువురు ఆస్తికులైన సహృదయుల ఆదరాభిమానాలను చూరగొంటుందని భావిస్తున్నాను.

ఇట్లు నివేదించే

తిరుపతి — బుధజననియోజ్యుడు

20-1-2010 — ఈ. ఏ. శింగరాచార్యులు



శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే కూరనాథాయ నమః



# కూరేశవైభవం

**అర్వాంచో యత్పదసరసిజద్వంద్వ మాశ్రిత్య పూర్వే**
**మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా దేశికా ముక్తి మాపుః ।**
**సోఽయం రామానుజముని రపి స్వీయముక్తిం కరస్థాం**
**యత్సంబంధా దమనుత కథం వర్ణ్యతే కూరనాథః ॥**

అంతు లేని, సాటి లేని వైభవాన్ని కలవారు, అపారమైన కరుణకు సముద్రం వంటివారు, సమస్తకల్యాణగుణాలను కలవారు, శ్రీమన్నారాయణుడే పరతత్త్వం అనే సత్యాన్ని ప్రతిపాదించే పరమవైదికసిద్ధాంతమైన విశిష్టాద్వైతాన్ని రక్షించడంకోసం తమ నేత్రాలను రెండింటిని త్యాగం చేసినవారు, పరమపావనచరిత్రులు, పంచస్తవ ప్రణేతలుగా ప్రసిద్ధులు అయిన శ్రీవత్సాంకనామధేయులు, శ్రీవైష్ణవసంప్రదాయంలో కూరత్తాళ్వాన్, కూరేశులు, కూరనాథులు- ఇత్యాదినామాలతో కూడా ప్రసిద్ధులు. వీరి మహిమను వర్ణించడానికి వాచస్పతిగా కీర్తింపబడే బృహస్పతికూడా సమర్థుడు కాడన్నది పొగడ్త కాదు; వాస్తవం. శ్రియఃపతివైభవాన్ని వర్ణించడం ఒకవేళ సాధ్యమైనా, శ్రీరామానుజుల మహిమను వర్ణించడం వీలయే పనికాదని భగవద్రామానుజుల అంతరంగశిష్యులలో ఒకరైన ముదలియాణ్డాన్ (దాశరథి) అనేవారు. శ్రీరామానుజుల మహిమను వర్ణించడం సాధ్యమైనా, శ్రీకూరేశుల మహిమను వర్ణించడం మాత్రం సాధ్యం కాదని మన పూర్వాచార్యులు ముక్తకంఠంగా నొక్కి వక్కాణించే అభిప్రాయం.

మానవునకు ఉండవలసిన గుణాలో ముఖ్యమైనవి జీవకారుణ్యం, ఆచార్యభక్తి, భగవద్భక్తి, లౌకికసుఖంలో వైరాగ్యం, వైదుష్యం, సత్కర్మానుష్ఠానం మొదలైనవి. ఇవి అన్నీ మూర్తీభవించిన రూపమే కూరేశులు. వీరి దివ్యచరితానుసంధానం శ్రీవైష్ణవు లందరికీ తప్పక కర్తవ్యం. ప్రత్యేకించి, కూరేశుల సహస్రాబ్ది పూర్తి ఉత్సవాలు జరిగే ఈ సమయంలో ఈ మహనీయులను స్మరించడం అవశ్యకర్తవ్యమనే అభిప్రాయంతో వారి మహావైభవసముద్రంలోని చిన్ని కణాలను కొన్నిటినిమాత్రం ఆస్వాదించి ఆనందించడానికి ఈ చిన్న ప్రయత్నం చేయబడుతున్నది.

**కూరేశుల అవతారం :** ముక్తిప్రదాయకాలైన క్షేత్రాలుగా పౌరాణికప్రసిద్ధిని పొందిన వానిలో ఒకటైన కాంచీనగరానికి వాయవ్యదిక్కులో "కూరమ్" అనే ఒక అగ్రహారం ఉన్నది. కూరేశుల తండ్రి పేరు కూరత్తాళ్వార్ అని దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో తెలుపబడింది. కూరేశులు సౌమ్యవర్షంలో (క్రీ.శ.1008 సం) పుష్యమాసం హస్తనక్షత్రంలో కూరత్తాళ్వార్‌కు కుమారులుగా అవతరించారు. తండ్రిగారు వీరికి శ్రీవత్సాంకులనే పేరు పెట్టారు. వీరి అవతారాన్ని గూర్చిన కారణాన్ని సంప్రదాయజ్ఞులైన ఆచార్యులు ఈ విధంగా వివరిస్తారు. భగవానుడు శ్రీమన్నారా యణుడు శ్రీరామచంద్రుడై భూమిపై అవతరించినపుడు, ఆ స్వామికి అంతరంగ కైంకర్యాన్ని చేయడంకోసం ఆదిశేషుడు లక్ష్మణుని రూపంలో అవతరించి **"అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"** అని అంటూ ఆ శ్రీరామునకు సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలలోను కైంకర్యాన్ని చేశాడు. **"రామస్య దక్షిణో బాహుః"** అనిఅన్నట్లు ఆ స్వామికి కుడిభుజమై నిలిచాడు. మళ్ళీ కొన్నాళ్ళకు భగవానుడు ధర్మసంస్థాపనం కోసం భూమిపై అవతరించదలచినపుడు పూర్వంవలెనే ఈ అవతారంలోకూడా తనకు సహాయంగా ఉండమని ఆదిశేషుని భగవానుడు అడిగాడు. అపుడు ఆదిశేషుడు వినోదంగా- "మీరు శ్రీరామునిగా అవతరించినపుడు నేను తమ్మునిగా పుట్టి పలు క్లేశాలను అనుభవించాను. అది చాలు లెండి" అన్నాడట. అపుడు శ్రియఃపతి "ఈ అవతారంలో ఆ క్రమం వ్యత్యస్తం కానిద్దాం. నీవు అన్నగా అవతరించు, నేను తమ్మునిగా జన్మిస్తాను" అన్నాడట. ఆ రీతిలోనే ఆదిశేషుడు బలరాముడుగా, భగవానుడు శ్రీకృష్ణుడుగా అన్నదమ్ములుగా అవతరించారు. అయినా ఈ అవతారంలో కూడా భగవానునకు కొంత కొఱత మిగిలి పోయింది. "అయ్యో! ఇంతవరకు నేను శేషిత్వాన్నే ప్రధానంగా చేసికొని వ్యవహరించాను. నిజానికి నాకు శేషిత్వాన్ని అనుభవించడం కంటే భక్తులపట్ల శేషత్వాన్ని కల్గి ఉండడమే చాలా అభిమతం. అందువల్ల ఆ శేషిత్వానుభవం కోసం ఇంకా వేఱొక అవతారాన్ని పరిగ్రహించాలి" - అని మనస్సులో భావించిన భగవానుడు ముందుగా తాను శ్రీవత్సాంకుల రూపంలో శేషభూతుడుగా అవతరించి, ఆదిశేషులను శేషిస్థానంలో భగవద్రామానుజులుగా అవతరింపజేశాడు. ఇంతటితో ఆగకుండా, శ్రీయతివర పునరవతారభూతులుగా చెప్పబడే వరవరమునుల రూపంలో ఆదిశేషులను శేషిస్థానంలో అవతరింపజేసి, తాను ప్రతివాదిభయంకరమ్ అణ్ణన్ అనే నామంతో శేషభూతునిగా అవతరించాడు- అని సంప్రదాయజ్ఞులైన పెద్దల సూక్తి. శ్రియఃపతి వక్షఃస్థలంలో వెలిగే శ్రీవత్సమనే పుట్టుమచ్చవంటి గుర్తును వీరు కల్గి ఉండడం వీరి పరమపురుషత్వాన్ని సూచిస్తుందని, అందువల్ల వీరు భగవానునివలె శ్రీవత్స లాంఛనులనే నామాన్ని పొందారనికూడా ప్రసిద్ధి.

**కూరేశులు ఆళ్వాన్ అయ్యారు :** వీరికి శ్రీవైష్ణవసంప్రదాయంలో "ఆళ్వాన్" అని పేరు. భగవద్భక్తిరసంలో, భగవద్గుణాను భవరసంలో మునిగి ఉండేవారని ఈ నామంయొక్క తాత్పర్యం. ఈ పేరు వీరికి కల్గడానికి సంబంధించిన, ఒక ఆసక్తికరమైన దివ్యప్రబంధ వ్యాఖ్యానంలో కన్పించే ఐతిహ్యం ప్రకృతంలో అనుసంధేయం. భగవద్భక్తి రసార్ద్రహృదయులైన శ్రీకూరేశులద్వారా తిరువాయ్‌మొళ్రిలోని రస్యరహస్యార్థాలను ఆలకించాలని ఒక పర్యాయం భగవద్రామానుజులు ఆశపడ్డారు. శేషత్వంలో చరమావధిని కల్గి ఉండే కూరేశులు జగదాచార్యులైన శ్రీరామానుజులకు తాము తిరువాయ్‌మొళ్రి అర్థాలను చెప్పడానికి ఇష్టపడలేదు. శ్రీరామానుజుల బలవంతంపై వారిద్దరిమధ్య ఒక ఒప్పందం కుదిరింది. అది ఏమంటే - కూరేశులు - దాశరథి మొదలైన శిష్యులకు తిరువాయ్ మొళ్రిలోని అర్థాలను తెలియజేయాలి. ఆ శిష్యులు వానిని శ్రీరామానుజులకు తిరిగి చెప్పాలి- అన్నది ఆ ఒప్పందం. అదే మంచి తరుణం అని సంతోషపడిన శ్రీవైష్ణవుల పలువురి గోష్ఠి సమకూడింది. కూరేశులు తిరువాయ్‌మొళ్రిలోని **"ఉయర్వఱ ఉయర్‌నలమ్"** అని ప్రారంభం అయే పాశురాన్ని అనుసంధించడం ఆరంభించిన క్షణంలోనే ఆ పాశురార్థాన్ని స్మరించి తన్మయత్వంతో మోహాన్ని పొందారు. "మతాంతరులు సద్గుణనిధి అయిన పరమాత్మను నిర్గుణునిగా అన్నారు. కాని, ఆళ్వార్లు మొదటి పాదంలోనె అతులితమహానందధామునిగా పరమాత్మను స్తుతించారు. ఆహా!" అని అంటూ మాటిమాటికీ పాశురాన్ని స్మరించి, మూర్ఛిల్లారు. అపుడు గోష్ఠిలో ఉండే దాశరథివంటి శ్రీవైష్ణవులు పరుగెత్తి పోయి, శ్రీరామానుజులవద్ద ఈ సంగతిని చెప్పారు. శ్రీరామానుజులు వెంటనే కూరేశుల దగ్గరకు వచ్చి భగవానుని ఉలూఖలబంధ వృత్తాంతాన్ని **"ఎత్తిఱమ్ ఉరలినోడు ఇణైన్దిరున్దు ఏఙ్గియ వెళివే"** అని అంటూ స్మరించి ఆఱు నెలలకాలం మోహదశను పొందిన నమ్మాళ్వార్లను మనం ఇపుడు సేవించలేక పోయినా, అటువంటి గుణానుభవాన్నే పొంది, ముగ్ధులైన ఈభక్తవరేణ్యులను చూడగలిగాము కదా! ఆహా!" అని గద్గదస్వరంతో పల్కుతూ, చిరకాలం వేచి ఉన్నారు. కూరేశులు కొంత కాలానికి స్మృతిని పొందారు. అపుడు రామానుజులు వారిని "ఆళ్వాన్! ఆళ్వాన్!" అని గట్టిగా సంబోధిస్తూ, వీపు తట్టి లేవదీశారు. కూరేశులు మళ్ళీ **"ఉయర్వఱ ఉయర్‌నల ముడైయవన్"** అని అనుసంధిస్తూ దిగ్గున పైకి లేచారు. భగవద్గుణానుభవంవల్ల మనస్సు కఱగిపోయే సుకుమారమైన స్వభావాన్ని కల్గి ఉండడంలో నమ్మాళ్వార్లవంటివారు కూరేశులు అనే భావంతో శ్రీరామానుజులు వీరిని "ఆళ్వాన్!" అని సంబోధించారు. ఆ పేరు వీరికి ప్రసిద్ధనామంగా స్థిరపడింది.

**పూవు పూచిన వెంటనే పరిమళించింది :** కూరేశుల చిన్నతనంలోనే వారి జ్ఞానభక్తులు పరిమళించాయి. **"పిళ్ళాయ్ పణ్ణుత్తాళ్"** అంటూ గోదాదేవి విషయంలో శ్రీవరవరమునులు చిన్నతనంలోనే పరిణతిని పొందినట్లు పల్కిన సూక్తి వీరి విషయంలోకూడా పూర్తిగా అన్వయిస్తుంది. కూరేశుల చిన్నతనంలోనే తల్లిని కోల్పోయారు. కూరేశుల తండ్రి కూరత్తాళ్వార్ ద్వితీయవివాహం చేసికోవాలని ఒక దశలో తలచారు. కాని, కుమారుని విలక్షణమైన యోగ్యతను, భగవద్భక్తిని చూచి, తాము మళ్ళీ వివాహమాడితే రాబోయే భార్య సవతి తల్లే అవుతుంది కనుక, ఆమె ఒకవేళ సవతితల్లి భావంతో కూరేశుల విషయంలో అపచారం చేస్తే, ఆ అపచారంలో తమకుకూడా అన్వయం ఉంటుందని భయపడి, సామాన్యమైన గృహస్థాశ్రమ ధర్మపాలనకంటే, భాగవతాపచారాన్ని చేయకపోవడం అనే విశేషధర్మాన్ని పరిపాలనే యుక్తతరం- అని భావించి రెండవమాఱు వివాహం చేసికోవడం మానివేశారు.

**కూరేశుల లౌకికవిషయవైరాగ్యం:** కూరేశులు తాము జన్మించిన కూరం అనే అగ్రహారానికి అధిపతులు. ఒకనాటి రాత్రి నగరసంచారాన్ని చేసే వీరికి ఇక ఇంటిలో జరిగే సంభాషణ యాదృచ్ఛికంగా చెవిలో పడింది. వెంటనే రహస్యంగా ఆ సంభాషణను పూర్తిగా విన్నారు. అపుడు వారికి తెలిసిన విషయం ఏమంటే - 'ఆ ఇంటియజమాని కుమార్తెను వివాహమాడిన వరుడు త్వరలో మరణిస్తాడు' అని జ్యోతిషపండితులు చెప్పారు. ఆమాట విన్నతరువాత ఎవరూ ఆమెను వివాహమాడడంకోసం ముందుకు రావడం లేదు. ఆమెకు వివాహ వయస్సు మీరి పోతున్నది. ఈమెను ఇంకా ఇంటిలో పెట్టుకొంటే అది లోకాపవాదానికి కారణం అవుతుంది. అందుచేత ఆమెను వధించడమే తప్ప వేఱు దారి లేదు- అని బంధువులు నిర్ణయించుకున్నారు.

ఈ సంగతిని రాత్రి జరిగిన సంభాషణద్వారా గ్రహించిన కూరేశులు మఱునాడు ఆ ఇంటిసభ్యులను రాజసభకు రమ్మని, రాత్రి మీ ఇంటిలో జరిగిన సంగతిని గూర్చి నివేదించమని అన్నారు. వారుకూడా యథార్థాన్ని వెల్లడించారు. అపుడు శ్రీకూరేశులు "రాజ్యంలోని ప్రజలను ఆపదలనుండి కాపాడడమే కదా పాలకుని పరమకర్తవ్యం. అందువల్ల మీ కుమార్తెను నేను వివాహం చేసికొంటాను'' అని మాట ఇచ్చారు. "అయ్యో! ఇదేమి న్యాయం! మీకు ఏదయినా సంభవిస్తే రాజ్యం గతి ఏమి కావాలి? మాకు దిక్కెవరు!'' అని అంటున్న వారిని లెక్కజేయకుండా, "మీకు కల్గిన ఆపదకు ఇదే పరిష్కారం. వివాహానికి రెండు ప్రయోజనాలు- ధర్మానుష్ఠానం, పుత్రలాభం. ప్రజోత్పత్తికోసం భార్యతో శరీరసుఖం అపేక్షితం అవుతుంది. కాని, దానిని ఉపేక్షించి కేవలం గృహస్థాశ్రమ ధర్మానుష్ఠానంకోసం ఈమెను వివాహం చేసికొంటే నాకు ఏ

విపత్తు సంభవించదుకదా'' అని ఆమెను వివాహం చేసికొన్నారు. ఆసాధ్వీమణి కూడా పతిని అనుసరిస్తూ, విషయసుఖాలపట్ల జుగుప్సను కల్గినదై, సద్భక్తిని, వైరాగ్యాన్ని కల్గినదై, **"ఆణ్డాళ్"** అనే వ్యవహారనామాన్ని సార్థకం చేస్తూ భర్తతో సుఖంగా కాలం గడిపింది. **"కరణేషు మంత్రీ"** అనే రీతిలో భర్తకు అపుడపుడు కల్గిన శాస్త్రసందేహాలను సైతం తీరుస్తూ **"పత్నీ సుదక్షిణేత్యాసీత్"** అన్నట్లు తగిన భార్యగా వెలుగొందింది.

**భాగవతారాధననిష్ఠాతిశయం :** సకలవిధాలైన సంపదలను సమృద్ధిగాకల కూరనాథులు యతిరాజ శ్రీచరణ సమాశ్రయణం చేయడానికి ముందు, తమ నగరంలో నివసిస్తూ మహోత్సవసమయాలో కూడా వరదరాజస్వామిని సేవించడంకోసం కాంచీనగరానికి వెళ్ళకుండా అతిథి సమారాధనను శ్రద్ధగా చేస్తూ తమ ఇంటిలోనే ఉండేవారు. వరదరాజస్వామికి జరిగే వైశాఖోత్సవాన్ని సేవించాలనే కుతూహలంతో ఉత్తరదేశంలో చాలా దూరాన ఉన్న ఇద్దరు భక్తులు మార్గమధ్యంలో కూరానికి వచ్చి, కూరేశుల ఇచ్చిన ఆతిథ్యాన్ని స్వీకరించి, కంచికి వెళ్ళారు. అక్కడ వరదరాజస్వామి ఉత్సవాన్ని సేవించారు. గరుడసేవనాడు కూడా కంచికి రాని కూరేశులను వారిద్దరు తక్కువచేసి మాటలాడారు. "పలు యోజనాలదూరంనుండి ఎంతో వ్యయాన్ని, ప్రయాసను ఓర్చి భక్తులు వచ్చి కంచి గరుడసేవను సేవిస్తూ ఉండగా, చాలా సమీపంలోనే ఉండే కూరేశులు తమ ఇంటిలోనే ఉంటూ, ఉత్సవాలను సేవించడంలేదే !'' అని కొంచెం అగౌరవంగా అన్నారు. తరువాత వారు భగవత్సేవకోసమై ఆలయానికి వెళ్ళారు. ఎంత ప్రయత్నించినా వారిద్దరికీ భగవద్దర్శనం లభించలేదు. మనస్సులో చాలా బాధపడిన వారిద్దరిని వరదరాజస్వామి అర్చకముఖంగా -"మీరు మహాభక్తులైన కూరేశుల విషయంలో మానసికంగా చాలా అపచారపడ్డారు. అందువల్ల వెంటనే వారిదగ్గరకు పోయి క్షమను అర్థించండి. లేకపోతే మీకు నా దర్శనాన్ని ఇవ్వను'' అని హెచ్చరించాడు. అదేవిధంగా వారిద్దరు కూరేశుల పాదాలపై పడి జరిగినదానిని తెలిపి తమ తప్పును మన్నించమని వేడారు. అపుడు కూరేశులు చిఱునవ్వుతో "మీరు వెళ్ళిరండి. భగవానుడు కరుణాపూర్ణకటాక్షంతో మిమ్ములను అనుగ్రహిస్తాడు'' అని ఓదార్చారు. వారిద్దరు తరువాత కంచిని సేవించి, ఆనందించారు.

**సంపత్పరిత్యాగం - ఆచార్యసమాశ్రయణం :** కూరం అగ్రహారంలోని కూరేశుల భవనం మహేంద్రభవనాన్ని, కుబేరహర్మ్యాన్ని మించి ఉండేది. వారి భవనంలోని ప్రధానద్వారకవాటాలకు పొదగబడ్డ మువ్వల గంటల ధ్వని యోజనదూరం వరకు విన్పించేది. అంతటి గొప్ప సంపదను కల కూరేశులు ప్రతిదినం భక్తులను, సాధువులను, దరిద్రజనులను ఇతరులను పలు రీతులలో అన్నపానాదులతో ఆనందింపజేస్తూ ధార్మికాగ్రేసరులుగా ప్రకాశించారు.

ప్రతిదినం కంచిలోని భగవదాలయంలో శ్రీహస్తిశైలశిఖరోజ్జ్వలపారిజాతం అయిన వరదరాజస్వామికి ఆరాధన అయిన తరువాత ప్రధానద్వారం తలుపులు మూసిన పిమ్మటనే కూరేశుల భవనకవాటాలు మూయబడేవి. ఒకనాడు కంచిలో ఉత్సవకారణంగా ఆలయం తలుపులు రాత్రి చాలా సేపు అయినా మూయబడలేదు. ఈ విషయాన్ని గుర్తించని కూరేశుల గృహరక్షకులు యథాపూర్వం కూరేశుల ఇంటి తలుపులను రాత్రి పొద్దుపోయిన తర్వాత మూసివేశారు. తలుపులను మూసేటపుడు వినబడిన తలుపుల గంటల చప్పుడు యోజన దూరంలో ఉన్న శ్రీవరదరాజస్వామి చెవులకు వినబడింది. అపుడు ఆ స్వామి ఆ ధ్వనిని ఆలయకవాట ధ్వనిగా భావించి తనకు ఆలవట్టం వీచే కైంకర్యాన్ని చేసే అంతరంగ సేవకులైన కాంచీపూర్ణులను చూచి "ఈనాడు మన ఆలయంలో ఆరాధన పూర్తి కాకుండానే తలుపులను ఎందుకోసం మూశారు?" అని ప్రశ్నించాడు. కాంచీపూర్ణులు "స్వామీ! ఈ ధ్వని తమ ఆలయంలోనిది కాదు. కూరేశుల భవనకవాటలను మూసినపుడు వచ్చిన ధ్వని ఇది" అని అన్నారు. వరదస్వామి చిఱునవ్వు నవ్వి "కూరేశుల సంపద్వైభవం అంతటిదా! మాకు కూడా ఈ రీతిగా భ్రమను కల్గించిందే!" అని అన్నారు.,

తరువాత ఈ ఇరువురి సంభాషణ వివరాన్ని విన్న కూరేశులు మనస్సులో చాలా నొచ్చుకొని సిగ్గుపడి పరమవైరాగ్యాన్ని పొంది, తమ సమస్తసంపదను పరిత్యజించి, సత్పాత్రదానాన్ని చేశారు. శరీరపోషణకు అవసరం అయినంత ధనాన్నిమాత్రం పెట్టుకొన్నారు. సదాచార్యసమాశ్రయణాన్ని చేసి ఆత్మోజ్జీవనంకోసం ప్రయత్నించాలని నిశ్చయించుకున్నారు. అప్పటికే భగవద్రామానుజులు వరదరాజస్వామి సన్నిధిలో సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించారనే విషయాన్ని విని, కంచికి వచ్చి, వారి శ్రీపాదాలను ఆశ్రయించి, వారిని ప్రార్థించి, వారివల్ల పంచసంస్కారాలను పొంది, వారి శ్రీచరణసన్నిధానంలోనే సామాన్యశాస్త్రాలను, అధ్యాత్మశాస్త్రాలను, సంప్రదాయార్థాలను అధికరించి, ఇతరులకు బోధిస్తూ కాలం గడిపారు.

**కూరేశుల శ్రీరంగప్రయాణం :** కొంతకాలం తరువాత ఒకనాడు శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారం తిరువరఙ్గ ప్పెరుమాళ్ అరైయర్ అనే దివ్యప్రబంధగాయకులు శ్రీరంగంనుండి కంచికి వచ్చి తమ దివ్యగానంతో వరదరాజస్వామిని సంతోషపెట్టారు. అపుడు వరదుడు ఎంతో ప్రీతితో- "మీకేమి వరం కావాలో అడగండి, ఇస్తాను" అని అన్నాడు. అరైయర్- "స్వామీ! శ్రీరంగనాథుని సన్నిధి సమృద్ధికోసం భగవద్రామానుజులను మీరు మాకు అనుగ్రహించాలి" అని ప్రార్థించారు. "అయ్యో! వీరు ఈ విధంగా శ్రీరామానుజులను పంపమని అడుగుతున్నారు. రామానుజులను ఏవిధంగా విడచి

ఉండగలను!'' అని మనస్సులో వరదరాజస్వామి కొఱతపడినా, తాను ఇచ్చిన మాటను కాదనలేక శ్రీరామానుజులను అరైయర్‌కు ఇచ్చి, శ్రీరంగానికి పంపాడు. ఈవిధంగా శ్రీరంగానికి ప్రయాణమైన శ్రీరామానుజులను విడచి ఉండలేని కూరేశులు తాముకూడా వారి వెంట శ్రీరంగాన్ని చేరారు.

**చరమశ్లోకార్థలాభం :** భగవద్రామానుజులు గోష్ఠీపూర్ణుల శ్రీపాదసన్నిధిలో ఉండి చాలా శ్రమపడి శ్రీగీతాచరమశ్లోకరస్య రహస్యార్థాలను శ్రవణం చేసి, తమ మఠానికి తిరిగివచ్చారు. ఆచార్యుల రాకను విన్న కూరేశులు వారి వద్దకు వెళ్ళి నమస్కరించి మౌనంగా నిలిచారు. అపుడు రామానుజులు "నాయనా! కూరేశా! గోష్ఠీపూర్ణులు నాకు చరమశ్లోక రహస్యార్థాలను ఉపదేశించి, వీనిని ఎవరికీ చెప్పవద్దని, గోప్యంగా ఉంచి రక్షించమని అన్నారు. అపుడు నేను పరమభాగవత శిఖామణి అయిన నా శిష్యులు కూరేశులకు మాత్రం చెప్పకుండా ఉండలేను- అని అన్నాను. కాంచీపూర్ణులు, కూరేశులు వినే యోగ్యతను కలవారైనా, వారి అధ్యవసాయాన్ని పరీక్షించి, ఒక సంవత్సరకాలం వారినుండి శుశ్రూషను పొంది, ఆ పిమ్మటనే ఉపదేశించండి- అని నాకు అనుమతిని ఇచ్చారు.'' అని అన్నారు. ఆర్తులైన కూరేశులు "స్వామీ! **"మిన్నిన్ నిలైయిల మన్నుయిరాక్కైకళ్"** అన్నట్లు ఈశరీరం క్షణభంగురం, మెఱపు మెఱసినంతకాలం కూడా ఉంటుందో ఉండదో చెప్పలేమే! ఒక సంవత్సర కాలంపాటు నేను నిలచి ఉంటానని ఏమి నమ్మకం! అంత కాలం ఈ రహస్యార్థాలను వినకుండా ఉండలేను'' అని పల్కి, "ఆచార్యభవన ప్రాంగణంలో ఒక మాసం ఉపవాసం చేస్తే అది ఒక సంవత్సరకాలం శుశ్రూష చేయడంతో సమానం'' అనే శాస్త్రమర్యాదనుబట్టి ఆ రీతిగా ఒక నెలపాటు ఉపవాసాన్ని చేసి, చరమశ్లోకార్థాలను శ్రీరామానుజులద్వారా విన్నారు.

**బంగారుపాత్రను విసరివేశారు :** భగవద్రామానుజుల శ్రీపాదపద్మాలను నిరంతరం అనుసంధించే పరమై కాంతులు, ఆచార్యులనే పరదేవతగా భావించేవారు అయిన కూరేశులు దైనందిన జీవనానికి ఆవశ్యకం అయినంత తక్కువ సంపదనుమాత్రం తమవద్ద ఉంచుకొని కొంతకాలం గడిపారు. తావన్మాత్రమైన సంపదను సైతం తమవద్ద పెట్టుకొని కాపాడుకోవడం కూడా స్వరూపవిరుద్ధమని భావించి, ఆ సంపదను కూడా భాగవతులకు దానం చేసివేశారు. అన్ని విధాల త్రికరణశుద్ధితో తనను అనుసరించే ధర్మపత్ని ఆణ్డాళ్‌తోపాటు శ్రీరంగానికి బయలుదేరారు. దారి నడుమ మధురాంతక క్షేత్రసమీపంలో వారు ప్రయాణం చేసే సమయంలో ఆణ్డాళ్ కూరేశులతో "స్వామీ! నాకు చాలా భయంగా ఉన్నది'' అని

అన్నారు. కూరేశులు "మన దగ్గర విలువైన వస్తువు ఏదైనా ఉంటే కదా భయపడాలి. నీవు దేనికైనా తీసికొనివస్తున్నావా! ఏమి!'' అని ఆమెను ప్రశ్నించారు. ఆణ్డాళ్- "స్వామీ సమస్తం దానం చేసినా, మీరు ప్రతిదినం సాపాటు చేసే సువర్ణభాజన పత్రాన్ని (ఆకును) మాత్రం మనవెంట తెస్తున్నాను'' అని మెల్లగా అన్నారు. వెంటనే కూరేశులు ఆ పాత్రను ఆమెదగ్గరనుండి తీసికొని, దగ్గరలో ఉండే ముళ్ళపొదలలోకి వేసరివేసి "ఇక నిర్భయంగా ప్రయాణం చేయవచ్చు, పద'' అని ధర్మపత్నితో అన్నారు. ఆ క్షేత్రంలో తమ ఆచార్యులైన భగవద్రామానుజులకు అభయాన్ని ప్రసాదించిన భగవానుడు **"ఏరికాత్త రామన్"**ను సేవించి, దారిలో ఉండే దివ్యదేశాలను మంగళా శాసనం చేస్తూ శ్రీరంగాన్ని చేరి, ఆచార్యుల సన్నిధిలో కైంకర్యం చేసికొంటూ ఆ పుణ్యదంపతులు ఆనందంగా కాలం గడువసాగారు.

**తిరువరఙ్గత్తముదనార్ కూరేశులను ఆశ్రయించడం :** అపుడు ఆ సమయంలో శ్రీరంగాలయపరిజన పాలనాధికారాన్ని నిర్వహించే తిరువరఙ్గత్తముదనార్ భగవద్రామానుజులు సన్నిధికి వచ్చి "నేను పలు పాపాలను చేశాను. భగవచ్ఛేషభూతుణ్ణి అయేటట్లుగా నన్ను సంస్కరించే ఒక మహానుభావుణ్ణి నాకు ఆచార్యులుగా నిశ్చయించండి'' అని వారిని ప్రార్థించారు. అపుడు శ్రీరామానుజులు కూరనాథులను పిలిచి - "వీరు మన శ్రీరంగనాథుని ఆలయనిర్వహణ ధురంధరులు. వీరిలో ఉండే దోషాలను వేనినీ లెక్కించకుండా, వీరిని అనువర్తిస్తూ అనుకూలంగా ప్రవర్తించి నావద్దకు తీసికొని రండి' అని ఆదేశించారు. శ్రీవత్సాంకులు ఆచార్యాదేశాను సారం తిరువరఙ్గత్త ముదనార్‌ను సంస్కరించి రామానుజుల సన్నిధికి తీసుకొనివచ్చారు. శ్రీరామానుజుల నియమనంతో అముదనార్ కూరేశులవద్ద పంచసంస్కారాలను పొందారు. అముదనార్ శ్రీరామానుజులను కీర్తిస్తూ రచించిన ఇరామానుశనూ*ఱ్ఱ* న్దాది ప్రబంధంలో- **"మొ*ழி*యై క్కడక్కుమ్ పెరుమ్ పుక*ழா*న్ వఞ్జ ముక్కుఱుమ్బామ్ కు*ழி*యై క్కడక్కుమ్ నమ్ కూరత్తా*ழ்*వాన్"** (మాటకు అందని గొప్ప కల్యాణగుణాలను కలవారు, మానవుని వంచించే ధన- విద్యా-అభిజనమదాలనే మూడు పాడు గోతులలో పడకుండా దాటిన మన కూరేశులు) అని ఆచార్యసద్గుణ సంకీర్తనాన్ని చేసి ధన్యులయ్యారు.

కూరేశుల అంతరంగభక్తులైన అముదనార్ ఆచార్యసన్నిధిలో దర్శనగ్రంథాలను అధ్యయనం చేస్తూ ఉండగా అముదనార్ తల్లి పరమపదాన్ని చేరారు. దశాహకైంకర్యం పూర్తి అయిన తరువాత ఏకాహశ్రాద్ధనిర్వహణంకోసం అముదనార్ భోక్తగా ఎవరిని అయినా యోగ్యులను పంపవలసినదిగా శ్రీరామానుజులను అర్థించారు. వారు కూరేశులను అందుకోసం వెళ్ళమని ఆదేశించారు. కూరేశులు మనస్పూర్తిగా ఆ ఆదేశాన్ని స్వీకరించడాన్ని చూచి అముదనార్ తమ భాగ్యానికి ఉబ్బి తబ్బిబ్బు అయ్యారు.

ఏకాహ(శ్రాద్ధంనాడు తమ సమస్తసంపదను ఆ ఆచార్యులకు సమర్పించారు. కూరేశులు ఆ సంపదను అంతటినీ తీసికొని దారిలో నాల్గు వైపుల విసరి వేసి కావేరీనదిలో స్నానం చేసి, ఊర్ధ్వపుండ్రధారులై యతిరాజపాదసన్నిధిని చేరి నమస్కరించారు. మీకు సమర్పించిన ధనం ఏమయిందని శ్రీరామానుజులు ప్రశ్నించగా, అనర్థహేతువు అయిన ఆ అర్థం నష్టమైనది- అని అంటూ జరిగిన వృత్తాంతాన్ని కూరేశులు నివేదించారు. కూరేశుల విరక్తివైలక్షణ్యాన్ని చూచి శ్రీరామానుజులు ఆశ్చర్యపడి చాలా ఆనందించారు.

శ్రాద్ధసమయంలో భోక్తగావచ్చిన వారిని యజమాని **"కిం సకలం సంపూర్ణమ్"** (అంతా పూర్ణమే కదా!) అని ప్రశ్నించినపుడు భోక్త **"సకలం సంపూర్ణమ్"** అని తృప్తిగా బదులివ్వడం శాస్త్రపరిపాటి. అపుడే ఆ శ్రాద్ధం పూర్తి అయినట్లు లెక్క. రామానుజులు కూరేశులను భోక్తగా పంపినపుడు అముదనార్ శ్రీరంగాలయం కుంచికను (తాళం చెవులు) మేము సమర్పిస్తే తప్ప **"తృప్తోస్మి"** అని అనవద్దని నియమించారు. కూరేశులు శ్రీరామానుజుల మాటప్రకారం అముదనార్‌వల్ల శ్రీరంగ ఆలయపరిపాలనాధికారాన్ని, కుంచికను వారివల్ల భోక్తదక్షిణగా పొంది, వానిని ఆచార్యసమర్పణం చేశారు. శ్రీరామానుజులు శ్రీరంగదేవాలయపరిపాలన తమ అధీనమైనందులకు సంతోషించి, ఆలయకైంకర్య నిర్వహణలో చేయదగిన సంస్కరణలను చేసి, ఆలయ అభివృద్ధిని, కలుగజేశారు. అందువల్లనే ఈనాటికీ **"శ్రీమన్! శ్రీరంగశ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ"** అని, **"రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్"** అని ప్రతిదినం పెద్దలు మంగళాశాసనసమయంలో అనుసంధిస్తున్నారు.

**కూరేశుల అసాధారణ మేధావిలాసం :** భగవద్రామానుజులు బాదరాయణుల బ్రహ్మసూత్రాలకు భాష్యాన్ని రచించి శ్రీయామునాచార్యులవారి మనసులో మిగిలిపోయిన కొఱతను తీర్చదలచి, బ్రహ్మసూత్రాలపై భగవద్బోధాయనప్రణీతమైన వృత్తిని ముందుగా చూడదలచారు. ఆ గ్రంథం కాశ్మీరదేశంలోని శారదాపీఠంలో రక్షింపబడుతున్నదని తెలిసి, కూరేశులతో కలసి అక్కడకు బయలుదేరి శారదాపీఠాన్ని చేరారు. రామానుజుల కీర్తిప్రతిష్ఠలను గూర్చి అంతకు ముందే విన్న సరస్వతీభాండా గారాధికారివల్ల ఆ గ్రంథాన్ని పొంది ప్రథమాధ్యాయంవరకు కటాక్షించారు. కూరనాథులు రాత్రివేళకూడా ఆ గ్రంథాన్ని చదివే కూరేశులు ద్వితీయాధ్యాయంనుండి చివరివరకు పఠించి, అందలి విశేషాలను తమ మేధలో నిక్షిప్తం చేశారు. అసూయాళువులైన కొందఱి మాటలను విన్న భాండాగారాధికారి తిరిగి ఆ గ్రంథాన్ని రామానుజులను చూడనివ్వలేదు. 'మొదటి అధ్యాయం తరువాత గల గ్రంథభాగాన్ని చూడలేక పోయామే!' అనే అతృప్తిని రామానుజులు వ్యక్తం చేసినపుడు కూరేశులు తాము ఆ వృత్తిగ్రంథాన్ని పూర్తిగా

చదివినట్లు తెలిసి వారు ఆజ్ఞాపిస్తే ఆ గ్రంథాన్ని ఒక్కపంక్తికూడా విడువకుండా అప్పగించగలనని అన్నారు. కూరేశులు అసాధారణమేధావిలాసాన్ని చూచిన రామానుజులు చాలా ఆశ్చర్యపడ్డారు.

**శ్రీభాష్యరచనలో శ్రీరామానుజులకు తోడ్పాటు : "భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే"** (నీవు సీతాదేవితోపాటు పర్వతసానువులలో విహరించేటపుడు మెలకువగా ఉన్న సమయంలో, నిద్రించే సమయంలోను అన్ని కైంకర్యాలను చేస్తాను) అని ప్రార్థించి లక్ష్మణుడు సీతారాములకు ఇద్దఱికీ సకలవిధకైంకర్యాలను చేశాడు. లక్ష్మణుని సేవలకు శ్రీరాముడు ఆనందించి- **"భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ, త్వయా పుత్రేణ ధర్మాత్మా న సంవృత్తః పితా మమ"**అని ప్రశంసిస్తూ, లక్ష్మణునివల్ల తనకు తండ్రి జీవించలేడనే కొఱత తీరిందని అన్నాడు. ఆ రీతిలోనే బోధాయనుల వృత్తి గ్రంథాన్ని బుద్ధిస్థం చేసికొని, నాకు ఆనందం కల్గించిన మీ వల్ల ఆ గ్రంథాన్ని నేను చూడలేక పోయాననే బాధ తీరింది. అది మన చేతులకు అందినట్లే ఆనందిస్తున్నాను'' అని శ్రీరామానుజులు కూరేశులను ప్రశంసించారు. తరువాత రామానుజులు, కూరేశులు శ్రీరంగానికి చేరారు.

శ్రీభాష్యరచనకు ఉపక్రమించిన రామానుజులు కూరేశులతో "నేను బోధాయన వృత్తిని పూర్ణంగా చూడలేదు. అందువల్ల నా భాష్యరచనలో ఎక్కడైనా వృత్తిగ్రంథ విరోధం ఏర్పడవచ్చు. అపుడు నాకు ఆ విరోధాన్ని మీరు తప్పక సూచించాలి'' అని అన్నారు. కూరేశులు రామానుజులతో "సర్వజ్ఞులైన మీరు ఈ విధంగా అనదగునా? నేను ఆ విధంగా చేయలేను?'' అని అన్నారు. రామానుజులు అపుడు- "పోనీ, ఒకపని చేయండి. మీకు వృత్తి గ్రంథానికి విరోధంగా నా భాష్యం తోచినపుడు మీరు నేను చెప్పే భాష్యాన్ని వ్రాయడం మానివేయండి. ఊరికే ఉండండి'' అని ఒక నియమాన్ని ఏర్పరచారు. కూరేశులు దానికి ఒప్పుకొన్నారు. కూరేశుల సహాయంతో రామానుజులు శ్రీభాష్యరచనను పూర్తిచేశారు. **"భావజ్ఞేన"** అనే శ్లోకార్థాన్ని స్మరిస్తూ రామానుజులు కూరేశుల సాహచర్యంవల్ల, సహకారంవల్ల తమకు భగవద్యాములు లేరనే కొఱత లేకుండా పోయిందని భావించారు. కూరేశులు కూడా అభినందించారు.

**గోష్ఠీపూర్ణులకు శుశ్రూష :** భగవద్రామానుజులు అనుగ్రహించే ఉభయవేదాంత కాలక్షేపగోష్ఠి నడుస్తున్న ఒకానొక సమయంలో ఆత్మకు అంతరంగనిరూపకం జ్ఞాతృత్వమా? లేక, శేషత్వమా? అనే విషయం చర్చకు వచ్చింది. భగవద్రామానుజులు సర్వజ్ఞులైనా, యథార్థం ఆచార్య ముఖంగా లోకానికి తెలియజేయాలని తలచి, "కూరేశా! మీరు గోష్ఠీపురానికి (తిరుక్కోట్టియూర్‌కు) పోయి గోష్ఠీపూర్ణుల సన్నిధిలో ఈ

సందేహాన్ని విన్నపించి, వారు పలికే సమాధానాన్ని తెలిసికొనిరండి''- అని ఆదేశించారు. కూరేశులు తిరుక్కోట్టియూర్ నంబి వద్దకుపోయి సందేహాన్ని విన్నపించి, వారికి శుశ్రూష చేస్తూ ఆఱు నెలలకాలం వేచి ఉన్నారు. అయినా నమ్బి ఏమీ సమాధానం చెప్ప లేదు. కూరేశులు "ఇక నేను ఆచార్యులను సేవించి వస్తాను'' అని నమ్బివద్ద అనుమతిని ప్రార్థించగా అపుడు నమ్బి- ''కూరేశా! ఆళ్వార్లు **'అడియేనుళ్ళాన్'** అని అనుగ్రహించారు. చూచారా'' అని పల్కి సందేహనివృత్తిని చేశారు. కూరేశులుకూడా ''కృతార్థుణ్ణి అయ్యాను'' అని అంటూ వారినుండి అనుమతిని తీసికొని శ్రీరామానుజులవద్దకు చేరి, తిరుక్కోట్టియూర్ నంబి పల్కిన సూక్తిని విన్నపించారు.

ఇక్కడ తిరుక్కోట్టియూర్ నంబి ఇచ్చిన సమాధానంలోని తాత్పర్యం కొంచెం గమనిద్దాం. నమ్మాళ్వార్లు తిరువాయ్మొழிలోని ఎనిమిదవ శతకం- ఎనిమిదవ దశకంలో గల **"కణ్గళ్ శివన్దు"** అనే మొదటి పాశురం, **"అడియేనుళ్ళాన్"** అనే రెండవ పాశురం శ్రియఃపతి స్వరూపాన్ని నిరూపిస్తున్నవి. వాటిలో, **"అడియేనుళ్ళాన్"** అనే రెండవ గాథలో ఉండే మొదటి విశేషణంతో పరమాత్మ జీవాత్మలో అనుప్రవేశించి ఉన్నాడనే విషయాన్ని ప్రతిపాదించే ఆళ్వార్లు "భగవానుని శేషభూతుడనైన నాలో ఉన్నాడు'' అని అన్నారు. అందువల్ల- శేషభూతుడనే అర్థాన్ని ఇచ్చే **"అడియేన్"** శబ్దంతో ఆత్మను నిర్దేశించినందువల్ల ఆత్మకు దాసత్వాపరపర్యాయం అయిన శేషత్వమే అంతరంగ నిరూపకం- అని తెలుస్తున్నది.

**శ్రీరంగాలయ పౌరోహిత్యకైంకర్యలాభం :** ఒకనాడు మిట్ట మధ్యాహ్నంవేళ తీవ్రమైన ఎండ కాసే సమయంలో శ్రీరామానుజులు అముదనార్ గృహానికి వచ్చారు. "ఇంతటి తీవ్రమైన ఎండలో ఈ విధంగా దేవరవారు రావడానికి ఏమి కారణం?'' అని అముదనార్ ప్రార్థించగా -''మీరు ఇంతవరకు నిర్వహిస్తున్న శ్రీరంగాలయ పౌరోహిత్య కైంకర్యాన్ని మాకు ఇవ్వండి' అని అడిగారు. "మహాప్రసాదం'' అని అంటూ అముదనార్ పౌరోహిత్య కైంకర్యాన్ని రామానుజులకు సహిరణ్యాదానజలపూర్వకంగా దానం చేశారు. పౌరోహిత్యం అంటే- శ్రీరంగనాథుని ఆలయంలో పురాణపఠన కైంకర్యం, వేదవిణ్ణప్పం, పంచాంగ శ్రవణం, తిరుమఞ్జన కట్టియ పారాయణం- మొదలైనవి. అపుడు యతీశ్వరులు ఆ పౌరోహిత్యకైంకర్యాన్ని కూరేశుల చేతులకు అప్పగించి, దానిని వారే నిర్వహించ వలసినదిగా ఆజ్ఞాపించారు. ఆనాటినుండి ఈనాటివరకు కూరేశుల వంశీయులు ఈ పౌరోహిత్యకైంకర్యాన్ని అవిచ్ఛిన్నంగా నిర్వహిస్తూ ఉండడం అందరికీ తెలిసినదే.

**మూగవాని అదృష్టం :** భగవద్రామానుజులు ఒకనాడు ఒక మూగవానిని తమ మఠానికి పిలచి, తలుపులను మూసి, అతనికి తమ శ్రీచరణాలను చూపిస్తూ, అవే

అతనికి గతి అని సైగ చేశారు. వివేకి అయిన అతడు యథార్థాన్ని గుర్తించి, శ్రీరామానుజుల చరణాలను శిరసా వహించాడు. కూరేశులు ఈ సందర్భాన్ని కవాటరంధ్రంద్వారా గమనించి, "ఆహా! ఈ మూగవాడు ఎంత అదృష్టశాలి! నేను ఎన్ని శాస్త్రాలు అభ్యసిస్తే ఏమి లాభం! నాకు ఈ భాగ్యం కలుగలేదే! మూగవాడై నేను పుట్టి ఉంటే ఎంత బాగుండేది!'' అని తలబాదుకొని ఏడ్చారట.

**కూరేశుల జీవకారుణ్యం :** సహజంగా అత్యంతసుకుమారమైన మనస్సును కల కూరేశులు మూర్తీభవించిన దయగా కీర్తింపబడేవారు. ఇతరుల దుఃఖాన్ని కొంచెంకూడా చూచి సహించలేక పోయేవారు **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"** అని కీర్తింపబడ్డ శ్రీరామచంద్రుని హృదయంవంటిది వారి హృదయం. ఒకనాడు ప్రయాణం చేస్తున్న కూరేశుల కంటికి పామునోటిలో చిక్కుకొని ప్రాణభయంతో ఆక్రోశించే కప్ప కన్పించింది. ఆ కప్ప అరుపులను విని కూరేశులు "ఎవరో వచ్చి తనను కాపాడబోతారు అనే ఆశతో ఈ కప్ప ఈ రీతిగా ఆక్రందిస్తున్నది! అయ్యో! దీని అరుపులను ఎవరు వింటారు?'' అని అంటూ మూర్ఛిల్లారట. ఇంకొకసారి ఏదో పనిమీద ఒక తోటలోకి వెళ్ళారు. అక్కడ అంతకుముందే ఎవరో వచ్చి అరటిచెట్టు ఆకును కోసితీసికొని వెళ్ళారు. ఆచెట్టునుండి కన్నీళ్ళవలె కారే నీళ్ళను చూచి కూరేశులు బాధతో మూర్ఛను పొందారు. అదేవిధంగా, ఇంకొక పర్యాయం ఒకానొక అబల కావేరీనది నుండి బిందెతో నీటిని మోసికొని రాలేక అవస్థపడుతూ ఉండగా చూచి ఆమెపై జాలిపడి, ఆ బిందెను మోసి సహాయం చేశారు. కూరేశుల కరుణా పూర్ణహృదయాన్ని వ్యక్తం చేసే ఇటువంటి సంఘటనలు కోకొల్లలు.

**ఆత్మగుణపూర్ణత :** శ్రీరంగాలయం నెలకొని ఉండే ప్రాంతాన్ని ఆ కాలంలో ఒకానొక చోళప్రభువు పరిపాలించేవాడు. అతడు శ్రీవైష్ణవమతద్వేషి. అతడు విష్ణుప్రతిమలను ధ్వంసం చేసి, విష్ణ్వాలయాలను కూలగొట్టి వైష్ణవులను, వైష్ణవమతానికి ఉపద్రవం కల్గించాడు. అపుడు అతని శ్రేయస్సునుగూర్చి భయపడిన శ్రేయోభిలాషులు కొందఱు "మంత్రపూర్వకంగా ప్రతిష్ఠించిన దేవతామూర్తులను పాడుచేయడంవల్ల అనర్థం తప్పదు'' అని అతనితో అన్నారు. "అట్లయితే, దైవీశక్తిని ఉద్వాసనను చేసి విగ్రహాలను ధ్వంసం చేస్తాను'' అని సంకల్పించిన ఆ రాజు ఒకానొక బ్రాహ్మణునకు చాలా ధనాన్ని ఇచ్చి, ప్రలోభపెట్టి, ''అంజనం ధరించడంద్వారా అదృశ్యుడవై, విష్ణ్వాలయాలలోని విగ్రహాలకు ఉపద్రవాన్ని కల్గించు''- అని ఆజ్ఞాపించాడు. పాపిష్ఠివాడు, లుబ్ధుడైన ఆ విప్రుడు అదృశ్యాంజనాన్ని ధరించి ఇతరులకు కంటబడకుండా దేవతాశక్తిని ఉద్వాసనం చేసి, వాటిని తీసికొనిపోయి సముద్రంలో పారవేయడం

ప్రారంభించాడు. ఈ వార్తను విని శ్రీరామానుజా చార్యులవారు- "చాలా కాలం నుండి శ్రీరంగాలయాన్ని రక్షిస్తున్నాము. ఆసురవర్గం ఇపుడు విజృంభించింది. నోటితో చెప్పడానికి కూడా వీలుకాని అనర్థం ఈ కోవెలకు సంభవిస్తే ఏమి చేయగలం? ఏవిధంగా అడ్డుకోగలం?- అనే వ్యాకులంలో తమ ఆచార్యులైన మహాపూర్ణులతో పాటు ఆలోచించడం ప్రారంభించారు. అపుడు మహాపూర్ణులు- "శ్రీరంగనాథుని దేవాలయ పరిసరాలలో ఒకసారి ప్రదక్షిణాన్ని చేస్తాను. ఆ ప్రయత్నంలో నా వెంట సహాయంగా మీ శిష్యులలో ఎవరినైనా పంపండి కాని, నాతో వచ్చే వక్తి నేను ఇంకొకరికి వెనుకగా వెడుతున్నాను- అనే భావనను పొందకుండా ఉండేవారై, నన్ను నా నీడవలె అనుసరించేవారై ఉండాలి. అటువంటివారిని ఎవరినైనా పంపించండి'' అని అన్నారు. ఇటువంటి గొప్ప వ్యక్తిత్వం కలవారు కూరేశులే అని పూర్తిగా తెలిసినవారైనా, శ్రీరామానుజులు ఆ విషయాన్ని మహాపూర్ణుల నోట వినాలని తలచి, "ఇక్కడ ఉండేవారిలో ఎవరు అటువంటివారు?'' అని అడిగారు. "కూరేశులను మీరు పంపవచ్చు కదా!'' అని మహాపూర్ణులు బదులిచ్చారు. ఆ మాటను విన్న కూరేశులు "మహాపూర్ణుల వంటివారిచే ఇంతమంది సమక్షంలో ఈ విధంగా అనుగ్రహింపబడ్డ నేనెంత అదృష్టవంతుడను" అని తలచి మహానందాన్ని పొందారు. మహాపూర్ణులవెంట వెళ్ళారు.

**పుత్రోదయం :** తమ సంపదను అంతటినీ దానం చేసి, ఆచార్యసేవే ప్రధానంగా భావించి, అత్యంతసాధారణమైన జీవనాన్ని గడిపే కూరేశులు తమ నిత్యజీవనాన్ని ఉంఛవృత్తి ద్వారా (భిక్షావృత్తిద్వారా) గడిపేవారు. వర్షాకాలంలో ఒకనాడు వర్షంవల్ల బయటకు నీటిని తాగి తృప్తిపడి కూరేశులు- "అన్నం తినకపోయినా నన్ను ఆకలి బాధించడంలేదు. నిజానికి ఏనాడు నేను అష్టాక్షరీమహామంత్రాన్ని జపించలేనో, నిగమపుష్పాలతో భగవానుని ఆరాధించలేనో, ఆనాడే నాకు ఉపవాసం'' అని భావించారు. **"ఉణ్ణుమ్ శోరు పరుకుమ్ నీర్ తిణ్ణుమ్ వెగ్ర్గిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** (తినే తిండి, తాగే నీరు, అనుభవించే తాంబూలాది భోగ్యపదార్థాలు అన్నీ స్వామి అయిన కృష్ణుడే) అని ఆళ్వార్లు పల్కిన రీతిలో మనస్సులో దృఢనిశ్చయాన్ని కూరేశులు కల్గి ఉన్నారు. ఆనాటి రాత్రి శ్రీరంగాలయంలో భగవన్నివేదనసమయంలో మోగిన తిరుచిన్నాల ధ్వనిని విని కూరేశుల ధర్మపత్ని భర్త ఏమీ భుజించకుండా ఆకలితో ఉన్న స్థితిని తలచి, బాధతో "స్వామీ! శ్రీరంగనాథా! నీ భక్తుడు ఇక్కడ ఉపవాసం చేస్తూ ఉండగా, నీవు మాత్రం ఆనందంగా పలు విధాలైన భక్ష్యభోజ్యాలను ఆరగించి ఆనందిస్తున్నావా? ఇదేమయ్యా!'' అని అనుకొన్నది. ఆమె మనోవేదనను గుర్తించిన శ్రీరంగనాథుడు వెంటనే అర్చకముఖంగా దేవాలయకార్యనిర్వాహకులైన ఉత్తమనంబిని ఆదేశించి, వారిద్వారా దేవాలయ మర్యాదలతో తాను ఆరగించిన పాయసాన్నాన్ని

కూరేశుల ఇంటికి పంపించాడు. కూరేశులు ఆ పాయసంలో కొంత భాగాన్ని తాము భుజించి, మిగిలిన భాగాన్ని తమ పత్నికి ఇచ్చారు. ఆమె దానిని స్వీకరించింది. పూర్వం త్రేతాయుగంలో దశరథుడు చేసిన పుత్రకామేష్టియాగసందర్భంలో అగ్నిపురుషుడిచ్చిన పాయసం కారణంగా నల్గురు పుత్రులు ఉదయించినట్లే, శ్రీరంగనాథుడనుగ్రహించిన పాయసాన్నప్రభావంచేత పరాశరభట్టర్, వ్యాసభట్టర్ అనే ఇద్దరు పుత్రులు కూరేశులకు కలిగారు.

**తండ్రే ఆచార్యులయ్యారు :** కూరేశులకు కల్గిన పుత్రులిద్దరిని చూచి చాలా ఆనందించిన శ్రీరామానుజులు పదకొండవనాడు తమ శిష్యులతో కలసి కూరేశుల ఇంటికి వెళ్ళారు. గోవిందభట్టర్ (ఎమ్బార్)ను పిలచి ఇద్దరు పిల్లలను తమ వద్దకు తీసికొని రమ్మని ఆజ్ఞాపించారు. ఎమ్బార్ పురిటి ఇంటిలోనికి పోయి బాలకులను ఇద్దఱినీ తీసికొని వస్తూ దృష్టి దోషం వారికి సోకకుండా ఉండాలని ద్వయమంత్రాన్ని ఉచ్చరిస్తూ వచ్చారు. రామానుజులు ఆ బాలకులిద్దరితేజస్సును చూచి ఆశ్చర్యపడి, కరుణాపూర్ణనేత్రాలతో వారిని కటాక్షించి, ఎమ్బార్‌ను చూచి "గోవిందభట్టారకా! వీరివద్ద ద్వయం పరిమళిస్తున్నదే! ఏమి!'' అని అడిగారు. ఎమ్బార్ అపుడు "స్వామీ! పిల్లలిద్దరి రక్షణకోసం ద్వయాన్ని ఉచ్చరించాను'' అని అన్నారు. యతిరాజులు "వీరి ఉజ్జీవనంకోసం మీరు ముందుగా ప్రయత్నించి నందువల్ల భవిష్యత్తులో మీరే వీరికి ఆచార్యులు'' అని నిర్ణయించారు. ఆ రీతిలోనే ఎమ్బార్ కూరేశపుత్రులిద్దరికీ పంచసంస్కారాలను చేసిన ఆచార్యులయ్యారు. అందువల్లనే గురుపరంపరలో భగవద్రామానుజులు, ఎమ్బార్, భట్టర్- అనే క్రమం అనుసంధింప బడుతున్నది. కూరేశులుకూడా తమ పుత్రులిద్దరికీ ఇంకొక రీతిలో ఆచార్యులయ్యారు. కూరేశులు తిరువాయ్‌మొழி ప్రబంధంలోని అర్థాలను తమ పుత్రులిద్దరికీ ఉపదేశించేటపుడు ప్రథమదశకం - ద్వితీయదశకంలోని **"ఏణ్‌పెరుక్కన్నలత్తు"** అనే పాశురం ప్రస్తావనకు వచ్చింది. ఆ పాశురం అష్టాక్షరీ మంత్రార్థప్రకాశకం అయినందున, మంత్రార్థం ఆచార్యసన్నిధిలో వినవలసి ఉన్నందున, ఆ పాశురార్థాన్ని ఎమ్బార్ సన్నిధిలో తెలిసికొనిరమ్మని అన్నారు. తండ్రి ఆజ్ఞానుసారం పరాశరభట్టర్, వ్యాసభట్టర్ ఎమ్బార్ వద్దకు వెళ్ళబోతూ ఉండగా, కూరేశులు వారిద్దరినీ వెనుకకు పిలచి, "శరీరం క్షణభంగురం. ఎవరు ఎంతసేపు జీవించి ఉంటారో తెలియదు. రండి. నేనే మీకు ఆ అర్థాన్ని ఉపదేశిస్తాను'' అని పల్కి, వారిద్దరికీ రహస్యంగా పాశురార్థాన్ని తెలిపి ఆ పాశురం ఏ రీతిలో అష్టాక్షరీ మంత్రార్థాన్ని ప్రతిపాదిస్తున్నదో వివరించారు. అందువల్ల ఆచార్యపరంపరలో కూరేశులకుకూడా సముచితస్థానం ఉన్నది. ఈ కారణంచేతనే

పరాశరభట్టర్ తమ సహస్రనామభాష్యారంభంలోని మొదటి ప్రార్థనాశ్లోకంలో "వందే గోవిందతాతౌ" అని ఎమ్బార్‌ను, కూరేశులను ఇద్దరిని స్తుతించారు.

**శ్రీరంగనాథుడే పెళ్ళిపెద్ద :** కూరేశుల కుమారులిద్దరు ఉభయవేదాంతాలలోను, సకలసామాన్య శాస్త్రాలలోను నిష్ణాతులయ్యారు. వారిద్దరూ క్రమంగా వివాహానికి తగిన వయస్సును పొందారు. ఆణ్డాళ్ అపుడు "స్వామీ! పిల్లలిద్దరికి వివాహోచితవయస్సు వచ్చింది. వివాహ ప్రయత్నం చేయవద్దా!" అని కూరేశులను ప్రోత్సహించింది. అహంకార- మమకారాలు ఈషణ్మాత్రం లేని తమ రక్షణభారం శ్రీరంగనాథునిదేనని పూర్తిగా విశ్వసించే ఆచార్యపరతంత్రులైన కూరేశులు భగవద్రామానుజుల సన్నిధిలో పుత్రుల వివాహాలను జరిపించవలసినదిగా విజ్ఞాపనచేశారు. శ్రీరామానుజులు తమ ఆచార్యులైన మహాపూర్ణుల ఇంటి కన్యను వివాహం చేసికోవడం మంచిదని నిర్ణయించారు. ఆచార్యాజ్ఞను అనుసరిస్తూ కూరేశులు మహాపూర్ణుల బంధువుల వద్దకు వెళ్ళి కన్యాదానాన్ని చేయవలసినదిగా అర్థించారు. వారు మొదట అంగీకరించినా, మళ్ళీ కొత్తసంబంధం అనే దృష్టిలో కన్యాదానానికి అనుమతించలేదు.

కొంతకాలం గడచిన తర్వాత మళ్ళీ ఆణ్డాళ్ కూరేశులతో పుత్రుల వివాహ ప్రస్తావనను చేశారు. పరమైకాంతులైన కూరేశులు ''భగవానుని కుటుంబం యోగక్షేమాలను నిర్వహించే భారం ఆ భగవానుడే. ఎందుకు దానినిగూర్చి మనకు చింత! భగవత్సన్నిధికి కుమారులను ఇద్దరినీ పంపించు'' అని ఆమెతో అన్నారు. మరునాడు తండ్రి- కుమారులు శ్రీరంగనాథుని సన్నిధికి సేవకోసం వెళ్ళారు. అపుడు శ్రీరంగనాథుడు -"కూరేశా! నాతో ఏదో చెప్పాలని మీరు అనుకుంటున్నట్లున్నదే! నీ మనస్సులో ఉన్నమాటను చెప్పండి'' అని అర్చకముఖంగా అడిగాడు. కూరేశులు "శ్రీరంగనాథా! పిల్లలిద్దరికీ వివాహవయస్సు వచ్చిందని అందరూ అంటున్నారు'' అని విన్నపించారు. శ్రీరంగనాథుడు "అయితే ఎందుకు విచారం? ఆ పనిని నేను నిర్వహిస్తాను లెండి'' అని బదులు పలికాడు. తదనుగుణంగానే రంగనాథుడు మహాపూర్ణుల బంధువులకు స్వప్నంలో కన్పించి కూరేశుల పుత్రులిద్దరికీ మీ ఇంటికన్యలను ఇచ్చి వివాహం జరిపించమని ఆజ్ఞాపించాడు. వారు చాలా ఆశ్చర్యపడి, మరునాడే కూరేశుల ఇంటికి వచ్చి కన్యాదానం చేస్తామని మాట ఇచ్చారు. ఎంతో వైభవంగా పరాశర- వ్యాసభట్టర్‌ల వివాహాలు జరిగాయి. ఈ విధంగా శ్రీరంగనాథుడే కూరేశుల ఇంటి పెళ్ళిపెద్ద అయ్యాడు.

**శిష్యవాత్సల్యం :** కూరేశుల ఆత్మగుణ సంపదను చూచి ఆకర్షితులైన పలువురు వారిని ఆశ్రయించి ఉజ్జీవించారు. వారిలో పిళ్ళైప్పిళ్ళై ఆళ్వాన్ ఒకరు. వీరు కొంతకాలం

ఐశ్వర్య- ఆభిజాత్యాదులవల్ల కల్గిన గర్వంచేత భాగవతులపట్ల పలు అపచారాలను చేశారు. కూరేశులు ఇది గుర్తించి, వీరిని సంస్కరించి బాగుచేయాలని తలచారు. ఒకానొక పుణ్యతిథి నాడు అందఱు అన్నసువర్ణ వస్త్రాదిదానాలను చేస్తున్నారు. కూరనాథులు స్నానం చేసి శుచిగా ఉండే పిళ్ళై ప్పిళ్ళైఆఴ్వాన్ దగ్గరకు వచ్చి దానం ఇమ్మని అడిగారు. "నేను మీ చరమావధిదాసుడను. నా సర్వస్వంమీదే కదా!'' అని బదులిచ్చే పిళ్ళైప్పిళ్ళై ఆఴ్వాన్‌తో "నాకు మామూలు దానం వద్దు. విలక్షణమైన దానం కావాలి. త్రికరణాలతో మీరు ఇకపై ఏ భాగవతులవిషయంలోను అపచారపడననే మాటను నాకు దానం చేయండి'' అని అన్నారు. ఆఴ్వాన్ కూడా "సరే'' అని మాట ఇచ్చారు. అయినా, కొంతకాలం తరువాత పూర్వసంస్కారబలంచేత పిళ్ళైప్పిళ్ళై ఆఴ్వాన్ భాగవతాపచారాన్ని చేయడం తటస్థించింది. తాను చేసిన అపచారాన్ని తలచుకొని ఎంతో పశ్చాత్తాప పడిన ఆఴ్వాన్ బయటకు పోయి తన ముఖాన్ని కూరేశులకు చూపించలేక, ఇంటిలోపలే ఉండిపోయారు. కూరేశులు ఈ విషయాన్ని గుర్తించి, శిష్యవాత్సల్యంతో తామే స్వయంగా వారి ఇంటికి వెళ్ళారు. పిళ్ళైప్పిళ్ళై ఆఴ్వాన్ ఎంతో సిగ్గుపడుతూ జరిగిన వృత్తాంతాన్ని చెప్పి, కూరేశుల పాదాలపై పడి ఏడుస్తూ- త్రికరణాలతో ఎటువంటి భాగవతాపచారాన్ని చేయనని మీకు ఇచ్చిన మాటను నిలబెట్టుకోలేక పోయాను. నిర్భాగ్యుడను. ఇక ఈ పాడు శరీరం ఎందుకు? పాపాలను చేయడంకోసమేకదా ఇది పనికి వస్తున్నది! నా పాపాలకు నిష్కృతిలేదు'' అని దుఃఖపడ్డారు. కూరేశులు ఆఴ్వాన్‌ను ఓదారుస్తూ- "మీకు నిజమైన పశ్చాత్తాపం కల్గింది. చాలు. మీ మానసికమైన అపచారాలను యతీంద్రులు మన్నిస్తారు. రాజదండనవల్ల శారీరకంగా అపచారపడరు. ఇక, వాక్కుతో అపచారపడకుండా జాగ్రత్తపడండి'' అని ఉపదేశించి వెళ్ళిపోయారు. ఇటువంటి కూరేశుల శిష్యవాత్సల్యాన్ని నిరూపించే వృత్తాంతాలు ఎన్నో ఉన్నాయి.

**కూరేశుల చోళరాజసభాప్రవేశం :** కూరేశులు (అన్ని విధాల కుడిభుజమై **"రామస్య దక్షిణో బాహుః"** అన్నట్లు) భగవద్రామానుజులకు దర్శననిర్వాహంలో తోడ్పాటుగా ఉండే వారు. ఆ కాలంలో కులోత్తుంగచోళుడనే రాజు రాజేంద్రచోళపురాన్ని రాజధానిగా చేసికొని ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తూ ఉండేవాడు. అతడు అతిక్రూరుడైన శైవుడు. వేదబాహ్యలైన శాస్త్రాలను ప్రమాణాలుగా తలచే అతడు విద్వాంసులను అందఱినీ తన సభకు పిలిపించి **"శివాత్ పరతరం నాస్తి"** అనే వాక్యాన్ని వ్రాసి సంతకం పెట్టమని నిర్బంధించేవాడు. రాజదండనకు భయపడి కొందఱు, ధనలోభానికి లోబడి కొందఱు అతని మాటప్రకారం చేశారు. ఈ విధంగా కొంతకాలం అయిన తర్వాత,

నాలూరాన్ అనే రాజవల్లభుడైన వైష్ణవుడు "ప్రభూ! వీరి అందరిచేత సంతకం పెట్టించడం ఎందుకు? శ్రీరామానుజులు అంగీకరిస్తే తప్ప ఈ మాటకు విలువలేదు. వారిని నీ సభకు పిలిపించి వారిని అంగీకరింపజేయి' అని రాజుకు పలుమార్లు చెప్పాడు. ప్రభువు అతని మాటలవల్ల శ్రీరామానుజులను రాజసభకు తీసికొని రమ్మని తనభటులను ఆజ్ఞాపించి పంపాడు. వారు శ్రీరంగాన్ని చేరారు. ఈ సంగతి కూరేశుల చెవిలో పడింది. రాజసభకు శ్రీరామానుజుల వెళ్ళడం జరిగితే సంభవింపబోయే మహాపదను గూర్చి భయపడి, స్వయంగా తామే శ్రీరామానుజుల వేషంలో రాజసభకు వెళ్ళాలని వారు నిర్ణయించుకున్నారు. రాజభటులు రామానుజుల వారి మఠాన్ని చేరే సమయానికి వారు స్నానం కోసం కావేరీనదికి వెళ్ళారు. అపుడు కూరేశులు శ్రీరామానుజుల త్రిదండకాషాయాలను ధరించి అక్కడకు వచ్చిన రాజభటులతో తామే శ్రీరామానుజులమని చెప్పి, మహాపూర్ణులు వెంటరాగా రాజసభకు వెళ్ళారు. ఇంతలో శ్రీరామానుజులు మఠానికి తిరిగి వచ్చారు. గోవిందభట్టర్ జరిగిన సంగతిని వారికి తెలియజేశారు. కూరేశుల ధవళవస్త్రాలను శ్రీరామానుజులు ధరించారు. రాజసభలో మహాపూర్ణులకు, కూరేశులకు ఏమి ఆపదరానున్నదో! ఏమో- అని వారు భయపడుతూ, చేయగల్గినది వేఱే ఏమీ లేనందున శిష్యులు కొంతమంది ప్రార్థనపై వారు వెంటరాగా తిరునారాయణపురం దిశలో ప్రయాణం చేశారు.

ఇక, తన సభను ప్రవేశించిన కూరేశులను, మహాపూర్ణులను చూచి చోళరాజు పూర్వంవలెనే **"శివాత్ పరతరం నాస్తి"** అనే వ్రాసి సంతకం పెట్టమని ఆదేశించాడు. కూరనాథులు అపుడు శ్రుతిస్మృతీతిహాసాగమపురాణాదులనుండి పరశ్శతంగా ప్రమాణాలను ఉదాహరిస్తూ శ్రీమన్నారాయణుడే పరతత్త్వం అనే సత్యాన్ని నిరూపించారు. **"శేషం కోపేన పూరయేత్"** అనే సామెత రీతిలో బదులు చెప్పలేని చోళప్రభువు "నాకు తెలుసు. మీరు విదగ్ధులు. మీప్రతిభతో అన్నిటికీ సమాధానం చెప్పగలరు. కాని, నా ఆజ్ఞను మీరు పాటిస్తూ నేను చెప్పినట్లు వ్రాసి సంతకం పెట్టండి'' అని నిర్బంధిస్తూ తాళపత్రాన్ని ఇచ్చాడు. కూరేశులు తమ నిర్ణయానికి కట్టుబడి తాళపత్రంలో **"ద్రోణ మస్తి తతః పరమ్"** అని ప్రభువు మాటను పరిహసిస్తూ సమాధానం వ్రాశారు. **"శివాత్ పరతరమ్ నాస్తి"** అనే చోళరాజు మాటకు శివునికంటే పరతత్త్వం ఇంకొకటి లేదని తాత్పర్యం. కూరేశులు వక్రోక్తిని అనుసరిస్తూ, శ్లేషద్వారా చమత్కారావహంగా సమాధానం వ్రాశారు. వారి సమాధానం ప్రకారం- శివశబ్దానికి అల్పపరిమాణం కల, ధాన్యాదులను కొలిచే కొలత అని అర్థం. ద్రోణమంటే అంతకంటే ఎక్కువ పరిమితిని కల కొలపాత్ర. అందువల్ల ఎక్కువ పరిమాణాన్ని కల ద్రోణమనే కొలత ఉండగా, అంతకంటే తక్కువ పరిమాణాన్ని కల శివమనే కొలత కంటే పెద్దది

లేదని అనడం లోకానుభవవిరుద్ధం కనుక, ఆమాట అసంగతమనే భావంతో కూరేశులు తమ సమాధానవాక్యాన్ని వ్రాశారు.

కూరేశులు చేసిన పరిహాసానికి పట్టలేనంత కోపాన్ని పొందిన చోళరాజు మహాపూర్ణులను చూచి మీరైనా నేను చెప్పినట్లు వ్రాసి సంతకం చేయండి - అని అన్నాడు. కాని, వారు అందులకు ఒప్పుకోకుండా, కూరేశులవలెనే పలు ప్రమాణాలను చూపుతూ శ్రీమన్నారాయణ పారమ్యాన్ని నిరూపించారు. క్రోధావిష్టుడైన రాజు, కూరేశుల, మహాపూర్ణులనేత్రాలను పెరికి వేయవలసినదిగా భటులను ఆజ్ఞాపించాడు. "ఛీ! ఛీ! ఇంతటి పాపిష్ఠివాడవైన నిన్ను చూచిన కళ్ళు నాకు ఇక వద్దు'' అని అంటూ కూరేశులు తమ గోళ్ళతో తామే తమ కళ్ళను పెకలించుకొన్నారు. రాజభటులు మహాపూర్ణుల నేత్రాలను బలవంతంగా తీసివేసి, రాజసభనుండి వారిద్దరిని బయటకు నిర్దాక్షిణ్యంగా గెంటివేశారు. దర్శనరక్షణకోసం నా దర్శనాలను సమర్పించుకో గలిగానుకదా- అని కూరేశులు సంతోషించారు. చాలా వృద్ధులైన మహాపూర్ణులు నేత్రోత్పాటనంవల్ల కల్గిన బాధను తట్టుకోలేక దారిలో ఒకచోట క్షేత్రంలో కూరేశుల ఒడిలో శిరస్సును, తమ కుమార్తె అత్తుళ్ళాయమ్మ ఒడిలో శ్రీపాదాలను పెట్టుకొని తమ ఆచార్యులైన శ్రీయామునుల శ్రీచరణాలను స్మరిస్తూ పరమపదానికి చేరుకున్నారు.

అపుడు పరాంతకపురం నుండి వచ్చిన శ్రీవైష్ణవులు మహాపూర్ణులకు చరమ సంస్కారాలను జరిపి, అంధులైన కూరేశులను పల్లకిలో ఎక్కించుకొని, తమ అగ్రహారంలో కొంతకాలం ఆదరించి, వారి నేత్రబాధను ఉపశమింపజేశారు. తరువాత వారిని శ్రీరంగానికి చేర్చారు. కూరేశులు శ్రీరంగనాథుని ఆలయంలోని మహాబలి పీఠాన్ని చేరి నమస్కరించి- గొప్ప ఆర్తితో "శ్రీరంగనాథా! మహాపూర్ణులకు మోక్షాన్ని ప్రసాదించినట్లే నాకుకూడా ఎందుకు మోక్షాన్ని అనుగ్రహించలేదు!'' అని విజ్ఞాపనను చేసి, ఆలయం లోపలకు పోవాలని ప్రయత్నించారు. కాని రాజభటులు తమ ప్రభువు ఆజ్ఞను అనుసరించి, "భగవద్రామానుజులకు సంబంధించినవారెవ్వరూ ఆలయంలోకి ప్రవేశించరాదు'' అని అడ్డుపెట్టారు. కూరేశుల మహిమను తెలిసిన అక్కడ ఉన్న కొందఱు "కూరేశులు అసాధారణాత్మగుణపరిపూర్ణులు. వీరిని ఆలయంలోనికి వెళ్ళనివ్వండి'' అని అన్నారు కూరేశులు అపుడు- "అయ్యో! ఆచార్యసంబంధం నా ఆలయప్రవేశార్హతకు అడ్డు అవుతున్నదా! ఆత్మగుణాలు దానిని సాధిస్తున్నవా! అటువంటి ఆలయప్రవేశ యోగ్యతనాకు వద్దు. ఆత్మగుణాలు వద్దు. ఆచార్య సంబంధమే పరమోపాదేయం'' అని తలచి దేవాలయంలోకి వెళ్ళకుండానే తిరిగి

వెళ్ళిపోయారు. తరువాత శ్రీరామానుజులేని శ్రీరంగక్షేత్రాన్నికూడా విడచిపెట్టి తిరుమాలిరుమ్‌శోలై దివ్యక్షేత్రాన్ని చేరారు.

భాగవతాగ్రగణ్యులు, వైష్ణవదర్శనపారీణులు, మహాకవులైన కూరేశులు తిరుమాలిరుమ్‌శోలైకు పయనిస్తూ, శ్రియఃపతియొక్క స్వరూపరూపగుణవిభూతులను అనుసంధిస్తూ శ్రీవైకుంఠస్తవం, అతిమానుషస్తవాలను అనుగ్రహించారు. కూరేశులు రచించిన పంచస్తవిలో శ్రీవైకుంఠస్తవం మొదటిది. ఇందులో పరవాసుదేవుని స్వరూపరూపగుణవిభూతులు చక్కగా ప్రతిపాదింపబడ్డాయి. అతిమానుషస్తవం రెండవది. ఇది విభవావాతారవైభవాన్ని అనుభవింపజేస్తుంది. ముఖ్యంగా రామకృష్ణావతారాలలోని పలు అద్భుతవిషయాలనుగూర్చిన కీర్తనం ఇందులో కన్పిస్తుంది. శబ్దార్థసౌందర్యం భావగాంభీర్యం, సంఘటనాసామర్థ్యం ఈ స్తుతిలో నిరూపమానం- అని వాఙ్మయరసికుల, పరిశోధకుల నిర్ణయం.

ఈ విధంగా రెండు స్తవాలను అనుగ్రహించిన తరువాత తిరుమాలిరుమ్ శోలైను చేరిన కూరేశులు ఆ క్షేత్రంలో నెలకొని ఉండే సుందరబాహుస్వామి దివ్యమంగళవిగ్రహ సౌందర్యాన్ని మానసికంగా దర్శించి, ఆనందించి, తమ అనుభవపరీవాహాన్ని సుదీర్ఘమైన సుందరబాహుస్తవంగా ప్రబంధీకరించారు. ఆ స్తవం చివర "హే వనగిరీశ్వర! మమ విజ్ఞాపనా మంగీకురుష్వ రామానుజార్యవశగః పరివర్తిషీయ" (ఓ కరుణాసాగరా! యోగ్యత లేనివారిని తఱిమివేసి, శ్రీరంగంలోని అసురవర్గాన్ని నశింపజేయాలి. నేను భగవద్రామానుజుల శ్రీపాదచ్ఛాయలో మళ్ళీ వర్తించేటట్లు చేయాలి-) అని ప్రార్థించారు. కూరేశుల ప్రార్థనాఫలంగా చోళరాజు కంఠంలో తీరని వ్యాధితో బాధపడి మరణించాడు. ఈ వార్తను వినిన కూరేశులు సుందరబాహుస్వామి అనుమతిని పొంది శ్రీరంగాన్ని తిరిగి చేరారు.

**శ్రీరంగానికి శ్రీరామానుజుల ప్రత్యాగమనం :** కులోత్తుంగచోళునివల్ల ఏర్పడిన ఉపద్రవం కారణంగా తిరునారాయణ పురంలో సుమారు పన్నెండేళ్ళ కాలం వేంచేసి ఉన్న శ్రీరామానుజులు కూరేశులకు, మహాపూర్ణులకు కల్గిన ఆపదను విని ఉద్విగ్నులై, "చివరకు కూరేశులైనా జీవించి ఉన్నారు కదా ! అని కొంతవరకు ఊరడిల్లారు. తరువాత కొంతకాలానికి రామానుజుల పంపిన కింకరుడు శ్రీరంగానికి పోయి, చోళరాజు మరణవృత్తాంతాన్ని తెలిసికొని, తిరునారాయణపురానికి తిరిగి వచ్చి శ్రీరామానుజులకు చెప్పాడు. ఆ వార్తను విన్న శ్రీరామానుజులు సంతోషించి, వెంటనే శ్రీరంగాన్ని చేరారు. తమ శిష్యులతోపాటు కూరేశుల ఇంటికి వెళ్ళారు. కూరేశులు ఆచార్యుల ఆగమనాన్ని విని, ఎదురేగి స్వాగతాన్ని పల్కి, వారి చరణాలపై వాలారు.

రామానుజులు వారిని ఆప్యాయంగా కౌగలించుకొని, గద్గదకంఠంతో "కూరేశా! మన దర్శనానికి నేత్రభూతులైన మీరు నేత్రాలు కోల్పోయారు. మహాపూర్ణులు పరమపదించారు. ఇదంతా నా పాపఫలం'' అని చాలా దుఃఖించి, కూరేశులను ఓదార్చి వారిని తమ మఠానికి తీసికొని పోయారు.

**వరదరాజస్తవావిర్భావం :** మఱునాడు శ్రీరామానుజులు కూరేశులు రచించిన మూడు స్తవాలను చెవులార ఆనందంగా ఆలకించి, కూరేశులతో- "మీ సూక్తి ప్రభావంచేతనే శ్రీరంగక్షేత్రానికి ఏర్పడిన ఉపద్రవం తీరింది. మేము సుఖంగా ఉన్నాము. అభిమతాధిక దానరసికుడైన వరదరాజస్వామి కాంచీపురంలో భక్తజనులకోసం వేంచేసి ఉన్నాడు. "దాసుణ్ణి అయిన నాకు నేత్రాలను ప్రసాదించండి'' అని ప్రార్థిస్తూ మీరు ఆస్వామి విషయంలో ఒక స్తుతిని విజ్ఞాపన చేయండి'' అని ఆదేశించారు. కాని, నిరీహులలో అగ్రేసరులైన కూరేశులు "నాకు నేత్రాలు అక్కరలేదు'' అని బదులిచ్చారు. కాని, శిష్యవత్సలులైన రామానుజులు "మీరు వరదరాజస్వామి విషయంలో ఒక స్తుతిని తప్పక రచించాలి'' అని నిర్బంధించారు. ఆచార్యాజ్ఞను పరిపాలిస్తూ కూరేశులు వరదరాజస్తవాన్ని విజ్ఞాపన చేశారు. అందులో **"నీలమేఘనిభ మంజనపుంజశ్యామ కుంతల మనంతశయం త్వామ్, అబ్జపాణిపద మంబుజనేత్రం నేత్రసాత్కురు కరీశ! సదా మే"** అనే శ్లోకపర్యంతం రచించి, నిన్ను సదా సేవించి, ఆనందించడంకోసం తగిన అప్రాకృతనేత్రాలను నాకు అనుగ్రహించు'' అని విజ్ఞాపన చేశారు. ఆనాటి రాత్రి స్వప్నంలో వరదరాజస్వామి సాక్షాత్కరించి, ''మీరు ప్రార్థించినట్లే అనుగ్రహించాను'' అని అన్నాడు. కూరేశులు ఆనందించి, ఉదయమే లేచి, ప్రాతః కాలిక కృత్యాలను అనుష్ఠించి, స్తవాన్ని ముగించి, యతిరాజుల సన్నిధిని చేరి స్వప్నోదంతాన్ని నివేదించారు. **"నీలమేఘనిభ"** మిత్యాది శ్లోకాన్ని విన్న రామానుజులు ''మీకు నేత్రాలను అనుగ్రహించకుండా ఉండి ఉండడు. ఏదీ మీ ముఖాన్ని చూడనివ్వండి'' అని కూరేశులతో అన్నారు. ''అప్రాకృతనేత్రదానాన్నే నేను భగవానునివద్ద యాచించాను'' అని అనిన కూరేశులను చూచి, "ఇంత మాత్రమే చాలదు, వరదరాజస్వామి సన్నిధిని చేరి ప్రార్థించి, తిరిగివద్దాం రండి'' అని కూరేశులతో పాటు కాంచీనగరానికి బయలు దేరారు.

**ఉద్వేలమైన దయ :** వరదరాజస్వామి సన్నిధిలో కూరేశులు వరదరాజస్తవాన్ని విన్నపిస్తూ ఉండగా శ్రీరామానుజులు ఆలయ ప్రదక్షిణను చేసే సమయంలో, అద్భుతమైన వరదరాజస్తవాన్ని ఆకర్ణించిన వరదరాజస్వామి ప్రత్యక్షమై "కూరేశా! మీ అభిమతాన్ని కోరుకోండి'' అని అన్నాడు. కూరేశులు శ్రీరామానుజుల మాట ప్రకారంగా

నేత్రాలను ప్రసాదించమని కోరకుండా, నేను పొందే ఫలం నాలూరాన్‌కూడా పొందాలి- అని ప్రార్థించారు. చోళరాజుకు తగని ఆలోచనను చెప్పి, కూరేశులకు, మహాపూర్ణులకు ఆపద కల్గడానికి హేతుభూతుడై, భగవద్రామానుజుల దేశాంతరప్రవాసానికి కారణమైన నాలూరాన్ అసహ్యాపచారాన్ని చేసినవాడైనాడు. అతనికి నరకపాతం తప్పదు. అయినా, శ్రీవైష్ణవకులానికి చెందిన ఇతడు నరకానికి పోవడం తగదు. ఇతనిని ఏవిధంగా అయినా కాపాడాలి- అనే పరమదయతో కారుణికులైన కూరేశులు వరదరాజస్వామిని ఆ విధంగా ప్రార్థించారు. తనను వధించేవానిపట్లకూడా ఔదార్యంతో అతని ఉజ్జీవనాన్ని కోరే కూరేశుల దయాళుత ఎల్లలు లేనిది, వాచామగోచరం.

వరదరాజస్వామి కూరేశుల ప్రార్థనను విని "ఆ విధంగానే కానివ్వండి'' అని అనుగ్రహించాడు. రామానుజులు ప్రదక్షిణం చేసి వచ్చి ఈ విషయాన్ని దుఃఖితులై- "స్వామీ! నా కోరిక తీరలేదే'' అని వరదరాజస్వామితో పల్కి, కూరేశులతో "మీరు స్వతంత్రులై, నా సంకల్పానుసారం ప్రవర్తించలేదు'' అని ఖిన్నమనస్కంగా పలికారు. అపుడు వరదరాజస్వామి "రామానుజా! దుఃఖించకండి. కూరేశులు మిమ్మలను, నన్ను తప్పక నేత్రాలతో దర్శించగలరు'' అని వరం ఇచ్చాడు. అపుడు కూరేశులు తమ చర్మచక్షువులతో వరదుని సేవించి, ఆస్వామి దివ్యరూపాన్ని, దివ్యాభరణాలను, దివ్యవసనాలను గుర్తించి వర్ణించారు. శ్రీరామానుజుల ప్రత్యవయవాన్ని భక్తితో దర్శించి ఆనందించారు. శ్రీరామానుజులు సంతుష్టులై శిష్యులతో కలసి శ్రీరంగానికి తిరిగి వచ్చారు.

కొన్నాళ్ల తరువాత కొంతమంది శ్రీవైష్ణవులు కూరేశుల దగ్గరకు వచ్చి- "మీ విషయంలోనేకాక, మన దర్శనానికే ఘోరమైన అపరాధాన్ని చేసిన పాపిష్ఠివాడు నాలూరాన్. అతనిని నిర్దయగా దండించవలసి ఉండగా, మీరు నాలూరాన్‌కుకూడా మోక్షం సిద్ధించాలని వరదరాజస్వామిని ప్రార్థించారు. ఇది తగినదేనా!'' అని ప్రశ్నించారు. అపుడు కూరేశులు "పాపం చేసిన వారి విషయంలోనే కదా క్షమను చూపించాలి'' అని సమాధానం చెప్పారు. "తనను చంపగోరినవారిని కూడా రక్షించాలనే కృతసంకల్పాన్ని కల ఈ కూరేశులు వారి ఆచార్యులకంటే మిన్న'' అని ఆ శ్రీవైష్ణవులు శ్లాఘించారు.

**కూరేశుల రచనలు :** తిరువాయ్‌మొழி (3-5-8) పాశురం ఈడువ్యాఖ్యాన అరుంబదంలో ఈక్రింది ముక్తకశ్లోకం కూరేశకృతంగా ఉట్టంకింపబడింది. చోళరాజువల్ల కల్గిన ఉపద్రవం కారణంగా కూరేశులు, శ్రీరామానుజులు ఒకరికొకరు దూరమై బాధపడేటపుడు శ్రీరామానుజులు కూరేశుల క్షేమవార్తను తెలిసికోవడం కోసం మారుతి

యాణ్డాన్ అనే తమ శిష్యులను కూరేశుల దగ్గఱకు పంపించారు. అపుడు కూరేశులు తమకు చోళరాజువల్ల కల్గిన ఆపదనుగూర్చి నర్మగర్భంగా సూచిస్తూ రచించిన ఈశ్లోకం కూరేశుల అసాధారణరచనాపటిమకు మచ్చు తునక.

త్రిస్రోఽష్టకాః అయానాఖ్యా ధీవిశేషవతాం నృణామ్ ।
తత్ర పశ్చిమ! పూర్వం మాం నహ్యత్యంతాయ మధ్యమః ॥

అష్టకాః = అష్టాక్షరిని అధ్యయనం చేసేవారు, ధీవిశేషవతాం నృణాం = స్వరూప- ఉపాయ- పురుషార్థజ్ఞానాన్ని కలవారైన మానవులకు, తిస్రః ఆఖ్యాః= స్వరూపనిష్ఠ, ఉపాయనిష్ఠ, పురుషార్థనిష్ఠ అనే మూడు పేర్లను, అయాన్= పొందారు. (అంగీకరించారు), తత్ర = వాటిలో, మధ్యమః = అష్టాక్షరిలోని మధ్యమపదం నమశ్శబ్దంలోని ఏకదేశం అయిన, షష్ఠీవిభక్తిని కల మకారంచేత చెప్పబడ్డ ఉపాయవిరోధి, పూర్వం మాం = అష్టాక్షరిలోని పూర్వపదమైన ప్రణవంచేత చెప్పబడే స్వరూపంలో నిష్ఠను కల నన్ను (ఈ పదం కూరేశులు అపుడు మేల్‌కోటకు తూర్పుదిక్కులోని దేశంలో ఉండే స్థితిని సూచిస్తుంది), అంతాయ = (స్వరూపం) నాశంకోసం (నన్ను వధించాలని), నహ్యతి= ప్రయత్నిస్తున్నాడు, పశ్చిమ = అష్టాక్షరి మంత్రంలో పశ్చిమపదంచేత చెప్పబడే భగవత్కైంకర్యంలో నిష్ఠను కల స్వామీ! (ఈ పదం శ్రీరామానుజులు కూరేశులుండే చోటికి పడమటి దిక్కులోగల మేల్‌కోటలో ఉన్న స్థితిని సూచిస్తుంది) (పశ్చిమపూర్వమ్- అని ఒకే పదంగా గ్రహిస్తే) మధ్యమః = తృతీయపదంలోని మకారంయొక్క అర్థమైన పురుషార్థవిరోధి, (భగవద్భాగవతాచార్య సేవకు అడ్డుగా ఉండే చోళరాజు), మాం న హ్యతి = నన్ను బాధిస్తున్నాడు. స్వరూపజ్ఞానం కలిగినా, భాగవత - ఆచార్య సేవ చేయలేకపోతున్నందున ఆ జ్ఞానం అకించిత్కరం- నిరుపయోగం. అందువల్ల మిమ్ములను సేవించే ఉజ్జీవనం నాకెపుడు కల్గుతుందో కదా! అని తాత్త్వికమైన అర్థం- ఇక, ఈ శ్లోకానికి వ్యాకరణరీతిలో అర్థం ఏమంటే- అష్టకాః = అష్టాధ్యాయిని అధ్యయనం చేసిన వైయాకరణులు, ధీవిశేషవతాం నృణాం = దైవం ఉన్నాడనే లేడనే బుద్ధి విశేషాన్ని కల మానవులకు, తిస్రః ఆఖ్యాః = మూడు నామాలు- ఆస్తిక- నాస్తిక- దైష్టికులనే మూడు పేర్లను, అయాన్ = తెలిసికొన్నారు. (**"అస్తి నాస్తి దిష్టం మతిః"** అనే సూత్రంవల్ల తెలిసికొన్నారు), తత్ర = ఆ ఆస్తిక, నాస్తిక, దైష్టికులనేవారి నడుమలో, పశ్చిమ = దైష్టికుడా (యతివరా!), పూర్వం = మొదటివాణ్ణి- ఆస్తికుడను అయిన, మాం = నన్ను, మధ్యమః = నాస్తికుడైన చోళరాజు, అంతాయ = (నా) నాశంకోసం, నహ్యతి = ఆజ్ఞాపించాడు. నేను ఏమి చేయను? మీ సేవ ఎపుడు లభిస్తుంది ? అని తాత్పర్యం.

కూరేశప్రణీతాలైన కృతులలో పంచస్తవి అనే పేరుతో వ్యవహరింపబడే రత్నాల వంటి అయిదు స్తుతుల సమాహారం సంస్కృత స్తోత్రసాహిత్యనందనోద్యానవనంలో ఒక అద్వితీయ కల్పవృక్షం. శ్రీవైకుంఠస్తవం, అతిమానుషస్తవం, సుందరబాహుస్తవం, వరదరాజస్తవం, శ్రీస్తవం- అనేవి ఆ అయిదు స్తవాలు. వీటిలో 102 శ్లోకాలను కల శ్రీవైకుంఠస్తవం పరమపదనాథుని గూర్చినది కాగా, 61 శ్లోకాలను కల అతిమానుషస్తవం భగవానుని పలు విభవావతారలీలలను- ప్రత్యేకించి, శ్రీరామావతార శ్రీకృష్ణావతారా లోని లీలలను కీర్తిస్తున్నది. 132 శ్లోకాలలో కూడిన సుందరబాహుస్తవం తిరుమాలిరుమ్ శోలై వనాద్రి, వనగిరి అనే పేర్లతో పిలువబడేది, 108 శ్రీవైష్ణవదివ్యక్షేత్రాలలో ఒకటి అయిన దివ్యతిరుపతిని, అక్కడ అధివసించి ఉండే, **"సుందరబాహుస్వామి,అఖకర్"** అనే నామాలతో పిలువబడే అర్చామూర్తివైభవాన్ని స్తుతిస్తున్నది. వరదరాజస్తవం కంచి వరదరాజ స్వామిని సంస్తుతిస్తున్నది. చివరిది అయిన శ్రీస్తవం 12 శ్లోకాలతో లక్ష్మీవైభవాన్ని ప్రపంచిస్తున్నది.

**కూరేశుల ఇతరకృతులు :** శ్రీదేశికులు పాంచరాత్రరక్షలో కూరేశులు వడుగనంబి కోసం **"అభిగమన సారమ్"** అనే గ్రంథాన్ని రచించినట్లు తెలిపారు. రహస్యత్రయసారం లోని చరమశ్లోకాధికారంలో **"ఆఖ్వానుడైయ చరమశ్లోకవ్యాఖ్యానత్తిలుమ్ ఇవ్వళవే వివక్షితమ్"** అనే దేశికసూక్తినిబట్టి కూరేశులు చరమశ్లోకవ్యాఖ్యను కూడా రచించి ఉంటారని తెలుస్తున్నది. రహస్యత్రయవ్యాఖ్యసారప్రకాశికాకారులు ఈ చరమశ్లోకవ్యాఖ్య నుండి మూడు శ్లోకపాదాల ప్రమాణాన్ని ఉదాహరించారుకూడా. రహస్యత్రయసారంలోని చరమశ్లోకాధికారంలో దేశికులు "పరాశరభట్టార్యులు, శ్రీవత్సచిహ్నలు రచించిన నిత్యగ్రంథాలలో'' అని అన్నందున కూరేశులు కూడా ఒక నిత్యగ్రంథాన్ని రచించారని తోస్తుంది. శ్రీవిష్ణుపురాణ వ్యాఖ్యానం విష్ణుచిత్తీయంలో (1-12-56) ఎజ్గళ్ ఆఖ్వాన్ అనే ఆచార్యులు ఉట్టంకించిన ప్రమాణాన్నిబట్టి చూస్తే కూరేశులు పురుషసూక్త భాష్యాన్ని రచించి ఉంటారని భావించవచ్చు అని, తిరుమఖిశై అణ్ణావప్పజ్గార్ కృతమైన తత్త్వసారవ్యాఖ్యానం రత్నసారణినిబట్టి కూరేశులు శారీరకసారమనే గ్రంథం రచించినట్లు తోస్తుందని శ్రీవత్సాంకాచార్యస్వామి అభిప్రాయం. ఈ కృతులు ఇపుడు అలభ్యం. **'సర్వజ్ఞతా మేవ ముపాలభామహే త్వం హ్యజ్ఞ ఏవాశ్రితదోషజాషణః"** అనే శ్లోకార్థాన్ని కూరేశకృతంగా భట్టర్ సహస్రనామభాష్యంలో ఉదాహరించారు. ఇది ఏ గ్రంథంలోనిదో తెలియదు. దీనిని బట్టి కూరేశులు పంచస్తవే కాక మఱికొన్ని స్తుతులను కూడా రచించి ఉంటారని భావించే అవకాశం ఉన్నది. ఆఖ్వాన్ తమిళంలో రచించిన కొన్ని లాలిపాటలు, ఊంజల్‌పాటలు మొదలైనవానిని కల్గిన తాళపత్రగ్రంథం ఒకటి తమవద్ద ఉన్నదని

పాండిచ్చేరి నివాసి అయిన గ్రంథసమీక్షాకారులు 1968 సం॥లో హిందూదినపత్రికలో తెలిపారని శ్రీవత్సాంకా చార్యులవారు తమ పంచస్తవి ద్రావిడవ్యాఖ్యానం ఉపోద్ఘాతంలో తెలియజేశారు. ఈ ఆళ్వాన్ ఎవరో నిర్ణయించవలసి ఉన్నది. **"నెఞ్జుక్కు ఇరుళ్ కడి దీపమ్"** అనే పెరియతిరుమొళితనియన్ కూరేశకృతమే. యమకరత్నాకరం, కూరేశవిజయమనే గ్రంథాలు కూరేశప్రణీతాలనే అభిప్రాయం కొంత వివాదగ్రస్తం. పలువురు యమకరత్నాకరం కూరేశకృతమేనని నమ్ముతున్నారు. **"లక్ష్మీనాథ సమారంభామ్"** అనే శ్లోక గురుపరంలోని శ్లోకం, **"యో నిత్యమ్"** అనే భగవద్రామానుజుల నిత్యతనియన్‌శ్లోకం కూరేశకృతాలే. ఇవేకాక (భగవద్విషయారుం బదంలో ఉట్టంకింపబడ్డ) **"త్రిస్రోఽ ష్టకాః"** ఇత్యాది కొన్ని ముక్తకశ్లోకాలు కూడా కూరేశులు రచించినవిగా సంప్రదాయంలో ప్రసిద్ధి ఉన్నది. కూరేశుల దివ్యప్రబంధనిర్వాహాలు, వారు అనుగ్రహించిన వార్తలుకూడా చాలా ఉన్నాయి. ఉదాహరణకు **"సకృదేవ ప్రపన్నాయ"** అనే శ్రీరామచరమ శ్లోకంలోని "సకృత్'' శబ్దానికి **"సహసా"** అని అర్థం చెప్పుకోవాలని ఆళ్వాన్ నిర్వహించినట్లు తనిచరమమనే గ్రంథంలో శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు తెలిపారు. పెరియతిరుమొళి ప్రబంధానికి గల **"నెఞ్జుక్కు"** అనే తనియన్ పాశురాన్ని, నిత్యానుసంధేయాలైన **"లక్ష్మీనాథ'', ''యో నిత్యమ్"** అనే సంస్కృత తనియన్ శ్లోకాలను కూరేశులు అనుగ్రహించారు. పెరియ తిరుముడి అడైవు ప్రకారం కూరేశులు గద్యత్రయానికి ఒక వ్యాఖ్యను రచించినట్లు తెలుస్తున్నది. ఇంకా చరిత్రకు అందకుండా వీరి అమూల్యకృతి రత్నాలు ఎన్ని లుప్తమయ్యాయో తెలియదు.

**కూరేశుల పరమపదయాత్ర :** ఈ విధంగా కూరేశులు లోకోజ్జీవనాలైన శ్రీసూక్తులను అనుగ్రహిస్తూ, తమ జ్ఞానానుష్ఠానాలతో నిస్సమాభ్యధికం అయిన రీతిలో ప్రకాశిస్తూ చిరకాలం ఈ విభూతిలో వేంచేసి ఉన్నారు. ఒక పర్యాయం శ్రీరామానుజుల సన్నిధిలో తిరువాయ్‌మొళి కాలక్షేపం జరిగే సందర్భంలో ముక్తుని అర్చిరాదిగతిని తెలిపే **"శూళ్‌విశుమ్బు"** అనే (10-9) దశకం ప్రసక్తం కాగానే అందులోని **"ముడిముడై వానవర్ ముఱై ముఱై ఎదిర్‌కొళ్ళ"** అనే పాశురంలో "పరమపదానికి ముందుగా చేరినవారు తరువాత చేరేవారికి స్వాగతాన్ని పల్కుతూ, ఉపచారాలను చేస్తారు'' అని విస్తృతంగా వ్యాఖ్యానింపబడింది. దీనిని వినిన కూరేశులు "నేను పరమపదానికి పోవడంలో ఆలస్యం చేస్తే, అక్కడకు శ్రీరామానుజులే ముందుగా వేంచేయవచ్చు. అపుడు నాకు వారు స్వాగతాన్ని పల్కి, ఉపచరించేటట్లు ఏర్పడుతుంది. ఇది మహాపచారం. **"అత్ర పరత్ర చాపి నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్"** అని అన్నట్లు ఈ విభూతిలో, నిత్యవిభూతిలో రెండుచోట్ల నాకు శ్రీరామానుజుల శ్రీపాదాలేకదా పరమప్రాప్యం. కనుక

నేనే ముందుగా పరమపదానికి పోవడం యుక్తం'' అని నిశ్చయించుకొని, ఈ సంగతిని ఎమ్బెరుమానార్ సన్నిధిలో విన్నపించకుండానే శ్రీరంగనాథుని సన్నిధిలోకి పోయి మౌనంగా నిలచారు. భగవానుడపుడు అర్చకముఖంగా- "కూరేశా! ఏమి మీ మనస్సులో అభిప్రాయం? ఏదో చెప్పాలని వచ్చినట్లున్నారు!" అని అన్నాడు. కూరేశు లపుడు ఒక శ్లోకాన్ని విన్నపించి, చాలా ఆర్ద్రంగా శ్రీరంగనాథుని మనస్సు కఱగే రీతిలో ఉపన్యసించగా, శ్రీరంగనాథుడు చాలా ఆనందపడి "మీకు అవశ్యకమైనదానిని అంతటినీ ఇస్తాను. ఏం కావాలో అడగండి'' అని అన్నాడు. ''దాసునకు ఇంతకు ముందే అన్నీ అనుగ్రహించావుకదా స్వామీ!" అని కూరేశులు అనగా, శ్రీరంగనాథుడు- "ఆవిధంగా కాదు, ఇపుడుకూడా అడగండి, నా దేవేరులపై ఆన. మన శ్రీరామానుజులపై ఆన. ఏదయినా సరే ఇస్తాను'' అని నిర్బంధించాడు. కూరేశులు- ఈ శరీరంతో ఇక ఈ లోకంలో జీవించి ఉండలేను. ముక్తిని ప్రసాదించి, పరమపదానికి తీసికొనిపొమ్మని విజ్ఞాపన చేశారు.

శ్రీరంగనాథుడు వారి వేడికోలును విని- "అయ్యో! కూరేశులను ఇక విశ్లేషించవలసి వస్తున్నదే!" అని చాలా బాధపడి, "ఈ వరాన్ని తప్ప ఇంకొక వరాన్ని దేనిని అయినా అడగండి'' అని అన్నాడు. **"రామో ద్విర్నాభిభాషతే"** అని అన్న నీవు ఆ మాటను అసత్యం చేయవచ్చునా? రెండు మాటలను పలికేవాడవు కావు కదా నీవు! అడిగినదానిని దేనినైనా ఇస్తానని అని ఇపుడీరీతిలో అనవచ్చునా ! దాసుడు ప్రార్థించిన దానిని ప్రసాదించు'' అని కూరేశులు మళ్ళీ అన్నారు. ''ఇక చేయగల్గినది ఏదీ లేదు'' అని నిశ్చయించుకొని శ్రీరంగనాథుడు "మీకు, మీ సంబంధాన్ని కల వారికి, మీ తిరునామాన్ని అనుసంధించేవారికి పరమపదాన్ని అనుగ్రహిస్తున్నాను'' అని పలికి తిరుప్పరివట్టం, నిర్మాల్యం, ప్రసాదం, తులసీమాల మొదలైనవానిని అనుగ్రహించి కూరేశులను పంపించాడు.

**శ్రీరామానుజుల ఆనందం, విచారం :** ఈ విధంగా కూరేశులు శ్రీరంగనాథుని వల్ల పరమపదప్రాప్తినిగూర్చి, వరాన్ని పొందిన సంగతిని గూర్చి విని శ్రీరామానుజులు "పూర్వం నేను తిరుక్కోట్టియూర్‌నమ్బి సన్నిధిలో రహస్యార్థోపదేశాన్నిపొందినపుడు 'ఈ అర్థాలను పరమగుహ్యాలుగా మీరు సంరక్షించాలి' అని వారు చేసిన నియమాన్ని ఉల్లంఘించి, ఆ తిరుక్కోట్టియూర్‌లోనే తెఱ్కాழ்వార్ సన్నిధిలో ఆస్వామి సమక్షంలో ఇంకా పలువురి సమక్షంలో ఆ రహస్యార్థాలను వెల్లడి చేశాను. ఆ ఆచార్యాజ్ఞోల్లంఘనానికి ఫలంగా నరకమే నాకు ప్రాప్తిస్తుంది; పరమపదానికి పోయే అవకాశం లేదు- అనే భయం ఇంతవరకు ఉన్నది. కాని, ఇపుడు కూరేశుల సంబంధాన్ని కలవారికికూడా

పరమపదప్రాప్తి కల్గిస్తానని శ్రీరంగనాథుడు వరం ఇచ్చినందువల్ల ఇక నాకు ఆ భయం తీరింది. నాకు కూరేశులతో సంబంధం ఉన్నది కదా!'' అని ఆనందంగా పల్కి, తమ కాషాయాన్ని ఆకాశంలోకి విసరి ఎగురవేస్తూ తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు. దీనినిబట్టే- **"అర్వాంచో యత్పదసరసిజద్వంద్వమ్"** అనే ఈ చరిత్రగ్రంథం ప్రారంభంలో అనుసంధింపబడ్డ శ్లోకాన్ని పరాశరభట్టర్ అనుగ్రహించారు. ఈ సందర్భంవల్ల సదాచార్యసంబంధం వలెనే, సచ్ఛిష్యసంబంధంకూడా సద్గతికి హేతువు- అని తెలుస్తున్నది.

శ్రీరామానుజులు తమకు ఒక విధంగా కల్గిన ఆనందాన్ని వ్యక్తం చేసినా, ఇక కూరేశులు తమను విడచి పరమపదాన్ని చేరబోతారు- అని గ్రహించి మనస్సులో చాలా కొఱతపడి దుఃఖించారు. తమ శిష్యులను తీసికొని వెంటబెట్టుకొని, కూరేశులు ఉన్న చోటికి వచ్చి 'కూరేశా! ఎంతపనిని చేశారు! మమ్ములను ఈవిధంగా చిత్రవధ చేయవచ్చునా!'' అని అడిగారు. కూరేశులు అపుడు తాము ముందుగా పరమపదాన్ని చేరాలని ప్రార్థించడంలో గల ఉద్దేశ్యాన్ని తెలిపారు, శ్రీరామానుజులు **"న శాస్త్రం నైవ చ క్రమః"** అనే రీతిలో ఏ క్రమం లేని నిత్యవిభూతిలో మీరు క్రమాన్ని అన్వేషిస్తున్నారా! ఈ రీతిలోకూడా ఒక విలక్షణమైన శేషత్వం ఉంటుందా! ఆహా!'' అని ఎంతో ఆశ్చర్యపడి, వ్యాకులంతో కన్నీరు మున్నీరుగా దుఃఖించి, కూరేశులను కౌగలించుకొని, దుఃఖాన్ని పట్టలేక "అయ్యో! కూరేశా! మాకు ప్రాణసములైన మిమ్ములను కోల్పోయి నేను నిలువగలనా! నన్నుకూడా మీతో తీసికొని పోవాలని మీకెందుకు తోచలేదు ? నన్ను విడచి వెళ్ళాలని మీకు ఏవిధంగా అనిపించింది? ఏవిధంగా రుచించింది? పరమపద నాథుడు, నిత్యసూరులు, ముక్తులు ఏం నోము నోచారో కదా! **"ఎన్న నోన్బు నోఱ్ఱార్కొలో"** ఇక్కడ మేము, శ్రీరంగనాథుడు మిమ్ములను కోల్పోవడానికి ఎంత పాపం చేశామో! **"ఇచ్చువై తవిర యాన్ పోయ్ ఇన్దిరలోక మాళుమ్ అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్ అరఙ్గమానకరుళానే!"** (ఈలోకంలో కైంకర్యాన్ని చేసి పొందే అనుభవాన్నికాక, నాకు పరమపదాన్ని ఏలే ఆ ఆనందరసం లభించినా నేను దానిని ఓ శ్రీరంగనాథా! ఇష్టపడను) అనే ఆళ్వార్ల శ్రీసూక్తిని మఱచిపోయారా! ఇక నేను ఏం చేయను? చేయగలను! మీ మనస్సు గాయపడేటట్లుగా పలు మాటలు పల్కి ఏం ఫలం? మీ ప్రాప్యానికి నేను అడ్డుపెట్టవచ్చునా! సుఖంగా నిత్యవిభూతికి వేంచేయండి'' అని పలు పలు విధాలుగా పల్కి, వారి చెవిలో ద్వయాన్ని అనుగ్రహించారు. అక్కడ ఉండే శిష్యులంతా "ఇపుడు ఇదేమి'' అని అడిగారు. శ్రీరామానుజులు- "మీకు తెలియదా! రాజకుమారునకు కర్పూరనికరం లేకపోతే నాలుక పిడుచకట్టుకుపోయేటట్లు వీరికి

ద్వయం వినలేకపోతే మనస్సు తల్లడిల్లుతుంది'' అని అన్నారు. తరువాత కూరేశుల వీపును తడిమి, అంజలిని ఘటించి, అనుమతిని తీసికొని బయలుదేరబోయారు. ఈ విధంగా తమ పరమపద గమానానికి శ్రీరామానుజుల అనుమతిని పొందిన కూరేశులు తమ పుత్రులైన పరాశరభట్టర్, వ్యాసభట్టర్‌లను ఊరడించి వారికి తగిన సందేశాన్ని ఇచ్చి, తమ ధర్మపత్ని ఆండాళ్‌కు సమాస్వాశ వచనాలను పలికి తమ శిష్యులు పిళ్ళైపిళ్ళై ఆழ్వాన్ ఒడిలో శిరస్సును, ఆణ్డాళ్ ఒడిలో శ్రీచరణాలను పెట్టుకొని ఆழ్వార్ల, శ్రీయామునుల, శ్రీరామానుజుల శ్రీపాదాలను ధ్యానిస్తూ పరమపదాన్ని చేరుకున్నారు. తరువాత శ్రీరామానుజులు దగ్గర ఉండి కూరేశుల చరమకైంకర్యాలను యథావిధి వారి కుమారులద్వారా నిర్వర్తింపజేశారు.

కూరేశులు పరమపదించిన తరువాత శ్రీరామానుజులు తమ దుఃఖాన్ని **"ఉలకమ్ నిఱైన్ద పుకழాల్ తిరుమకళ్‌పోల్ వళర్‌త్తేన్ శెఙ్గణ్‌మాల్‌తాన్ కొణ్డుపోనాన్"** అనే పెరియాழ్వార్ల పాశురాన్ని అనుసంధిస్తూ వ్యక్తం చేశారని ఐతిహ్యం. కులశేఖరుల పెరుమాళ్ తిరుమొழிకి **"ఇన్నముదమ్ ఊట్టుకేన్"** అనే తనియన్‌ను అనుగ్రహించే రామానుజులు ఆ పాశురాన్ని **"ఇఙ్గే వా పైఙ్కిళియే"** అని తమ పెంపుడు చిలుకను పిలిచి అంటున్నట్లుగా పలికారు. ఈ పాశురంలో నిర్దేశింపబడ్డ పెంపుడు చిలుక వేఱెవ్వరోకాదని, వారు శ్రీరామానుజులకు అత్యంతప్రియశిష్యులైన కూరేశులేనని శ్రీపిళ్ళైలోకం జీయర్ సూక్తి. **"పవిత్రీకృతకూరేశః"** అనే శ్రీరామానుజాష్టోత్తర శతనామస్తోత్రంలోని నామం కూరేశులు శ్రీరామానుజులకు పవిత్రంవలె నిత్యం సన్నిహితులై పరిచర్యచేశారనే విషయాన్ని తెలుపుతున్నది. కూరేశులను ఆశ్రయించి తరించిన శిష్యులు పలువురు ఉన్నారు. వారిలో పిళ్ళైపిళ్ళైయాழ్వాన్, తిరువరఙ్గత్తముద నార్, నాలూరాన్- మొదలైనవారు. సుదర్శనశతకర్త అయిన కూరనారాయణజీయర్ కూడా వీరి శిష్యులేనని కొందఱి అభిప్రాయం. కూరేశులు 108 సం.లు జీవించి ఉన్నట్లు పెరియతిరుముడి అడైవు అనే తమిళగ్రంథంలో తెలుపబడింది.

కూరేశులు ఇపుడు ఈ లోకంలో భౌతికంగా వేంచేసి ఉండకపోయినా, వాచామ గోచరం అయిన తమ కీర్తి శరీరంతోను, అర్చావతారతిరుమేనులతోను ఈ విభూతిలో అంతటా వేంచేసి ఉండి, తమ విలక్షణమైన అనుష్ఠానంతో మనకు ఆదర్శంగా నిలచి ఉన్నారు. వారు అనుష్ఠించిన మార్గం సదా అనుసరణీయం. పల్కిన శ్రీసూక్తులు మనకు సదా స్మరణీయాలు. **"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః, నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్"** అని అన్నట్లు కూరేశులవంటి మహనీయుల కీర్తిమూర్తి సదా అజరామరమై ఆచంద్రార్కం ఈ లోకంలో ప్రకాశిస్తుంది.



# పంచస్తవి వైభవం

కూరేశుల పంచస్తవి వైభవానికి సంబంధించిన కొన్ని అంశాలు సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నాయి.

**పంచస్తవి అవతరణక్రమం :** పంచమిస్తవిలోగల అయిదు స్తోత్రాల అవతరణ క్రమాన్నిగూర్చి విద్వాంసులలో భిన్నాభిప్రాయాలున్నాయి. శ్రీవైష్ణవ సంప్రదాయానుసారం లక్ష్మీపురుషకార ప్రార్థనాపురస్సరంగా భగవదాశ్రయణం చేసే క్రమంలో, ఆ రీతిలోనే శ్రీవత్సాంకులు ప్రారంభంలో లక్ష్మీస్తుతి అయిన శ్రీస్తవాన్ని ఆ తరువాత శ్రీవైకుంఠస్తవం నుండి నాల్గు స్తోత్రాలను రచించారని కొందఱు అభిప్రాయపడ్డారు. కాని, శ్రీవత్సాంకుల పంచస్తవిలో మొదటిది శ్రీవైకుంఠస్తవమనే విషయం చరిత్రప్రసిద్ధం. మహావిద్వాన్, కాంచీ ప్ర.భ. అణ్ణఙ్గరాచార్యస్వామివారు తమ చతుఃశ్లోకీ వ్యాఖ్యానారంభంలో- "వీరు (యామునులు) స్తోత్రరత్నాన్ని ముగించిన తరువాత ఈ స్తోత్రాన్ని అనుగ్రహించారని పెద్దల సూక్తి. కూరత్తాழ్వాన్ కూడా శ్రీవైకుంఠస్తవాదులను నాల్గింటిని అనుగ్రహించిన తరువాతనే శ్రీస్తవాన్ని రచించారు. భట్టర్‌కూడా శ్రీరంగరాజస్తవాన్ని రచించిన తరువాతనే శ్రీగుణరత్నకోశాన్ని రచించారు. ఆశ్రయణవేళలో లక్ష్మీదేవిని ముందుగా ఆశ్రయించి, తరువాత భగవానుని ఆశ్రయించినా, స్తోత్రప్రక్రియలో ఈ క్రమవివక్ష ఆచార్యులకు లేదు." అని పల్కడంవల్ల శ్రీస్తుతి చివరిదే కాని మొదటిది కాదని తెలుస్తున్నది. కనుక, శ్రీవైకుంఠస్తవం, అతిమానుషస్తవం, సుందరబాహుస్తవం, వరదరాజస్తవం, శ్రీస్తవ-మనే క్రమాన్ని పంచస్తవిలో చెప్పడం యుక్తమని తోస్తుంది. సంస్కృతవ్యాఖ్యాత శ్రీనివాసాచార్యులవారుకూడా శ్రీస్తవవ్యాఖ్యానారంభంలో **"ప్రథమతో యో నిత్య మచ్యుతపదాంబుజేత్యారభ్య,.... ప్రబంధచతుష్టయం సృష్ట్వా, రామానుజాంఘ్రి శరణోఽస్మీతి... వరదాఽస్మి తవేక్షణీయః- ఇతి పరిసమాప్య .... పురుషకారతయా ప్రథమతః సమాశ్రయణీయాం శ్రియ మేకాదశభిః శ్లోకైః..."** అని పల్కడం ఈ సంగతిని ఋజువుచేస్తున్నది.

**పంచస్తవిలో కూరేశుల కవితావైభవం :** కూరేశుల పంచస్తవిలోని కవితాగుణావైభవం అనితరసాధారణం. ఎంతటి సాహిత్యవిమర్శకులకైనా అవాఙ్మానసగోచరం. ఈ వాఙ్మయం కూరేశుల అనన్య సామాన్యమైన భగవద్భక్తికి అమలినదర్పణం. శ్రీవైష్ణవపూర్వాచార్యకృతాలైన స్తోత్రాలన్నీ కేవలం స్తుతులు కావు; విశిష్టాద్వైత తత్త్వార్థప్రతిపాదకాలు అనే విషయం ప్రకృతంలో పూర్ణంగా అన్వయిస్తుంది. ఈ అయిదు స్తుతులలోని ఎన్నో శ్లోకాలు ఈ విషయానికి చక్కని నిదర్శనాలు. ఇంతేకాక,

పలు శ్లోకాలలో దివ్యసూరుల ద్రావిడప్రబంధాలలోని మధురభావాలు మఱింత అందంగా పఠితలకు సాక్షాత్కరిస్తాయి. కూరేశుల పంచస్తవి భక్తుల జిహ్వాలకు, చిత్తాలకు తేనెల సోనలు, సుధాకలశాలు అనడం అతిశయోక్తికాదు. ఈ స్తుతులలో కన్పించే కొన్ని విశేషాలు చాలా సంగ్రహంగా ప్రస్తుతింపబడుతున్నాయి.

కూరేశుల మధురోదారశైలిని నిరూపించే శ్లోకాలు పంచస్తవిలో మనకు అడుగడుగునా దర్శనమిస్తాయి. వరదరాజస్తవంలోని **"నీలమేఘనిభమ్"** అనేశ్లోకం శ్రీవైకుంఠస్తవంలోని **"పీతాంబరం వరదశీతల దృష్టిపాతమ్"** ఇత్యాది శ్లోకం, అతిమానుషస్తవంలోని **"అంభోదనీల మరవింద దళాయతాక్షమ్"** అనే శ్లోకం, సుందరబాహుస్తవంలోని **"అబ్జపాణి మరవిందలోచనమ్"** ఇత్యాది శ్లోకం మచ్చుకు ఉదాహరణలు. విద్యానాథాది ఆలంకారికులు నిర్వచించిన పలు శబ్దార్థగుణాలకు ఈ పంచస్తవి చక్కని లక్ష్యం గ్రంథం. ప్రసిద్ధార్థ పదప్రయోగ రూపమైన ప్రసాదగుణం **"సుందరాయతభుజమ్"** ఇత్యాది శ్లోకాలలో, చిన్న చిన్న పదాలతో విడివిడిగా కన్పించే రచనావైఖరిగా నిర్వచింపబడ్డ మాధుర్యగుణం **"జ్ఞానం బలం విపుల మీశనమ్"** ఇత్యాది శ్లోకంలో, దీర్ఘదీర్ఘ సమాసప్రయోగరూపమైన ఓజస్సు **"ప్రళయజనీరపూర"**, **"నఖక్రకచకప్రధి"** ఇత్యాదులలో, శ్రవణసుభగాలైన పదాలను ప్రయోగించడమనే ప్రేయస్సు **"యన్మంగళాయ మహతే"** ఇత్యాది శ్లోకాలలో- ఈవిధంగా పలు గుణాలను ఈ పంచస్తవిలో గమనించవచ్చు. ఇందులో ప్రధానంగా **"రతి ర్దేవాది విషయా"** అని నిర్వచింపబడ్డ భగవద్విషయక రతిపర్యవసాయి అయిన భక్తిరసం ప్రధానమైనా, పలు ఇతరరసాల నిర్వహణకూడా హృదయంగమంగా చేయబడింది. **"యన్నామ నాథ నవనీతమ్"** అనే శ్లోకంలో శ్రీకృష్ణుని నవనీతచౌర్య వృత్తాంతప్రస్తావన ద్వారా హాస్యరసం ఎంత సుకుమారంగా పోషింపబడిందో చూడవచ్చు. **"సంజీవయన్నపి సుతమ్"** ఇత్యాదులలో అద్భుతం, **"అరాళం పాతాళమ్"**, **"న వాయుః పస్పందే"** మొదలైన వానిలో భయానకరసం, **"ప్రశాంతానంతాత్మానుభవజ"** ఇత్యాదులలో శాంతం- ఈ విధంగా పలు రసాల నిర్వహణ సహృదయహృదయావర్జకం. ఇక ఇందులోని అలంకారాల ప్రయోగానికి కొదువే లేదు. స్తోత్రాలు ఉపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, శ్లేషాది అలంకారాల ప్రయోగప్రాచుర్యాన్ని కల్గి ఉంటాయనే విషయాన్ని పంచస్తవిలో స్పష్టంగా దర్శించవచ్చు. **"అంభోరుహాక్షమ్"**, **"న్యాయస్మృతిప్రభృతిభిః"** ఇత్యాది శ్లోకాలలోని ఉపమాలంకార ప్రయోగం, **"శ్రీవత్సకౌస్తుభౌ"**, **"ఆనందమందిరొ"**, **"ఆక్రీడభూమిషు"** ఇత్యాదులో ఉదాత్తం, **"శ్రీమత్పరాంశమునీంద్ర"** ఇత్యాదులలో ఉత్ప్రేక్ష, **"యత్తుంగశృంగవినిషంగి"**, **"శశధరరింఖణాఢ్య"** మొదలైన శ్లోకాలలో అతిశయోక్తి, **"భక్తానాం యద్వపుషి"**, **"ఆశ్లేషే

వరద!", "కాంతాలకాంతమ్" ఇత్యాదులలో నిశ్చయగర్భమైన సందేహం, "యో జాత(క్రశిమా"ఇత్యాదులలో శ్లేష "సౌందర్యసారామృతవీచిసింధు" మొదలైన వానిలో రూపకం- "సుఖస్పర్శైః", "వకుళ ధరసరస్వతీ" ఇత్యాదులలో నిరుక్తి, "అనన్యాధీనత్వం తవ" అనే శ్లోకంలో వ్యాజస్తుతి, "కరుణారస వాహి" అనే శ్లోకంలో రూపకం, "వరద! య దిహ వస్తు" అనే శ్లోకంలో పరికరం - ఈ విధంగా ఎన్నో అలంకారాలు కూరేశుల సూక్తులలో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాయి.

**కూరేశుల వివిధశాస్త్రవైదుష్యం :** కూరేశుల వివిధశాస్త్రపాండిత్యంకూడా పంచస్తవిలో వ్యక్తం అవుతున్నది. "**వ్యోమాంభోజ మిదంతయా కిల విదన్ భ్రాంతోఽ** యమిత్యుచ్యతే" అనే సూక్తి వీరి తర్కశాస్త్రవైదుష్యాన్ని, "**నేత్రసాత్కురు**", "**పిశునయన్**", "**కౌతస్కుతాః**", "**తేరిథ, జిగ్యిథ**", "**పారణీయతి**" ఇత్యాది విశిష్టప్రయోగాలు వ్యాకరణశాస్త్ర పాండిత్యాన్ని, "**పిత్తఘ్ను మంజన మనాప్నుషి జాతు నేత్రే నైవ ప్రభాభి రపి శంఖసితత్వబుద్ధిః**" ఇత్యాదులు వైద్యశాస్త్రపరిచయాన్ని, "**వ్యాఖ్యాతో గతిసామ్యలబ్ధ విషయానన్యత్వ బోధోజ్జ్వలైః**" ఇత్యాది సూక్తులు వేదాంతశాస్త్రపాటవాన్ని ఋజువు చేస్తున్నాయి. "**పతిం విశ్వస్యాత్మేశ్వరమ్**", "**జ్యోతిః పరమ్ పరమతత్త్వమ్**", "**పృథివ్యాద్యాత్మాంతమ్**" ఇత్యాది శ్లోకాలను వీరు ఉపనిషత్సూక్తులను యథాతథంగా అనువదిస్తూ రచించిన సొబగు సహృదయైకవేద్యం. వీరి విశిష్టమైన లోకానుభవాన్ని, ఝటితిస్ఫూర్తిని "**యుక్తో విధేయవిషయేషు హి కామచారః**", "సర్వో హి వశ్యవిషయే వివృణోతి వీర్యమ్", "న హి చకోర్యేకాఖిలాం చంద్రికాం నాలం పాతు మితి ప్రగృహ్య రసనా మాసీత సత్యాం తృషి", "సర్వం గుణాయ గుణినా మితి సత్య మేతత్" ఇత్యాది ప్రయోగాలు తెలుపుతున్నవి.

**పంచస్తవిలో దివ్యసూరి సూక్త్యనుభవాలు :** పంచస్తవిలోని ఎన్నో శ్లోకాలలో దివ్యసూరిసూక్తుల మధురభావాలు అందంగా ప్రతిబింబిస్తున్నవని పూర్వాచార్యులు సోపపత్తికంగా నిరూపించారు. ఉదాహరణకు రెండు మూడు ఉదాహరణలు మాత్రం విన్నవింపబడుతున్నాయి. "మ*ళ్ళు*జ్ఞాద వైనుతియ శక్కర నల్‌వలత్తైయాయ్" అనే తిరువాయ్‌మొ*ళ్ళి*పాశురభావాన్ని పురస్కరించుకొని కూరేశులు శ్రీవైకుంఠస్తవంలోని "విశ్వం ధియైవ విరచయ్య" అనే శ్లోకాన్ని అనుగ్రహించారు. విశేషమేమంటే ఈ పాశురంలో ఆ*ళ్వా*ర్లు వ్యక్తం చేసిన భావాన్ని కూరేశులు కావ్యశైలిలో గంభీరంగా "కా మనీషా" అని అంటూ ప్రశ్నను సంధిస్తూ సూచించారు. దీనికి ప్రతిగా ఆ*ళ్వా*ర్లు గంభీరంగా ప్రశ్నమాత్రంతో సూచించిన భావాన్ని కూరేశులు వ్యక్తంచేసిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు -పొయ్‌కై ఆ*ళ్వా*ర్లు "వరత్తాల్ వలి నినైన్దు" అని

హిరణ్యకశిపుడు నృసింహమూర్తి వధించిన వృత్తాంతాన్ని అనుసంధిస్తూ అడిగిన ప్రశ్నకు తగిన సమాధానాన్ని కూరేశులు వరదరాజస్తవంలోని- **"యదపరాధసహస్ర మజస్రమ్"** అనే శ్లోకంలో తెలిపారు. అదే విధంగా, పెరియతిరువన్దాది లోని **"శీరాల్ పిఱన్దు శిఱప్పాల్ వళరాదు ....శొల్లు నీ యా మఱియ చ్చూழ్న్దు"** అనే పాశురంలో నమ్మాழ్వార్లు వామనావతారాన్ని స్మరిస్తూ అడిగిన ప్రశ్నను అతిమానుషస్తవం లోని **"త్వన్నిర్మితా జఠరగా చ"** అనే శ్లోకంలో అనువదించి, దానిని **"మధ్యే తథా తు న విచక్రమిషే జగచ్చేత్ త్వద్విక్రమైః కథ మివ శ్రుతి రంచితా స్యాత్"**అని అంటూ సమాధానించారు. పెరియాழ్వార్లు తిరుమాలిరుమ్‌శోలై క్షేత్రవైభవాన్ని కీర్తిస్తూ, **"కరువారణమ్ తన్ పిడి తుఱన్దు"** అని అంటూ అందించిన సుందరదృశ్యాన్ని కూరేశులు సుందరబాహుస్తవంలో **"సుందరదోర్ద్విప్యాజ్ఞాలంభన"** ఇత్యాది శ్లోకంతో అనుసంధించారు. మత్స్యావతారాన్ని కీర్తిస్తూ తిరుమఙ్గైయాழ్వార్లు పెరియతిరుమొழిలో **"నిలయిడ మెఙ్గు మిన్ఱి"** అనే పాశురాన్ని రచించారు. ఈ పాశురంలో ప్రతిపాదంలోను 23 అక్షరాలు ఉన్నాయి. సుందరబాహుస్తవంలో ఈ పాశురభావాన్ని గ్రహించి కూరేశులు మత్స్యావతారాన్ని వర్ణించే ఘట్టంలో **"ప్రళయజనీరపూర"** అనే శ్లోకాన్ని రచించడం, ఈ శ్లోకంలోకూడా ప్రతిపాదంలో 23 అక్షరాలుండేటట్లుగా కూర్చడం కూరేశులకు దివ్యప్రబంధసూక్తులలో గల అభినివేశాతిశయాన్ని నిరూపిస్తున్నది. ఇటువంటి ఉదాహరణలు ఎన్నో ఉన్నా విస్తృతిభీతిచేత విరమిస్తున్నాను.

**పంచస్తవిలో వృత్తౌచిత్యం :** కూరేశులు వృత్తౌచిత్యాన్ని పాటించిన సందర్భాలుకూడా ఎన్నో ఉన్నాయి. మకుటమాల, వనమాల, ఆయుధ మాలలను వర్ణిస్తూ కూరేశులు సుందరబాహుస్తవంలో మాలినీవృత్తాన్ని (38) ప్రయోగించడం, గరుడుని రథోద్ధతావృత్తంలో వర్ణించడం, **"మధురాభాషి"** అయిన శ్రీరాముని మంజుభాషిణీ వృత్తంలో వర్ణించడం ఇందుకు కొన్ని నిదర్శనాలు. ఇటువంటివి చాలా ఉన్నాయి.

**పంచస్తవిలో సమకాలీన సంఘటనల ప్రస్తావన :** ఏ కవి అయినా దేశకాలాలకు అతీతుడు కాడన్నది వాస్తవం. ఈ విషయం కూరేశుల పంచస్తవిలోకూడా నిరూపితమైనది. చోళరాజు దురాగతం వల్ల శ్రీరామానుజులకు, శ్రీరంగానికి దూరమై, కన్నులను పోగొట్టుకొన్న కూరేశులు తిరిగి తాము పూర్వంవలె శ్రీరంగం చేరి, శ్రీరామానుజుల సన్నిధిలో కాలం గడపాలనే వాంఛను **"శ్రీరంగధామని యథా పుర మేష సోఽహం రామానుజార్యవశగః పరివర్తిషీయ"** అని, **"శ్రీరంగ శ్రియ మన్వహం ప్రగుణయన్ త్వద్భక్తభోగ్యాం కురు"** అని, **"యోగ్యతావిరహితా మత్సార్య సద్వత్సల"** అని సుందరబాహుస్తవంలో, **"నేత్రసాత్కురు కరీశ సదా మే"** అని వరదరాజస్తవంలో, **"తాం**

**మాతరం చ పితరం చ భవంత మస్య వ్యుచ్ఛంతు రాత్రయ ఇమా వరివస్యతో మే"** అని శ్రీవైకుంఠస్తవంలోను వ్యక్తం చేశారు. పంచస్తవిలో కొన్ని చారిత్రక ఘట్టాలుకూడా చోటు చేసికోవడం విశేషం. తిరుక్కచ్చినమ్బికి పితామహులుగా చెప్పబడే హరితవారణభృత్యునకు (పచ్చైవారణదాసుడు) వరదరాజ స్వామి దృష్టిని ప్రసాదించాడనే ఐతిహ్యం **"హరితవారణభృత్యసమాహ్వయమ్" (126)** అనే శ్లోకంలోను, మలయధ్వజుడనే పాండ్యదేశప్రభువు కాశీయాత్రకై ప్రయాణిస్తూ దారిలో వనగిరిలోని సుందరబాహుస్వామి, నూపురగంగల వైభవాన్ని స్వామి ద్వారానే విని, వారిని దర్శించి, గంగాస్నానమనోరథాన్ని విడచిన ఐతిహ్యం. **"ఇద మిమే శ్రుణుమో మలయధ్వజమ్" (128)** అనే శ్లోకంలోను ప్రస్తావింపబడ్డాయి.

కూరేశుల సూక్తులలో పలు చోట్ల పరస్పర శబ్దార్థసామ్యాలు గోచరిస్తాయి. **"సర్వస్య చైవ గుణతో హి విలక్షణత్వమ్"** అనే శ్రీవైకుంఠస్తవప్రయోగంలో, **"గుణాయత్తం లోకే గుణిషు హి మతం మంగళపదమ్"** అనే వరదరాజస్తవసూక్తి, **"గుణజం గుణినో హి మంగళత్వం ప్రమితమ్"** అనే సుందరబాహుస్తవ ప్రయోగంతో గల సామ్యం సుస్పష్టం. నఖాలను వర్ణించే **"శంభోరంభోరుహముఖ"** అనే వరదరాజస్తవశ్లోకం, **"యో జాతక్రశిమా మలీ చ శిరసా"** అనే సుందరబాహుస్తవశ్లోకం అర్థతః సామ్యాన్ని కల్గిఉన్నాయి. ఇటువంటి విశేషాలను ఇంకా చాలా గమనించవచ్చు. కొన్ని ఆయా శ్లోకాల భావాలలో సూచింపబడ్డాయి.

**పూర్వాచార్యులపై కూరేశుల పంచస్తవి ప్రభావం :** ఇక కూరేశులపై పూర్వుల ప్రభావంగూర్చి ప్రస్తావిస్తే, కూరేశులపై దివ్యసూరుల ప్రభావంగూర్చి ఇంతకుముందే నిరూపింపబడింది. శ్రీయామునులు స్తోత్రరత్నంలోని, చతుఃశ్లోకిలోని పలు సూక్తుల భావాలు పంచస్తవిలో చాలాచోట్ల స్పష్టంగా కన్పిస్తాయి. తదనంతర పూర్వాచార్యులపై కూరేశుల ప్రభావం ఎటువంటిది? అని విచారించినపుడు నమ్బిళ్ళై, శ్రీవరవరమునుల వంటి పలువురు పూర్వాచార్యుల వ్యాఖ్యానాలలో పంచస్తవిలోని పలు శ్లోకాలు ప్రమాణాలుగా గ్రహింపబడడాన్ని స్పష్టంగా గమనించవచ్చు. **"యస్యా వీక్ష్య ముఖమ్"** అనే శ్రీస్తవశ్లోకం తిరువాయ్‌మొழ்రిలోని **"నమ్బనై" (3-7-8), "అల్లలిల్" (3-10-8)** అనే పాశురాల ఈడువ్యాఖ్యలో, **"యస్యాః కటాక్షణమ్"** అనే శ్రీవైకుంఠస్తవ శ్లోకం **(27)** తిరువాయ్‌మొழ்రిలోని **'మాయమ్ శెయ్యేలెన్నై" (10-10-2)** అనే పాశుర ఈడువ్యాఖ్యలో, **"హై సుందరైకతరజన్మని'** అనే సుందరబాహుస్తవశ్లోకం **(107)** తిరువాయ్‌మొழ்రిలోని **"వళవేழులకిన్" (1-5-1)** అనేపాశురవ్యాఖ్యలో, **"అఞ్జనపుంజ శ్యామకుంతలమ్"** అనే వరదరాజస్తవశ్లోకం **(23) "తత్తుక్కొణ్డాళ్‌కొలో"** అనే పెరియతిరుమొழ்రి **(2-17)** పాశురవ్యాఖ్యలో, **"పాపీయసోఽపి'** అనే అతిమానుషస్తవ

శ్లోకం (61) తిరుప్పావైలోని **"కఱవైకళ్" (28)** అనే పాశురవ్యాఖ్యలో ప్రమాణాలుగా స్వీకరింపబడడం కూరేశుల పంచస్తవిలోని అన్ని స్తోత్రాలు పరమప్రమాణాలుగా పూర్వాచార్యులచే అంగీకరింపబడ్డాయనే విషయాన్ని సూచిస్తున్నాయి. పరాశరభట్టర్ సహస్రనామభాష్యం ఉపోద్ఘాతంలో వైకుంఠస్తవంలోని **"రూపశ్రియా", "తత్త్వార్థపర"** అనే రెండు శ్లోకాలను ఉట్టంకించారు. కూరేశులు వరదరాజస్తవంలో ఒక్కొక్క వృత్తాన్ని ఒక్కొక్క దశకంలో ప్రయోగించిన రీతిని దేశికులు దయాశతకంలో అనుసరించడంకూడా ప్రకృతంలో భావ్యం. **"హస్తీశ ! సంశమయ న స్తమిమం వివాదమ్"** అనే సూక్త్యర్థాన్ని దృష్టిలో పెట్టుకొని, పరాశరభట్టర్ **"త్వం మేఽహం మే"** అనే ప్రసిద్ధమైన, అత్యంత సుందరమైన ముక్తకశ్లోకాన్ని అనుగ్రహించారు. ఈ అంశాలు రెండు (కూరేశులపై పూర్వుల ప్రభావం, తదనంతరాచార్యులపై కూరేశుల ప్రభావం) విస్తృతంగా నిరూపించవలసినవి కనుక ఇక్కడ వాటినిగూర్చి ఇక్కడ ఎక్కువగా ప్రస్తావించలేదు.

**పంచస్తవిలో శరణాగతితత్త్వం :** పంచస్తవిలోని స్తోత్రాలన్నీ శరణాగతితత్త్వ ప్రతిపాదకాలు. ఈ అంశాన్ని వ్యాఖ్యాతలందఱూ ఆయా శ్లోకవ్యాఖ్యలలో వివరించారు కూడా. ఉదాహరణకు వరదరాజస్తవాన్ని గమనించవచ్చు. ఇందులో **"శ్రీనిధిమ్"** అనే 21వ శ్లోకంతో ద్వయంలోని శ్రీమత్పదార్థాన్ని, కరిగిరివర్ణనద్వారా నారాయణపదంలోని ఏకదేశం అయిన నారపదంయొక్క అర్థాన్ని, నారాయణనామం భగవానుని కల్యాణగుణప్రాచుర్యాన్ని తెలుపుతున్నది కనుక, ఆ కల్యాణగుణాలను ద్వితీయదశకంలోను, నారాయణ నామంచేత చెప్పబడే, చరణశబ్దోపలక్షితమైన దివ్యమంగళవిగ్రహాన్ని 33శ్లోకాలతోను, తదంగంగా పలు అవతారాలను మఱికొన్ని శ్లోకాలలోను వర్ణించి, ఈవిధంగా నారాయణశబ్దార్థంగా వరదరాజస్వామిని ప్రతిపాదించి, శరణాగతి చేసే వానికి ఉండతగిన ఆకించన్య, అనన్యగతిత్వాదులను 18శ్లోకాలతో వ్యక్తీకరించి, చివరగా **"వరద శరణ మిత్యహం త్వాం వృణే"** అని 82వ శ్లోకంలోను, **"వరద మురుదయం గతిం త్వాం వృణే"** అని 83వ శ్లోకంలోను గోప్తృత్వవరణ రూపమైన శరణాగతిని చేయడంద్వారా పూర్వఖండార్థాన్ని పూర్తిచేశారు. ఈ విధంగా శరణాగతితత్త్వాన్ని కూరేశులు వరదరాజస్తవంలో ఆవిష్కరించారు. ఇది కేవలం సంగ్రహం. ఈ క్రమవివరణం ఆచార్యోపదేశగమ్యం. ఇటువంటి క్రమం మిగిలిన స్తుతులలోను అన్వయించుకోవచ్చు.

**పంచస్తవి - విశిష్టాద్వైతసిద్ధాంతం :** శ్రీవైష్ణవాచార్యస్తోత్రాలన్నీ విశిష్టాద్వైతసిద్ధాంత ప్రతిపాదకాలు అనే విషయానికి పంచస్తవి ఒక చక్కని ఉదాహరణం. **"అన్యం యదు ద్యదుపచాయ్యపచాయి చైవమ్"** ఇత్యాదులలో అచేతనతత్త్వం, **"త్వద్దాస్య మస్య హి**

మమ స్వరసప్రయుక్తమ్" ఇత్యాదులలో చిత్తత్త్వం, "జనిజీవనాప్యయవిముక్త యో యతః" ఇత్యాదులలో ఈశ్వరతత్త్వం ప్రస్తావింపబడ్డాయి. చరమోపాయం అయిన శరణాగతియొక్కతత్త్వం "అద్యాపి నాస్త్యుపరతిః" ఇత్యాదిశ్లోకాలలోను వ్యక్తం. పరతత్త్వం శ్రీమన్నారాయణుడేననే విషయాన్ని "యస్యాః కటాక్షమ్" ఇత్యాదిసూక్తులు, అతడు సమస్తకల్యాణగుణాకరుడనే అంశాన్ని "సౌశీల్యాశ్రితవత్సలత్వ" ఇత్యాది సూక్తులు, లక్ష్మీదేవిపురుషకారాన్ని "స్వస్తి శ్రీ ర్దిశతాత్" ఇత్యాదిసూక్తులు నిరూపిస్తున్నాయి. భగవదాశ్రయణం ఆచార్యసమాశ్రయణపూర్వకంగా చేయాలని, ఆచార్యుని విషయంలో కృతజ్ఞుడై, వారికి వశుడై వర్తించాలనే సంప్రదాయార్థాన్ని "శ్రీమంత హరిచరణౌ", "రామానుజాంఘ్రి శరణోஉస్మి', "శ్రీరంగధామని యథా పుర మేష సోஉహం రామానుజార్యవశగః పరివర్తిషీయ" ఇత్యాదిప్రయోగాలు బోధిస్తున్నాయి. విశిష్టాద్వైత సిద్ధాంతంలో ప్రధానప్రతితంత్రార్థంగా కీర్తింపబడే చిదచిత్తులకు పరమాత్మకు మధ్య గల శరీరశరీరిభావం "పృథివ్యాద్యా త్మాంతమ్", 'పతిం విశ్వస్యాత్మేశ్వరమ్" ఇత్యాది సూక్తులలో తెలుపబడింది. ఈ విధంగా కూరేశుల పంచస్తవి విశిష్టాద్వైతసిద్ధాంత సర్వస్వం అని కీర్తించదగినది.

**పంచస్తవి వ్యాఖ్యలు :** కూరేశుల పంచస్తవికి సంస్కృతంలో మూడు వ్యాఖ్యలున్నాయి. అవి శ్రీనివాసాచార్యవ్యాఖ్య, గార్గ్యరామానుజాచార్యవ్యాఖ్య, వేంకటనివాసవ్యాఖ్య, వీటిలో మూడవది ఇంకా అముద్రితం. రెండవది ఒకసారి ముద్రితం, ఇపుడు అలభ్యం. మొదటిది పలుమార్లు ముద్రితం. ద్రావిడంలో మహావిద్వాన్ శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య సుప్రసిద్ధం. ఇటీవలికాలంలో చెన్నైనగరంలోని విశిష్టాద్వైత ప్రచారిణీ సభవారు డా. ఉ.వే. శ్రీమాన్ శ్రీవత్సాంకాచార్యస్వామివారి ద్రావిడవ్యాఖ్యను ప్రచురించారు. వాచస్పతి, డా. ఉ.వే. శ్రీమాన్ ఎన్.సి.వి. నరసింహాచార్యస్వామివారు, శ్రీవైష్ణవసింహ, ఉ.వే. శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారు (తిరుపతి) సంస్కరించిన శ్రీశైల శ్రీనివాసాచార్యకృతసంస్కృతవ్యాఖ్యను ఇటీవలే టి.టి.డివారు ముద్రించారు. ఇవే కాక తెలుగులో శ్రీ పళ్ళెపూర్ణప్రజ్ఞాచార్యులవారి వ్యాఖ్య, శ్రీ పరవస్తు గోవిందాచార్యస్వామి సంగ్రహవ్యాఖ్యవంటివి చాలా ఉన్నాయి. ఇటీవలే శ్రీస్తవ, అతిమానుషస్తవ, సుందర బాహుస్తవాలకు దాసుని విపులవ్యాఖ్యలు ముద్రింపబడ్డాయి. త్వరలో మిగిలిన రెండింటి వ్యాఖ్యలు ముద్రింపబడనున్నాయి. "విశిష్టాద్వైత వేదాంత నేపథ్యంలో పంచస్తవి" అనే విషయాన్ని పురస్కరించుకొని, పరిశోధనచేసి, శ్రీమాన్ డా॥ రాజగోపాలన్ తమ సిద్ధాంత గ్రంథాన్ని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సమర్పించి, పిహెచ్.డి. పట్టాను పొందడం కూడా ప్రకృతంలో స్మరించదగిన విషయం.

శ్రీమతే రామానుజాయ నమః



# కూరేశుల నిత్యతనియన్ - సవ్యాఖ్యానము

**శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే।**
**యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥**

యత్ ఉక్తయః = ఏ కూరేశుల సూక్తులు, త్రయీకంఠే = వేదమనే వధువుయొక్క కంఠంలో, మంగళసూత్రతామ్ = మంగళసూత్రంగా (తాళిగా) ఉండే స్థితిని, యాంతి= పొందుతున్నాయో, అటువంటి, శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యః = పూజ్యులైన శ్రీవత్సచిహ్నులకు, నమ ఉక్తిం = నమస్కారవచనాన్ని, అధీమహే = అధ్యయనం చేస్తున్నాము.

ఈ తనియన్ శ్లోకాన్ని భట్టరు తమ శ్రీరంగరాజస్తవ మనే స్తోత్ర ప్రారంభంలో రచించారు. సత్సంప్రదాయాన్ని అనుసరిస్తూ భట్టరు తమకు **"పిత్రే బ్రహ్మోపదేష్ట్రే చ"** అనే రీతిలో పితృపాదులు, బ్రహ్మోపదేష్టలు అయిన కూరేశులను కీర్తిస్తూ గురుపరంపరా వందనక్రమాన్ని దీనితో ఆరంభిస్తున్నారు.

**"వేదమ్ వల్లార్కళై క్కొణ్డు విణ్ణోర్ పెరుమాన్ తిరుప్పాదమ్ పణిన్దు"** (వేదార్థాన్ని నిర్ణయించడంలో సమర్థులైన ఆచార్యులను పురస్కరించుకొని పరమపదవాసుల నాథుని శ్రీచరణాలను ఆశ్రయించి) అనే రీతిలో, **"భగవద్వందనం స్వాద్యం గురువందన పూర్వకమ్, క్షీరం శర్కరయా యుక్తం స్వదతే హి విశేషతః"** (గురువందన పూర్వకమైన భగవద్వందనం శర్కరతోకూడుకొన్న పాలవలె విశేషంగా స్వాద్యం కదా) అనే రీతిలోను ఆచార్యముఖంగా భగవదాశ్రయణాన్ని చేయడం సత్సంప్రదాయం, నిరపాయోపాయం. ఈ రీతిలో భట్టర్ మొట్టమొదటగా ఆచార్యవందనాన్ని ఈ తనియన్ద్వారా ఆచరిస్తున్నారు. భట్టర్ సామాన్యశాస్త్రాధ్యయనాన్నే కాక, తిరువాయ్మొழி వంటి దివ్యప్రబంధరహస్యార్థాలను కూడా కూరేశుల సన్నిధిలో గ్రహించిన విషయం **"మిన్నిన్నిలైయిల"** అనే తిరువాయ్మొழி పాశురానికి (1-2-2) గల ఈడువ్యాఖ్యను బట్టి తెలుస్తున్నది. భట్టర్ తమ శ్రీవిష్ణుసహస్రనామభాష్య రచనారంభంలోకూడా **"వందే గోవిందతాతౌ"** అని అంటూ తమ ఆచార్యులైన ఎంబార్ను స్మరించిన వెంటనే శ్రీవత్సాంకులకు నమస్కరించారు. వేదమనబడే సతి కంఠానికి తాళివంటి శ్రీసూక్తు

లను అనుగ్రహించిన, పూజ్యులైన శ్రీవత్సాంకులను నమస్కరిస్తున్నామని శ్లోకసారం. సమాసోక్తిప్రక్రియలో రచింపబడ్డ ఈ శ్లోకంలోని భావసౌందర్యం, సాంప్రదాయికార్థ ప్రతిపాదనగాంభీర్యం సహృదయహృదయావర్జకం, పండితమనోరంజకం.

లోకంలో సత్కులప్రసూత అయిన వధువుకు తాళి లేని దశలు రెండు ఉంటాయి. అందులో మొదటిది ఆమె వివాహమాడడానికి ముందు దశ. అది కన్యకాదశ. రెండవది- భర్త మరణించిన పిదప కలిగే దశ. అది విధవాదశ. కన్యగా ఉండే దశలో తాళి లేని అందమైన వధువును చూచి పలువురు యువకులు ఆమె తనకు భార్య అయితే బాగుండునని ఆశపడతారు. లోకంలోని గృహస్థులు, విరక్తులుకూడా ఆమెను చూచి ఆమె ఇంకా ఎవరికీ స్వంతం (భార్య) కాలేదని భావిస్తారు. ఆమెకు వివాహమై, తాళిని మెడలో ధరించిన తరువాత ఆ మంగళసూత్రాన్ని చూచినవారంతా ఆమె తమకు భార్య కావాలని కోరుకోరు. "ఈమెకు వివాహమైనది. ఈమెకొక భర్త ఉన్నాడు. ఈమె అతని సొత్తు"- అని తాళినిబట్టి గ్రహిస్తారు. దైవవశాత్తు వైధవ్యాన్ని పొంది తాళి తొలగింపబడ్డ స్త్రీని చూచినవారు ఈమెకు గతంలో భర్త ఒకడు ఉండేవాడు. దురదృష్టవశంచేత ఆమె ఇతనిని కోల్పోయినది. ఇక ఈమెకు భర్తగా ఉండే అవకాశం ఎవరికీ లేదు- అని తెలిసికొంటారు. ఈ విధంగా కులకాంతకు మంగళసూత్రం లేని రెండు దశలలోని మొదటిదశలో పలువురు ఆమెకు భర్తకావలెనని ఆశపడే అవకాశం, రెండవ దశలో ఇకపై ఎవ్వరూ ఆమెకు భర్తగా ఉండడం వీలు కాదని భావించే అవకాశం ఏర్పడుతున్నది. ఈ వివరణం అంతా దృష్టాంతవిషయం. ఇక దార్ష్టాంతికస్వరూపాన్ని ఈవిధంగా వివరించవచ్చు. శ్రీవత్సాంకుల గ్రంథాలు అవతరించడానికిముందు వేదవాఙ్మయం తాళి లేని వధువుకు సంభవించదగిన పై రెండు దశలను పొందింది. ఏవిధంగా అంటే - వేదంలో ప్రతిపాదింపబడ్డ పరతత్త్వం బ్రహ్మ అని కొందఱు, రుద్రుడని కొందఱు, ఇంద్రుడని కొందఱు వాదించారు. ఇది మొదటి దశ. శ్రీవత్సాంకుల గ్రంథాలు అవతరించిన తరువాత- "వేదకాంతకు భర్తలు పలువురు ఉన్నారని అనడం కాని, భర్తయే లేడని అనడం కాని సరి కాదు. వేదమాతకు భర్త అనే వాడొకడున్నాడు. అతడు "వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః" అని అన్నట్లు శ్రీమన్నారాయణుడే - అనే విషయం నిష్కర్షింపబడింది. వారి సూక్తులద్వారా నిశ్చయింపబడింది. అందువల్ల శ్రీవత్సాంకుల సూక్తులు వేదకాంతమెడలో తాళివంటివి. ఈ సూక్తిలోని తాత్పర్యం ఏమంటే- శ్రీవత్సాంకులు వేదవిరుద్ధాలైన వాదాలను చేసేవారి మతాలను నిరసించి, పరతత్త్వనిర్ణయాన్ని చేయగల వాక్పటిమను కల్గిన వారని. చోళరాజు సభలో కూరేశులు విష్ణుపారమ్యాన్ని నిరూపిస్తూ పల్కిన "ఏకో హ

వై నారాయణ ఆసీత్", "న బ్రహ్మా నేశానః", "నారాయణః పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః"ఇత్యాది సూక్తులు పురుషోత్తమునిచే పరిణీత అయిన వేదకాంత మెడలో మంగళసూత్రాలయ్యాయి- అని కాని, పూర్వం తెలిపిన రీతిలో కూరేశుల కృతులలోని సూక్తులు వేదకాంతమెడలో మంగళసూత్రాలయ్యాయి - అని కాని చెప్పవచ్చు.

శ్రీశుద్ధసత్త్వం దొడ్డయాచార్యస్వామివారు రచించిన **"కూరేశపంచాశత్'** అనే స్తోత్రంలో కూరేశులకు **"నిగమాంతాకల్ప'** అనే విశేషణం ప్రయోగింపబడింది. దీనిని వ్యాఖ్యానిస్తూ **"శ్రీవైష్ణవసింహ"** ఉ.వే. టి.ఏ కృష్ణమాచార్యస్వామివారు (తిరుపతి)- ఈ విధంగా తెలిపారు. **"నిగమాంతానా మాకల్పః ఆభరణం యేన సః"** అని బహువ్రీహిసమాసాశ్రయణం వల్ల వేదకాంతకు అలంకారాన్ని నిర్మించినవారనే భావం వ్యక్తమవుతుంది. కూరేశులు నిర్మించిన వేదకాంత మెడలోని ఆభరణం పంచస్తవేకదా. అంతేకాక, శ్రీరామానుజుల ఆజ్ఞానుసారం శ్రీరంగామృతకవి (తిరువరఙ్గత్తముదనార్) ద్వారా కూరేశులు శ్రీరంగాలయ పౌరోహిత్యాన్ని సంపాదించిన ఐతిహ్యంకూడా ప్రకృతంలో స్మరణీయం. శ్రీరంగనాథుని ఆలయంలో పౌరోహిత్యకైంకర్యాన్ని నిర్వహించే కూరేశులు **"పంచస్తవి"** అనే మంగళసూత్రాన్ని నిర్మించి ఇవ్వగా, భగవానుడు దానిని వేదకాంతకంఠంలో అలంకరించి, ఆమె తన సొత్తు అనే విషయాన్ని లోకానికి చాటి చెప్పాడనే అర్థస్వారస్యం దీనివల్ల వ్యక్తమవుతున్నది. వేదప్రతిపాద్యమైన పరతత్త్వం శ్రీమన్నారాయణుడే అనే విషయం కూరేశుల పంచస్తవివల్ల లోకప్రసిద్ధిని పొందిదని ఈ వివరణసారం. దీనిని ప్రకృతంలోకూడా అన్వయించుకోవచ్చు. లోకంలో పురోహితుడు తాళిని నిర్మించి ఇస్తే, వరుడు దానిని వధువుకంఠంలో అలంకరించడం ప్రత్యక్షసిద్ధంకదా ! ఈ వివరణం అంతా **"త్రయీ"** శబ్దంలోని స్త్రీయోగస్వారస్యాన్నిబట్టి చేయబడింది.

తమిళంలోని **"తిరుమఱుమార్బన్"** అనే ద్రావిడనామానికి శ్రీవత్సచిహ్ననామం సంస్కృతీకరణం. భగవానుడే కూరేశులుగా అవతరించగా, ఆదిశేషుడు శ్రీరామానుజులుగా అవతరించారని, శ్రీరామావతారకాలంలో తనకు ఆదిశేషాంశ భూతుడైన లక్ష్మణుడు **"అహం సర్వం కరిష్యామి"** అని ఆశపడి చేసిన సకలవిధకైంకర్యాలకు బదులుగా, భగవానుడు శ్రీవత్సాంకులుగా అవతరించి, ఆదిశేషావతారులైన శ్రీరామానుజులకు సేవ చేసి, తన ఆశను తీర్చుకున్నాడని సాంప్రదాయికమైన నమ్మకం. ఇది కూరేశులు సర్వనేత్రుడనే నిత్యసూరుల అంశతో అవతరించారనే సూక్తికి విరుద్ధం

కాదు. "న హి నిందా న్యాయం"తో ఈ రెండిటిని అన్వయించుకోవాలి. 'నమ ఉక్తిమ్' అనే పదంవల్ల కేవలం వాచికకైంకర్యం చెప్పబడినా, దానివల్ల మిగిలిన రెండూ - అంటే- కాయిక, మానసికకైంకర్యాలుకూడా దీనిచే ఉపలక్షితాలు. అందువల్ల శ్రీవత్సాంకుల విషయంలో కరణత్రయరూపమైన కైంకర్యాన్ని చేస్తున్నామని ఇందులోని భావం. ఈ శ్లోకంలో వక్తవ్యాంశాలు ఇంకా చాలా ఉన్నా విస్మృతిభయంచేత ఇంతటితో విరమింపబడు తున్నది.

## కూరేశుల తిరునక్షత్రతనియన్

మకరే హస్తనక్షత్రే సర్వనేత్రాంశసంభవమ్ ।
శ్రీమత్కూరకులాధీశం శ్రీవత్సాంక ముపాస్మహే ॥

## కూరేశుల నిత్యతనియన్

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తిమధీమహి ।
యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥

## వాழ்ి త్తిరునామమ్

శీరారుమ్ తిరుప్పతికళ్ శిఱక్క వన్దోన్ వాழ்ియే
తెన్నరఙ్గర్ శీరరుళై చ్చేరుమవన్ వాழ்ియే
పారారు మెతిరాశర్ పదమ్ పణిన్దోన్ వాழ்ియే
పాషియత్తి నుట్పొరుళై ప్పకరుమవన్ వాழ்ియే
నారాయణన్ శమయమ్ నాట్టినాన్ వాழ்ియే
నాలూరాన్ తనక్కు ముత్తి నల్కినాన్ వాழ்ియే
ఏరారుమ్ తైయిలత్తత్తిఝ్గు వన్దాన్ వాழ்ియే
ఎழ்ిల్ కూరత్తాழ்్వాన్‌తన్ ఇణైయడికళ్ వాழ்ియే



## వాழ்ిత్తిరునామమ్

పొరుళ్ విరిక్కు మెతిరాశర్ పొన్నడియోన్ వాழ்ియే
పొన్‌వట్టిల్‌తనై యెఱిన్ద పుకழ்ుడైయోన్ వాழ்ియే
మరుళ్ విరిక్కుమ్ ముక్కుఱుమ్బై మాఱ్ఱవన్దోన్ వాழ்ియే

మయర్వఱవే మెయ్ఞ్ఞానమ్ విళఙ్గిడువోన్ వాழ్రియే
ఇరుళ్ విరిక్కుమ్ శివమెదిరిట్టెழுత్తిట్టోన్ వాழ்రియే
ఏత మఱ వెవ్వుయిర్క్కుమ్ ఇత మళిత్తోన్ వాழ்రియే
అరుళ్ విరిక్కు మరఙ్గత్తానడియిణైన్దోన్ వాழ்రియే
అழகారు మాழ்వాన్ తన్నడియిణైకళ్ వాழ்రియే

## నాళ్పాట్టు

మట్టవిழுమ్ పొழிల్ శూழ் కురుకేశర్ మఱైత్తమిழ் వాழ்న్దిదునాళ్
మణ్ణులకిల్ శ్రీభాష్యమ్ విళఙ్గిడ వన్దు పిఱన్దవర్నాళ్
ఎట్టు మిరణ్డు మిశైన్ద శులోక మిశైత్తిడ వన్దవర్ నాళ్
ఇల్లై యెన చ్చివ మెన్దే యెదిరిట్టెழுత్తిడ వన్దవర్ నాళ్
తుట్ట కుదిర్ట్టికళ్ మాయికళ్ వాழ்వై త్తుణిత్తిడ వన్దవర్నాళ్
అట్ట తిశైక్కుమ్ నిఱై పుకழ்న్దణర్ వాழ் కూరత్తాழ்వాన్
అవతరిత్తదునాళ్ తైయిల్ విళఙ్గిడు అత్తమతు నన్నాళే

## తిరుమఞ్జన క్కట్టియమ్

అర్వాంచో యత్పదసరసిజద్వంద్వ మాశ్రిత్య పూర్వే
మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా దేశికా ముక్తి మాపుః ।

సోఽయం రామానుజముని రపి స్వీయముక్తిం కరస్థాం
యత్సంబంధా దమనుత కథం వర్ణ్యతే కూరనాథః ॥

కాషాయశోభి కమనీయశిఖానివేశం
దండత్రయోజ్జ్వలకరం విమలోపవీతమ్ ।
ఉద్యద్దినేశనిభ ముల్లసదూర్ధ్వపుండ్రమ్
రూపం తవాస్తు యతిరాజ! దృశో ర్మమాగ్రే ॥
జయ విజయీ భవ!

1) యతిరాజవేషత్తాల్ కృమికంఠశఙై నడువిల్ శెన్ఱు వెన్ఱ విడాయ్ తీరవో!
2) ఎళ్ళళవుమ్ అఞ్జామల్ "ద్రోణ మస్తి తతః పరమ్" ఎన్ఱు ఎழுత్తిట్ట శ్రమమ్ తీరవో!
3) దర్శనత్తై ఉద్ధరిత్తు దర్శనఙ్గట్కు అழிవిన్ఱి వరమ్ పెఱ్ఱ విడాయ్ తీరవో!

4) దయైయుడనే నాలూరాన్ పిళ్ళై పొరుత్తు తన్ కతియై అవర్క్కళిత్త శ్రమమ్ తీరవో!

5) కూరేశవిజయత్తాల్ కుదృష్టికళై కుడియోట్టి వెన్ఱి పెన్ఱ వేర్వై యారవో!

6) కులకురువామ్ ఎతిరాశర్ విరకత్తాల్ నెడుఙ్కాలమ్ నొన్దిరున్ద ఇళైప్పారవో!

7) శ్రీభాష్య మిదుమ్బోదు బ్రహ్మసూత్రవృత్తి యెల్లామ్ తరిత్తురైత్త విడాయ్ తీరవో!

8) శ్రియఃపతియిన్ శేషత్వమ్ జీవాత్మలక్షణ మెన్ఱతివిత్త విడాయ్ తీరవో!

9) శ్రీకూరప్రభవ! దర్శనస్థాపనాచార్య! శ్రీకూరనకర్ తళ్ళైక్కవే జగమేళ్ళుమ్ కుళిర
నిన్ఱు తిరుమఞ్జనమ్ కణ్డరుళవే! జయ! విజయీభవ!



శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే కూరనాథగురవే నమః



శ్రీ కూరేశులు అనుగ్రహించిన

# శ్రీవైకుంఠస్తవము

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే ।
యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥

భగవద్రామానుజుల సకాశంలో సకల వేదాంతరహస్యార్థాలను అధికరించిన కూరేశులు లోకానుగ్రహార్థం అర్థపంచకప్రకాశకం అయిన పంచస్తవాన్ని అనుగ్రహించ దలచి ముందుగా పరమపదనాథ వైభవాన్ని ఈ వైకుంఠస్తవంలో కీర్తిస్తూ ప్రారంభంలో స్వాచార్యస్తుతిరూపమైన మంగళాచరణాన్ని చేస్తున్నారు. ఈ శ్లోకమే నిత్యం ప్రపన్నులు అనుసంధించుకొనే భగవద్రామానుజుల స్తుతిరూపముక్తకం (తనియన్).

యో నిత్య మచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ-
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥ 1

ఏ భగవద్రామానుజులు ఎల్లప్పుడూ భగవానుని శ్రీచరణాల ద్వంద్వం అనే సువర్ణంలో ఉండే వ్యామోహంవల్ల ఆ భగవత్పాదారవిందాలను తప్ప మిగిలిన విషయాలను అన్నిటినీ గడ్డిపోచతో సమానంగా భావించారో (తిరస్కరించారో) అటువంటివారు, కరుణకు అద్వితీయమైన (గొప్ప) సముద్రంవంటివారు, కల్యాణగుణశాలి, అస్మదాచార్యులు అయిన ఆ భగవద్రామానుజులయొక్క శ్రీచరణాలను శరణు పొందుతున్నాను.

త్రైవిద్యవృద్ధజనమూర్ధవిభూషణం యత్
సంపచ్చ సాత్త్వికజనస్య యదేవ నిత్యమ్ ।

**యద్వా శరణ్య మశరణ్యజనస్య పుణ్యం**
**తత్సంశ్రయేమ వకుళాభరణాంఘ్రియుగ్మమ్॥** 2

ఏ నమ్మాళ్వార్ల శ్రీచరణయుగ్మం పరమవైదికుల శిరస్సుకు అలంకారంగా ఉన్నదో, ఎవరి శ్రీపాదయుగ్మం సర్వకాలం సాత్త్వికులకు సకలైశ్వర్యంగా ఉన్నదో, ఏ శ్రీపాదయుగ్మమే దిక్కు లేనివారికి రక్షకంగా ఉన్నదో, అటువంటి, పరమపావనం అయిన నమ్మాళ్వార్ల శ్రీచరణద్వయిని ఆశ్రయిస్తున్నాను.

**భక్తిప్రభావభవదద్భుతభావబన్ధ-**
**సన్ధుక్షితప్రణయసారరసౌఘపూర్ణః ।**
**వేదార్థరత్ననిధి రచ్యుతదివ్యధామా**
**జీయాత్పరాంకుశపయోధి రసీమభూమా ॥** 3

భక్తియొక్క ప్రభావంచేత కలిగిన, ఆశ్చర్యకరాలైన భావవిశేషాలచేత వృద్ధిని పొందింపబడ్డ, సారభూతం అయిన ప్రణయం యొక్క ప్రవాహం చేత పుట్టిన - నవరసాల సమూహంతో నిండినది, వేదార్థాలు అనే నవరత్నాలకు నిధి, భగవానునకు దివ్యస్థానం, అంతులేని గొప్పతనాన్ని కల్గినది అయిన శఠకోపులనే క్షీరసముద్రం చిరకాలం వర్ధిల్లాలి.

**యన్మఙ్గలాయ మహతే జగతా ముశన్తి**
**త్రైవిష్టపాన్యపి పదాని యదాశ్రయాణి ।**
**వన్దామహే సరసిజేక్షణ మద్వితీయం**
**వేదాంతవేద్య మనిదంప్రథమం మహస్తత్ ॥** 4

తత్త్వవేత్తలు ఏ తేజస్సును లోకాలకు గొప్ప మంగళం కల్గడంకోసం కోరుతున్నారో, ముల్లోకాలకు చెందిన స్థానాలుకూడా ఏ తేజస్సును ఆధారంగా కల్గి ఉన్నాయో, ఇది మొదలు అని చెప్పడానికి సాధ్యం కానిది (కాలపరిచ్ఛిన్నం కానిది), సాటి వచ్చేది ఇంకొకటి లేనిది, తేజస్తత్త్వమే మూర్తీభవించినట్లున్నది, వేఱొక నిమిత్తాన్ని అపేక్షించనిది, వేదాంతవాక్యప్రతిపాదితమైనది, తామరలవంటి నేత్రాలను కల్గినది, సుప్రసిద్ధమైనది అయిన ఆ తేజస్సును నమస్కరిస్తున్నాము. (**"త్రైవిష్టపాన్యపి.... యదాశ్రయాణి"**- అనే సూక్తికి అనుగుణంగా **"ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి! ద్యావా పృథివీ విధృతే తిష్ఠతః"** అనే శ్రుతి భావ్యం. **"అద్వితీయమ్, అనిదం ప్రథమ్"** - **"సదేవ సౌమ్య"** అనే శ్రుతిలోని "సత్, అద్వితీయ" పదాలు స్మారితాలు.)

పీతామ్బరం వరదశీతలదృష్టిపాతం
ఆజానులమ్బిభుజ మాయతకర్ణపాశమ్ ।
తన్మేఘమేచక ముదగ్రవిశాలవక్షో
లక్ష్మీధరం కిమపి వస్తు మమావిరస్తు ॥ 5

పీతాంబరాన్ని కల్గినది, వరాలను ఇచ్చే చల్లని కటాక్షాలను కల్గినది, మోకాళ్ళవరకు సాగిన భుజాలను కల్గినది, విశాలమైన గొప్ప కర్ణాలను కల్గినది, విశాలమైన వక్షస్సును కల్గినది, శ్రీమహాలక్ష్మిని ధరించినది, ఇటువంటిది అని నిర్వచించడానికి సాధ్యం కానిది అయిన ఆ వస్తువు (శ్రీమన్నారాయణుడు) (ఈవిధంగా వర్ణింపబడ్డ రీతిలో) నా మనస్సులో ప్రత్యక్షంకావాలి. ("ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్", "తస్య మహారజనం వాసః", "తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ", "హ్రీశ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ" ఇత్యాది శ్రుతులు ప్రకృతంలో భావ్యాలు.)

యత్తత్త్వ మక్షర మదృశ్య మగోత్రవర్ణమ్
అగ్రాహ్య మవ్యయ మనీదృశ మద్వితీయమ్।
ఈశాన మస్య జగతో యదణో రణీయః
తద్వైష్ణవం పద ముదార ముదాహరామః ॥ 6

భగవానుని ఏ స్వరూపం సత్యమైనదో, నిర్వికారమైనదో, మాంసచక్షువులతో దర్శించడానికి సాధ్యం కానిదో, నామరూపాలు లేనిదో, అనుమానాది ప్రమాణాలతో గ్రహించడానికి వీలు లేనిదో, వినాశం లేనిదో, మనం కన్నులతో చూచే వస్తువువంటిది కాదో, సాటి లేనిదో, ఏ స్వరూపం ఈ జగత్తుకు నియామకమై, అణువుకంటే మిక్కిలి సూక్ష్మమైనదో, పెద్ద వస్తువులకంటే పెద్దదో - అటువంటి విష్ణుసంబంధమైన ఉపాస్యస్వ రూపాన్ని స్తుతిస్తున్నాము. ("ఈశాన మస్య జగతః"- "పతిం విశ్వస్యాత్మేశ్వరమ్" అనే శ్రుతులు భావ్యాలు.)

ఆమ్నాయమూర్ధని చ మూర్ధని చోర్ధ్వపుంసాం
యద్ధామ వైష్ణవ మభీక్ష్ణతరం చకాస్తి ।
తన్మాదృశా మపి చ గోచర మేతి వాచః
మన్యే తదీయ మిద మాశ్రితవత్సలత్వమ్॥ 7

విష్ణువుకు చెందిన ఏ జ్యోతిస్సు వేదాంతాలలో, పూర్వపురుషుల (దివ్యసూరుల) శిరస్సులో మిక్కిలి గొప్పగా వెల్గుతున్నదో, ఆ జ్యోతిస్సు మావంటివారి మాటలకు

కూడా విషయం అవుతున్నది (అందుతున్నది) అనే దానికి కారణం- ఆ విష్ణుసంబంధమైన (వైష్ణవమైన) తేజస్సుయొక్క ఆశ్రితవాత్సల్యమేనని భావిస్తున్నాను. ("వైష్ణవం ధామ"- "జ్యోతి శ్చరణాభిధానాత్" అనే బ్రహ్మ సూత్రార్థం స్మరణీయం. "మూర్ధని చోర్ధ్వపుంసామ్" అన్నపుడు "ఎన్ తలైయే" అనే శఠకోపసూరి సూక్తి, "యన్మూర్ధ్ని మే శ్రుతిశిరస్సు చ భాతి" అనే యామున సూక్తి భావ్యం.)

జానన్నపీహ కిల మా మనపత్రపిష్ణుః
విష్ణోః పదప్రణయినీం గిర మాద్రియేఽహమ్ ।
న శ్వాఽవలీఢ మపి తీర్థ మతీర్థ మాహుః
నోదన్యతాఽపి చ శునా కిల లజ్జితవ్యమ్ ॥ 8

నేను అజ్ఞుడనని తెలిసినా ఏమాత్రం లజ్జ లేకుండా విష్ణువుయొక్క శ్రీపాదాలలో ప్రేమను గల వాక్కును ప్రకృతంలో ప్రయోగించాలని (స్తుతించాలని) ఆశపడు తున్నాను. సహజంగానే పవిత్రమైన (గంగ మొదలైన) తీర్థం కుక్కచేత నాకబడినా దానిని తీర్థం కాదని ఎవరూ అనరు. దాహాన్ని పొందిన ఆ కుక్కకూడా సిగ్గుపడవలసిన పని లేదు.

దేవస్య దైత్యమథమస్య గుణేష్వియత్తా
సంఖ్యా చ వాఙ్మనసగోచర మత్యభూతామ్ ।
అప్యేవ మణ్వపి చ తత్ర మమాఽఽర్తిశాన్త్యై
కీటస్య తృష్యత ఉదన్వతి విప్రుషాఽలమ్ ॥ 9

అసురులను నిరసించడం స్వభావంగా కల భగవానునియొక్క కల్యాణ గుణాలు ఇన్ని అని లెక్కించడం కాని, ఒక్కొక్క గుణం ఏతావన్మాత్రం అని పరిచ్ఛేదించడం కాని మనస్సుకు, వాక్కుకు సాధ్యం కానిది. అయినా, ఆ గుణాలలో ఏక దేశం అయినా నా ఆర్తిని ఉపశమింపజేయడానికి చాలు. దాహాన్ని కల పురుగుకు (క్షుద్రజంతువుకు) దాని దాహం తీరడానికి సముద్రంలోని ఒక్క నీటిబొట్టు అయినా చాలుకదా.

ప్రేమార్ద్రవిహ్వలగిరః పురుషాః పురాణాః
త్వాం తుష్టువు ర్మధురిపో ! మధురై ర్వచోభిః ।
వాచో విడమ్బిత మిదం మమ నీచవాచః
క్షాన్తి స్తు తే సవిషయా మమ దుర్వచోభిః ॥ 10

మధుసూదనా! భగవద్భక్తిప్రకర్షచేత గద్గదమైన వాక్కులను కల దివ్యసూరులు, పూర్వాచార్యులు మొదలైన పూర్వులు తమ తీయని వాక్కులతో నిన్ను స్తుతించారు. నీచమైన వాక్కులను కల ఈ నా స్తుతి ఆ ప్రాచీనుల వాక్కులకు అనుకరణం. ఇందువల్ల వారి వాక్కులకుకూడా దోషం అంటుతుంది. అయితే దీనికి పరిహారం ఏమి? అని అంటే, నా నీచవాక్కులచేత నీ క్షమ తగిన విషయం కల్గినది అవుతుంది. (లేకపోతే నీ క్షమ నిర్విషయమే అవుతుంది కదా!)

**ఆజ్ఞా తవాఽత్ర భవతీ విదితా త్రయీ సా**
**తాం హి ప్రమాణ ముపజగ్ము రతీన్ద్రియేఽర్థే ।**
**అభాసభూయ మభియాన్త్యపరాణి దోషైః**
**ఏషా తు దోషరహితా మహితా పురాణీ ॥** **11**

పరమపూజ్యమైన ఆ వేదం నీ శాసనంగా ప్రసిద్ధిజెందింది. ("శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే" అని కదా భగవత్సూక్తి) ఆ వేదత్రయిని అతీంద్రియాలైన- బాహ్యేంద్రియాలకు కన్పించని విషయంలో పరమప్రమాణంగా వైదికులు అంగీకరించారు. వేదాలకంటే వేఱయిన ప్రత్యక్షానుమానోపమానాది ప్రమాణాలు బహుదోషజుష్టాలు. కనుక అవి ఆభాసత్వాన్ని పొందుతున్నవి. అందుచేత అవి ప్రమాణాలు కావు. నిత్యమైనది, అందువల్లనే దోషరహితమైనది అయిన ఈ వేదం ప్రమాణాలన్నిటిలో గొప్పది. (కనుక శ్రుత్యనుసారంగా స్తుతించాలి.)

**అన్తర్హితో నిధి రపి త్వ మశేషపుంసామ్**
**లభ్యోఽసి పుణ్యపురుషై రితరై ర్దురాపః ।**
**తత్ర త్రయీం సుకృతినః కృతినోఽధిజగ్ముః**
**బాహ్యేషు బాహ్యచరితై రితరై ర్నిపేతే ॥** **12**

స్వామీ ! సమస్తపురుషులకు (యోగులకుకూడా) "వైత్తమా నిది" అన్నట్లు ఇంద్రియాలకు కన్పించని నిధివై, పుణ్యాత్ములచేత పొందదగినవాడవై ఉన్నావు. ఇతరులకు- అంటే- పాపాత్ములకు పొందడానికి శక్యం కానివాడవు నీవు. నీ స్వరూపాది జ్ఞానవిషయంలో పుణ్యాత్ములైన పండితులు వేదాన్ని పరమప్రమాణంగా గ్రహించారు. శాస్త్రవిరుద్ధమైన నడతను కల ఇతరులు వేదవిరుద్ధమైన మార్గాన్ని అవలంబించి పతితులవుతున్నారు.

**చిత్రం విధే ర్విసితం త్విద మావిరస్తి**
**దుష్టాత్మనా మయ మహో! కిల దుర్విపాకః ।**

**యత్కేచిదత్ర భవతీం శ్రుతి మాశ్రయన్తో౾**
**ప్యర్థే కుదృష్టివినివిష్టధియో వినష్టాః ॥** **13**

దైవంయొక్క ఈ విలాసాన్ని చూస్తే చాలా చిత్రంగా కన్పిస్తున్నది. ఎందువల్లనంటే, కొందఱు పరమప్రమాణం, పూజనీయం అయిన వేదాన్ని ప్రమాణంగా అంగీకరించినా, దాని పదార్థ - వాక్యార్థ - తాత్పర్యార్థనిర్ణయాన్ని గూర్చి అపసిద్ధాంతం చేయడంలో చాలా పట్టుదలను కలవారై చెడిపోతున్నారు. అందువల్ల దుష్టాత్ములైన వారి ఈ దురదృష్టవిపాకం ఎంత ఆశ్చర్యకరం ! (**"న తు మామభిజానంతి తత్త్వేనైతత్ చ్యవంతి తే"** - నన్ను పరతత్త్వంగా గ్రహించకుండా పతితులవుతున్నారు -అనే గీతా సూక్తి స్మరణీయం.)

**బాహ్యాః కుదృష్టయ ఇతి ద్వితయే౾ప్యపారం**
**ఘోరం తమ స్సముపయాన్తి న హీక్షసే తాన్।**
**జగ్ధస్య కాననమృగై ర్మృగతృష్ణికేప్సోః**
**కాసారసత్త్వనిహతస్య చ కో విశేషః ॥** **14**

వేదాన్ని ప్రమాణంగా అంగీకరించని మాధ్యమికులు మొదలైన బౌద్ధులు, జైనులు మొదలైన నాస్తికులు, వేదైకదేశాన్ని- (నిర్గుణశ్రుతులవంటి) వేదంలో కొంతభాగాన్ని- వ్యావహారికప్రమాణంగా అంగీకరించి అపసిద్ధాంతాలను చేసే మిథ్యావాదులు మొదలైనవారు- అని ఈ రీతిలో బాహ్య-కుదృష్టులనే రెండు వర్గాలకు చెందినవారు. అంతులేని, భయంకరమైన అజ్ఞానాన్ని (చీకటిని) పొందుతున్నారు. ఆ బాహ్యకుదృష్టులను నీవు కటాక్షింపవు. దాహాన్ని తీర్చుకోవడం కోసం ఎండమావులను చేరగోరి, దారి నడుమ అడవిలో ఉండే సింహశార్దూలాది క్రూరమృగాలచేత చంపబడ్డవానికి, సరస్సులో దాహం తీర్చుకోవాలని తలచి అందులో దిగరాని చోట దిగి మునిగిపోయి, దానిలో ఉండే మొసళ్ళవంటి జంతువులచే చంపబడినవానికి ఏమి భేదం? (ఏమీ భేదం లేదు) (**"న హీక్షసే తాన్"- "జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః , సాత్త్వికః స తు విజ్ఞేయః, స వై మోక్షార్థచింతకః"** మొదలైన ప్రమాణాలు ఈ సూక్తికి అనుగుణంగా స్మరణీయాలు. ఎండమావులను వెదకుతూ క్రూరమృగాలచేత చంపబడ్డవాడు, సరస్సులో తగనిచోట ప్రవేశించి మొసళ్ళచేత మింగబడ్డవాడు- ఇద్దఱూ -దాహాన్ని తీర్చకోలేకపోవడంలో, ప్రాణాలను పోగొట్టుకోవడంలో సమానులే. అదే రీతిలో పరమప్రమాణం అయిన వేదాన్ని అప్రమాణంగా భావించి, ప్రతారకవాక్యాన్ని ప్రమాణంగా తలచి, దుర్మతకల్పనాన్ని చేసే వేదబాహ్యులు, వేదాన్ని పూర్ణంగా

ప్రమాణంగా అంగీకరించకుండా, దానికి సాక్షికప్రామాణ్యాన్ని అంగీకరించి, స్వకపోలకల్పితార్థాలను పలికి, అపసిద్ధాంతాన్ని చేసే కుదృష్టులు- ఇద్దఱూ తత్త్వనిర్ణయం చేయలేకపోవడంలోను, అధఃపతనంలోను సమానులు- అని తాత్పర్యం.)

**న్యాయస్మృతిప్రభృతిభి ర్భవతా నిసృష్టైః**
**వేదోపబృంహణవిధా వుచితై రుపాయైః ।**
**శ్రుత్యర్థ మర్థ మివ భానుకరై ర్విభేజుః**
**త్వద్భక్తిభావితవికల్మషశేముషీకాః ॥ 15**

నీపట్లగల భక్తిభావనచేత నిర్మలమైన బుద్ధిని గల పెద్దలు పరమాత్మవైన నీచే అనుగ్రహింపబడిన, వేదాన్ని వివరించడంలో తగిన సాధనాలైన తర్కమీమాంసా న్యాయాలతోను, మన్వాదిస్మృతులతోను, ఇతిహాసపురాణాలతోను వేదార్థాలను, సూర్యకిరణాలద్వారా లోకంలోని ఘటపటాది వస్తువులనువలె, వర్గీకరించారు. (**"పూర్వోత్తరావిరోధేన కోఽత్రార్థోఽభిమతో భవేత్, ఇత్యాద్యమూహనం తర్కః, శుష్కతర్కం తు వర్జయేత్"** - పూర్వోత్తరసందర్భాలకు విరోధం లేకుండా తగిన అర్థాన్ని ఊహించే తర్కం తప్ప శుష్కతర్కాన్ని వదలి పెట్టాలి, **"ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా, యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః"** - వేదరూపశాస్త్రానికి విరుద్ధంగా కాకుండా ఉండే తర్కంతో ఆర్షమైన ధర్మోపదేశాన్ని ఎవడు సమన్వయిస్తాడో అతడే ధర్మాన్ని తెలిసినవాడు. మిగిలినవారు కారు, **"వేదశాస్త్రరథారూఢాః న్యాయఖడ్గధరా ద్విజాః, క్రీడార్థ మపి యత్ బ్రూయుః తద్ధర్మః పరమో మతః"**- వేదశాస్త్రాలనే రథాన్ని అధిరోహించిన, న్యాయాలనే ఖడ్గాలను ధరించిన ద్విజులు విలాసంగా ఏమి పల్కినా అది పరమధర్మమే కాగలదు) ఇత్యాది ప్రమాణాలు ఈ శ్లోకార్థానికి అనుగుణంగా అనుసంధేయాలు.

**యే తు త్వదంఘ్రిసరసీరుహభక్తిహీనా**
**తేషా మమీభి రపి నైవ యథార్థబోధః ।**
**పిత్తఘ్న మఞ్జన మనాప్నుషి జాతు నేత్రే**
**నైవ ప్రభాభి రపి శంఖసితత్వబుద్ధిః ॥ 16**

ఎవరు నీ పాదపద్మాలలో భక్తిని లేకుండా ఉంటారో, వారికి పైన చెప్పబడ్డ న్యాయస్మృతీతిహాసపురాణాదులద్వారా యథార్థమైన జ్ఞానం కలుగనే కలుగదు. కంటికి పైత్యాన్ని పోగొట్టే కాటుకను పెట్టుకోకపోతే సూర్యకిరణకాంతులచేకూడ శంఖం తెల్లనిది

అనే జ్ఞానం ఏనాటికీ కలుగదుకదా ! (భక్తి తత్త్వజ్ఞానానికి ప్రధానమైన సాధనం, కేవల శాస్త్రజ్ఞానం ఉపయోగకరం కాదు)

తత్త్వార్థతత్పరపరశ్శతవేదవాక్యైః
సామర్థ్యత స్మృతిభి రప్యథ తాదృశీభిః ।
త్వా మేవ తత్త్వపరసాత్త్వికసత్పురాణైః
దేవజ్ఞధీభి రపి నిశ్చినుమః పరేశమ్ ॥ 17*

తత్త్వార్థాలను వ్యక్తీకరించడంలో తాత్పర్యాన్ని కల అనేకవేదవాక్యాలతో, ఇంకా ఇటువంటి- అంటే- తత్త్వార్థప్రకాశకాలైన స్మృతులతోను (అస్పష్టార్థకవాక్యాలను స్పష్టార్థకవాక్యాలకు అనుగుణంగా నిర్వహించవలసి ఉండడం అనే) సామర్థ్యాలతోను, తత్త్వపరాలు, సాత్త్వికాలు అయిన పురాణశ్రేష్ఠాలతోను బ్రహ్మవిత్తులైన పరాంకుశ-పరకాల- యతివరాదుల అభిప్రాయానుగుణంగాను నీవే సర్వేశ్వరుడవని నిశ్చయించు కున్నాము.

అన్యత్ర తు క్వచన కేచిదిహేశశబ్దాత్
లోకప్రసిద్ధి ముపగమ్య త మీశ మాహుః ।
తైశ్చ ప్రసిద్ధివిభవస్య సమూలతాయై
గ్రాహ్యా త్రయీ త్వయి తు సాఽచ్యుత ! సమ్ముఖీనా ॥ 18

కొందఱు ఇక్కడ కొన్ని గ్రంథాలలో దేవతాంతరాల విషయంలో ఈశశబ్ద ప్రయోగంవల్ల, లౌకిక ప్రసిద్ధినిబట్టి, దేవతాంతరమైన రుద్రుని విషయంలో ఈశశబ్దానికి

---

* వేదార్థధీ స్త్వయి తు భక్తిత ఏవ లభ్యా
యావాన్ హి యశ్చ భగవన్నసి తత్త్వత స్త్వమ్ ।
తత్త్వార్థతత్పరశ్శతవేదవాక్యైః
సామర్థ్యతః స్మృతిభి రప్యథ తాదృశీభిః ॥ 17(ఎ)

షాడ్గుణ్యపూర్తిని కల భగవన్ ! నీవు యథార్థంగా ఎంతటివాడవుగా ఉన్నావో, ఎవడవై ఉన్నావో దానిని తెలిసికోవడానికి సాధనమైన వేదార్థజ్ఞానం నీపట్ల గల భక్తివల్లనే పొందడానికి వీలు అవుతుంది. జగజ్జనకుడవైన వైకుంఠనాథా! అదేవిధంగా వేదవేద్యుడవైన నిన్ను దర్శించడం, ప్రవేశించడం (ధ్యానించడం) నీపట్ల గల భక్తివల్లనే సాధ్యం. (ఈ శ్లోకం పలు ముద్రితగ్రంథాలలో కన్పించడంలేదు. పంచస్తవి వ్యాఖ్యాత శ్రీనివాసాచార్యుల వారు కూడ దీనిని వ్యాఖ్యానించలేదు.)

అర్థంగా (శివుని) చెబుతున్నారు. వారిచేకూడా ఆ ప్రసిద్ధిప్రాచుర్యానికి ప్రామాణ్యంకోసం వేదాన్ని ప్రమాణంగా అంగీకరించవలసి ఉన్నది. అయితే ఆ వేదం మాత్రం, ఓ అచ్యుతా! నీ విషయంలో ఆభిముఖ్యాన్ని కల్గి ఉన్నది తప్ప, దేవతాంతరాన్ని పరతత్త్వంగా ప్రతిపాదించడం లేదు. (నారాయణపరమైన **"శాశ్వతం శివ మచ్యుతమ్"** అనే శ్రుతిని ఇక్కడ స్మరించాలి)

**యః ఖల్వణో రణుతరో మహతో మహీయాన్**
**ఆత్మా జనస్య జనకో జగత శ్చ యోఽ భూత్ ।**
**వేదాత్మకప్రణవకారణవర్ణవాచ్యం**
**తం త్వాం వయం తు పరమేశ్వర మామనామః ॥** 19

(ఇక) మేమయితే అణువుకంటే అణువువు, మహత్తుకంటే అతిమహత్తువు, చేతనాచేతనాలకు ఉత్పాదకుడవు, అంతర్యామివి అయిన నిన్ను వేదస్వరూపమైన ఓంకారానికి కారణమైన అకారంచేత చెప్పబడేవానినిగా (అకారశబ్దవాచ్యునిగా), పరమేశ్వరునిగా వేదాలద్వారా తెలిసికొంటున్నాము. (**"అక్షరాణా మకారోఽస్మి', "అణో రణీయాన్ మహతో మహీయాన్", "యద్వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః , తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః", "తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్"** వంటి శ్రుతిస్మృతి ప్రమాణాలు ప్రకృతంలో గ్రాహ్యాలు)

**ఆత్మేశ్వరోఽసి న పరోఽస్తి తవేశ్వరోఽన్యో**
**విశ్వస్య చాధిపతి రస్య పరాయణం చ ।**
**నారాయణాచ్యుత ! పరస్త్వ మిహైక ఏవ**
**బ్రహ్మాదయోఽపి భవదీక్షణలబ్ధసత్తాః ॥** 20

ఓ నారాయణా! అచ్యుతా! ఈ లోకంలో నీవు ఒక్కడవే గొప్పవాడవు. ఆత్మలను నియమించేవాడవు. నీకంటే గొప్పవాడైన, నిన్ను నియమించేవాడైన వేఱొక నియంత ఎవడూ లేడు. విశ్వానికి అధిపతివి, ప్రాప్యుడవు నీవే. ఈ లోకానికి గొప్ప శరణం కూడా నీవే. బ్రహ్మాదులుకూడా నీకటాక్షంవల్లనే సత్తను పొందుతున్నారు. (**"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై", "బ్రహ్మణః పుత్రాయ జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ విరూపాక్షాయ"** ఇత్యాది శ్రుతులు అనుసంధేయాలు.)

**నిత్య స్సమాభ్యధికవర్జిత ఊర్జితశ్రీః**
**నిత్యేఽక్షరే దివి వసన్పురుషః పురాణః ।**

సత్త్వప్రవర్తనకరో జగతోఽస్య మూలం
నాఽన్య స్త్వదస్తి ధరణీధర ! వేదవేద్యః ॥ 21

భూమిని ధరించిన వైకుంఠనాథా ! నీవు ఒక్కడవే (కాలంచేత పరిచ్ఛిన్నుడవు కాని) నిత్యుడవు. నీకు సాటివచ్చే వారు, మించినవారు ఎవరూ లేరు. (వస్తుపరిచ్ఛేదాన్ని కలవాడవు కావు) సత్యజ్ఞానాదులకంటే ముఖ్యమైన స్వరూపకనిరూపక, కనుక, దార్ఢ్య వతి అయిన లక్ష్మిని కలవాడవు నీవు. త్రికాలంలోను ఉండేది, కాలకృతపరిణామాన్ని లేనిది, పరమాకాశమనబడేది అయిన దివిలో నివసిస్తూ ఈ జగత్తుకు మూలకారణంగా ఉన్నావు. సత్త్వగుణకార్యమైన పరిపాలనను చేస్తున్నావు. ఆద్యుడవు, పురాణ పురుషుడవును. నీకంటే వేఱొకడు వేదాలచేత పరతత్త్వంగా ప్రతిపాదింపబడడం లేదు. (ధరణీశబ్దం ఉభయవిభూతి వాచకం. పూర్వశ్లోకంనుండి "త్వమ్, ఏకః, ఏవ" అనే పదాలు అధ్యాహార్యాలు. "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్, న తత్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే, హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ", "తదక్షరే పరమే వ్యోమన్", "యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్", "యతో వా ఇమాని భూతాని జాయంతే", "సర్వే వేదా యత్పద మామనంతి" ఇత్యాది శ్రుతులు ప్రకృతంలో స్మరణీయాలు)

యం భూతభవ్యభవదీశ మనీశ మాహుః
అన్త స్సముద్రనిలయం య మనన్తరూపమ్ ।
యస్య త్రిలోకజననీ మహిషీ చ లక్ష్మీః
సాక్షాత్స ఏవ పురుషోఽసి సహస్రమూర్ధా ॥ 22

వేదాలు భూతభవిష్యద్వర్తమానకాలాలు అన్నిటికీ నియా మకునిగా, తనకు ఇంకొక నియామకుని లేనివానిగా ఏ పురుషుని చెబుతున్నాయో, ఏ పురుషుని క్షీరాబ్ధిలోపల నివాసం కలవానినిగా తెల్పుతున్నవో, ఏపురుషునకు మహిషి అయిన లక్ష్మీదేవి త్రిలోకజననియో, సాక్షాత్తు సహస్రశీర్షుడైన ఆ పురుషుడవు నీవే. ("ఈశానో భూతభవ్యస్య", "న తస్యేశోఽస్తి కశ్చన, య మంతః సముద్రే కవయో వదంతి", "తదేక మవ్యక్త మనంతరూపమ్", "అస్యేశానో జగతో విష్ణుపత్నీ", "సహస్రశీర్షా పురుషః "- ఇత్యాది శ్రుతులు భావ్యాలు)

సర్వశ్రుతిష్వనుగతం స్థిర మప్రకంప్యం
నారాయణాహ్వయధరం త్వ మివానవద్యమ్ ।
సూక్తం తు పౌరుష మశేషజగత్పవిత్రం
త్వా ముత్తమం పురుష మీశ ముదాజహార ॥ 23

నీవలెనే సమస్తవేదాలలోను అనుగతమైనది. అందఱిచేత భగవత్పరంగా అంగీకరింపబడినది, కుతుర్కాలతో అన్యదేవతాపరంగా అన్వయించడానికి ఏమాత్రం వీలు లేనిది, నారాయణనామాన్ని కల్గినది, నిర్దుష్టమైనది, సమస్తలోకాలను పావనం చేసేది అయిన పురుషసూక్తం సర్వనియామకుడవైన నిన్ను సర్వోత్తముడవైన పురుషునిగా ప్రతిపాదించింది. (**"వేదేషు పౌరుషం సూక్తమ్", "ఋగ్వేదే షోడశర్చం స్యాత్ యజుష్వష్టాదశర్చకమ్, సామవేదేషు సప్తర్చమ్ తథా వాజసనేయకే", "ఉత్తమః పురుషస్త్వన్యత్ పరమాత్మేత్యుదాహృతః"** - ఇత్యాది ప్రమాణాలు ప్రకృతంలో అనుసంధేయాలు.)

**ఆనంద మైశ్వర మవాఙ్మనసావగాహ్యామ్**
**ఆమ్నాసిషు శ్శతగుణోత్తరితక్రమేణ ।**
**సోఽయం తవైవ నృషు హి త్వ మిహాన్తరాత్మా**
**త్వం పుణ్డరీకనయనః పురుష శ్చ పౌష్ణః ॥** **24**

ఈశ్వరత్వప్రయుక్తమైన ఏ ఆనందాన్ని నూఱు నూఱు రెట్లు పెంచుతూ మనుష్యానందనుండి లెక్కించి, చివరికి మాటకు మనస్సుకు అందనిదిగా వేదాలు పునఃపునః అభ్యాసం చేశాయో, అట్టి ఆనందం నీదే. ఎందుకు? అని అంటే, ఈ ప్రకరణంలో మానవులలో నీవు అంతరాత్మగా, పుండరీకాక్షుడవుగా, సూర్య మండలాంతర్వర్తి అయిన పురుషుడవుగా చెప్పబడ్డావు. (**స య శ్చాయం పురుషే యశ్చాసా వాదిత్యే స ఏకః", "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ, య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే..."** ఇత్యాది శ్రుతులు గ్రాహ్యాలు)

**యన్మూలకారణ మబుద్ధ్యత సృష్టివాక్యైః**
**బ్రహ్మేతి వా సదితివాఽఽత్మగిరాఽథవా తత్ ।**
**నారాయణస్త్వితి మహోపనిషద్బ్రవీతి**
**సౌబాలికీప్రభృతయోఽప్యనుజగ్ము రేనామ్ ॥** **25**

ఏవస్తువు జగత్సృష్టి కారణాలను బోధించే **"బ్రహ్మ వా ఇద మగ్ర ఆసీత్"** అనే వాక్యంచేత, **"స దేవ సౌమ్య ఇద మగ్ర ఆసీత్"** అనే వాక్యంచేత **"ఆత్మా వా ఇద మగ్ర ఆసీత్"** అనే వాక్యంచేత ప్రాథమికకారణంగా తెలియబడినదో, ఆ మూలకారణ మైన వస్తువును మహోపనిషత్తు నారాయణుడని స్పష్టం చేసింది. దీనిని సుబాలోపనిషత్తు మొదలైనవి అనుసరించాయి. (**"ఏకో హ వై నారాయణ ఆసీత్"** అనే మహోపనిషద్వాక్యం, **"య ఆత్మని తిష్ఠన్ ఆత్మాన మంతరో యమయతి... దివ్యో దేవ ఏకో నారాయణః"** అనే సుబాలోపనిషద్వాక్యం ఇక్కడ స్మరణీయాలు)

**జ్యోతిః పరం పరమ తత్త్వ మథో పరాత్మా**
**బ్రహ్మేతి చ శ్రుతిషు యత్పరవస్త్వధీతమ్ ।**
**నారాయణ స్తదితి తద్విశినష్టి కాచిత్**
**విష్ణోః పదం పరమ మిత్యపరా గృణాతి ॥ 26**

శ్రుతులలో పరతత్త్వం అని, పరంజ్యోతి అని, పరమాత్మ అని, బ్రహ్మ అని ఏ పరవస్తువు అధ్యయనం చేయబడిందో (చెప్పబడిందో) ప్రసిద్ధమైన ఆ పరవస్తువు నారాయణుడేనని ఒక ఉపనిషత్తు వివరిస్తున్నది. ఇంకొక ఉపనిషత్తు విష్ణువుయొక్క ఉత్కృష్టస్వరూపాన్ని ఇదమిత్థంగా నిరూపిస్తున్నది. (**"నారాయణః పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః, నారాయణ పరో జ్యోతి రాత్మా నారాయణః పరః"** అనే నారాయణానువాకవాక్యం, **"విజ్ఞానసారథి ర్య స్తు మనఃప్రగ్రహవాన్ నరః, సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్"** అనే కఠోపనిషద్వాక్యం స్మరించదగినవి.)

**సన్తీదృశ శ్శ్రుతిశిరస్సు పరస్సహస్రాః**
**వాచ స్తవ ప్రథయితుం పరమేశితృత్వమ్ ।**
**కిఞ్చేహ న వ్యజగణః క్రిమిధాతృభేదం**
**క్రామన్ జగన్తి నిగిరన్ పునరుద్గిరంశ్చ ॥ 27**

నీ సర్వేశ్వరత్వాన్ని వెల్లడించడానికి వేదాంతాలలో వేలకు మించిన ఇటువంటి వాక్కులు ఎన్నో ఉన్నాయి. అంతేకాక, లోకాలను త్రివిక్రమావతారంలో ఆక్రమిస్తూ, ప్రళయంలో మింగుతూ, మళ్ళీసృష్టి సమయంలో వెలువరిస్తూ నీవు "ఇది పురుగు, ఇతడు బ్రహ్మ"- అనే భేదాన్ని ఈ విక్రమణాదులలో లెక్కించలేదు. (**"త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్"** ఇత్యాది శ్రుతులు ప్రకృతంలో గ్రాహ్యాలు)

**రూపశ్రియా పరమయా పరమేణ ధామ్నా**
**చిత్రై శ్చ కైశ్చి దుచితై ర్భవత శ్చరిత్రైః ।**
**చిహ్నై రనిహ్నవపరై రపరై శ్చ కైశ్చిత్**
**నిశ్చిన్వతే త్వయి విపశ్చిత ఈశితృత్వమ్ ॥ 28**

బ్రహ్మవేత్తలు నీ శ్రేష్ఠమైన స్వరూపశోభతో, సర్వోత్కృష్టమైన స్థానంతో, ఆశ్చర్యకరాలైన, మహిమకు అనుగుణాలైన కొన్ని నీ చరిత్రలతో, జగత్కారణాది చరిత్రలతో, కప్పి పుచ్చుకోవడానికి వీలు కాని తత్త్వనిర్ణాయకాలైన కొన్ని చిహ్నాలతో, ఇంకా మఱికొన్ని చిహ్నాలతో నీలో సర్వేశ్వరత్వాన్ని నిశ్చయిస్తున్నారు. (భగవానుని

స్వరూపం లోకోత్తరం అనే విషయానికి -"తస్య భాసా సర్వ మిదం విభాతి", "దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా, యది భాః సదృశీ సా స్యాద్భాస స్తస్య మహాత్మనః" ఇత్యాది ప్రమాణాలు భావ్యాలు. "చిత్రైః చరిత్రైః" - స్తంభోద్భవం, సేతునిర్మాణం, చరాచరమోక్ష ప్రదానాదులు, చిహ్నైః- లక్ష్మీపతిత్వ, శేషశాయిత్వ, వైనతేయ వాహనత్వాదులు.)

యస్యాః కటాక్షణ మనుక్షణ మీశ్వరాణామ్
ఐశ్వర్య హేతు రితి సర్వజనీన మేతత్ ।
తాం శ్రీ రితి త్వదుపసంశ్రయణా న్నిరాహుః
త్వాం చ శ్రియ శ్శ్రియ ముదాహు రుదారవాచః ॥ 29

ఏ లక్ష్మీదేవియొక్క కటాక్షం ప్రతిక్షణం ఇంద్రాదుల ఐశ్వర్యానికి హేతువు- అని చెప్పడం సర్వజనప్రసిద్ధమో, అటువంటి ఆ తల్లి నీ ఆశ్రయణంవల్ల (నిన్ను ఆమె ఆశ్రయించినందువల్ల) "శ్రీః" అని విజ్ఞులచే నిర్వచింపబడుతున్నది- అని గొప్ప వాక్కులను గల యామునులవంటి మహనీయులు నిర్వచించారు. నిన్నుకూడా వారు ఆ శ్రీదేవికి శ్రీగా ఉదాహరించారు. ("శ్రీరిత్యే వ చ నామ తే భగవతి", "క శ్రీః శ్రియః"అనే యామునుల సూక్తులు, "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా!" అనే తిరుమజ్గైయాళ్వార్ల సూక్తి. "శ్రియః శ్రీ శ్చ భవేదగ్ర్యా" అనే శ్రీరామాయణసూక్తి ఇక్కడ భావ్యాలు)

మాయా త్వయా గుణమయీ కిల యా నిసృష్టా
సా తే విభో ! కి మివ నర్మ న నిర్మిమీతే ।
కౌతస్కుతాః స్థిరకుతర్కవశేన కేచిత్
సత్యాం శ్రుతౌ చ బధిరా స్త్వయి తన్మహిమ్నా ॥ 30

ఓ ప్రభూ! సత్తరజస్తమోగుణాత్మక అయిన ప్రకృతి నీచే దేహేంద్రియాదు లుగా మార్చబడినది. అది నీకు ఏ లీలనైనా చేయగల సాధనం. కొందఱు హేతువాదులు ప్రతినివిష్టమూర్ఖులై కుతర్కాలతో, అవి ప్రమాణాలకు అనుకూలం కానివి అయినా, నీ పారమ్యాన్ని వేదం స్పష్టంగా తెలుపుతున్నా, ఆ మాయయొక్క మహిమచేత చెవిటివారవుతున్నారు. ("అజా మేకాం లోహితశుక్లకృష్ణామ్ బహ్వీం ప్రజాం జనయంతీమ్ సరూపామ్", "మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్" ఇత్యాది శ్రుతులు, "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" అనే గీతాసూక్తి ఇక్కడ గ్రాహ్యాలు.)

యస్థావరక్రిమిపతంగమతంగజాదిషు
అన్యేషు జన్తుషు సదైవ విజాయమానః ।
త్వం నిత్య! నిర్మల! నిరఞ్జన! నిర్వికార!
కల్యాణసద్గుణనిధే ! స ఇతీరిత స్తైః ॥ 31

నిత్యా ! నిర్మలా ! నిరంజనా నిర్వికారా! కల్యాణగుణనిధీ ! నీపారమ్యాన్ని వేదం పలు రీతులలో ఘోషిస్తున్నా ఏ చేతనుడు స్థావర- క్రిమి-పక్షి- గజాదిరూపాల లోను, ఇతరరూపాలలోను కర్మవశంచేత వివిధంగా జన్మిస్తున్నాడో, ఆ చేతనుడే నీవు అని బధిరులైన హేతువాదులు అంటున్నారు. ("పరం బ్రహ్మైవాజ్ఞం భ్రమపరిగతం సంసరతి" అని అద్వైతసిద్ధాంతం. భగవానుని నిత్యత్వాదులకు "అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకోఽ విజిఘత్సోఽ పిపాస స్సత్యకామ స్సత్యసంకల్పః", "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్" ఇత్యాది శ్రుతులు భావ్యాలు)

త్వద్దృష్టిజుష్ట మిద మావిరభూ దశేషం
నోచేత్కటాక్షయసి నైవ భవేత్ప్రవృత్తిః ।
స్థాతుం చ వాంఛతి జగత్తవ దృష్టిపాతం
తేన శ్రుతౌ జగదిషే హి జగత్త్వమేవ ॥ 32

"స దేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" అని, "తమః పరే దేవ ఏకీభవతి" అని చెప్పిన రీతిలో ప్రళయకాలంలో విభజించి చూడడానికి సాధ్యం కాని అతిసూక్ష్మమైన దశలో ఉండే ఈ జగత్తు తరువాత సృష్టికాలంలో "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అనే నీ సంకల్పరూపమైన జ్ఞానంతో కూడినదై కన్పించే ఈ జగత్తుగా పుట్టింది. నీవు ఆ విధంగా కటాక్షించి ఉండకపోతే జగత్తు సృష్టింపబడి ఉండేది కాదు. అంతేకాక, జడమైన ఈ జగత్తు తన స్థితికోసం సదా నీ కటాక్షాన్ని, అనుప్రవేశాన్ని కోరుతున్నది. ఈ విధంగా నీవు జగత్తుకు ముఖ్యుడవు కావడంవల్ల వేదాలు నీవే జగత్తు అని స్పష్టంగా వచిస్తున్నవి. అంటే- శరీరానికి శరీరి అయిన ఆత్మ ముఖ్యమైనట్లే, ఈ జగత్తుకు ఈ జగత్తును శరీరంగా కల్గిన నీవు ముఖ్యుడవు. ("తత్ సృష్ట్వా తదేవానుప్రావిశత్", "అంతః ప్రవిష్టః శాస్తా జనానాగ్ం సర్వాత్మా" ఇత్యాది శ్రుతి సూక్తులు స్మరణీయాలు. "నావేక్షసే యది" ఇత్యాది అతిమానుషస్తవ శ్లోకం కూడా ప్రకృతంలో భావ్యం.)

ఏవం భగో ! ఇహ భవత్పరతన్త్ర ఏవ
శబ్దోఽపి రూపవదముష్య చరాచరస్య ।

**ఐశ్వర్య మీదృశ మిదం శ్రుతిషూదితం తే**
**పాపీయసా మయ మహో! త్వయి మోహహేతుః॥** **33**

ఓ భగవాన్ ! కానవచ్చే ఈచేతనా చేతనాల నామాలుకూడా వాటి రూపం వలెనే ఈ విధంగా (**"అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"** అని అన్నట్లు అనుప్రవేశ కార్యంగా) ఇక్కడ (నీవే జగత్తు అనే సమానాధికరణప్రయోగం) నీ స్వామిత్వాన్ని మూలంగా కల్గినది. ఇటువంటి విలక్షణమైన నీ ఈ ఈశ్వరత్వం వేదాలలో చెప్పబడింది. కాని, ఈ ఈశ్వరత్వగుణం పాపిష్ఠివారికి నీ విషయంలో మోహాన్ని (భ్రాంతిని) పొందడానికే హేతువు అవుతున్నదే ! ఎంత ఆశ్చర్యం ! (జగత్తు పరమాత్మను అంతర్యామిగా కల్గి ఉన్నది, కనుక "జగత్తు నీవే". అని వేదంలో చెప్పడినదని భావించకుండా పరమచేతనుడైన భగవానునకు జడమైన జగత్తుతో అభేదాన్ని నిర్వహించడం భ్రాంతిమూలకం. ఇక్కడ **"అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య"**, అనే శ్రుతి అనుప్రవేశానికి, **"సర్వం ఖల్విదం బ్రహ్మ"**, **"జ్యోతీంషి విష్ణుః, భువనాని విష్ణుః"** ఇత్యాదులు సామానాధికరణ్యానికి ప్రమాణాలుగా భావ్యాలు.)

**యే త్వత్కటాక్షలవలక్ష్య మివ క్షణం తైః**
**ఐశ్వర్య మీదృశ మలభ్య మలమ్భి పుంభిః ।**
**యత్కేఽపి సంజగదిరే పరమేశితృత్వం**
**తేషా మపి శ్రుతిషు తన్మహిమప్రసంగాత్ ॥** **34**

ఎవరు నీ కటాక్షాలకు క్షణకాలం లక్ష్యం అవుతున్నారో, వారు ఇతరులకు పొందడానికి సాధ్యం కానటువంటి ఐశ్వర్యాన్ని పొందుతారు. నీ అనుగ్రహంవల్ల వారికి అటువంటి మహిమ కల్గినందుచేత శ్రుతులలో వారికి పరమైశ్వర్యం ప్రతిపాదింపబడింది. దీనికి అంతటికీ మూలకారణం నీ కటాక్షలేశమే. కనుక ఈ ఐశ్వర్యం అంతా నీదే. (**"హిరణ్యగర్భః సమవర్తతాగ్రే"**, **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** అనే శ్రుతులు, **"ప్రాజాపత్యం త్వయా కర్మ మయి సర్వం నివేశితమ్"** అనే స్మృతివాక్యం ఇత్యాదులు ఉదాహార్యాలు)

**నిత్యేషు వస్తుషు భవన్నిరపేక్ష మేవ**
**తత్తత్స్వరూప మితి కేచిదిహ భ్రమన్తః ।**
**ఐశ్వర్య మత్ర తవ సావధి సంగిరన్తే**
**బ్రూతే త్రయీ తు నిరుపాధిక మీశనం తే ॥** **35**

ఈ లోకంలో భ్రాంతిని పొందిన కొందఱు నిత్యపదార్థాల విషయంలో ఆ యా నిత్యపదార్థాల స్వరూపం నీ అధీనంలో ఉన్నది కాదని, అది స్వతఃసిద్ధమని భావించి, జగత్కారణత్వవిషయంలో నీ మహిమ సావధికం అని అంటున్నారు. వేదం మాత్రం నీ ఐశ్వర్యం నిరుపాధికం- అంటే- సహజమని అంటున్నది. ("పతిం విశ్వస్యాత్మేశ్వర మచ్యుతమ్", "ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః", "పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" ఇత్యాది శ్రుతులు శ్రీమన్నారాయణుని నిరుపాధికమైన, స్వాభావికమైన ఐశ్వర్యానికి ప్రమాణాలు)

**ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థసత్తా**
**నిత్యం ప్రియా స్తవ తు కేచన తే హి నిత్యాః ।**
**నిత్యం త్వదేకపరతన్త్రనిజస్వరూపాః**
**భావత్కమంగళగుణా హి నిదర్శనం నః ॥** 36

నిత్యానిత్యపదార్థాలు అన్నీ నీ సంకల్పంవల్లనే ఏర్పడుతున్నాయి. అయితే, ఈ విధంగా అనడం నిత్యవస్తువుల నిత్యత్వానికి భంగంకదా- అని అంటే, కొన్ని పదార్థాలు నీకు నిత్యంగా ప్రియాలు కనుక అవి నిత్యాలు అయినవి. ఈ విషయం సుప్రసిద్ధం. ఎల్లప్పుడు నీ ఒక్కని అధీనంలోనే ఉండే స్వరూపాన్ని కల నీ కల్యాణగుణాలు ఈ విషయంలో మాకు దృష్టాంతాలు (భగవద్గుణాలు నిత్యాలు అనే అంశానికి "య స్సర్వజ్ఞః సర్వవిత్" ఇత్యాదులు ప్రమాణాలు)

**విశ్వస్య విశ్వవిధకారణ మచ్యుత ! త్వం**
**కార్యం తదేతదఖిలం చిదచిత్స్వరూపమ్ ।**
**త్వం నిర్వికార ఇతి వేదశిరస్సు ఘోషో**
**నిస్సీమ మేవ తవ దర్శయతీశితృత్వమ్ ॥** 37

ఓ అచ్యుతా ! నీవు చ్యుతి లేనివాడవు. కనుక నీవు అన్నిటికీ అన్నివిధాలైన కారణాలుగా అవుతున్నావు. సమస్తమైన, చిదచిదాత్మకమైన జగత్తు నీయొక్క కార్యమే. సుమా ! అయినా, నీవు నిర్వికారుడవు అని వేదఘోష ఏ హద్దు లేని నీ ఈ ఐశ్వర్యాన్ని తెలుపుతున్నది. (భగవానుడు సూక్ష్మచిదచిద్వేషంతో ఉపాదానకారణంగా, "బహుస్యాం ప్రజాయేయ" అనే సంకల్పవిశిష్టవేషంతో నిమిత్తకారణంగా, కాలాదివిశిష్టవేషేణ సహకారికారణంగా అవుతున్నాడు. భగవానుని నిర్వికారత్వం వీర్యగుణకార్యం)

కిం సాధనః క్వ నివస న్కిముపాదదానః
కస్మై ఫలాయ సృజతీశ ఇదం సమస్తమ్ ।
ఇత్యాద్యనిష్ఠితకుతర్క మతర్కయన్తః
త్వద్వైభవం శ్రుతివిదో విదు రప్రతర్క్యమ్ ॥ 38

వేదాంతతత్త్వాన్ని గ్రహించిన పెద్దలు, భగవానుడు ఏ సాధనాలతో ఎక్కడ ఉంటూ, ఏవస్తువును ఉపాదానంగా గ్రహించి, ఏఫలం కోసం ఈ సమస్త విశ్వాన్ని సృష్టిస్తున్నాడు? ఇత్యాది కుతర్కాలను చేయకుండా, నీ మహిమ ఊహకు, తర్కానికి అందనిదిగా తెలిసికొంటున్నారు. (భగవానుని ఐశ్వర్యం అచింత్యం అనే విషయానికి "పరాஉస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" ఇత్యాదులు ప్రమాణాలు)

యత్సంవృతం దశగుణోత్తరసప్తతత్త్వైః
అణ్డం చతుర్దశ జగద్భవధాతృధామ ।
అణ్డాని తత్సుసదృశాని పరశ్శతాని
క్రీడావిధే స్తవ పరిచ్ఛదతా మగచ్ఛన్ ॥ 39

ఉత్తరోత్తరం పది పది రెట్లు అధికంగా ఉండే సప్తతత్త్వాలతో కూడినది, పదునాల్గు లోకాలను కల్గినది, శివునకు, బ్రహ్మకు వాసస్థానమైనది అయిన ఏ బ్రహ్మాండం ఉన్నదో, దానికి మిక్కిలి సమానాలైన, వందలకు మించిన (లెక్కలేనన్ని) బ్రహ్మాండాలు నీ విలాసానికి ఉపకరణాలు అవుతున్నాయి. ("లోకవత్తు లీలాకైవల్యమ్", "ఇన్బుఱు ఇవ్విళైయాట్టుడైయాన్" ఇత్యాదులు అండసృష్టికి భగవల్లీలయే ప్రయోజనమని తెల్పుతున్నవి. శ్రీసుందరబాహుస్తవంలోని "లోకాంశ్చతుర్దశ", "సురనరతిర్యగాది" అనే శ్లోకాల భావాలు స్మరణీయాలు.)

ఇచ్ఛావిహారవిధయే విహితాన్యమూని
స్యాత్త్వద్విభూతిలవలేశకలాయుతాంశః ।
యా వై న జాతు పరిణామపదాస్పదం సా
కాలాతిగా తవ పరా మహతీ విభూతిః ॥ 40

స్వేచ్ఛగా నీవు ఇష్టం వచ్చినట్లు విహరించడంకోసం సృష్టింపబడ్డ ఈ బ్రహ్మాండాలు నీ మహిమయొక్క అత్యల్ప భాగంలోని అతిసూక్ష్మ సూక్ష్మ భాగంలో పదివేలవంతుమాత్రంచేతనే ఏర్పడుతున్నాయి. దీనికంటే వేఱయినది, ఏనాటికీ

పరిణామానికి ఆస్పదం కానిది (పరిణామాన్ని పొందనిది), కాలకృతపరిణామాన్ని మించినది అయిన ఆ ఉత్కృష్టమైన నిత్యవిభూతి చాలా గొప్పది. ("కస్యాయుతాయుత శతైకకలాంశకాంశే విశ్వం విచిత్రచిదచిత్ ప్రవిభాగవృత్తమ్" అనే యామునసూక్తి, "పాదోఽస్య విశ్వా భూతాని" అనే శ్రుతి ఇక్కడ ఉదాహార్యాలు)

యద్వైష్ణవం హి పరమం పద మామనన్తి
ఖం వా యదేవ పరమం తమసః పరస్తాత్ ।
తేజోమయం పరమసత్త్వమయం ధ్రువం యత్
ఆనందకంద మతిసుందర మద్భుతం యత్ ॥ 41

దేనిని విష్ణుసంబంధమైన, ఉత్తమమైన స్థానంగా వేదాలు కొనియాడుతున్నాయో, దేనిని శ్రేష్ఠమైన ఆకాశంగా వేదాలు చెబుతున్నాయో, ఏది తమోగుణానికి ఆవల ఉన్నదో, గొప్పది అయిన సత్త్వగుణరూపమైనదో, (తేజోరూపమై, పరమ సాత్త్వికమై ఉన్నదో), స్థిరమైనదో, మిక్కిలి సుందరమైనదో, ఆనందానికి హేతువు అవుతున్నదో, దానిని వైకుంఠమనే పేరు గల నీ నివాసంగా కీర్తిస్తున్నారు. ("తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః", "తదక్షరే పరమే వ్యోమన్", "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన" ఇత్యాది ప్రమాణాలు ఇక్కడ గ్రాహ్యాలు)

యద్బ్రహ్మరుద్రపురుహూతముఖై ర్దురాపం
నిత్యం నివృత్తినిరతై స్సనకాదిభి ర్వా ।
సాయుజ్య ముజ్వల ముశన్తి యదాపరోక్ష్యం
యస్మాత్పరం న పద మచ్యుత మస్తి కించిత్ ॥ 42

సృష్టికర్త అయిన బ్రహ్మ, సంహారాన్ని చేసే రుద్రుడు, ముల్లోకాలకు అధిపతి అయిన దేవేంద్రుడు- మొదలైనవారుకూడా పొందడానికి ఏది సాధ్యం కాదో, నిత్యం నివృత్తి మార్గంలో నిష్ఠను కల (ప్రపత్తిధర్మనిష్ఠులైన) సనకాదులచేతకూడా పొందడానికి సాధ్యం కానిది ఏదో, దేనియొక్క సాక్షాత్కారం ఉజ్జ్వలమైన జ్ఞానానందాదుల ఆవిర్భావరూపంగా చెబుతున్నారో, దేనికంటే పూజ్యమైన పదం ఇంకొకటి లేదో, వైకుంఠమని పేరు గల దానిని నీ నివాసస్థానంగా విజ్ఞులు పేర్కొంటున్నారు. ("నివృత్తినిరతైః"- ప్రపత్తిధర్మ నిష్ఠులని అర్థం. "భగవత్ప్రపత్తివిరోధిస్వప్రవృత్తినివృత్తిః ప్రపత్తిః" అనే ప్రపత్తి లక్షణ స్మరణీయం.)

రూపేణ సద్గుణగణైః పరయా సమృద్ధ్యా
భావై రుదారమధురై రపి వా మహిమ్నా ।
తాదృక్తదీదృగిద మిత్యుపవర్ణయన్త్యోః
వాచో యదీయవిభవస్య తిరస్క్రియాయై ॥ 43

రూపంతో, సద్గుణసమూహంతో, గొప్పదైన సమృద్ధితో మధురాలు అయిన పదార్థాల సమృద్ధితో, మహిమతో వైకుంఠం "ఇది, ఇటువంటిది అని వర్ణించేవారి వాక్కులు ఆ పరమపదం మహిమయొక్క తిరోధానానికే - (మహిమను తక్కువ చేయడానికే) కారణం అవుతున్నవి. అవి దాని మహిమను యథాతథంగా వర్ణించగల్గినవి కావు. అటువంటి వైకుంఠమని పేరును కలదానిని నీ స్థానంగా అంటున్నారు. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకమ్" ఇత్యాదులు పరమపద రూపానికి, "యత్ర నాన్యత్ పశ్యతి నాన్యత్ శ్రుణోతి" ఇత్యాదులు దాని సమృద్ధికి ప్రమాణాలు.

యద్వృద్ధ్యపక్షయవినాశముఖై ర్వికారైః
ఏతై రసంస్తుత మనస్తమితాస్తిశబ్దమ్ ।
యద్గౌరవాచ్ఛ్రుతిషు ఫల్గు ఫలం క్రియాణామ్
ఆదిష్ట మన్యదసుఖోత్తర మధ్రువం చ ॥ 44

ఏ వైకుంఠం వృద్ధి, క్షయం, నాశం మొదలైన షడ్విధవికారాలను లేనిదిగా, ఏనాటికీ లేదు అనే మాటను లేనిదిగా, దేని గౌరవాన్ని పురస్కరించుకొని వేదాలలో ప్రతిపాదింపబడ్డ జ్యోతిష్టోమాది కర్మల ఫలం చాలా నిస్సారంగా, దుఃఖపర్యవసానాన్ని కల్గినదిగా, అస్థిరంగా తెలుపబడుతున్నదో, వైకుంఠం అనే పేరుగల దానిని నీ నివాసంగా బ్రహ్మవిదులు అంటున్నారు. ("తదక్షరే పరమే వ్యోమన్, తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః", "న చ పునరావర్తతే", "తే హ నాకం మహిమానస్సచం తే, యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః"- ఇత్యాదులు పరమపదగౌరవాన్ని ఆవిష్కరిస్తున్నాయి. స్వర్గాదుల అధమత్వానికి "గతాగతం కామకామా లభంతే", "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" ఇత్యాదులు ప్రమాణాలు "అస్తి, జాయతే, పరిణమతే, ఏధతే, అపచీయతే, వినశ్యతి"- అనేవి షడ్విధవికారాలు)

నిష్కల్మషై ర్నిహతజన్మజరావికారైః
భూయిష్ఠభక్తివిభవై రభవై రవాప్యమ్ ।
అన్యై రధన్యపురుషై ర్మనసాఽప్యనాప్యం
వైకుణ్ఠనామ తవ ధామ తదామనన్తి ॥ 45

కర్మయోగానుష్ఠానంద్వారా పాపాలను పోగొట్టుకొన్నవారు, జ్ఞానయోగానుష్ఠానంవల్ల సంసారంలో ఇచ్ఛ లేనివారు, గొప్ప భక్తియోగవైభవాన్ని కలవారు, తద్ద్వారా జన్మజరాది వికారాలను లేకుండా చేసికొన్నవారు అయిన ధన్యులచేత పొందదగినది, నిర్భాగ్యులైన ఇతరులకు మనస్సుతో భావించడానికికూడా వీలుకానిది అయిన వైకుంఠమనే పేరు గల పరమపదాన్ని నీ స్థానంగా చెబుతున్నారు. (**"ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, యోఽస్యాధ్యక్షః పరమే వ్యోమన్"** ఇత్యాది శ్రుతులు అనుసంధేయాలు)

**నిత్యా తవాఽన్యనిరపేక్షమహామహిమ్నోఽపి**
**ఏతాదృశీ నిరవధి ర్నియతా విభూతిః ।**
**జ్ఞానాదయో గుణగణా స్సమతీతసీమా**
**లక్ష్మీః ప్రియా పరిజనాః పతగేన్ద్రముఖ్యాః ॥** **46**

కారణాంతరాల అపేక్ష లేని, గొప్ప మహిమను కల నీకు శాశ్వతమైనది, హద్దు లేనిది అయిన ఈ వైభవం నిత్యమైనది. అంతం లేనిది. జ్ఞానాది కల్యాణ గుణగణాలు నీకు నిత్యాలు. నీ ప్రియురాలైన లక్ష్మీదేవి నిన్ను ఎడబాయకుండా నిత్యంగా ఉన్నది. గరుత్మంతుడు మొదలైన పరిజనాలు నిత్యులు. (**"అకలకిల్లేన్ ఇఱైయు మెన్ఱు అలర్మేల్ మఙ్గైయుఱై మార్బా", "విష్ణో రేషాఽనపాయినీ"** ఇత్యాదులు లక్ష్మి అనపాయిత్వానికి ప్రమాణాలు)

**ఏకస్య యేషు హి గుణస్య లవాయుతాంశః**
**స్యాత్కస్యచిత్స ఖలు వాఙ్మనసాతిగశ్రీః ।**
**తే తాదృశోఽత్యవధయ స్సమతీతసంఖ్యాః**
**త్వత్సద్గుణా స్త్వమసి తన్నిరపేక్షలక్ష్మీః ॥** **47**

నీకున్న కల్యాణగుణాలలోని ఒక్కగుణం యొక్క లవలేశంలో పదివేల వంతు భాగాన్ని అయినా ఎవడైనా కల్గి ఉంటే, అతడు వాక్కులకు, మనస్సుకు అందని గొప్పతనాన్ని కలవాడు అవుతాడు. అటువంటి, హద్దు లేని, సుప్రసిద్ధాలైన నీ కల్యాణగుణాలు అసంఖ్యాకాలు. నీ గొప్పతనం ఆ గుణాలపై ఆధారపడినది కాదు. అది స్వాభావికం. సహజసిద్ధం. (**"స్వాభావికీ జ్ఞానబలక్రియా చ", "ఉయర్వఱ ఉయర్ నల ముడైయవన్"** ఇత్యాదులు భగవానుని **"తన్నిరపేక్షలక్ష్మీకత్వా"**నికి ప్రమాణాలు)

**సర్వస్య చైవ గుణతో హి విలక్షణత్వమ్**
**ఐశ్వర్యత శ్చ కిల కశ్చిదుదఞ్చిత స్స్యాత్ ।**

తత్రప్రత్యుత త్వయి విభో ! విభవో గుణా శ్చ
సంబన్ధత స్తవ భజన్తి హి మంగళత్వమ్ ॥ 48

లోకంలో అందఱికీ వారికి ఉండే గుణాలనుబట్టి వైలక్షణ్యం సిద్ధిస్తుంది కదా ! ఒకడు అతని ఐశ్వర్యంచేత పూజింపబడుతున్నాడు. కాని, ప్రభూ ! ఆ రెండూ నీ విషయంలో వ్యత్యస్తాలు. ఎందుకంటే- నీ ఐశ్వర్యం, గుణాలు- అన్నీ నీ సంబంధంవల్లనే కల్యాణత్వాన్ని పొందుతున్నాయి. (శ్రీసుందరబాహుస్తవంలోని "గుణిజం గుణినో హి" అనేశ్లోకం, వరదరాజస్తవంలోని "గుణాయత్తం లోకే" అనే శ్లోకం ప్రకృతంలో స్మరణీయాలు.)

దూరే గుణా స్తవ తు సత్త్వరజస్తమాంసి
తేన త్రయీ ప్రథయతి త్వయి నిర్గుణత్వమ్ ।
నిత్యం హరే ! నిఖిలసద్గుణసాగరం హి
త్వా మా మనన్తి పరమేశ్వర మీశ్వరాణామ్ ॥ 49

ఓ శ్రీహరీ ! ప్రకృతిగుణాలైన సత్త్వం, రజస్సు, తమస్సు- అనే గుణాలు నీకు కడు దూరంలో ఉన్నాయి. (నీవు శుద్ధసత్త్వగుణాకరుడవు) అందువల్ల వేదం నిన్ను నిర్గుణుడవని అంటున్నది. ఐశ్వర్యాన్ని కలవారిలో అందఱిలో ఉత్కృష్టమైన ఐశ్వర్యాన్ని కల నిన్ను నిత్యం సమస్తకల్యాణగుణాకరునిగా వేదాలు వర్ణిస్తున్నాయి. ("సత్త్వాదయో న సంతీశే యత స్తే ప్రకృతే ర్గుణాః" అని సత్త్వాదులకు భగవానుడు అతీతుడు. "త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్", "య స్సర్వజ్ఞః సర్వవిత్, పరాஉస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ", "సత్యకామః సత్యసంకల్పః" ఇత్యాది ప్రమాణవచనాలు ప్రకృతంలో గ్రాహ్యాలు)

జ్ఞానాత్మన స్తవ తదేవ గుణం గృణన్తి
తేజోమయస్య హి మణే ర్గుణ ఏవ తేజః ।
తేనైవ విశ్వ మపరోక్ష ముదీక్షసే త్వం
రక్షా త్వదీక్షణత ఏవ యతోஉఖిలస్య ॥ 50

జ్ఞానస్వరూపుడవైన నీకు ఆ జ్ఞానమే గుణం అని బ్రహ్మవేత్తలు అంటున్నారు. ఎందువల్ల? అని అంటే, తేజోరూపమైన మణికి తేజస్సేకదా గుణం. సమస్త ప్రాణికోటికి రక్షణం నీ కటాక్షంవల్లనే కల్గుతున్నది. అందువల్ల నీవు ఆ జ్ఞానంతోనే సమస్తవిశ్వాన్ని ప్రత్యక్షంగా దర్శిస్తున్నావు. ("యో వేత్తి యుగపత్ సర్వం ప్రత్యక్షేణ సదా స్వతః"

ఇత్యాది ప్రమాణాలు భగవానుని సర్వకాల సర్వవిధ సర్వజ్ఞత్వానికి ప్రమాణాలుగా అనుసంధేయాలు)

త్రయ్యుద్యతా తవ యువత్వముఖై ర్గుణౌఘైః
ఆనంద మేధిత మియా నితి సన్నియన్తుమ్।
తే యే శతంత్వితి పరమ్పరయా ప్రవృత్తా
నైవైష వాఙ్మనసగోచర ఇత్యుదాహ ॥ 51

తైత్తిరీయంలోని ఆనందవల్లి ప్రవృద్ధమైన నీ ఆనందగుణాన్ని **"యువా స్యాత్ సాధు యువాధ్యాయకః, ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్, స ఏకో మానుష ఆనందః"** ఇత్యాదిగా యౌవనాది గుణసమూహాలతో ఇంతటిది అని పరిచ్ఛేదించాలని ప్రయత్నించి, **"తే యే శతమ్"** అని అంటూ ముందుదానికి తరువాతదానిని నూఱు నూఱురెట్లుగా గుణిస్తూ పోయి, చివరకు **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ ఆనందం బ్రహ్మణో విద్వాన్"** అని అంటూ నీ ఆనందగుణం మాటకు, మనస్సుకు అందనిది, అపరిచ్ఛిన్నమైనది- అని దృఢంగా పలికింది (**"ఆనంద మైశ్వరమ్"** ఇత్యాది 24వ శ్లోకం స్మరణీయం).

ఏవం తయా చతురయా తవ యౌవనాద్యాః
సర్వే గుణా స్సహ సమస్తవిభూతి శ్చ ।
ప్రవ్యాహృతా స్స్యు రవధీ నవధీరయన్తో
వాచామగోచరమహామహిమాన ఏవ ॥ 52

ఈ విధంగా చాతుర్యాన్ని కల ఆ ఆనందవల్లిచేత చెప్పబడ్డ నీ ఆనందగుణం యొక్క అపరిచ్ఛిన్నత్వం నీ ఒక్క గుణానికి మాత్రమే కాదు, అన్ని గుణాలకు, విభూతులకు -అన్నిటికీ అది అన్వయిస్తుంది. ఈ యౌవనాది సమస్త దివ్యమంగళ విగ్రహగుణాలు, జ్ఞానాదిస్వరూపగుణాలు, సమస్తవిభూతులు- అన్నీ అవధి లేనివిగా, వాక్కులకు, మనస్సుకు అందని మహిమను కల్గినవిగా ఆ ఆనందవల్లిచేత చెప్పబడినట్లయింది.

సంవర్తవర్తి నిఖిలం నిరభిజ్ఞ మజ్ఞం
చిత్రే చ కర్మణి యథార్హ మహో ! నియచ్ఛన్ ।
సద్యః క్రిమిద్రుహిణభేద మభేద మేతత్
ఆవిశ్చకర్థ సకృదీక్షణదీక్షణేన ॥ 53

ప్రళయసమయంలో ఉన్నది, విభజించడానికి సాధ్యం కాని (చాలా సూక్ష్మమైన) దశలో ఉన్నది, అనుభవరూపమైన జ్ఞానాన్ని లేనిది, అందువల్లనే ప్రత్యభిజ్ఞారూపమైన జ్ఞానాన్ని లేనిది అయిన సమస్తప్రాణిలోకం, దాని కర్మలు విచిత్రమైనవి అయినా **"తదైక్షత"** అని నీవు ఒక్కసారి చేసిన ఈ క్షణరూపసంకల్పంద్వారా ఆయా ప్రాణులను వారి వారి విచిత్ర కర్మలకు అనుగుణంగా నియమిస్తూ, తత్క్షణమే ఇది పురుగు- ఇతడు బ్రహ్మ- అనే భేదాన్ని కల్గినవిగా అయేటట్లు ఎటువంటి పక్షపాతం లేకుండా వాటిని ఆవిర్భవింపజేశావు. ఆహా ! నీ సంకల్పప్రభావం ఎంత గొప్పది. (సృష్టి అప్యయపూర్వక అనేదానికి **"స దేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, బ్రహ్మ వా ఇద మేకమేవాగ్ర ఆసీత్, ఆత్మా వా ఇద మేక మేవాగ్ర ఆసీత్"** మొదలైన శ్రుతివచనాలు, **"ఆసీ దిదం తమోభూతమ్"** అనే మనుస్మృతివచనం ప్రమాణాలు)

**అస్తం యదుద్యదుపచాయ్యపచాయి చైవమ్**
**ఈశం దరిద్ర మథ జంగమ మప్యనిజ్గమ్।**
**విశ్వం విచిత్ర మవిలక్షణవీక్షణేన**
**విక్షోభయస్యనవధి ర్బత! శక్తి రైశీ ॥** 54

ప్రభూ ! వైకుంఠనాథా ! వినాశాన్ని పొందేది, పుట్టేది, వృద్ధిని పొందేది, క్షీణించేది, సంపద కల్గినది, సంపద లేనిది, చైతన్యాన్ని కల్గినది, (చలించేది) కదలనిది- అని ఈ రీతిగా ఉండే విచిత్రమైన విశ్వాన్ని (సమస్తం) ఒక్కమాఱు సంకల్పం చేయడం ద్వారా విశేషమైన వికారాన్ని పొందినదానినిగా చేస్తున్నావు. ఆహా ! నీ ఈశ్వరత్వ ప్రయుక్తమైన శక్తి ఎంత ఆశ్చర్యకరమైనది! (**"పరాऽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే"** ఇత్యాదులు ప్రకృతంలో గ్రాహ్యాలు)

**రూపప్రకారపరిణామకృతవ్యవస్థం**
**విశ్వం విపర్యసితు మన్య దసచ్చ కర్తుమ్ ।**
**క్షామ్యన్ స్వభావనియమం కి ముదీక్షసే త్వం?**
**స్వాతన్త్ర్య మైశ్వర మపర్యనుయోజ్య మాహుః ॥** 55

రూపం, స్వభావం- అనే వీటి మార్పుచేత చేయబడ్డ వ్యవస్థను కల్గిన ఈ చేతనాచేతనజగత్తును (అచేతనానికి స్వరూపంలో మార్పు, చేతనపదార్థాలకు స్వభావంలో మార్పు కల్గుతాయి) లయం చేయడానికి, అసత్కల్పమైనదానిని సత్తుగా చేయడానికి, (తిరిగి సృష్టించడానికి) నీవు సమర్థుడవైనా, ఆయా పదార్థాల కర్మఫల

స్వభావనియమాన్ని ఎందుకోసం పరిశీలిస్తున్నావు? అందువల్ల నీ ఈశ్వరత్వ ప్రయుక్తమైన స్వాతంత్ర్యం (నిరంకుశస్వాతంత్ర్యం) ప్రశ్నించరానిది (అపర్యను యోజ్యం) అని వేదార్థవిదులు భావిస్తారు.

**సంవర్తసంభృతకరస్య సహస్రరశ్మేః**
**ఉస్రం తమిస్రయదజస్రవిహారి హారి ।**
**నిత్యానుకూల మనుకూలనృణాం పరేషామ్**
**ఉద్వేజనం చ తవ తేజ ఉదాహరన్తి ॥ 56**

ప్రళయసమయంలో సంపూర్ణంగా కిరణాలను కల సూర్యునియొక్క తేజస్సును సైతం అంధకారం చేసేది (తక్కువ చేసేది), ఎల్లప్పుడు విహరించేది, మనోహరమైనది, శత్రువులకు భయాన్ని కల్గించేది అయిన నీ తేజస్సు భక్తులకు నిత్యానుకూలం, భోగ్యమును- అని పెద్దలు అంటారు.

**నైవ హ్యవాప్య మనవాప్త మిహాస్తి యస్య**
**సత్తాఽపి తస్య తవ వీక్షణతః ప్రజానామ్ ।**
**సంపత్తు కింపున రతో న వదాన్య మన్యం**
**మన్యే త్వ మేవ ఖలు మన్దిర మిన్దిరాయాః ॥ 57**

నీవు ఈ విభూతిద్వయంలో ఇంతవరకు పొందనిది, ఇకపై పొందవలసినది ఏదీ లేదు కదా ! అటువంటి నీ కటాక్షంవల్లనే సమస్తజీవులకు సత్త, ఉత్పత్తి కల్గుతున్నది. నీవేకదా లక్ష్మీదేవికి నివాసభూమి. ఇక, సంపద నీకు ఉన్నదని ప్రత్యేకంగా చెప్పాలా ! అందువల్ల నిన్నుతప్ప ఇంకొక దాతనుగూర్చి నేను భావించను.

**పాపై రనాదిభవసమ్భవవాసనోత్థైః**
**దుఃఖేషు యః ఖలు మిమఙ్క్షతి హన్త! జన్తుః ।**
**తం కేవలం ను కృపయైవ సముద్ధరిష్యన్**
**తద్దుష్కృతస్య నను నిష్కృతి మాత్థ శాస్త్రైః ॥ 58**

అనాది అయిన సంసారంవల్ల కల్గిన సంస్కారవశంచేత చేసే పాపాల కారణంగా జీవుడు ఆ యా పాపాల ఫలరూపంగా నరకాదిదుఃఖాలలో మునిగిపోవాలని అనుకుంటున్నాడే ! అయ్యో ! ఆ జీవుని నీవు నిర్హేతుకకృపతోనే ఉద్ధరిస్తూ మనుస్మృతి మొదలైన స్మృతులద్వారా, గీతాదులద్వారా ఆ జీవుని పాపాలకు తగిన ప్రాయశ్చిత్తాలను తెలిపావు. (కృప- స్వార్థనిరపేక్షమైన కృప- అని, పరదుఃఖాసహిష్ణుత్వరూపమైన కృప- అని రెండు విధాలు. ఇటువంటి భగవత్కృప అపరిచ్ఛిన్నమని భావం)

శాస్త్రై రనాదినిధనై స్స్మతిభి స్త్వదీయ-
దివ్యావతారచరితై శ్శుభయా చ దృష్ట్యా ।
నిఃశ్రేయసం యదుపకల్పయసి ప్రజానాం
సా త్వత్కృపాజలధితల్లజవల్గితశ్రీః ॥ 59

ఆద్యంతాలు లేని శ్రుతులతో, మనుస్మృతి మొదలైన స్మృతులతో, నీకు సంబంధించిన అవతార చరిత్రలతో, మంగళకరమైన నీ వీక్షణంతో ప్రజలకు మోక్షాన్ని అనుగ్రహించడం అనేది నీ కృపాసముద్రతరంగవైభవమేకదా! (**"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థచింతకః"** అనే సూక్తి ప్రకృతంలో స్మరణీయం)

హై! హన్త! జన్తుషు నిరన్తరసన్తతాత్మా
పాప్మా హి నామ బత! కోఽయ మచిన్త్యశక్తిః ।
యస్త్వత్కృపాజలధిమప్యతివేలఖేలమ్
ఉల్లజ్ఘయత్యకృతభాసురభాగధేయాన్ ॥ 60

ప్రాణులలో నిత్యం వ్యాపించి ఉండే స్వరూపాన్ని కల్గినది, మావంటివారికి భావించడానికికూడా సాధ్యం కాని శక్తిని కల్గినది అయిన పాపం అనేది ఎటువంటి స్వరూపాన్ని కల్గినది ? ఎటువంటి శక్తిని కల్గినది? స్వామీ! చెప్పు. బహుశః అది నీకు కూడా చెప్పడానికి సాధ్యం కాదేమో! ఎందుకు? అని అంటే, ఈ పాపం, నిన్ను శరణాగతిని చేయని పురుషులను హద్దు లేని నీ దయాసముద్రాన్ని కూడా దాటిన వారినిగా చేస్తున్నదే. ఆహా! (పాపం మూలంగా అభాగ్యులు భగవానుని ఆశ్రయించ కుండా ఆ స్వామి దయకు దూరం అవుతున్నారు కదా! )

యద్బ్రహ్మకల్పనియుతానుభవేఽప్యనాశ్యం
తత్కిల్బిషం సృజతి జన్తు రిహ క్షణార్ధే ।
ఏవం సదా సకలజన్మసు సాపరాధం
క్షామ్యస్యహో! తదభిసంధివిరామమాత్రాత్ ॥ 61

ఏ పాపం వేయి బ్రహ్మకల్పాలు అనుభవించినా తీరనిదో, నశింపజేయడానికి సాధ్యం కానిదో, అటువంటి పాపాన్ని ఈ లోకంలో చేతనుడు ఒక అఱక్షణంలో చేస్తున్నాడు. ఈ విధంగా ఎల్లప్పుడు అన్ని జన్మలలో అపరాధాలను చేసిన ప్రాణినికూడా నీవు "ఇకపై నేను పాపం చేయను'' అని సంకల్పించి, పాపం చేయడం మానినంత

మాత్రంతో గతంలో అతడు చేసిన పాపాలను అన్నిటినీ క్షమిస్తావు. ఎంత ఆశ్చర్యకరం! (పూర్వ శ్లోకంలో జీవుని పాపాల శక్తి తెలుపబడగా, ఇందులో అటువంటి పాపాలను రూపుమాపగల భగవానుని క్షమాశక్తి తెలుపబడింది.)

**క్షాన్తి స్తవేయ మియతీ మహతీ కథం ను**
**ముహ్యే దహో! త్వయి కృతాఞ్జలిపఞ్జరేషు ।**
**ఇత్థం స్వతో నిఖిలజన్తుషు నిర్విశేషం**
**వాత్సల్య ముత్సుకజనేషు కథం గుణ స్తే ॥ 62**

ఇంతటి గొప్ప నీ ఓర్పు (సహనం) నిన్ను ఎల్లప్పుడూ అంజలిముద్రతో సేవించేవారిని ఏవిధంగా మఱచిపోతుంది? మఱచిపోదు. ఈవిధంగా సహజంగానే సమస్తజీవులపట్ల పక్షపాతం లేని నీ వాత్సల్యం నీ భక్తిని కలవారి ఎడల గుణం ఏవిధంగా అవుతుంది ? (అది సహజమే అయినపుడు గుణం కాదని సరసభావం.)

**విశ్వం ధియైవ విరచయ్య నిచాయ్య భూయః**
**సంజహ్రుష స్సతి సమాశ్రితవత్సలత్వే ।**
**ఆజగ్ముష స్తవ గజోత్తమబృంహితేన**
**పాదం పరా మమృశుషోఽ పి చ కా మనీషా? ॥ 63**

సంకల్పరూపజ్ఞానంతోనే ప్రపంచాన్ని సృష్టించి, వర్ధిల్లజేసి, తిరిగి లయం చేస్తున్నా, నీవు ఆశ్రితుల విషయంలోని వాత్సల్యగుణంవల్ల గజేంద్రుని ఘీంకారాన్ని విని ఎంతో వేగంగా వచ్చి ఆగజేంద్రుని పాదాన్ని ప్రేమతో స్పృశించావు కదా! ఈ విధంగా చేయడంలో కారణం ఏమి స్వామీ? నీకు ఉన్న భక్తవాత్సల్యమేకదా! భక్తులపట్ల నీకున్న వాత్సల్యం నీ సంకల్పబలం కంటే మిన్నకదా! (ఈ శ్లోకానికి శఠకోపసూరి ప్రణీతమైన **"మఙ్ఞాద! వైనుతియ"** అనే పాశురం మూలం).

**యః కశ్చిదేవ యది కిఞ్చన హన్త ! జన్తుః**
**భవ్యో భజేత భగవన్త మనన్యచేతాః ।**
**తం సోఽయ మీదృశ ఇయా నితి వాఽప్యజానన్**
**హై! వైనతేయసమ మప్యురరీకరోషి ॥ 64**

భవిష్యత్తులో బాగుపడగలవాడు ఎవడైనా భగవానుడవైన నిన్ను అనన్యమనస్కుడై కొంచెం భజిస్తే "వీడు ఈ జాతికి చెందినవాడు, ఈ ప్రవర్తనను కలవాడు, ఇన్ని గుణాలను కలవాడు'', అని పరిశీలించిచూడకుండా, అతనిని

గరుడునితో సమానంగా అనుగ్రహిస్తున్నావు. ఆహా ! ఎంత ఆశ్చర్యం ! ("అపి చేత్ సుదురాచారో భజతే మా మనన్యభాక్, సాధు రేవ స మంతవ్యః సమ్యక్ వ్యవసితో హి సః" అనే సూక్త్యర్థం భావ్యం)

**త్వత్స్వామ్య మేవ భజతా మభివాఞ్ఛసి త్వం**
**తత్స్వాత్కృతై ర్విభవరూపగుణై స్త్వదీయైః ।**
**ముక్తిం తతో హి పరమం తవ సామ్య మాహుః**
**త్వద్దాస్య మేవ విదుషాం పరమం మతం తత్ ॥ 65**

భక్తపరాధీనుడవైన నీవు నీ స్వరూప, రూప, గుణ, విభూతులను నిన్ను సేవించే భక్తుల వశం చేస్తున్నావు. ఆ విధంగా వారికి నీతో పరమసామ్యాపత్తిని కల్గించాలని తలుస్తున్నావు. అందువల్ల ముక్తిని నీతోటి పరమసామ్యంగా వేదవిదులు అంటున్నారు. అనన్యార్హమైన నీ కైంకర్యాన్నే జ్ఞానులు ఉత్కృష్టమని భావిస్తున్నారు. ("నిరంజనః పరమం సామ్య ముపైతి", "మమ సాధర్మ్య మాగతాః', "తమ్మైయోడొక్క అరుళ్ శెయ్‌వర్" ఇత్యాది సూక్తులు భావ్యాలు.)

**తద్వై తథాఽస్తు కతమోఽయ మహో! స్వభావో**
**యావాన్యథావిధగుణో భజతే భవన్తమ్ ।**
**తావాం స్తథావిధగుణ స్తదధీనవృత్తిః**
**సంశ్లిష్యసి త్వ మిహ తేన సమానధర్మా ॥ 66**

ఈ విధంగా చెప్పబడ్డ నీ సౌశీల్యం అటువంటిదే (అనిర్వచనీయమే). కానీ, నిన్ను ఉపాసించేవాడు ఎటువంటి గుణాలను కలవాడై, ఎటువంటి జ్ఞానాన్ని కలవాడై నిన్ను భజిస్తాడో, అతని విషయంలో నీవు అటువంటి జ్ఞానాది గుణాలను కలవాడవై, అతని అధీనంలో ఉండే ప్రవర్తనను కలవాడవై, అతనితో సమానమైన ధర్మాలను కలవాడవై అతనితో కలుస్తున్నావు. నీ ఈ స్వభావం ఎంత ఆశ్చర్యకరం కదా ! (నిరంకుశ స్వతంత్రుడవైన నీవు ప్రకారాంతరంలో ఉపాసన ఫలాన్ని ఇవ్వగలవాడవైనా, ఉపాసకునకు యథోపాసనంగానే సంశ్లేషరూపఫలాని ఇచ్చే నీ ఈ స్వభావం ఎటువంటిది? అవాఙ్మానసగోచరం- అని భావం. **"యథాక్రతు రస్మిన్ లోకే పురుషో భవతి ఏవ మేవేతః ప్రేత్య భవతి"** అని నిర్వచించిన తత్క్రతున్యాయం, **"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్"** ఇత్యాది గీతాసూక్తి, **"తమరుకన్దతు ఎవ్వురువమ్ అవ్వురువమ్ తానే"** అని, **"నెజ్జినాల్ నినైప్పాన్ యవన్ అవనాకుమ్"** ఇత్యాది దివ్యసూరిసూక్తులు స్మరణీయాలు)

నీలాఞ్జనాద్రినిభ మున్నస మాయతాక్షమ్
ఆజానుజైత్రభుజ మాయతకర్ణపాశమ్ ।
శ్రీవత్సలక్షణ ముదారగభీరనాభిం
పశ్యేమ దేవ ! శరద శ్శత మీదృశం త్వామ్ ॥ 67

దేవా! వర్ణంలో నల్లని కాటుకకొండలో సాటివచ్చేవాడవు, ఉన్నతమైన నాసికను కల్గినవాడవు, జయశీలాలైన ఆజానుబాహువులను కల్గినవాడవు, విశాలమైన గొప్ప చెవితమ్మెలను కల్గినవాడవు, శ్రీవత్సమనే పుట్టుమచ్చను కల్గినవాడవు, గొప్ప లోతైన బొడ్డును కల్గినవాడవైన నిన్ను నూఱేండ్లు(నిత్యం) మేము దర్శించాలి. ("పశ్యేమ శరద శ్శతమ్" అని, "సదా పశ్యంతి సూరయః" అని అన్నట్లు నిరంతరం సేవించాలి-అని భావం)

అమ్బోరుహాక్ష మరవిన్దనిభాంఘ్రియుగ్మమ్
ఆతామ్రతామరసరమ్యకరాగ్రకాన్తి ।
భృంగాలకం భ్రమరవిభ్రమకాయకాన్తి
పీతామ్బరం వపు రదస్తు వయం స్తవామ ॥ 68

తామరలవంటి కన్నులను కల్గినది, తామరపూవుతో పోలిన శ్రీచరణ యుగ్మాన్ని కల్గినది, ఎఱ్ఱ కలువల కాంతివలె అందమైన అఱచేతుల కాంతిని కల్గినది, తుమ్మెదలవంటి ముంగురులను కల్గినది, తుమ్మెదల శరీరవర్ణం వంటి వర్ణాన్ని కల్గినది, పచ్చని పట్టువస్త్రాన్ని ధరించినది అయిన ఈ నీ రూపాన్ని మేము స్తుతిస్తాము.

భ్రూవిభ్రమేణ మృదుశీతవిలోకితేన
మందస్మితేన మధురాక్షరయా చ వాచా ।
ప్రేమప్రకర్షపిశునేన వికాసినా చ
సమ్భావయిష్యసి కదా ముఖపఙ్కజేన ॥ 69

కనుబొమల విలాసాలను కల్గినది, మృదువైన, చల్లని దయార్ద్రవీక్షణాలను కల్గినది, చిఱునవ్వుతో కూడినది, వాత్సల్యాతిశయాన్ని సూచించేది, అందువల్లనే వికసించేది అయిన నీ ముఖపద్మంతోను, తీయని అక్షరాలను కల నీ మాటలతోను నన్ను నీవు ఎపుడు ఆదరిస్తావు ?

వజ్రాఙ్కుశ ధ్వజసరోరుహశంఖచక్ర-
మత్సీసుధాకలశకల్పకకల్పితాఙ్కమ్ ।

త్వత్పాదపద్మయుగళం విగళత్ప్రభాభిః
భూయోఽభిషేక్ష్యతి కదా ను శిరో మదీయమ్ ॥ 70

వజ్రాయుధం, అంకుశం, ధ్వజం, పద్మం, శంఖం, చక్రం, మత్స్యం, అమృతకలశం, కల్పవృక్షం మొదలైన మంగళ చిహ్నాలతో ప్రకాశించే నీ పాదపద్మ యుగళాన్ని పలుమార్లు ప్రసరించే కాంతులతో నా శిరస్సు ఎపుడు అభిషేకిస్తుంది ? (ఎపుడు నమస్కరిస్తుంది? స్తోత్రరత్నంలోని "కదా పునః శంఖ" ఇత్యాది శ్లోకార్థం భావ్యం)

త్రైవిక్రమక్రమకృతాక్రమణత్రిలోకమ్
ఉత్తంస ముత్తమ మనుత్తమభక్తిభాజామ్ ।
నిత్యం ధనం మమ కదా హి మదుత్తమాంగమ్
అంగీకరిష్యతి చిరం తవ పాదపద్మమ్ ॥ 71

త్రివిక్రమవతారంలో ముల్లోకాలను ఆక్రమించినది, ప్రపన్నులకు ఉత్తమమైన శిరోభూషణమైనది, నేను నిరంతరం ఆశపడేది అయిన నీ పాదపద్మం నా శిరస్సును ఎపుడు అంగీకరిస్తుందోకదా! ("తావి వైయమ్ కొణ్డ తడన్దామరైకట్కే" అనే శఠ కోపసూరి సూక్తి స్మరణీయం.)

ఉన్నిద్రపత్రశతపత్రసగోత్ర మన్తర్-
లేఖారవిన్ద మభినన్దన మిన్ద్రియాణామ్ ।
మన్మూర్ధ్ని హన్త ! కరపల్లవతల్లజం తే
కుర్వన్ కదా కృతమనోరథయిష్యసే మామ్ ॥ 72

వికసించిన రేకులను కల్గిన పద్మంతో సమానమైనది, లోపల ఉండే రేఖల రూపంలో పద్మాన్ని కల్గినది, ఇంద్రియాలకు ఆనందాన్ని కల్గించేది అయిన నీ గొప్ప చిగురుటాకువంటి శ్రీహస్తం నా శిరస్సున ఉంచి ఎపుడు నన్ను కృతార్థునిగా చేస్తావు? స్వామీ!

ఆంగీ నిసర్గనియతా త్వయి హన్త ! కాన్తిః
నిత్యం తవాల మియ మేవ తథాఽపి చాన్యా ।
వైభూషణీ భవతి కాన్తి రలంతరాం సా
హై! పుష్కలైవ నిఖిలాఽపి భవద్విభూతిః ॥ 73

నీ శరీరకాంతి సహజమైనది. ఇదే ఎల్లప్పుడు నీ అనుభవానికి చాలు. అది ఎంత ఆనందకరం ! అయినా, ఇంకొక ప్రసిద్ధమైన, నీ భూషణాలకు సంబంధించిన

కాంతి మిక్కిలి పర్యాప్తంగా ఉన్నది. సమస్తమైన నీ విభూతి అంతా పరిపూర్ణమైనదే ! ఎంత అద్భుతం.

శ్రీవత్సకౌస్తుభకిరీటలలాటికాభిః
కేయూరహారకటకోత్తమకర్ణికాభిః ।
ఉద్దామదామమణినూపురనీవిబంధైః
భాన్తం భవన్త మనిమేష ముదీక్షిషీయ ॥ 74

శ్రీవత్సంతో, కౌస్తుభంతో, కిరీటంతో, లలాటంతో అలంకరించిన ఆభరణాలతో, భుజకీర్తులతో, ముత్యాల పేరుతో, ముంగురులతో, ఉత్తమ కర్ణాభరణాలతో, ప్రకాశించే వనమాలతో, మణినూపురాలతో, మణిమేఖలతో వెలుగొందే నిన్ను ఱెప్పపాటు లేకుండా దర్శిస్తాను.

ఐన్దీవరీ క్వచిదపి క్వచనాఽఽరవిన్దీ
చాన్ద్రాతపీ క్వచన చ క్వచనాఽథ హైమీ ।
కాన్తి స్తవోఢపరభాగపరస్పరశ్రీః
పార్యేత పారణయితుం కిము చక్షుషో ర్మే ॥ 75

దివ్యమంగళవిగ్రహంలో, కంటిపాపలలో నీలకలువల వర్ణం, వదనం, కరతలం, మొదలైనవానిలో పద్మవర్ణం, మందహాసంలో, ముత్యాలహారాదులలో, చంద్రునకు చెందిన శ్వేతవర్ణం, పీతాంబరాదులలో బంగారు వన్నె- ఈవిధంగా పలు విభిన్నవర్ణాల సాన్నిధ్యంవల్ల కల్గిన వర్ణోత్కర్షతోకూడిన పరభాగశోభను కల నీ కాంతి నా కన్నులను ఎపుడు తృప్తిపఱుస్తుంది ?

త్వాం సేవితం జలజచక్రగదాసిశార్ఙ్గైః
తార్క్ష్యేణ సైన్యపతినాఽనుచరై స్తథాఽన్యైః ।
దేవ్యా శ్రియా సహ వసన్త మనన్తభోగే
భుఞ్జీయ సాఞ్జలి రసఙ్కుచితాక్షిపక్ష్మా ॥ 76

సుదర్శనచక్రం, పాంచజన్యశంఖం, నందకఖడ్గం, కౌమోదకీగద, శార్ఙ్గమనే విల్లు- అనే వీటిచే, గరుడునిచే, విష్వక్సేనునిచే, ఆ విధంగానే మిగిలిన చండప్రచండాది సమస్తపరిజనులచే సేవింపబడేవాడవు, లక్ష్మీదేవితోపాటు ఆదిశేషుని శరీరంపై వేంచేసి ఉండేవాడవు అయిన నిన్ను అంజలిని చేస్తూ, కనుఱెప్పపాటు లేనివాడనై అనుభవించాలి. (దర్శించాలి) (నిత్యముక్తుల భోగాన్ని ఇందులో కూరేశులు ప్రార్థించారు.)

కైఙ్కర్యనిత్యనిరతై ర్భవదేకభోగైః
నిత్యై రనుక్షణనవీనరసార్ద్రభావైః ।
నిత్యాభివాఞ్ఛితపరస్పరనీచభావైః
మద్దేవతైః పరిజనై స్తవ సంగసీయ ॥ 77

నీ కైంకర్యంలోనే నిత్యం ఆసక్తిని కలవారు, నీ ఒక్కని విషయంలోనే అనుభవాన్ని కలవారు (భవదనన్యభోగులు), నిత్యసిద్ధులు, ప్రతిక్షణం కలిగే నూతనమైన భగవదనుభవంచేత ద్రవించిన భావాన్ని కలవారు, నిత్యం తమలో పరస్పరశేషత్వాన్ని అభిలషించేవారు,నాకు దైవాలవంటివారు అయిన నీ పరిజనులతో ఎపుడు కలసి కొంటానో కదా! ("అడియార్కళ్ కుழாఙ్గళ్ ఉడన్ కూడువదెన్ఱుకొలో" అనే తిరువాయ్మొழி సూక్తి భావ్యం.)

యత్కిఞ్చిదుజ్జ్వల మిదం యదుపాఖ్యయాऽహుః
సౌందర్య మృద్ధి రితి యన్మహిమాంశలేశః ।
నామ్నైవ యాం శ్రియ ముశన్తి యదీయ ధామ
త్వా మామనన్తి యతమా యతమానసిద్ధిః ॥ 78

లోకంలో ఉజ్జ్వలమైన ఏ వస్తువును అయినా ఏ శ్రీదేవి పేరుతో నిర్దేశిస్తున్నారో, ఏ తల్లి మహిమలోని ఏకదేశంలోని అత్యల్పభాగం అవయవశోభ, సంపద అని చెప్పబడుతున్నదో, ఎవరిని శ్రీదేవి అనే పేరుతో చెబుతున్నారో, నిన్ను ఏలక్ష్మికి నివాస భూమిగా తలుస్తున్నారో, ఏ లక్ష్మి యోగులకు సిద్ధిస్వరూపిణియో, అటువంటి శ్రీదేవిని, నిన్ను చేరి, గొప్ప కైంకర్యభావాన్ని కలవాడనై, సేవించాలి. ("యతమానసిద్ధిః"- "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే" అనే సూక్తి భావ్యం.)

యా వై త్వయాऽప్యుదధిమంథనయత్నలభ్యా
యాऽన్తర్హితేతి జగదున్మథనోద్యతోऽభూః ।
యా చ ప్రతిక్షణ మపూర్వరసానుబంధైః
భావై ర్భవన్త మభినన్దయతే సదైవ ॥ 79

సత్యసంకల్పుడవైన నీవుకూడా ఎవరిని సముద్రమథనప్రయత్నంద్వారా పొందవలసివచ్చిందో, ఎవరు (సీతాదేవి) అంతర్హిత అయినదని నీవు "జగత్ స్సమస్తం పరివర్తయా మ్యహమ్" అని జగత్ సంహారం కోసం ఉద్యుక్తుడవు అయ్యావో, ఏ తల్లి ప్రతిక్షణం అపూర్వరసానుబంధాలను కల భావాలతో నిన్ను ఎల్లప్పుడూ ఆనందింప

జేస్తున్నదో, అటువంటి శ్రీదేవిని, నిన్ను చేరి గొప్ప కైంకర్యభావాన్ని కలవాడనై సేవించాలి. (సీతాదేవి అంతర్హిత అయినపుడు శ్రీరాముడు ఆగ్రహించిన వృత్తాంతం ఉత్తర రామాయణంలో ఉన్నది. ఈశ్లోకం తరువాతి శ్లోకంతో అన్వయిస్తుంది.)

రూపశ్రియా గుణగణై ర్విభవేన ధామ్నా
భావై రుదారమధురై శ్చతురై శ్చరిత్రైః ।
నిత్యం తవైవ సదృశీం శ్రియ మీశ్వరీం తాం
త్వాం చాశ్రితః పరిచరేయ ముదీర్ణభావః॥ 80

రూపలావణ్యసౌందర్యశోభతో, విభవావతారాలతో, దయావాత్సల్యాది గుణగణాలతో స్థానంతో గొప్పవి, తీయనివి అయిన చిత్తవృత్తులతో, ఆశ్రిత సంరక్షణలోని నేర్పును కల నడతలతో ఎల్లప్పుడు నీకు తగినది, సమస్త ప్రాణులకు ఈశాన అయిన ఆ శ్రీదేవిని, నిన్ను చేరినవాడనై గొప్ప కైంకర్యభావంతో సేవించాలి. (“తుల్యశీల వయోవృత్తాం తుల్యాభిజనలక్షణామ్, రాఘవోఽ ర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా”, “అస్యేశానో జగతః”, “ఈశ్వరీం సర్వభూతానామ్” ఇత్యాది ప్రమాణాలు భావ్యాలు)

యా బిభ్రతీ స్థిరచరాత్మక మేవ విశ్వం
విశ్వమ్భరా పరమయా క్షమయా క్షమా చ ।
తాం మాతరం చ పితరం చ భవంత మస్య
వ్యుచ్ఛంతు రాత్రయ ఇమా వరివస్యతో మే ॥ 81

ఏ భూదేవి స్థావరజంగమాత్మకం అయిన ఈ విశ్వాన్ని అంతటినీ భరించడం చేత విశ్వంభర అని, నిరవధికమైన క్షమాగుణం చేత క్షమ అని ప్రసిద్ధి పొందిందో, జనని అయిన ఆ భూదేవిని, తండ్రివి అయన నిన్ను నిత్యం సేవిస్తున్న నాకు ఈ రాత్రులు నీ సేవకు ప్రభాతాలు కావాలి. (నీ సేవకు ఉపయుక్తకాలాలుగా కావాలి.)

భావై రుదారమధురై ర్వివిధై ర్విలాసైః
భ్రూవిభ్రమస్మితకటాక్షనిరీక్షణై శ్చ ।
యా త్వన్మయీ త్వమపి యన్మయ ఏవ సా మాం
నీళా నితాంత మురరీకురుతా ముదారా ॥ 82

గంభీరాలైన, మధురాలైన భావాలతో (చిత్తవృత్తులతో), వివిధాలైన విలాసాలతో, కనుబొమల కదలికలు, చిఱునవ్వు, క్రీగంటిచూపులు- అనే వీనితో ఏ నీళాదేవి నీతో

అనన్యయై (నిన్ను వీడనిదై) ఉన్నదో, ఏ నీళాదేవిని నీవు ఏనాడు ఎడబాసి ఉండవో, అటువంటి గొప్ప ఉదార అయిన నీళాదేవి నన్ను తన నిత్యకింకరునిగా స్వీకరించాలి. (దయాశతకంలో ప్రారంభంలో దేశికులు చేసిన శ్రీదేవి భూదేవి, నీళాదేవుల వర్ణనకు ఈ మూడు శ్లోకాలే మూలం అని పెద్దల అభిప్రాయం).

**భావై రనుక్షణ మపూర్వరసానువిద్ధైః**
**అత్యద్భుతై రభినవై రభినంద్య దేవీః ।**
**భృత్యా న్యథోచితపరిచ్ఛదినో యథార్హం**
**సమ్భావయన్త మభితో భగవన్! భవేయమ్ ॥ 83**

భగవన్ ! ప్రతిక్షణం భోగ్యతాతిశయంచేత అపూర్వంగా, కొత్త కొత్తగా తోచే శృంగారరసవిశేషాలతో కూడినవి, మిక్కిలి ఆశ్చర్యకరాలైనవి, నిత్యనూతనాలైనవి అయిన సాత్త్వికాది భావాలలో శ్రీదేవి-భూదేవి-నీళాదేవులను ఆనందింపజేసేవాడవు, తమ తమ అధికారాలకు అనుగుణంగా వేత్రం (బెత్తం) ఛత్రం మొదలైనవానిని ధరించిన విష్వక్సేనుడు మొదలైన భృత్యులను తగినట్లుగా సంభావించేవాడవైన నీచెంత సమస్తకైంకర్యాలను నిర్వర్తించేవాడను కావాలి.

**హా ! హంత ! హంత ! హతకోఽస్మి ఖలోఽస్మి ధిఙ్మాం**
**ముహ్యన్నహో ! అహ మిదం కిమువాచ వాచా ।**
**త్వా మఙ్గ ! మంగళగుణాస్పద మస్తహేయమ్**
**ఆః ! స్మర్తు మేవ కథ మర్హతి మాదృగంహః ॥ 84**

స్వామీ! అయ్యయ్యో ! నేను ఎంత మృతప్రాయుడను ! క్రూరుడను ! ఎంతగానో లౌకికవిషయాలలో మోహాన్ని పొందుతూ, దేహమే ఆత్మ అని భ్రమిస్తూ, మోసపోయానో. ఇటువంటి ఖలుడను అయిన నేను మతిలేని మాటలతో నిన్ను ప్రార్థించానా! ఎంత ఆశ్చర్యం! ఏ హేయగుణం లేనివాడవు, సమస్త మంగళాలకు నిలయుడవు అయిన నిన్ను నేను స్మరించడానికే అర్హుడను కానే! ఇక, పొందే యోగ్యత నాకెక్కడిది ! అవివేకినై నీ గుణానుభవాన్ని ప్రార్థించాను. ఇది నాకు చాలా బాధాకరంగా ఉన్నదయ్యా!

**అంహః ప్రసహ్య వినిగృహ్య విశోధ్య బుద్ధిం**
**వ్యాపూయ విశ్వ మశివం జనుషాఽనుబద్ధమ్ ।**
**ఆధాయ సద్గుణగణా నపి నాఽహ మర్హః**
**త్వత్పాదయో ర్యదహ మత్ర చిరం నిమగ్నః ॥ 85**

నేను చిరకాలంగా ఈ పాపాలలో మునిగినవాడను అయినందున నా పాపాన్ని బలాత్కారంగా అణచివేసి, బుద్ధిని బాగా శోధించి, జన్మలతో అనువర్తించే, అమంగళకరమైన విషయవాసనలను లేకుండా కడిగివేసికొని, సద్గుణసముదాయాన్ని ఎంతగా చేర్చుకొన్నవాడను అయినా, (ఇంతచేసినా) నేను నీ పాదసేవకు ఎంతమాత్రం అర్హుణ్ణికాను. (**"జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాధిభిః, నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే"** - ఇత్యాదులు భావ్యాలు)

**జానేఽథవా కి మహ మంగ ! యదేవ సంగాత్**
**అంగీకరోషి న హి మంగళ మన్యదస్మాత్ ।**
**తేన త్వమేవ మురరీకురుషే జనం చేత్**
**నైవాముతో భవతి యుక్తతరో హి కశ్చిత్ ॥** 86

ఆవిధంగా కాకపోతే, ఓ వైకుంఠనాథా ! నేనేమి తెలియగలను ? నీవు నన్ను అనుగ్రహించడానికి మన మధ్య ఉండే స్వస్వామిభావరూపసంబంధం తప్ప ఇంకొక సుకృతహేతువు ఏదీ నాలో లేదు. దీనిని నీవు భావించి నా పాపాన్నే పుణ్యంగా అంగీకరిస్తున్నావుకదా! (దేవా! నాపాపాన్ని నీవు స్వస్వామిభావసంబంధాన్ని చూచి అంగీకరిస్తున్నావు, కనుక నీ అంగీకారంకంటే ఇంకొక సుకృతం -మంగళం- ఏదీ నాదగ్గర లేదు) అందువల్ల, దోషాన్ని గుణంగా భావించే బుద్ధికి మూలకారణం అయిన స్వస్వామి భావసంబంధంతో నీవు సకలదోషదూషితుడను అయిన నన్ను అంగీకరిస్తే, నాకంటే యోగ్యుడు ఇంకొకడు నీకు దొరకడు సుమా! (భగవానుని దోషభోగ్యత్వం- **"దోషో యద్యపి తస్య స్యాత్", "విభీషణో వా సుగ్రీవ! యది వా రావణ స్స్వయమ్", "కుఱ్ఱనైయ కుఱ్ఱమ్ శెయినుమ్ కుణమ్ కొళ్ళుమ్"** ఇత్యాది అనేక ప్రమాణసిద్ధం)

**యన్నాఽభవామ భవదీయకటాక్షలక్ష్యం**
**సంసారగర్తపరివర్త మతోఽగమామ ।**
**ఆగాంసి యే ఖలు సహస్ర మజస్ర మేవ**
**జన్మస్వతన్మహి కథం త ఇమేఽనుకంప్యాః ॥** 87

నీ కటాక్షాలకు పాత్రం కాకపోవడంవల్ల మేము ఈ సంసారమనే గుంటలో పడి పరిభ్రమిస్తున్నాము. జన్మజన్మలలో వేలాది అపరాధాలను నిరంతరం చేస్తున్నాము. ఇటువంటి మేము నీ దయకు యోగ్యులం ఏవిధంగా కాగలము? (కాకాసురుడుకూడా ఒక్కమాటే అపరాధం చేశాడు. కనుక పరిపాలింపబడ్డాడు. మేము పలుమార్లు పలు జన్మలలో అపరాధాలను చేశాము. కనుక ఏవిధంగా నీ దయను పొందగలం? అని హార్దభావం)

**సత్కర్మ నైవ కిల కిఞ్చన సఞ్చినోమి**
**విద్యాఽప్యవద్యరహితా న చ విద్యతే మే ।**
**కిఞ్చ త్వదఞ్చితపదామ్బుజభక్తిహీనః**
**పాత్రం భవామి భగవన్ ! భవతో దయాయాః ॥** **88**

షాడ్గుణ్యపూర్తిని కల భగవన్ ! నేను కొంచెం అయినా సత్కర్మానుష్ఠానాన్ని చేయలేదుకదా ! నిర్దుష్టమైన జ్ఞానాన్ని కలవాడను కాను. నీ పదాంబుజాలలో అనన్యమైన భక్తిని కలవాడను అయినా కాను. కనుక ఇటువంటి నేను నీదయకు తగిన పాత్రం అవుతున్నాను సుమా! (ఈవిధంగా కర్మజ్ఞానభక్తియోగదూరుణ్ణి అయినందువల్లనే నేను నీ నిర్హేతుకకృపకు తగినవాడను- అని భావం. "**నోఱ్ఱ నోన్బు ఇలేన్ నుణ్ణఱివిలేన్**", "**న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ న భక్తిమాన్ త్వచ్చరణారవిందే**" ఇత్యాది సూక్తుల భావాలు ప్రకృతంలో అనుసంధేయాలు)

**కిం భూయసా ప్రలపితేన యదేవ కించిత్**
**పాపాహ్వ మల్ప మురు వా తదశేష మేషః ।**
**జానన్నవా శతసహస్రపరార్థకృత్వో**
**యోఽకార్ష మేన మగతిం కృపయా క్షమస్వ ॥** **89**

ఇపుడు నేను పలు మాటలను పల్కి ఏం ప్రయోజనం? కొంచెంగా కాని, గొప్పగా కాని ఏమాత్రం అయినా నేను దుష్కర్మలను నేను తెలిసి, తెలియకుండా ఎన్నో వందల వేలమార్లు గతంలో చేశాను. ఇపుడు దిక్కులేనివాడనై ఉన్నాను. నీ కంటే ఇంకొక రక్షకుడు నాకు లేడు. అటువంటి నన్ను నీ నిర్హేతుక దయతో కాపాడు.

**దేవ ! త్వదీయచరణప్రణయప్రవీణ-**
**రామానుజార్యవిషయీకృత మప్యహో! మామ్ ।**
**భూయః ప్రధర్షయతి వైషయికో విమోహో**
**మత్కర్మణః కతర దత్ర సమానసారమ్ ॥** **90**

దేవా ! నీ చరణభక్తిలో ప్రవీణులైన భగవద్రామానుజులవారిచేత నేను అనుగ్రహింపబడినవాడను. అయినా, నన్ను లౌకికవిషయాలలోని వ్యామోహం మాటిమాటికి బాధిస్తున్నదే ! అహో ! ఎంత ఆశ్చర్యం ! ఈ లోకంలో నేను చేసిన పాపంకంటే బలమైనది ఇంకొకటి ఏదీ లేదే !

గర్భేషు నిర్భరనిపీడనఖిన్నదేహః
క్షోదీయసోఽతిమహతోఽప్యఖిలస్య జన్తోః ।
జన్మాన్తరాణ్యనువిచింత్య పరస్సహస్రాణి
అత్రాఽహ మప్రతివిధి ర్నిహత శ్చరామి ॥ 91

మిక్కిలి చిన్న పరిమాణాన్ని కల చీమ, మిక్కిలి పెద్ద పరిమాణాన్ని కల ఏనుగు మొదలైన ప్రాణుల గర్భాలలో (ఆయా జన్మల సమయంలో) నివసించి నందువల్ల ఏర్పడే చాలా ఒత్తిడిచేత పీడింపబడ్డ దేహాన్ని కలవాడనై, వేలాది జన్మాంతరాలు వరుసగా తలచుకొని మృతప్రాయుడనైన నేను ఇపుడు ప్రతిక్రియ ఏదీ లేనివాడనై సంచరిస్తున్నాను. ("నిరుచ్ఛ్వాసః సచైతన్యః స్మరన్ జన్మశతాన్యపి, ఆస్తే గర్భేఽతిదుఃఖేన నిజకర్మ నిబంధనః, విజ్ఞానభ్రంశ మాప్నోతి జాతశ్చ మునిసత్తమ" మొదలైన విష్ణుపురాణవచనాలు స్మరణీయాలు.)

భూయ శ్చ జన్మసమయేషు సుదుర్వచాని
దుఃఖాని దుఃఖ మతిరిచ్య కి మప్యజానన్ ।
మూఢోఽనుభూయ పున రేవ తు బాలభావాత్
దుఃఖోత్తరం నిజచరిత్ర మముత్ర సేవే ॥ 92

(తల్లి) గర్భంలో క్లేశాన్ని అనుభవించిన తరువాతకూడా జన్మసమయంలో ఇంతటివి అని, ఇట్టివి అని నిర్వచించడానికి సాధ్యం కాని బాధలను అనుభవించి, దుఃఖాలను తప్ప వేఱు దేనినీ తెలియక, ఆ దుఃఖాలను దాటే ఉపాయాన్ని తెలియక, మూఢుడనై తిరిగి బాలత్వంవల్ల పరలోకంలో దుఃఖప్రచురం అయిన నా కర్మఫలాన్ని అనుభవిస్తున్నాను.

భూయాంసి భూయ ఉపయన్వివిధాని దుఃఖాని
అన్యచ్చ దుఃఖ మనుభూయ సుఖభ్రమేణ।
దుఃఖానుబద్ధ మపి దుఃఖవిమిశ్ర మల్పం
క్షుద్రం జుగుప్సితసుఖం సుఖ మిత్యుపాసే ॥ 93

తిరిగి పలు విధాలైన, అనేకాలైన దుఃఖాలను అనుభవిస్తూ నేను మిగిలిన దుఃఖాలనుకూడా సుఖభ్రాంతితో అనుభవించి, అనుభవదశలోనే దుఃఖంతో కలసినది, తరువాతికాలంలో దుఃఖాన్నే కల్గించేది, అల్పమైనది, క్షణికమైనది, శిష్టులచేత గర్హింపబడేది అయిన విషయసుఖాన్ని నిజమైన సుఖంగా భ్రమించి సేవిస్తున్నాను.

**లోలద్భిరిన్ద్రియహయై రపథేషు నీతో**
**దుష్ప్రాపదుర్భగమనోరథమథ్యమానః ।**
**విద్యాధనాభిజనజన్మమదేన కామ-**
**క్రోధాదిభి శ్చ హతధీ ర్న శమం ప్రయామి ॥** 94

చంచలాలైన ఇంద్రియాలనే గుఱ్ఱాలచే తగని దారులలో బలవంతంగా లాగుకొనిపోబడ్డవాడనై, పొందరానివి, గర్హింపబడేవి అయిన కోరికలచేత మనస్సులో పీడింపబడ్డవాడనై, విద్యా-అభిజన- ధన- మదాలతో, కామక్రోధాదులతో కలుషితమైన బుద్ధిని కలవాడనైన నేను ఏనాటికీ శాంతిని పొందలేను. (ఈ శ్లోకానికి అనుగుణంగా **"వఞ్జముక్కుఱుమ్బామ్ కుழிయై క్కడక్కుమ్ నమ్ కూరత్తாழ்వాన్"** అనే ఇరామానుశ-నూற்றన్దాది సూక్తి స్మరణీయం. **"ఇంద్రియాణి హయానాహుః"** అనే శ్రుతి సూక్తి, **"క్వ చ దుష్టేంద్రియవాజివశ్యతా"** అనే భారవిసూక్తి భావ్యాలు.)

**లభ్యేషు దుర్లభతరేష్వపి వాఞ్ఛితేషు**
**జాతా సహస్రగుణతత్ప్రతిలమ్భనేఽపి ।**
**విఘ్నై ర్హతేష్వపి చ తేషు సమూలఘాతం**
**వర్ధిష్ణు రేవ న తు శామ్యతి హన్త ! తృష్ణా ॥** 95

సులభాలు (సులభంగా పొందదగినవి) అయిన ఇష్టవస్తువులలోని ఆశ నేను ఆశించినదానికంటే వేల రెట్లు ఎక్కువగా తీరినా, వాటిలో ఆశ నాకు ఉపశమించలేదు. అత్యంతం దుర్లభాలు అయిన ఆశలు విఘ్నాలవల్ల అవరుద్ధమైనా నాకు వాటిమీద తృష్ణ తగ్గడం లేదు. ఇంకా ఇంకా వృద్ధి అవుతున్నది. ఇది ఎంత విచారకరం! (**"న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి, హవిషా కృష్ణవర్త్మేవ పున ర్భూయోఽభి వర్ధతే"** ఇత్యాదులు భావ్యాలు)

**త్వత్కీర్తనస్తుతినమస్కృతివేదనేషు**
**శ్రద్ధా న భక్తి రపి శక్తి రథో న చేచ్ఛా ।**
**నైవానుతాప మతి రేష్వకృతేషు కిన్ను**
**భూయా నహో ! పరికరః ప్రతికూలపక్షే ॥** 96

స్వామీ! నీ నామసంకీర్తనంలో, స్తుతించడంలో, నమస్కరించడంలో, ధ్యానంలో భక్తి, శ్రద్ధ ఏమాత్రం లేదు. శక్తికూడా లేదు. అవి లేకపోయినా, ఇచ్ఛ అయినా ఉన్నదా? అని అంటే, అదికూడా లేదు. నీ కీర్తనస్తుతి ప్రణామధ్యానాలు చేయలేదనే పశ్చాత్తాపం లేనేలేదు. కాని, వ్యతిరేకంగామాత్రం ఎంత సామగ్రి అయినా ఉన్నది. (క్షణకాలం

కూడా భగవన్నామకీర్తనం చేయకుండా ఉండడం గొప్ప హానికరం అన్నది- "ఏకస్మిన్నప్యతి క్రాంతే ముహూర్తే ధ్యానవర్జితే, దస్యుభి ర్ముషితేనేవ యుక్త మాక్రందితుం నృణామ్" అనే సూక్తిద్వారా వ్యక్తం)

ఏతేన వై సువిదితం బత! మామకీనం
దౌరాత్మ్య మప్రతివిధేయ మపార మీశ !
సమ్మూర్ఛతోఽ ప్యపద మస్మి యత స్త్వదీయ-
నిస్సీమభూమకరుణామృతవీచివాయోః ॥ 97

వైకుంఠపతీ ! హద్దు లేని మహిమను కల నీదయామృతసముద్రం అంతటా వ్యాపిస్తున్నది. అయినా, నేను ఆ సముద్రతరంగాల వాయువునకుకూడా పాత్రుణ్ణి కాలేకపోయాను. అందువల్ల నా దుర్మార్గం అంతు లేనిది, ప్రతీకారం లేనిది అని సువ్యక్తమైనదికదా ! అయ్యో !

ఐశ్వర్యవీర్యకరుణాగరిమక్షమాద్యాః
స్వామిన్నకారణసుహృత్త్వ మథో విశేషాత్ ।
సర్వే గుణా స్వవిషయా స్తవ మా మపార -
ఘోరాఘపూర్ణ మగతిం నిహతం సమేత్య ॥ 98

స్వామీ ! అంతు లేని, దారుణమైన పాపాలతో నిండినవాడను, మృతప్రాయుడను అయిన నన్ను చేరి నీ ఐశ్వర్యం, వీర్యం, కరుణ, గౌరవం, క్షమ మొదలైన గుణాలు, నీ నిర్హేతుకసుహృత్త్వం తగిన విషయాన్ని కల్గినవి అయినవి. (అపారఘోరపాపభూయిష్ఠుడనైన నన్ను కరుణించకపోతే నీ కృపాక్షమాదిగుణాలకు తగిన విషయం దొరుకదుకదా ! అని భావం. "అనుత్తమం పాత్ర మిదం దయాయాః" ఇత్యాది సూక్తులు స్మరణీయాలు)

త్వత్పాదసంశ్రయణహేతుషు సాధికారాన్
ఉద్యుఞ్జత శ్చరితకృత్స్నవిధీంశ్చ తాంస్తాన్ ।
త్వం రక్షసీతి మహిమా తవ నాల మేషోః
మాంచే దనీదృశ మనన్యగతిం న రక్షేః ॥ 99

స్వామీ! ఏ అధికారం లేనివాడను, అనన్యగతిని అయిన నన్ను నీవు రక్షించకపోతే, నీ పాదపద్మసంశ్రయణంలో హేతువులైన కర్మయోగాదులలో అధికారాన్ని కలవారు, వాటిని అనుష్ఠించాలని ప్రయత్నించేవారు, వాటిని పూర్తిగా ఆచరించినవారు

అయిన ఆ పుణ్యాత్ములను మాత్రమే నీవు రక్షిస్తున్నావు- అనే నీ మహిమకు కొఱతేసుమా!

**యా కర్మణా మధికృతి ర్య ఇహోద్యమ స్తేషు**
**అప్యేష్వనుష్ఠితి రశేష మిదం హి పుంసామ్ ।**
**త్వా మన్తరేణ న కథంచన శక్య మాప్తుమ్**
**ఏవం చ తేషు మయి చాఽస్తి న తే విశేషః ॥ 100**

పూర్వం చెప్పబడ్డ కర్మలలో అధికారం, ఆ కర్మలలో ప్రయత్నం, వాటిని పూర్ణంగా అనుష్ఠించడం- ఇవి అంతా నీ అనుగ్రహం లేకపోతే మానవులకు ఏవిధం గానూ సిద్ధించవు. వాస్తవం ఇది అయినపుడు, అంతా నీ సంకల్పాధీనం అయినపుడు, వారికి మోక్షసాధనానుష్ఠానాధికారం, ప్రయత్నం, పూర్ణాచరణం అన్నింటినీ నీవు అనుగ్రహించినట్లే నాకుకూడా అనుగ్రహించు. వారిని స్వీకరించినట్లు నన్ను కూడా స్వీకరించు.

**నిర్బన్ధ ఏష యది తే యదశేషవైధ-**
**సంసేవినో వరద ! రక్షసి నేతరాం స్త్వమ్ ।**
**తర్హి త్వ మేవ మయి శక్త్యధికారవాంఛాః**
**ప్రత్యూహశాన్తి మితరచ్చ విధేహి విశ్వమ్ ॥ 101**

ఓ వరదా! "సమస్తవిధ్యుక్తధర్మాలను అనుష్ఠించినవారినే నేను రక్షిస్తాను, ఇతరులను రక్షించను''- అనే నిర్బంధమే నీకు ముఖ్యం అయితే, అపుడు నీవే నాలో ఆ శక్తిని, అధికారాన్ని, రుచిని, అనుష్ఠానంలో కలిగే విరోధుల శాంతిని, ఇంకా అన్నిటినీ చేసి, నాకు ఆ యోగ్యతను కల్గించి అనుగ్రహించవయ్యా! (ప్రకృతంలో **"సుదుష్కరేణ శోచేద్యో యేన యేనేష్టహేతునా, స స తస్యాహమేవేతి చరమశ్లోకసంగ్రహః"** అనే పెద్దల సూక్తి స్మరణీయం.)

**వ్యక్తీకుర్వ న్నిగమశిరసా మర్థ మంతర్నిగూఢం**
**శ్రీవైకుంఠస్తవ మకృత యః శ్రేయసే సజ్జనానామ్ ।**
**కూరాధీశం గురుతరదయాదుగ్ధసింధుం తమీడే**
**శ్రీవత్సాంకం శ్రుతిమతగురుచ్ఛాత్రశీలైకధామ ॥**

వేదాంతాలలో ఇమిడి ఉండే అర్థాన్ని వ్యక్తం చేస్తూ, సజ్జనుల శ్రేయస్సుకోసం శ్రీవైకుంఠస్తవాన్ని అనుగ్రహించినవారు, చాలా గొప్ప దయ అనే అమృతానికి సముద్రంవంటివారు, కూరదేశానికి ప్రభువులు, వేదోక్తమైన గురులక్షణానికి,

శిష్యలక్షణానికి అద్వితీయమైన ఆశ్రయం అయినవారు అయిన ఆ శ్రీవత్సాంకులను స్తుతిస్తున్నాను. (ఈ శ్లోకాన్ని, తరువాత గల "అర్వాంచః" అనే శ్లోకాన్ని కూరేశుల మహిమను స్తుతిస్తూ పెద్దలెవరో రచించారు. ఇవి వైకుంఠస్తవంలో చేరినవి కావు.)

**అర్వాఞ్చో యత్పదసరసిజద్వంద్వ మాశ్రిత్య పూర్వే**
**మూర్ధ్నా యస్యాన్వయ ముపగతా దేశికా ముక్తి మాపుః ।**
**సోఽయం రామానుజముని రపి స్వీయముక్తిం కరస్థాం**
**యత్సంబన్ధా దమనుత కథం వర్ణ్యతే కూరనాథః ॥**

ఏ శ్రీ రామానుజులకు తరువాత జన్మించిన పూర్వాచార్యులు వారి శ్రీపాద సంబంధంవల్ల, పూర్వం జన్మించిన పూర్వాచార్యులు వారి శిరస్సంబంధంవల్ల ముక్తిని పొందారో, ఆ రామానుజులు సైతం తమ ముక్తి ఏ కూరేశుల సంబంధంవల్ల హస్తగతమైనదని తలచారో, ఆ కూరేశుల వైభవాన్ని వర్ణించడం సాధ్యం కాదు.

శ్రీవైకుంఠస్తవం సంపూర్ణము.



## శ్రీ కూరేశులు అనుగ్రహించిన

# అతిమానుషస్తవము

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే
యదుక్తయ స్త్రయీకణ్ఠే యాన్తి మఙ్గలసూత్రతామ్ ।

--- 0 0 0 ---

వైకుంఠనాథుని విషయంలో శ్రీ వైకుంఠస్తవాన్ని రచించి, తరువాత విభవావతారాలలోని అతిమానుషలీలలను కొన్నిటిని ప్రస్తావించడంద్వారా, పరాశరపారాశర్య భట్టనాథ పరాంకుశ పరకాలాది మహర్షులు తెల్పిన రహస్యాలను రమ్యంగా ఆవిష్కరిస్తూ అతిమానుషస్తవమనే ఈ స్తుతిని కూరేశులు రచిస్తున్నారు.



అతిమానుషశీలవృత్తవేషైః అతివృత్తామరవిక్రమప్రతాపైః ।
అతిలఙ్ఘితసర్వలోకసామ్యం వరయే వైష్ణవవైభవావతారమ్ ॥ 1

అత్యద్భుతాలైన స్వభావాలతో, లీలలతో, రూపాలతో, అతిదివ్యమైన విక్రమాలతో, ప్రతాపాలతో ఈలోకంలో ఎవ్వరూ సాటి రానట్లుండే భగవానుని విభవావతార వైభవాలను స్తుతిస్తున్నాను. ("అతిలంఘితసర్వలోకసామ్యమ్" -"జన్మ కర్మ చ మే దివ్యమ్" అనే సూక్తి స్మరణీయం. "వైభవావతారం వరయే" - "యః సర్వజ్ఞః సర్వవిత్", "పరాఽస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ", "త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్", "న తత్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే", "అపహతపాప్మా విజరః" - ఇత్యాదిగా చెప్పబడ్డ గుణాలు అన్నీ "స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" అన్నట్లు అవతారాలలోనే ప్రకాశిస్తాయి. కనుక వాటిని వరిస్తున్నానని భావం.)

శ్రేయః కిరన్తు కిరణా శ్చరణారవిన్ద-
నిష్యన్దమానమకరన్దరసౌఘదేశ్యాః ।
తజ్జా శ్రుతే ర్మధున ఉత్స ఇతి ప్రతీతాః
మాఙ్గల్యరఙ్గనిలయస్య పరస్య ధామ్నః ॥ 2

లోకంలోని జనులకు అందటికీ క్షేమాన్ని కల్గించే శ్రీరంగనిలయవిమానాన్ని వాసస్థానంగా కలవాడై, పరంజ్యోతి అనే పేరుతో ప్రసిద్ధుడైన శ్రీరంగనాథుని చరణారవిందాలనుండి స్రవించే మకరందరసప్రవాహంతో సమానమైనవి, "విష్ణోః పదే

పరమే మధ్వ ఉత్సః" అని వేదంచేత కీర్తింపబడేవి అయిన ఆ భగవానుని శ్రీచరణాల నుండి వెలువడే కిరణాలు (మనకు) శ్రేయస్సును కల్గించాలి.

**శ్రీమత్పరాఙ్కుశమునీన్ద్రమనోనివాసాత్**
**తజ్జానురాగరసమజ్జన మఞ్జసాఽప్య ।**
**అద్యాప్యనారతతదుత్థితరాగయోగం**
**శ్రీరఙ్గరాజచరణామ్బుజ మున్నయామః ॥** 3

శ్రీపరాంకుశముని (నమ్మాళ్వార్ల) హృదయంలోని నిత్యనివాసంవల్ల ఆ నమ్మాళ్వార్ల హృదయంలో గల అనురాగం (భక్తి) అనే రసంలో (నీటిలో) స్నానాన్ని వేగంగా పొంది, ఈనాటికీ ఆ అనురాగరసయోగం (ఎఱ్ఱని రంగు) మారకుండా ఉండే శ్రీరంగనాథుని చరణారవిందాలను శిరసా ధరిస్తున్నాము. (**"ఉన్నయామః"** అనే ప్రయోగంలోని బహువచనం సాత్త్వికాహంకార ప్రయుక్తం. లేక తమతో తమవంటి వారిని ఇతరులను కలుపుకొని ప్రయోగించాలని కూడా చెప్పవచ్చు. ఈ వివరణాన్ని ఇటువంటి ప్రయోగాలలో సర్వత్ర అన్వయించుకోవడంలో అడ్డులేదు.)

**వజ్రధ్వజాంకుశసుధాకలశాతపత్ర -**
**పఙ్కేరుహాఙ్కపరికర్మపరీత మన్తః ।**
**ఆపాదపఙ్కజవిశృఙ్ఖలదీప్రమౌలేః**
**శ్రీరఙ్గిణ శ్చరణయో ర్యుగ మాశ్రయామః ॥** 4

శ్రీచరణాలవరకు ఏ అడ్డూ లేకుండా ప్రకాశించే కిరీటాన్ని కల శ్రీరంగనాథుని శ్రీపాదాల లోపలివైపున వజ్రం, ధ్వజం, అంకుశం, సుధాకలశం, ఛత్రం, పద్మం- అనే వీని ఆకారాలలోని చిహ్నాలు వ్యాపించి ఉన్నాయి. ఈ చిహ్నాలనే అలంకారాలతో నిండిన శ్రీరంగనాథుని శ్రీపాదాలను ఆశ్రయిస్తున్నాము.

**శ్రీరఙ్గరాజచరణౌ ప్రణుమో యయోః ఖలు**
**ఏక స్త్రివిక్రమవిధౌ వసుధా మశేషామ్ ।**
**వ్యక్రంస్త సాచలకులా మపి విప్రకీర్ణ -**
**స్థూలావలగ్నసికతా మివ నిర్ణతోచ్చమ్ ॥** 5

త్రివిక్రమరూపి అయిన భగవానుని ఏ శ్రీచరణాలు రెండిటిలో ఒక పాదం పర్వతాలతోకూడినది అయినా, చెల్లా చెదఱుగా పడి ఉండే పెద్ద పెద్ద గులకరాళ్ళతో నిండిన దానివలె ఈ భూమిని ఎత్తు పల్లాలనే తేడా లేకుండా అంతటా వ్యాపించేటట్లుగా

అనాయాసంగా కొలిచిందో, అటువంటి శ్రీరంగనాథుని శ్రీపాదపద్మయుగళిని స్తుతిస్తున్నాము.

జ్ఞానం బలం విపుల మీశనవీర్యశక్తి -
తేజాంసి చ త్రియుగభూయ ముపాగతాని ।
పూర్ణాని షట్చ పరిగృహ్య భవం శ్చతుర్ధా
భక్తం జనం త్వమనుజగ్రహిథాఽనురాగాత్ ॥ 6

స్వామీ ! నీవు పరిమితి లేని జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం, శక్తి, తేజస్సు- అనే ఆఱు గుణాలను రెండు రెండు రెండుగా (సంకర్షణ- ప్రద్యుమ్న- అనిరుద్ధ మూర్తులలో కల్గి ఉండేటట్లు) పూర్ణంగా పరిగ్రహించి వాసుదేవ-సంకర్షణ-ప్రద్యుమ్న అనిరుద్ధరూపాలలో నాల్గు విధాలుగా భక్తజనులను ప్రేమతో అనుగ్రహించావు. ("షాడ్గుణ్యాత్ వాసుదేవః" ఇత్యాది శ్రీరంగరాజస్తవశ్లోకం భావ్యం.)

ఏకాన్తమఙ్గళగుణాస్పద మస్తహేయం
నిత్యం పదం తవ యత స్తత ఏవ దేవ !
అమ్నాయతే తదిహ విశ్వవిరూపరూపం
తేనైవ నన్విద మశబ్ద మరూప మాహుః ॥ 7

స్వామీ ! నీ స్వరూపం నిత్యం అసాధారణ కల్యాణగుణాలకు నిలయమై, హేయప్రతిభటమై ఉన్నందున ఆ ఈ స్వరూపం వేదంలో సకలవిలక్షణంగా అభ్యసింపబడు తున్నది. అందువల్లనే నీ ఈ అప్రాకృతస్వరూపం కర్మనిబంధనాలైన, ప్రాకృతాలైన నామరూపాలను లేనిదని వైదికులు అంటున్నారు.

శబ్దాదిహేయ ఇహ గోచర ఇన్ద్రియాణాం
తత్ప్రత్యనీకవిభవ స్త్వ మతీంద్రియోఽసి ।
తేనైవ తే న బత! దర్శన మస్తి కిఞ్చిత్
వాచో ధియ శ్చ తత ఏవ న గోచరోఽసి ॥ 8

స్వామీ! ఈ లోకంలో జుగుప్సను కల్గించే శబ్దాదివిషయాలు చక్షురాదీంద్రియాలకు గోచరమవుతున్నాయి. దానికంటే విలక్షణమైన గుణసంపదను కల నీవు అతీంద్రియుడవై- ఇంద్రియగోచరుడవు కానివాడవై- ఉన్నావు. అందువల్లనే నీకు ద్రష్టవ్యత్వం లేదు. కనుక వాక్కుకు, మనస్సుకు అందనివాడవై ఉన్నావు. అయ్యో ! ("న మాంసచక్షుభి రభివీక్షతే తమ్", "న చక్షుషా గృహ్యతే నాపి వాచా", "మతం యస్య న వేద సః" ఇత్యాదిశ్రుతులు భగవానుని అతీంద్రియత్వంలో భావ్యాలు.)

**ఏవం స్థితే త్వదుపసంశ్రయణాభ్యుపాయో**
**మానేన కేనచిదలప్స్యత నోపలబ్ధుమ్ ।**
**నోచే దమర్త్యమనుజాదిషు యోనిషు త్వమ్**
**ఇచ్ఛావిహారవిధినా సమవాతరిష్యః ॥** **9**

ఈవిధంగా అతీంద్రియుడవు అయినా, కర్మనిబంధనంగా కాకుండా, కేవలం స్వేచ్ఛతోనే నీవు దేవ-మనుష్య- తిర్యగాది జాతులలో అవతరించి ఉండకపోతే నిన్ను ఆశ్రయించడానికి తగిన ఉపాసన- అర్చన- ప్రణామ- ప్రదక్షిణాది ఉపాయాలు శాస్త్రోక్తాలైన ఏ ప్రమాణంచేత పొందడానికి (తెలిసికోవడానికి) వీలు కాకపోయేవి. అవి నిర్విషయాలే అయి ఉండేవికదా ! ("త మేవ శరణం వ్రజ", "మామేకం శరణం వ్రజ" ఇత్యాదులు శ్రీరామాయణాద్యధీనాలని భావం.)

**శీలః క ఏష తవ హంత! దయైకసిన్ధో !**
**క్షుద్రే పృథగ్జనపదే జగదణ్డమధ్యే ।**
**క్షోదీయసోఽపి హి జనస్య కృతే కృతీ త్వమ్**
**అత్రావతీర్య నను లోచనగోచరోఽభూః ॥** **10**

కరుణాసముద్రా ! కృతజ్ఞుడవైన నీవు ఈ బ్రహ్మాండం నడుమ అత్యల్పం, ప్రాకృతజనులకు నివాసస్థానం అయిన ఈ లోకంలో అతిక్షుద్రులైన జనులకోసం అవతరించి, అందటి నేత్రాలకు గోచరుడవు అవుతున్నావుకదా ! ఈవిధంగా అవతరించే నీ సౌశీల్యగుణం ఎంతటిది ! ఆశ్చర్యం !

**యం పాతకాత్సుమహతోఽప్యదధారయ స్త్వం**
**త్వత్పాదవారిపరిపూతశిరాశ్చ యోఽభూత్**
**తం వందసే కిల తత శ్చ వరం వృణీషే**
**క్రీడావిధి ర్భత ! విలక్షణలక్షణ స్తే ॥** **11**

దేవా ! నీవు రుద్రుని గొప్ప పాతకంనుండి ఉద్ధరించావు. ఆ రుద్రుడు నీ శ్రీపాదతీర్థాన్ని తన తలపై ధరించి శివుడు (మంగళకరుడు) అయ్యాడు. అటువంటి రుద్రునకు నీవు నమస్కరించావు. అతనివద్దనుండి వరాలను కోరావు. నీ లీలావ్యాపారాలలోని వైచిత్రి ఎంత ఆశ్చర్యకరమైనది ! (**"పావనార్థం జటామధ్యే దధార శిరసాహరః"**, **"స శివః శివోఽభూత్"** ఇత్యాదులు శ్లోక పూర్వార్ధాను గుణంగా భావ్యాలు.)

కీడావిధేః పరికర స్తవ యా తు మాయా
సా మోహినీ న కతమస్య తు హన్త ! జన్తోః ।
హై! మర్త్యసింహవపుష స్తవ తేజసోఽంశే
శమ్భు ర్భవన్ హి శరభ శ్శలభో బభూవ ॥ 12

స్వామీ! నీ లీలావ్యాపారానికి పరికరంగా (సాధనంగా) ఉన్న మాయ ఏ ప్రాణికి అయినా మోహాన్ని కల్గించగలదుసుమా ! శరభరూపాన్ని ధరించిన శివుడు (మోహంతో) నృసింహరూపివి అయిన నీ తేజస్సులోని ఏకదేశంలో మిడుతవలె పడి నశించిపోయాడే ! ఎంత ఆశ్చర్యం ! ("హంతు మభ్యాగతం రౌద్రం శరభం నరకేసరీ, నఖై ర్విదారయామాస హిరణ్యకశిపుం యథా", "నమోఽస్తు నరసింహాయ లక్ష్మీస్థితిజితక్రుధే, యత్క్రోధాగ్నౌ పురా రౌద్ర శ్శరభ శ్శలభాయితః" ఇత్యాది పౌరాణిక వచనాలు స్మరణీయాలు. "భగవత్స్వరూపతిరోధానకరీమ్", "దైవీం గుణమయీం మాయామ్", "మాయయా మోహితం జగత్" ఇత్యాదులు ప్రకృతియొక్క మోహినీత్వానికి ప్రమాణాలు.)

యస్యాఽఽత్మతాం త్రిపురభఙ్గవిధా వధా స్త్వం
త్వచ్ఛక్తితేజితశరో విజయీ చ యోఽభూత్ ।
దక్షక్రతౌ తు కిల తేన వినిర్జిత స్త్వం
యుక్తో విధేయవిషయేషు హి కామచారః ॥ 13

త్రిపురాలను దహించే క్రమంలో రుద్రునకు నీవు అంతరాత్మవు అయ్యావు. ఆ రుద్రుడు నీ శక్తివల్ల తీక్ష్ణమైన బాణాన్ని కలవాడై, విజయాన్ని పొందాడు. అటువంటి రుద్రునిచేత నీవు దక్షయజ్ఞసమయంలో జయింపబడ్డావా! నీకు విధేయులైనవారి విషయంలో ఈవిధంగా నీ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించడం యుక్తమే సుమా ! ("విష్ణు రాత్మా భగవతో భవస్యామితతేజసః, తస్మాద్ధనుర్జ్యాసంస్పర్శం స విషేహే మహేశ్వరః, పురా పరాజయం ప్రాప్య సమరే త్రిపురాసురాత్" అనే పౌరాణిక సూక్తులు అనుసంధేయాలు.)

ముగ్ధశ్శిశు ర్వటదళే శయితోఽతితన్వా
తన్వా జగన్తి బిభృషే సవికాస మేవ ।
ఐశీ మీమాం తు తవ శక్తి మతర్కితవ్యామ్
అవ్యాజతః ప్రథయసే కిమిహోఽవతీర్ణః ॥ 14

మఱ్ఱి ఆకుపైన పవళించిన, చాలా చిన్న వయస్సులోని బాలుని రూపంలో ఉన్న నీవు అతిసూక్ష్మమైన రూపంతో లోకాలను అన్నిటినీ వాటికి ఏ ఇరుకూ (సంకోచం)

లేకుండా ధరించావు. నీ సర్వేశ్వరత్వ ప్రయుక్తమైన, అసాధారణం అయిన, ఇంతటిది-ఇటువంటిది అని ఊహించడానికి సాధ్యం కానిదైన ఈ శక్తిని ఈలోకంలో అవతరిస్తూ నిర్హేతుకంగా ఎందుకోసం ప్రకాశింపజేస్తున్నావయ్యా?

బ్రహ్మేశమధ్యగణనా గణనార్కపఙ్క్తౌ
ఇన్ద్రానుజత్వ మదితే స్తనయత్వయోగాత్ ।
ఇక్ష్వాకువంశయదువంశజని శ్చ హన్త !
శ్లాఘ్యాన్యమూ న్యనుపమస్య పరస్య ధామ్నః ॥ 15

సాటి లేని పరంజ్యోతి అయిన సర్వేశ్వరుడు బ్రహ్మరుద్రుల నడుమ విష్ణునామంతో లెక్కింపబడడం, ద్వాదశాదిత్యులలో ఒకడుగా లెక్కింపబడడం, అదితికి కుమారుడై పుట్టడంవల్ల ఉపేంద్రుడు కావడం, ఇక్ష్వాకువంశంలో, యాదవవంశంలో అవతరించడం- అనే ఈ అవతారాలు అన్నీ శ్లాఘ్యాలు. ఆహా ! ("అనుపమస్య"- "న తత్సమాశ్చాభ్యధిక శ్చ దృశ్యతే", "ఒత్తార్ మిక్కారై ఇలైయాయ" ఇత్యాదులు భావ్యాలు. "మధ్యే విరించి గిరిశం ప్రథమావతారః", "ఆదిత్యానాం మహం విష్ణుః జ్యోతిషాం రవి రంశుమాన్" అనే ప్రమాణాలు కూడా పూర్వార్ధానుగుణంగా అనుసంధేయాలు.)

త్వన్నిర్మితా జఠరగా చ తవ త్రిలోకీ
కిం భిక్షణా దియ మృతే భవతా దురాపా ।
మధ్యే కదా తు న విచక్రమిషే జగచ్చేత్
త్వద్విక్రమైః కథ మివ శ్రుతి రశ్చితా స్యాత్ ॥ 16

నీచే సృష్టింపబడినవి, నీ గర్భంలో పెట్టుకొని రక్షింపబడినవి అయిన ఈ ముల్లోకాలను నీవు మహాబలిదగ్గరకు పోయి యాచించకపోతే పొందలేవా ! ఈ లోకంలో ఒకానొక సమయంలో త్రివిక్రముడవై అవతరించి, భిక్షను యాచించే వ్యాజంతో విక్రమించి కొలువకపోయి ఉంటే వేదం నీ త్రివిక్రమణాన్ని కీర్తించి ఉండకపోయేది. అందువల్ల దానికి పవిత్రత సిద్ధించి ఉండేదికాదు కదా ! (వేదాలకు పవిత్రతను కల్గించడం కోసమే ఆనాడు నీవు ఆ విధంగా బలిదగ్గరకు పోయి మూడడుగుల భూదానాన్ని యాచించావు అని భావం. "ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదమ్", "త్రీణి పదా విచక్రమే", "విచక్రమణ స్త్రేధోరు గాయః", "ఉరుక్రమస్య స హి బంధురిత్థా విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" ఇత్యాదిగా త్రివిక్రమావతారం వేదంలో బహుధా శ్లాఘింపబడింది.)

పృచ్ఛామి కిఞ్చన యదా కిల రాఘవత్వే
మాయామృగస్య వశగో మనుజత్వమౌగ్ధ్యాత్ ।
సీతావియోగవివశో న చ తద్గతిజ్ఞః
ప్రాదా స్తదా పరగతిం హి కథం ఖగాయ ॥ 17

స్వామీ! నిన్ను కొంచెం అడుగుతాను. బదులు చెప్పు. శ్రీరాముడవై నీవు అవతరించినపుడు "ఆత్మానం మానుషం మన్యే" అని తలచినందువల్ల కలిగిన, మానవసహజమైన మోహంవల్లనే కదా మారీచుడనే మాయామృగానికి వశుడవై, సీతావిశ్లేషంవల్ల దుఃఖించావు. ఆమె పోయిన దారినికూడా తెలియలేకుండా పోయావు. మఱి, అటువంటి సమయంలోనే జటాయువునకు మోక్షాన్ని "మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్" అని అంటూ ఏవిధంగా అనుగ్రహించావు స్వామీ?

అక్షుణ్ణయోగపథ మగ్ర్యహతం జటాయుం
తిర్యఞ్చ మేవ బత ! మోక్షపథే నియోక్తుమ్।
శక్నోషి వేత్సి చ యదా స తదా కథం త్వం
దేవీ మవాప్తు మనలం వ్యథితో విచిన్వన్ ॥ 18

స్వామీ! నీవు యోగమార్గాన్ని అనుష్ఠించనివాడు, బ్రాహ్మణుడైన రావణునిచేత చంపబడ్డవాడు, తిర్యక్‌జాతిలో జన్మించినవాడు అయిన జటాయువును సైతం మోక్షమార్గంలో పోయేటట్లు ఆజ్ఞాపించడాన్ని తెలిసినవాడవు, సమర్థుడవు అయినపుడు సీతాదేవిని వెదుకుతూ ఆమెను పొందలేక ఎందుకోసం దుఃఖించావో చెప్పు. ("య శ్చ హంతి ద్విజన్మానం య శ్చ విప్రేణ హన్యతే, తావుభా రథమౌ జ్ఞేయౌ పరలోక పరాఙ్ముఖౌ", "నాగ్ర్యహతస్య లోకోఽస్తి" అనే ప్రమాణాలు బ్రాహ్మణునిచే చంపబడిన వానికి మోక్షప్రాప్తి లేదని తెలుపుతున్నది.)

సాలాన్ హి సప్త సగిరీన్ సరసాతలాన్ యాన్
ఏకేషు మన్దజవతో నిరపత్రయ స్త్వమ్ ।
తేష్వేకవివ్యథనఖిన్నకపిప్రణున్నం
శాఖామృగం మృగయసే స్మ కథం సహాయమ్ ॥ 19

ఏడు సాలవృక్షాలను (మద్దిచెట్లను) పర్వతాలతోపాటుగా, రసాతల (పాతాళ) లోకాలతో పాటుగా ఒకే ఒక్కబాణంయొక్క అల్పవేగంతో నీవు భేదించావు. ఆ

సాలవృక్షాలలో ఒక్కటిని అయినా భేదించడంలో ఎంతో శ్రమపడినా చివరకు అసమర్థుడైన వాలిచే బహిష్కరింపడ్డ సుగ్రీవుని సహాయంకోసం నీవు ఎందుకోసం వెదికావు? ("బిభేద చ పునః సాలాన్ సప్తైకేన మహేషుణా, గిరీన్ రసాతలం చైవ", "ఇమే చ విపులా స్సాలా స్సప్తశాఖావలంబినః, యత్రైకం ఘటతే వాలీ నిష్ప్రత్రయితు మోజసా" అనే శ్రీరామాయణ శ్లోకాలు భావ్యాలు.)

దాస స్సఖా సమభవ త్తవ యః కపీన్ద్రః
తద్విద్విషం కపి మమర్షవశా జ్జిఘాంసుః ।
త్వత్స్నేహవిక్లబధియం త మిమం కపీన్ద్రం
విస్రమ్భయన్ సపది సాలగిరీ నవిధ్యః ॥ 20

ఏ సుగ్రీవుడు నీకు దాసుడు, స్నేహితుడు అయ్యాడో, అతనికి విరోధి అయిన వాలిని కోపవశంచేత చంపగోరి, నీ విషయంలో గల ప్రేమచేత కలత చెందిన బుద్ధిని కల ఆ సుగ్రీవుని నమ్మకంకోసం అపుడే ఏడు సాలవృక్షాలను, కులపర్వతాలను నీవు భేదించావు. (నీ సౌశీల్యం గుణం అటువంటిది, అంత గొప్పది.)

యద్వా మృగం మృగయువ న్మృగయాపథేన
ఛ్చన్నో జఘన్థ న తు శత్రువదాభిముఖ్యాత్ ।
తద్యుక్త మేవ తవ రాఘవవంశజస్య
తిర్యక్షు నైవ హి విపక్షతయోపచారః ॥ 21

అడవిమృగాన్ని వేటాడగోరే బోయవానిరీతిలో నీవు కూడా దాగి ఉండి చాటుగా వాలిని చంపావు. శత్రువుతో యుద్ధం చేసే రీతిలో ఎదురునిల్చి చంపలేదు- అన్నది యుక్తమే. ఇక్ష్వాకుకులంలో అవతరించిన నీకు తగినదే- ఎందుకు? అని అంటే, తిర్యక్కుల విషయంలో ఔపచారికంగా అయినా శత్రుత్వం కల్గిఉండడం రఘువంశంలో పుట్టిన నీ ఉత్తమ క్షత్రియత్వానికి తగదుకదా ! (అందువల్ల నీవు వాలిని తిర్యక్కుగా (వానరంగా) భావించి చాటుగా ఉండి జంతువును వేటాడే రీతిలో వధించావు.)

మానుష్యకం చరిత మాచరితుం ప్రవృత్తో
దేవాతిగం చరిత మంగ ! కిమజ్యకార్షీః ।
యత్సాగరే బత ! బబన్దిథ నాథ ! సేతుం
శైలైః ప్లవంగమసమిజ్జితసంప్రణున్నైః ॥ 22

స్వామీ ! నీ మనుష్యత్వానికి తగినట్లుగా ప్రవర్తించాలని ప్రయత్నించిన నీవు దేవతలకుకూడా సాధ్యం కాని కార్యాన్ని ఎందుకోసం చేశావయ్యా? (అటువంటి పనిని

ఏం చేశాను? అని అంటావా?) స్వామీ ! వానరవీరులచేత తీసికొనివచ్చి విసరిన పర్వతాలతో సముద్రంలో వారధిని కట్టావు- అన్నది ఎంత ఆశ్చర్యకరం ! (నీటిలో వేయగానే మునిగిపోయే రాళ్ళతో నీటిపై వారధిని నిర్మించడం అతిమానుషం, దేవాతిగం)

యో విక్రమేణ మనుజత్వవిభూషణేన
దేవం వరం వరుణరాజ మజ ! వ్యజేష్ఠాః ।
కృత్వోపదాం దశరథం విధిరుద్రముఖ్యైః
దేవైః స్తుతశ్చ స కిలేన్ద్రజితా జితోఽసి ॥ 23

పుట్టుక లేనివాడా! నీవు మనుష్యత్వానికి తగిన పరాక్రమంతో దేవతలలో గొప్పవాడైన వరుణుని జయించావు. యుద్ధానంతరం బ్రహ్మ, రుద్రుడు. మొదలైన దేవతలు దశరథుని పురస్కరించుకొని నిన్ను స్తుతించారు. అటువంటి నీవు ఇంద్రజిత్తు చేత జయింపబడ్డావా! ఇదేమి వింత స్వామీ! (యుద్ధానంతరం చేయబడ్డ **"సీతా లక్ష్మీ ర్భవాన్ విష్ణుః"** ఇత్యాది దేవతల స్తుతి స్మరణీయం)

అబ్ధిం న తేరిథ న జిగ్యిథ రాక్షసేన్ద్రం
నైవాఽస్య జజ్ఞిథ యదా చ బలాబలం త్వమ్ ।
నిస్సంశయ స్సపది తస్య పదేఽభ్యషిఞ్చః
తస్యానుజం కథ మిదం హి విభీషణం చ ॥ 24

శ్రీరామా! నీవు సముద్రాన్ని దాటకుండానే, రావణుని జయించకుండానే, రావణుని బలాన్ని, బలహీనతలను లెక్కించకుండానే సాహసంగా అతని తమ్ముడైన విభీషణుని ఆ రావణుని పదవిలో నిస్సంశయంగా అభిషేకించావు- అన్నది ప్రసిద్ధం. దీనిని ఏవిధంగా (ఏ భావనతో) చేశావు ? (**"అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ"** అనే రామాయణశ్లోకం స్మరణీయం. **"జిగేథ న రాక్షసేంద్రమ్"** అనే పాఠాంతరం మొదటిపాదంలో ఉన్నది.)

త్వం దక్షిణస్య విపసన్నుదధే స్తటేఽపి
దూరాన్తరోత్తరపయోధిమహాన్తరీపే ।
దైత్యాన్నిజైకశరపారణయన్ కిమేతాం
లఙ్కాం స్థితోఽత్ర కురుషే కిల న స్మ భస్మ ॥ 25

నీవు దక్షిణసముద్రతీరంలో ఉన్నా అక్కడికి చాలా దూరంలో ఉన్న ఉత్తర సముద్రమధ్యలోని పెద్ద దీవిలో ఉండే అసురులను నీ బాణానికి ఎరగా చేసి, వధించావే!

నీవు దక్షిణ తీరంలోనే ఉండి అక్కడికి చాలా సమీపంలో ఉన్న లంకానగరాన్ని ఎందుకోసం భస్మం చేయలేదు? చెప్పు.

**ఏతత్కథం కథయ యన్మథిత స్త్వయాఽసౌ**
**హిత్వా స్వభావనియమం ప్రథితం త్రిలోక్యామ్।**
**అశ్వాప్సరోవిషసుధావిధుపారిజాత-**
**లక్ష్మ్యాత్మనా పరిణతో జలధి ర్బభూవ ॥ 26**

నీచే మథింపబడ్డ ఈ సముద్రం ముల్లోకాలలో ప్రసిద్ధం అయిన తన స్వభావా సిద్ధమైన లోకనియమాన్ని విడచి, (ఈ వస్తువు ఈ విధంగా పరిణామాన్ని పొందుతుంది- అనే నియమాన్ని విడచి) అప్సరసలు, ఉచ్చైఃశ్రవం, హాలాహలం, అమృతం, చంద్రుడు, కల్పతరువు, లక్ష్మి- అనే రూపాలుగా పరిణమించింది- అనే విషయం ఏ విధంగా సంభవం! చెప్పు. (శ్రీరామావతారానికి సంబంధించిన పలు అతిమానుష లీలలను వర్ణించే ఈ సందర్భంలో క్షీరాబ్ధిమథనవృత్తాంత ప్రస్తావన అత్యంతం విలక్షణం.)

**యత్తాదృశాగస మరిం రఘువీర ! వీక్ష్య**
**విశ్రమ్యతా మితి ముమోచిథ ముగ్ధ మాజౌ ।**
**కోఽయం గుణః కతరకోటిగతః కియాన్వా**
**కస్య స్తుతేః పద మహో ! బత ! కస్య భూమిః ॥ 27**

శ్రీరామా! అటువంటి, నోటితో చెప్పలేని అపరాధాన్ని చేసిన రావణుని యుద్ధంలో కింకర్తవ్యతావిమూఢుడైన స్థితిలో చూచి "గచ్ఛ అనుజానామి" అని విడచిపెట్టి, పోరుకు రేపు రమ్మని అన్నావు కదా! ఇది ఏమి మహాగుణం! ఏ కోటిలోనికి చేరింది? ఎంతటిది? ఎవరి స్తుతికి సాధ్యమైనది? ఎవనికి దర్శించడానికి వీలున్నది? ఆహా! ఆశ్చర్యం - అని చెప్పవలసినదే! అంతే! (ఈ గుణంయొక్క స్వరూపస్వభావ పరిమాణనిర్ణయం ఎవరికైనా వాచామగోచరమే.)

**యల్లక్ష్మణ స్త్వదనుజో రిపుశక్తిముగ్ధః**
**శత్రో ర్గురు ర్హనుమత స్తు లఘు ర్బభూవ ।**
**ఏతైన వై సువిదితోఽభవ దిన్ద్రశత్రోః**
**మాయాస్త్రబన్ధననిబన్ధనజో విమోహః ॥ 28**

శత్రువైన రావణుడు ప్రయోగించిన శక్తి అనే ఆయుధంతో మోహాన్ని పొందిన నీ అనుజుడు లక్ష్మణుడు శత్రువు అయిన రావణునకు కదపడానికికూడా వీలుకానంత బరువుగాను, హనుమానునకు చాలా తేలికగాను అయినాడు. ఈ విషయంవల్ల

నీవు ఇంద్రజిత్తు ప్రయోగించిన మాయాస్త్రానికి కట్టుబడి మైకం పొందడం మనుష్యభావ ప్రయుక్తమని వ్యక్తమైనది కదా! ("హిమవాన్మందరో మేరుః త్రైలోక్యం వా సహామరైః, శక్యం భుజాభ్యాం ముద్ధర్తుం న సంఖ్యే భరతానుజః, శత్రూణా మప్రకంప్యోఽపి లఘుత్వ మగమత్కపేః" అనే శ్రీరామాయణ యుద్ధకాండసూక్తి భావ్యం.)

**హా ! హన్త ! హన్త ! భవతశ్చరణారవిన్ద -**
**ద్వంద్వం కదా ను భవితా విషయో మమాఽక్ష్ణోః ।**
**యోఽహం నిరర్గళవినిర్గళదన్ధకారైః**
**వృక్షై స్తృణై శ్చ సులభం సమయం వ్యతీతః ॥ 29**

అంధకారం పూర్తిగా తీరిన (పాపం పూర్తిగా తొలగిన) వృక్షాలు, తృణాలు సైతం పొందదగిన కాలవిశేషాన్ని (శ్రీరామావతారకాలాన్ని) పాపిని అయిన నేను పూర్తిగా కోల్పోయాను. అపుడు వారిలో జన్మించలేకపోయానే! అటువంటి నా కళ్ళకు నీ చరణారవిందయుగళ దర్శనం ఇక ఎపుడు లభిస్తుంది ! అయ్యో !

**వంశం రఘో రనుజిఘృక్షు రిహావతీర్ణో**
**దివ్యై ర్వవర్షిథ తథాఽత్ర భవద్గుణౌఘైః ।**
**త్వత్సన్నిధిప్రభవశైత్యజుషో యథా హి**
**వృక్షాశ్చ తాన్తి మలభన్త భవద్వియోగే ॥ 30**

శ్రీరామా ! రఘువంశాన్ని అనుగ్రహించగోరి, ఈలోకంలో అవతరించిన నీవు నీ దివ్యాలైన కల్యాణగుణప్రవాహాలతో ఎంతగా వర్షించావు అని అంటే - నీ సన్నిధానంవల్ల కల్గిన చల్లదనాన్ని పొందిన వృక్షాలు కూడా నిన్ను విశ్లేషించిన కాలంలో అంతులేని ఆర్తిని పొందాయి. ("అపి వృక్షాః పరిమ్లానాః సపుష్పాంకురకోరకాః" ఇత్యాదులు భావ్యాలు.)

**యే ధర్మ మాచరితుం మభ్యసితుం చ యోగం**
**బోద్ధుం చ కిఞ్చన న జాత్వధికారభాజః।**
**తేఽపి త్వదాచరితభూతలబన్ధగన్ధాత్**
**బన్ధాతిగాః పరగతిం గమితా స్తృణాద్యాః ॥ 31**

ఏ తృణాదులు ధర్మాన్ని ఆచరించడానికి, యోగాభ్యాసాన్ని చేయడానికి, దేనికైనా తెలిసికోవడానికి ఏనాడూ ఏ అధికారం లేనివై ఉన్నాయో, ఆ తృణాదులు కూడా నీవు సంచరించిన ప్రదేశాల సంబంధసంస్కారవశంచేత కర్మబంధాన్ని విడిచి పరగతిని

పొందాయి. ("దేశోఽయం సర్వకామధుక్", "తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః" అనే రీతిలో భగవద్భాగవతాభిమత దేశవాసంకూడా ఉత్తారకం. "త్వామామనంతి" అనే వరదరాజస్తవ శ్లోకం ప్రకృతంలో భావ్యం).

**తాదృగ్గుణో నను బభూవిథ రాఘవత్వే**
**యస్తావకం చరిత మన్వహ మన్వభుఙ్క్త ।**
**సోఽత్రైవ హన్త ! హనుమాన్ పరమాం విముక్తిం**
**బుద్ధ్వాఽవధూయ చరితం తవ సేవతేఽసౌ ॥ 32**

శ్రీరామావతారంలో నీ చరిత్రను ప్రతిదినం అనుభవించిన ఆ హనుమంతుడు ఈ భూమిలోనే ఉంటూ శ్లాఘ్యమైన మోక్షాన్నికూడా తిరస్కరించి, నీ చరిత్రనే స్మరిస్తూ ఆనందించే రీతిలో నీవు నీ కల్యాణగుణాలను (రామావతారంలో) ప్రకాశింపజేశావు. ("బహవో దుర్లభా శ్చైవ యే త్వయా కీర్తితా గుణాః", "బహవో నృప! కల్యాణగుణాః పుత్రస్య సంతి తే" ఇత్యాదులు శ్రీరామావతారంలోని గుణవైభవాన్ని ఆవిష్కరిస్తున్నాయి. "స్నేహో మే పరమో రాజన్! త్వయి నిత్యం ప్రతిష్ఠితః, భక్తి శ్చ నియతా వీర! భావో నాన్యత్ర గచ్ఛతి" అనే హనుమానుని సూక్తి స్మరణీయం. ఇందులో "స్నేహః పరమః" అని పరభక్తి, "నిత్యం ప్రతిష్ఠితః" అని పరజ్ఞానం, "నియతా భక్తిః" అని పరమభక్తి సూచింపబడ్డాయి.)

**యత్త్వం కృతాగస మపి ప్రణతిప్రసక్తం**
**తం వాయసం పరమయా దయయా క్షమిష్ఠాః ।**
**తేనైవ మాదృశజనస్య మహాగసోఽపి**
**యుక్తం సమాశ్వసన మిత్యుపధారయామి ॥ 33**

ఆర్ద్రాపరాధి అయినా, ప్రణామం చేయడానికి ఉద్యుక్తుడైన ఆ కాకాసురుని నీవు పరమకృపతో క్షమించావు. అందువల్ల దీనినిబట్టి మహాపరాధాలను చేసిన మావంటివారికికూడా ఆశ్వాసం కల్గి నిర్భయంగా ఉండవచ్చుననే నమ్మకం ఏర్పడింది. ("గుణానా మాకరో మహాన్" అని శ్రీరామావతారం సకలకల్యాణగుణాకరం అయినా, అందులో "వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్"- అన్నట్లు కృపాగుణం మహాపరాధులకు శరణం. కనుక దానికి ప్రాధాన్యం.)

**సా పూతనా శకట మర్జునయోశ్చ యుగ్మం**
**బాల్యోచితేఽన్యపరచేష్టితవిస్ఫులింగే ।**

**యస్యాలభన్త శలభత్వ మహో ! నిగూఢః**
**స త్వం వ్రజే వవృధిషే కిల కంసభీత్యా ॥ 34**

శ్రీకృష్ణావతారంలో బాల్యానికి తగినవి, అన్యార్థాలు (యాదృచ్ఛికాలు) అయిన నీ లీలలు అనే నిప్పుకణాలలో ఆ పూతన, శకటాసురుడు, మద్దిచెట్ల జంట మిడుతలవలె మాడిపోయారు. అటువంటి విక్రమాన్ని కల నీవు కంసభయంచేత దాగి ఉండి రేపల్లెలో పెరిగావుకదా ! ఇదేమి ఆశ్చర్యం !

**పశ్యత్సు సూరిషు సదా పరమం పదం తే**
**దేవ్యా శ్రియా సహ వసన్ పరయా విభూత్యా ।**
**యోగేన యోగనిరతైః పరిమృగ్యమాణః**
**కిం త్వం వ్రజేషు నవనీత మహో ! వ్యముష్ణాః ॥ 35**

శ్రీకృష్ణా ! నీ పరమపదాన్ని నిత్యసూరులు సదా దర్శనం చేస్తూ ఉండగా గొప్ప సంపదతో కూడినవాడవు శ్రీదేవితోపాటు ఆనందించేవాడవు, యోగాభ్యాస నిష్ఠులచే ధ్యానమార్గంలో అన్వేషింపబడేవాడవు అయిన నీవు రేపల్లెలోని గొల్లల ఇండ్లలో వెన్నను దొంగిలించడం ఎందుకయ్యా! ఆశ్చర్యం !

**యం దుర్గ్రహం సుమనసో మనసాఽపి నిత్యం**
**బన్ధచ్ఛిదం పరమ మీశ ముదాహరన్తి ।**
**దామ్నా నిబద్ధ ఇతి శుశ్రుమ తం భవన్తం**
**నాఽలం బభూవిథ బత! శ్లథనాయ తస్య ॥ 36**

"ఉభయపరికర్మితస్వాంతస్య" అన్నట్లు పరిశుద్ధాంతఃకరణాన్ని కల్గినవాని మనస్సు చేత కూడా ఏనాడూ గ్రహించ సాధ్యం కానివాడవని, **"యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః"** అన్న రహస్యాన్ని తెలిపిన ఉపాసకుల సంసారకర్మ బంధాలను తెంచగల సామర్థ్యాన్ని కలవాడవని,**"త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్"** అన్నట్లు పరమేశ్వరుడవని నిన్ను వైదికులు అంటున్నారు. అటువంటి నిన్ను యశోదాదేవి రోటికి తాటితో కట్టిందని విన్నాము. సంసారబంధాన్ని తెంచగల నీవు యశోదాదేవి కట్టిన బంధంనుండి బయటపడలేని అసమర్థుడవు అయ్యావా! ఆశ్చర్యం!

**ఐశం హి శైశవ మపి వ్యతివేలఖేలం**
**యత్పూతనాశకట మర్జునయోశ్చ యుగ్మమ్ ।**
**బాల్యోచితాన్యపరసాచివిచేష్టితేన**
**హన్తాలభన్త శలభాయిత మోజస స్తే ॥ 37**

పూతన, శకటాసురుడు, మద్దిచెట్ల జంట నీ బాల్యానికి తగిన, అన్యార్థాలైన యాదృచ్ఛికచేష్టలతో నీ ప్రతాపాగ్నిలో మిడుతలుగా అయ్యారు- అని అంటే నీ సర్వేశ్వరత్వప్రయుక్తమైన నీ బాల్యావస్థ పరిమితిలేని క్రీడలను కల్గినది కదా ! (**"సా పూతనా"** ఇత్యాది మూడు శ్లోకాలలో ప్రస్తావింపబడ్డ వృత్తాంతాలను క్రమంగా ఇక అయిదు శ్లోకాలలో వివరిస్తున్నారు.)

**సత్యేవ గవ్యనివహే నిజధామ్ని భూమ్నా**
**పర్యన్తసద్మసు కిమర్థ మచూచుర స్త్వమ్ ।**
**ముష్ణంశ్చ కిం వ్యజఘటో ఘటశేష మగ్రే**
**గోపీజనస్య పరిహాసపదం కిమాసీః ॥** 38

నీ ఇంటిలో నవనీతాదిద్రవ్యసమూహం అధికంగా ఉన్నప్పటికీ దగ్గరగా చుట్టూ ఉండే ఇళ్ళలో నీవు ఎందుకోసం వాటిని దొంగిలించావు ? ఒకవేళ దొంగిలించినా, భుక్తశేషమైన రిక్త పాత్రను వారి ముందే ఎందుకు పగులగొట్టావు ? గోపీజనం అంతా నిన్ను చూచి నవ్వే స్థితిని ఎందుకు పొందావు ?

**యన్నామ నాథ ! నవనీత మచూచుర స్త్వం**
**తచ్ఛాదనాయ యది తే మతి రావిరాసీత్ ।**
**కిం ముగ్ధ ! దిగ్ధ మమునా కరపల్లవం తే**
**గాత్రే ప్రమృజ్య నిరగాః కిల నిర్విశంకః ॥** 39

స్వామీ ! నీవు వెన్నను దొంగిలించిన తరువాత నీ చౌర్యాన్ని దాచుకోవాలనే అభిప్రాయం నీకు కల్గితే, దాచుకొనే తీరు తెలియనంతటి ముగ్ధుడవా ! దొంగిలించిన ఈ వెన్నను చిగురుటాకువంటి శ్రీహస్తంతో నీ తిరుమేనికి పూసికొని (దొంగతనం బయటపడుతుందనే భయం లేకుండా) నిర్భయంగా బయటికి ఎందుకు వెళ్ళిపోయావు ?

**త్వా మన్యగోపగృహగవ్యముషం యశోదా**
**గుర్వీ త్వదీయ మవమాన మమృష్యమాణా।**
**ప్రేమ్ణాఽథ దామపరిణామజుషా బబన్ధ**
**తాదృఙ్నతే చరిత మార్యజనా స్పృహన్తే ॥** 40

గొప్ప ఆత్మాభిమానం కల యశోదాదేవి నీకు జరిగిన అవమానాన్ని సహించలేక, ఇరుగుపొరుగు గొల్లఇండ్లలో ఉండే వెన్న, పాలును దొంగిలించిన నిన్ను దారంగా పరిణమించిన తన ప్రేమతో గట్టిగా కట్టింది. అటువంటి నీ లీలను విని ఆర్యజనులు

(ఆళ్వార్లు) సహించలేకున్నారు. ("దామ్నా చైవోదరే బద్ధ్వా ప్రత్యబధ్నా దులూఖలే" ఇత్యాది పౌరాణిక సూక్తి భావ్యం. "ఎత్తిఅమ్! ఎత్తిఅమ్!" ఇత్యాదిగా శఠకోపాది సూరులు ఈ లీలను అనుసంధించి మూర్ఛిల్లారు కదా!)

మాత్రా యది త్వమసి దామని సన్నిబద్ధః
తచ్ఛ్రావిణా ముదితచాక్షుషనిర్ఝరాణామ్ ।
బధ్నాసి హన్త ! హృదయం భగవన్! కుత స్తత్?
సర్వో హి వశ్యవిషయే వివృణోతి వీర్యమ్ ॥ 41

స్వామీ ! నీవు తల్లి అయిన యశోదచేత తాటితో రోటికి కట్టబడినవాడవైతే, ఆ సంగతిని విని నీ సౌలభ్యగుణపరాకాష్ఠకు పరవశించి, ఆనందబాష్పాలను కార్చే ఆర్యుల హృదయాలను కట్టివేస్తున్నావే! ఆహా! అది ఎందుకు? (నిన్ను కట్టినది యశోద అయినప్పుడు, నీవు ఆర్యజనుల హృదయాలను ఎందుకు బంధిస్తున్నావు?) అయినా అది యుక్తమే. లోకంలో అందఱు తమ తమ పరాక్రమాన్ని తమకు విధేయులైనవారి విషయంలోకదా చూపిస్తారు. (యశోద తనకు విధేయుడవైన నిన్ను కట్టింది, నీవు నీకు విధేయులైన నీ భక్తులను కట్టావు- అని చమత్కారం.)

కాన్తాలకాన్త మమలం కమలాయతాక్షమ్
ఉద్భ్రూవిలాస ముదితస్మిత మున్నసం చ ।
వక్త్రం వహన్ పరమ ! గోపగృహేషు కిం త్వం
గోపీమనాంసి నవనీత ముతాఽభ్యమోషీః ॥ 42

పరమపురుషా! అందమైన ముంగురులను కల్గినది, నిర్మలమైనది, తామరపూవువంటి విశాల నేత్రాలను కల్గినది, ఎత్తైన కనుబొమలను కల్గినది, చిఱునవ్వును కల్గినది, ఉన్నతమైన నాసికను కల్గినది అయిన ముఖాన్ని కల నీవు గొల్ల ఇళ్ళలో దూరి ఆ రూపంలో గోపికల మనస్సులను దోచావా? లేక, వెన్నను దొంగిలించావా! (గోపికల హృదయాలనే కదా ! అని హార్దభావం.)

సర్వం గుణాయ గుణినా మితి సత్య మేతత్
యత్ఖల్వహేతరజనే మలినత్వహేతుః ।
యద్గోపవేషవినివేశన ముత్తమం తే
గోపాలనం చ గణయన్తి గుణం గుణేషు ॥ 43

ఈ లోకంలో ఏ వ్యాపారం గుణం లేనివాని విషయంలో దోషానికి హేతువు అవుతుందో, అది అంతా గుణవంతుల విషయంలో గుణానికే కారణం అవుతుంది-

అనే లోకోక్తి సత్యమే. ఎందువల్లనంటే, నీవు గోపవేషాన్ని ధరించడం, గోవులను కాయడం గుణాలతో ఉత్తమ గుణం అని పెద్దలు లెక్కించారు.

గోపాలపోతకతయా నిభృతం ధరిత్రీమ్
అవస్తుకామ ఇవ సన్నపి బాల్యలౌల్యాత్ ।
ఐన్ద్రం నిహత్య మఖ మద్రి మఖో దధానః
కిం తస్థిషే సురగణాయ సవాసవాయ ॥ 44

చిన్న గొల్ల పిల్లవాడవై, రహస్యంగా భూలోకంలో నివసించాలని నీవు అనుకొన్నా, బాల్యంలోని సహజచాపల్యంచేత దేవేంద్రుని ఉత్సవాన్ని నిలిపి, ఆ పిమ్మట గోవర్ధనగిరిని ఎత్తి, ఇంద్రునితో పాటు దేవతలను అందఱినీ ఎందుకోసం ఎదిర్చావు ?

వేణుక్వణప్రణయిని త్వయి లోకనాథ !
బృన్దావనం చరణసఞ్చరణైః పునానే ।
భావాస్తదా వనభువః కిల కీదృశ స్తే
త్వద్గీతసిక్తసికతాసు వసున్ధరాసు ॥ 45

లోకనాథా ! నీవు వేణుగానప్రియుడవై, నీ పాదసంచారాలతో బృందావనాన్ని పవిత్రం చేసినపుడు నీ వేణుగానామృతంతో తడుపబడ్డ ఇసుకను కల బృందావన దేశాలలో (అడవిలో)ని పదార్థాలు అన్నీ ఏ దశను పొందాయో కదా! (శ్రీరంగరాజస్తవోత్తర శతకంలోని "శైలోఽగ్నిశ్చ" ఇత్యాది శ్లోకభావం భావ్యం.)

ధన్యై శ్రుతం తదిహతావకరాసకాలే
గీతేన యేన హి శిలా స్సలిలాంబభూవుః ।
పఞ్చాపి కిఞ్చ పరివృత్తగుణాని భూతా-
న్యుర్వీకృశానుమరుదమ్బరశమ్బరాణి ॥ 46

ఈ లోకంలో నీవు రాసక్రీడను ఆడినపుడు నీవు ఆలపించిన వేణుగానంచేత రాళ్ళుకూడా కఱగిపోయాయి. అంతే కాదు, భూమి, అగ్ని, వాయువు, ఆకాశం, జలం- అనే పంచభూతాలు తమ తమ సహజగుణాలను విడిచినవి అయ్యాయి. ఆ గానాన్ని భాగ్యవంతులు మాత్రమే వినగలిగారు.

తేభ్యః కృతీ న కిల కశ్చిదిహాఽస్తి యే వై
రాసోత్సవోత్సుకధియ స్తవ కాననాన్తే ।

వేణుస్వనస్రుతరసౌఘపరిప్లుతాన్తే
స్వే సృక్విణీ రసనయా లిలిహు ర్భుజఙ్గాః ॥ 47

బృందావనంలో రాసక్రీడలో ఆసక్తిని కల నీ వేణునాదంనుండి స్రవించే రసప్రవాహంలో తడుపబడ్డ చివరి భాగాలను కల తమ పెదవులను సర్పాలు తమ నాలుకలతో నాకినవి. ఆ సర్పాలకంటే ధన్యాత్ములు ఈ లోకంలో ఇంక ఎవరూ లేరుకదా!

అమ్భోదనీల మరవిన్దదళాయతాక్షం
పిఞ్ఛావతంస మురరీకృతవేణుపాణిమ్ ।
త్వాం గోపవేషపరికర్మితకాయకాన్తిం
ధన్యా స్తదా దదృశు రున్మథితాన్యభావాః ॥ 48

రాసక్రీడ సమయంలో మేఘంవలె నల్లనిది, తామరరేకులవలె వెడల్పయిన, పొడుగాటి తిరునేత్రాలను కల్గినది, నెమలిపింఛాన్ని ధరించినది, చేతిలో పిల్లనగ్రోవిని పట్టినది, గోపాలవేషంతో అందంగా ఉన్నది అయిన దివ్యరూపాన్ని ధరించిన నిన్ను భాగ్యవంతులు అనన్యచిత్తంతో నిన్ను తప్ప వేటే ఏ భావన మనస్సులో లేనివారై దర్శించారు. (నిన్ను ఆవిధంగా అనన్యచిత్తంతో భజించగల్గేవారే భాగ్యవంతులు అని భావం. "**తళ్ళెకళుమ్ తొజ్గలుమ్**" అనే పెరియాళ్వార్ల పాశురభావం ప్రకృతంలో స్మరణీయం.)

గోవర్ధనో గిరివరో యమునానదీ సా
బృన్దావనం చ మధురా చ పురీ పురాణీ ।
అద్యాఽపి హన్త ! సులభాః కృతినాం జనానామ్
ఏతే భవచ్చరణచారజుషః ప్రదేశాః ॥ 49

పర్వతశ్రేష్ఠం అయిన ఆ గోవర్ధనపర్వతం, ఆ యమునానది, బృందావనం, పురాతనం అయిన మధురాపురి, నీవు సంచరించిన ఈ ప్రదేశాలు- అన్నీ ధన్యాత్ములకు నేటికీ సులభాలుగా, దర్శించడానికి వీలుగా ఉన్నాయి. (భగవత్సంబంధాన్ని కల దేశమే పరమప్రాప్యమని భావం.)

బృన్దావనే స్థిరచరాత్మకకీటదూర్వా-
పర్యన్తజన్తునిచయే బత ! యే తదానీమ్ ।
నైవాఽలభామహి జనిం హతకా స్త ఏతే
పాపాః పదం తవ కదా పునరాశ్రయామః ॥ 50

నీవు కృష్ణుడవై అవతరించినపుడు బృందావనంలోని స్థిరచరాలలో గడ్డిపోచగా గాని, పురుగుగా గాని కనీసం జన్మించలేక పోయిన పాపిష్ఠివారం మేము. అటువంటి మేము ఇక నీ శ్రీపాదాలను ఎపుడు ఆశ్రయించగలం ! అయ్యో ! (**"తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః"** అని చెప్పబడ్డ భగవత్సంబంధం కల దేశంలో నివసించలేని దౌర్భాగ్యం ఇక్కడ సూచితం.)

**హా ! జన్మ తాసు సికతాసు మయా న లబ్ధం**
**రాసే త్వయా విరహితాః కిల గోపకన్యాః ।**
**యా స్తావకీనపదపఙ్క్తిజుషోఽ జుషన్త**
**నిక్షిప్య తత్ర నిజ మఙ్గ మనఙ్గతప్తమ్ ॥ 51**

రాసక్రీడలో నిన్ను విశ్లేషించిన గోపకన్యకలు ఆ విరహసమయంలో కామాగ్నిచేత దహింపబడ్డ తమ తమ శరీరాలతో నీవు సంచరించిన అడుగుల ముద్రలను కల ఇసుకలో పడి దొరలి, తత్సంబంధాన్ని కల్గించుకొని ఆశ్వాసాన్ని పొందారు. అటువంటి ఇసుకలో ఒక రేణువుగా అయినా నేను జన్మించలేదే ! అయ్యో ! (**"ఆసా మహో చరణరేణుజుషామ్"** ఇత్యాది శ్రీభాగవత శ్లోకభావం భావ్యం.)

**అచిన్వతః కుసుమ మఙ్ఘ్రిసరోరుహం తే**
**యే భేజిరే బత ! వనస్పతయో లతా వా ।**
**అద్యాఽపి తత్కులభువః కులదైవతం మే**
**బృన్దావనం మమ ధియం చ సనాథయన్తి ॥ 52**

నీవు పూవులను కోసే సమయంలో ఏ చెట్లు, లేక, ఏ తీగలు నీ పాదారవింద సంబంధాన్ని పొందాయో, ఆ చెట్ల, లతల పరంపరకు చెందిన చెట్లు, తీగలు నాకు కులదైవం అయిన బృందావనాన్ని, నా హృదయాన్ని ఈ నాటికీ అలంకరిస్తున్నవి. ఆహా!

**యత్త్వత్ప్రియం తదిహ పుణ్య మపుణ్య మన్యత్**
**నాఽన్య త్తయో ర్భవతి లక్షణ మత్ర జాతు ।**
**ధూర్తాయితం తవ హి యత్కిలరాసగోష్ఠ్యాం**
**తత్కీర్తనం పరమపావన మామనన్తి ॥ 53**

ఇక్కడ ఈ లోకంలో నీకు ఏది ఇష్టమో అదే పుణ్యం. ఏది ఇష్టం కాదో అది పాపం. ఆ పుణ్యాపాపాలకు ఈ లోకంలో ఇంకొక లక్షణం అంటూ ఎప్పటికీ ఏదీ

లేదు. (ఏవిధంగా అంటే) రాసగోష్ఠిలో నీవు చేసిన ధూర్తచేష్టలను అనుసంధించడం పరమపావనంగా మహర్షులు చెబుతున్నారు.

యా కంసముఖ్యనృపకీటనిబర్హణోత్థా
సా నిర్జితత్రిజగత స్తవ నైవ కీర్తిః ।
గోపాలనాది యదిదం భవదీయకర్మేతి
ఆర్ద్రీకరోతి విదుషాం హృదయం తదేతత్ ॥ 54

కంసాదిరాజులనే కీటకాలను నీవు సంహరించడంవల్ల నీకు కల్గిన కీర్తి మూడు లోకాలను జయించిన నీకు కీర్తి కానే కాదు. గోవులను మేపడం మొదలైన నీవు చేసిన లీలలుమాత్రం విజ్ఞుల హృదయాలను ద్రవీకరిస్తున్నవి.

గోపాలవేషపరికర్మపరావరేశం
యన్నామ ధామ పరమం తమసః పరస్తాత్ ।
తత్పిఞ్ఛలాఞ్ఛనసుదామకృతోపవీతం
గోధూళిధూసరితకున్తల మన్తరాఽఽస్తామ్ ॥ 55

ఉభయవిభూతినిర్వాహకమైనది, కావుననే చాలా గొప్పది అయిన ఏ తేజస్సు ప్రకృతికి ఆవలి వైపున ఉన్నదో, ఆ తేజస్సు నెమలికన్నుల మాలను ధరించి, గొల్లవేషాన్ని వేసికొని, పశువుల ధూళివల్ల బూడిదరంగును కల శిరోజాలతో నా హృదయంలోపల ఉండాలి. ("నామ" -"ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" ఇత్యాదిగా శ్రుతి ప్రసిద్ధం అయిన పరరూపం కంటే ఇదే పరమభోగ్యమని భావం.)

యద్వై జరాసుతభయా ద్విపలాయథా స్త్వం
తచ్చేన్మనుష్యచరితానువిధానజం తే ।
తర్హి త్రిలోకగురు మీశ్వర మీశ్వరాణాం
బాణాహవే కిమితి శమ్భు మజృమ్భయ స్త్వమ్ ॥ 56

నీవు జరాసంధుని భయంవల్ల పలాయనం చిత్తగించావు అనే వృత్తాంతం నీ మనుష్యభావానుగుణం అయితే ముల్లోకాలలో గొప్పవాడు,ఇంద్రాదులకు సైతం ప్రభువు అయిన రుద్రుని బాణాసురయుద్ధంలో ఎందుకోసం ఆవలించేటట్లు చేశావు ? ("జృంభణాస్త్ర ప్రయోగేన జృంభయామాస శంకరమ్, జృంభాభిభూత స్తు హరో రథోపస్థ ఉపావిశత్" అనే పౌరాణికవృత్తాంతం స్మరణీయం.)

జాతం కుత స్తదకృతజ్ఞవిచేష్టితం తే
పుత్రీయయా కిల వరం వవృషే వృషాఙ్కాత్ ।
అక్షేషు సక్తమతినా చ నిరాదరేణ
వారాణసీ హరపురీ భవతా విదగ్ధా ॥ 57

ఒకానొక సమయంలో పుత్రుడు కలగాలనే కోరికతో నీవు రుద్రునివద్ద వరాలను కోరావు. ఇంకొక సమయంలో పాచికలను ఆడడంలో ఆసక్తిని కల్గి, వేటే ఏ పనిలోను ఆదరం లేనట్టి నీవు హరపురిని (కాశిని) దగ్ధం చేశావు. అటువంటి కృతఘ్నవ్యాపారాన్ని నీవెందుకు చేశావు? (నీకు వరం ఇచ్చిన శివుని పురిని దగ్ధం చేయడం కృతఘ్నకార్యం కదా! అందువల్ల, నీవు పుత్రార్థివై శివుని వరాలను కోరడం మనుష్యత్వ విడంబనాను రూపం)

సంజీవయన్నపి మృతం సుత ముత్తరాయాః
సాందీపినే శ్చిరమృతం సుత మానయంశ్చ।
ధామ్నో నిజా ద్ద్విజసుతా న్పున రానయన్వా
స్వా మేవ తాం తను మహో ! కథ మానయ స్త్వమ్ ॥ 58

చనిపోయిన ఉత్తరాకుమారుని తిరిగి బ్రతికించి, చాలాకాలం క్రితం మరణించిన సాందీపిని పుత్రుని తిరిగి తీసికొని వచ్చి, తేజోమయమైన నీ వైకుంఠం నుండి వైదికపుత్రులను తిరిగి తీసికొని వచ్చిన నీవు వారి వారి శరీరాలలోనే వారిని ఇక్కడకు ఏవిధంగా తెచ్చావు? ఆశ్చర్యం ! ("పరాఽస్య శక్తిః" అని కీర్తింపబడే గొప్ప శక్తిని కల నీకు ఏదీ అసాధ్యం కాదు.)

అద్యాఽపి న్యాస్త్యుపరతి స్త్రివిధాపచారాత్
పాపః పరే నిపతితోఽస్మి తమస్యపారే ।
ఏతాదృశోఽహ మగతి ర్భవతో దయాయాః
పాత్రం త్వదీయ చరణౌ శరణం ప్రపద్యే ! ॥ 59

భగవదపచార, భాగవతాపచార, అసహ్యాపచారాలనే మూడు విధాలైన అపచారాలను చేయడం ఇప్పటికీ నేను మానలేదు. వాటిని ఇప్పటికీ చేస్తున్నాను. పాపిష్ఠుణ్ణి అయిన నేను గొప్పది, దాటడానికి సాధ్యం కానిది అయిన తమస్సులో (అజ్ఞానంలో) పడిపోయాను. ఇటువంటివాడను, ఉపాయాంతరాన్ని లేనివాడను, నీ కృపకు పాత్రుణ్ణి అయిన నేను నీ శ్రీపాదాలను శరణు పొందుతున్నాను.

**విస్రంభణం త్వయి న యద్యపి మేఽస్తి నాఽపి**
**శ్రద్ధా యథోక్తవచనార్థగతా తథాఽపి ।**
**వాచం త్విమాం సకృదథాఽప్యసకృన్మయోక్తాం**
**సత్యాం కురుష్వ దయయైవ దయైకసింధో ! ॥ 60**

దయకు అద్వితీయమైన సముద్రంవంటివాడా! నీపట్ల నమ్మకం నాకు లేకపోయినా, ఇంతకుముందు నేను **"త్వదీయచరణౌ శరణం ప్రపద్యే"** అని అంటూ పల్కిన శరణాగతివాక్యంలోని అర్థంలో నాకు శ్రద్ధ లేకపోయినా, ఒకసారి నేను పల్కిన ఈ వాక్యాన్ని అనేకపర్యాయాలు పల్కినట్లుగాను, యథార్థం అయేటట్లుగాను నీదయతోనే చేయాలి.

**పాపీయసోఽపి శరణాగతశబ్దభాజో**
**నోపేక్షణం మమ తవోచిత మీశ్వరస్య ।**
**త్వద్జ్ఞానశక్తికరుణాసు సతీషు నేహ**
**పాపం పరాక్రమితు మర్హతి మామకీనమ్ ॥ 61**

పాపిష్ఠివాడనే అయినా, శరణాగతి చేసినవాడననే పేరును కల నన్ను ఉపేక్షించడం సర్వేశ్వరుడవైన నీకు తగదు. నీ జ్ఞానం, శక్తి, కరుణ ఉండగా ఇక్కడ నా పాపం పరాక్రమించడం యుక్తం కాదుసుమా ! (నీ శక్తి, కరుణల పరాక్రమం నా పాపపరాక్రమం ముందు నిర్వీర్యం కావడం నీ మహిమకు తగదు అని భావం. శరణాగత రక్షణలో దయ ప్రధానసాధనం, జ్ఞానశక్తులు రెండు దానికి అంగాలు)

అతిమానుషస్తవం సంపూర్ణము.



శ్రీ కూరేశులు అనుగ్రహించిన

# సుందరబాహుస్తవము

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే ।
యదుక్తయ స్త్రయీకణ్ఠే యాన్తి మఙ్గలసూత్రతామ్ ॥

శ్రీవైకుంఠస్తవాన్ని పరమపదనాథుని విషయంగా, అతిమానుషస్తవాన్ని విభవావతార విషయంగా అనుగ్రహించిన కూరేశులు ఇందులో అర్చావతారం అయిన సుందరబాహుస్వామిని స్తుతిస్తున్నారు. ఈ స్తుతికి ఫలం పూర్వంవలె తాము శ్రీరంగంలో ఆచార్యసన్నిధిలో భగవద్భాగవతాచార్యసేవలో కాలం గడపాలన్నదేనని స్తుతి ప్రారంభంలో, చివరలో కూరేశులు సూచించారు. వనగిరి, తిరుమాలిరుమ్‌శోలై అని పిలువబడే క్షేత్రంలో వేంచేసి ఉండేమూర్తికి సుందరబాహుస్వామి అనిపేరు.

శ్రీమన్తౌ హరిచరణౌ సమాశ్రితోఽహం
శ్రీరామావరజమునీన్ద్రలబ్ధబోధః ।
నిర్భీక స్తత ఇహ సుందరోరుబాహుం
స్తోష్యే తచ్చరణవిలోకనాభిలాషీ ॥ 1

శ్రీరామానుజులవలన వేదాంతజ్ఞానాన్ని పొందినవాడను, ఆ తరువాత శ్రీదేవి నిత్యవాసం చేసే (పాపాలను పోగొట్టే) హరిచరణాలను ఉపాయంగా ఆశ్రయించిన వాడను అయిన నేను సంసారభయం ఏమాత్రం లేనివాడనై ఇక్కడ అందమైన, బలిష్ఠాలైన బాహువులను కల సుందరబాహుస్వామిని ఆ భగవద్రామానుజుల శ్రీచరణాలను సేవించాలనే కోరికను కలవాడనై స్తుతిస్తున్నాను.

సుందరాయతభుజం భజామహే వృక్షషణ్డమయ మద్రి మాస్థితమ్ ।
యత్ర సుప్రథితనూపురాపగాతీర్థ మర్థితఫలప్రదం విదుః ॥ 2

ఏ తిరుమాలిరుమ్‌శోలైకొండలో ప్రవహించే సుప్రసిద్ధం అయిన ఏ నూపురగంగను పరిశుద్ధమైన నీటిని కల్గినదని, కోరినవారి కోరికలను అన్నిటినీ ఇచ్చేదని కీర్తిస్తున్నారో, వృక్షసమూహాలలో నిండిన ఆ తిరుమాలిరుమ్‌శోలై పర్వతాన్ని ఆశ్రయించి వేంచేసి ఉండే సుందరబాహుస్వామిని భజిస్తున్నాము. ("శిలమ్బాఱు పాయుమ్

తిరుమాలిరుమ్‌శోలైయే" అని పెరియాళ్వార్ల, "శన్దాడు కారగిలుమ్ శుమన్దు..... శిలమ్బాఱుడైయ మాలిరుమ్ శోలై" అని తిరుమజ్గైయాళ్వార్ల సూక్తులు భావ్యాలు.)

క్వచి త్త్వరితగామినీ క్వచన మన్దమన్దాలసా
క్వచిత్ స్ఖలితవిహ్వలా క్వచన ఫేనిలా సారవా ।
పతత్యపి కిల క్వచి ద్వ్రజతి నూపురాహ్వా నదీ
సుసున్దరభుజాహ్వయం మధు నిపీయ మత్తా యథా ॥ 3

తిరుమాలిరుమ్ శోలైలో ప్రవహించే నూపురగంగ ఒక చోట వేగంగా ప్రవహిస్తున్నది. ఇంకొక చోట మెల్లమెల్లగా ప్రవహిస్తున్నది. ఇంకొక చోట ఎత్తుపల్లాలో ప్రవహించడంవల్ల తొట్రుపాటు కల్గినదిగా ఉన్నది. మఱి ఒకచోట పెద్ద శబ్దం చేస్తూ ప్రవహిస్తున్నది. వేఱొక చోట పైనుండి కిందికి దుముకుతున్నది. ఈ విధంగా ఉండే ఆ నది గమనాలు ఆ కొండపై ఉన్న సుందరబాహుస్వామి అనే మధువును ఆస్వాదించి, మత్తెక్కిన స్త్రీసంచారాలవలె తోస్తున్నవి.

ఉదధిగమన్దరాద్రిమథిమన్థనలబ్ధపయో -
మధురరసేన్దిరాహ్వసుధసున్దరదోఃపరిఘమ్ ।
అశరణ మాదృశాత్మరణం శరణార్థిజన -
ప్రవణధియం భజేమ తరుషణ్డమయాద్రిపతిమ్ ॥ 4

సముద్రంలో చొచ్చిన మందరపర్వతం అనే కవ్వంతో చిలికినపుడు లభించిన, పాలలోని మధురరసం అయిన లక్ష్మి అనే అమృతాన్ని పొందినవాడు, అందమైన, పరిఘలవంటి బాహువులను కలవాడు, దిక్కులేని మాకు గొప్ప దిక్కు, శరణార్థులపట్ల గొప్ప ఆదరం కలవాడు, వనగిరికి ప్రభువు అయిన సుందరబాహుస్వామిని సేవిస్తున్నాము. ("అముదిల్ వరుమ్ పెణ్ణముదుణ్డ పెరుమాన్" అనే తిరుమజ్గైమన్నన్ సూక్తి, "మన్దరమ్ నాట్టి యన్ఱు మదురకొழுఞ్జారు కొణ్డ" అని గోదాదేవి సూక్తి "మధురరసేందిరాహ్వ" అన్నపుడు భావ్యాలు.)

శశధరరిఙ్ఖణాఢ్యశిఖ ముచ్చిఖరప్రకరం
తిమిరనిభప్రభూతతరుషణ్డమయం భ్రమదమ్।
వనగిరి మావసన్త ముపయామి హరిం శరణం
భిదురితసప్తలోకసువిశృఙ్ఖలశఙ్ఖరవమ్ ॥ 5

చంద్రుని సంచారాలతో గొప్పగా ఉండే ఎత్తైన శిఖరాలను కల్గినది, చీకట్లవంటి పలు చెట్ల గుబురులతో నిండినది, ఆకారణంచేత చెట్లసమూహమే కాని కొండకాదు ! అనే భ్రాంతిని కల్గించేది అయిన వనగిరిలో నివసించేవాడు, సప్తలోకాలను బద్దలుచేసి, నిరాఘాటంగా సంచరించే ధ్వనిని కల పాంచజన్యాన్ని ధరించినవాడు అయిన సుందరబాహుస్వామిని శరణు పొందుతున్నాను. ("అదిల్ కురల్ శజ్గత్తు అ*ఝ*కర్ తమ్‌కోయిల్", "మది తవ*ఝ్* కుడుమి మాలిరుమ్ శోలై" ఇత్యాది తిరువాయ్‌మొ*ఝి* (2-10) సూక్తులు స్మరణీయాలు.)

యత్తుజ్గశృజ్గవినిషజ్గిసురాజ్గనానాం
న్యస్తోర్ధ్వపుణ్డ్రముఖమణ్డనమణ్డితానామ్ ।
దర్పణ్యభూ ద్ధృతమపాజ్కశశాజ్కపృష్ఠం
తద్ధామ సుందరభుజస్య మహాన్ వనాద్రిః ॥ 6

చంద్రుడు వనగిరిశిఖరాలకంటే కింది భాగంలో సంచరించేటపుడు కళంకం లేని చంద్రుని వెనుకభాగం ఆ కొండ శిఖరాలపై కూర్చుండి ఊర్ధ్వపుండ్రాన్ని తమ లలాటాలలో అలంకారంగా ధరించే దేవతాస్త్రీలకు స్వచ్ఛమైన అద్దంవలె ఉపయోగపడుతున్నది. సుందరబాహుస్వామికి నివాసమైన ఇటువంటి ఎత్తైన వనాద్రి చాలా గొప్పది. ("నీఱు శెవ్వే యిడ క్కాణిల్" అని అంటూ శఠకోపసూరి తిరువాయ్ మొ*ఝి*లో (4-4-7) తాము ధరించేది ఊర్ధ్వపుండ్రమేనని స్పష్టం చేశారు.)

యదీయశిఖరాగతాం శశికలాం తు శాఖామృగాః
నిరీక్ష్య హరశేఖరీభవన మామృశన్త స్తతః।
స్పృశన్తి న హి దేవతాన్తరసమాశ్రితేతి స్ఫుటం
స ఏష సుమహాతరువ్రజగిరి ర్గృహం శ్రీపతేః ॥ 7

తిరుమాలిరుమ్ శోలై పర్వతంపై నివసించే వానరాలు ఆ కొండశిఖరంపైకి వచ్చి సంచరించే చంద్రకళను చూచి, అది శివునకు శిరోభూషణంగా ఉన్న విషయాన్ని స్మరించి, అన్యదేవతాసమాశ్రయణాన్ని కల ఆ చంద్రవంకను తాకడం లేదు. వానరాలకు సైతం అటువంటి స్వరూపజ్ఞానాన్ని కల్గించేది, గొప్ప చెట్ల గుంపులను కల్గినది అయిన వనాద్రి సుందరబాహుస్వామికి నిలయం.

సున్దరదోర్ద్విర్వ్యాజ్గాలమ్బనకాతరవశానుయాయిని కరిణి ।
ప్రణయకలహసమాధి ర్యత్ర వనాద్రి స్స ఏష సున్దరదోష్ణః ॥ 8

ప్రణయకాలంలో మగఏనుగుపై కోపించి, దూరంగా పోయే వనాద్రిలో ఉండే ఒక ఆడఏనుగు, సుందరబాహుస్వామిపై మగ ఏనుగు పెట్టిన ఆనకు కట్టుబడి ప్రణయకలహాకోపాన్ని వదలిపెట్టి నిలచింది. అపుడు ఆ ఆడ ఏనుగును మగ ఏనుగు అనుసరించింది. ఇటువంటి అందమైన దృశ్యాలను కల వనాద్రి సుందరబాహుస్వామికి నివాసం. (ఈ శ్లోకం పెరియాழ్వార్ల సూక్తికి అనువాదం అనే విషయాన్ని పీఠికలో గమనించవచ్చు.)

**స ఏష సౌన్దర్యనిధే ర్ధృతశ్రియో వనాచలో నామ సుధామ యత్ర హి ।**
**భుజఙ్గరాజస్య కులస్య గౌరవాత్ న ఖణ్డితాః కుణ్డలిన శ్శిఖణ్డిభిః ॥ 9**

వనాద్రిలో ఉండే పాములను సర్పప్రభువు అయిన ఆదిశేషునిపై ఉండే గౌరవంచేత నెమళ్ళు చంపడంలేదు. ఇటువంటి వనగిరి సౌందర్యానికి నిధి అయినవాడు, లక్ష్మిని ధరించినవాడు అయిన సుందరబాహుస్వామియొక్క దివ్యస్థానం.

**వృషగిరి రయ మచ్యుతస్య యస్మిన్ స్వమత మలఙ్ఘయితుం పరస్పరేభ్యః ।**
**ఖగపతిచరణౌ ఖగా శ్శపన్తే భుజగపతే ర్భుజగా శ్చ సర్వ ఏవ ॥ 10**

ఏ వనాద్రిలో పక్షులు, పాములు తమ ప్రతిజ్ఞను ఉల్లంఘించకూడదనే విషయంలో ఒకరిపై ఇంకొకరికి నమ్మకం కల్గడంకోసం తమ కులాలకు ప్రభువులైన గరుత్మంతునిపైన, శేషునిపైన ఒట్టుపెట్టుకొంటాయో, ఆ వనాద్రి సత్యమైన ప్రతిజ్ఞను కలవాడు, అచ్యుతుడనే పేరును కలవాడు అయిన సుందబాహుస్వామికి నివాసం. (**"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"** ఇత్యాదులు భగవానుని సత్యప్రతిజ్ఞత్వానికి ప్రమాణాలు.)

**హరికుల మఖిలం హనూమదఙ్ఘ్రిం స్వకులపజామ్బవత స్తథైవ భల్లాః ।**
**నిజకులపజటాయుష శ్చ గృధ్రాః స్వకులపతే శ్చ గజా గజేన్ద్రనామ్నః ॥ 11**

వానరకులం అంతా హనుమానుని పాదాలపై, భల్లూకాలు తమ కులప్రభువు అయిన జాంబవంతుని పాదాలపై, గ్రద్దలు అన్నీ తమకు కులపతి అయిన జటాయువు పాదాలపై, గజాలు అన్నీ తమ కులప్రభువు అయిన గజేంద్రుని పాదాలపై వనగిరిలో శపథం చేస్తాయి.

**వకులధరసరస్వతీవిషక్తస్వరరసభావయుతాసు కిన్నరీషు ।**
**ద్రవతి దృష దపి ప్రసక్తగానాసు ఇహ వనశైలతటీషు సున్దరస్య ॥ 12**

శఠకోపసూరి ప్రణీతం అయిన వాక్కులను (తిరువాయ్‌మొழி పాశురాలను) నిషాదాది స్వరసహితంగా, శృంగారాదిరసబంధురంగా, రత్యాదిస్థాయి భావసహితంగా కిన్నర స్త్రీలు గానం చేసినపుడు సుందరబాహుస్వామి నివసించే పర్వతసానువులలోని రాళ్ళుసైతం కఱగిపోతున్నవి. ("శిలమ్బు" అంటే పర్వతమని కూడా ద్రావిడంలో అర్థం. శఠకోపసూరి పాశురాల గానానికి వనగిరికూడా ద్రవించి నూపురగంగారూపంలో ప్రవహించడంవల్ల దానికి "శిలమ్బాఱు" అనే పేరు వచ్చిందనే ఒక అద్భుతనిరుక్తిని కూరేశులు ఇందులో హృద్యంగా తెలుపడం విశేషం.)

**భృఙ్గీ గాయతి హంసతాలనిభృతం తత్పుష్ణతీ కోకిలాఽపి**
**ఉద్గాయత్యథ వల్లితల్లజముఖా దాస్రం మధు స్యన్దతే ।**
**నిష్పన్దస్తిమితాః కురఙ్గతతయ శ్శీతం శిలాసైకతం**
**సాయాహ్నే కిల యత్ర సున్దరభుజ స్తస్మిన్ వనక్ష్మాధరే ॥ 13**

సుందరబాహుస్వామి ప్రతిదినం సాయంసమయంలో వనగిరిపై సంచరించేటప్పుడు తుమ్మెద కన్నియ హంసగతులనే తాళస్వనాలతో దివ్యప్రబంధగానాన్ని చేస్తుంది. ఆ గానాన్ని పోషిస్తూ ఆడుకోయిల గట్టిగా గొంతెత్తి గానం చేస్తుంది. ఆ తరువాత ఈ గానాన్ని విన్న గొప్ప లతల కొనలనుండి మధువు అనే కన్నీరు స్రవిస్తుంది. లేళ్ళగుంపులు కదలకుండా మెదలకుండా నిలబడిపోతాయి. శిలలు, ఇసుక తిన్నెలు గానరసంతో చల్లబడతాయి. (పెరియాழ்వార్ తిరుమొழிలోని **"నావలమ్ పెరియ తీవు"** అనే దశకంలోని పాశురాల భావాలు ఇక్కడ అనుసంధేయాలు.)

**పీతామ్బరం వరదశీతలదృష్టిపాతమ్**
**అజానులమ్బిభుజ మాయతకర్ణపాశమ్ ।**
**శ్రీమన్మహావనగిరీన్ద్రనివాసదీక్షం**
**లక్ష్మీధరం కి మపి వస్తు మమాఽఽవిరస్తు ॥ 14**

పీతాంబరాన్ని ధరించినది, వరాలను అనుగ్రహించే చల్లని కటాక్షాన్ని కల్గినది, ఆజానుబాహువులతో కూడినది, విశాలమైన, గొప్ప కర్ణాలను కల్గినది, వనగిరిలో నివసించడమనే దీక్షను కల్గినది, వక్షస్థలంలో లక్ష్మిని కల్గినది, అనిర్వాచ్యమైనది అయిన పరతత్త్వం సుందరబాహుస్వామిరూపంలో నాకు సాక్షాత్కారం కావాలి. (వైకుంఠస్తవంలోని 5వ శ్లోకం మూడవపాదంలో కొంచెం మార్పుతో తిరిగి ఇక్కడ అనుసంధింపబడింది.)

**జనిజీవనాప్యయవిముక్తయో యతః జగతా మితి శ్రుతిశిరస్సు గీయతే ।**
**తదిదం సమస్తదురితైకభేషజం వనశైలసంభవ మహం భజే మహః ॥ 15**

లోకాల ఉత్పత్తి, స్థితి, సంహారం, సంసారబంధమోక్షాలు దేనివల్ల ఏర్పడుతున్నాయని వేదాంతాలలో గానం చేయబడుతున్నదో, అన్ని పాపాలకు సాటిలేని మందు అయిన, వనాద్రిలో సంభవమైన ఈ గొప్ప తేజస్సును నేను సేవిస్తున్నాను. (**"యతోవా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి, యత్ప్రయం త్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ"** అనే శ్రుతివాక్యం **"జనిజీవనాప్యయ"** ఇత్యాది ప్రయోగానుగుణంగా స్మరణీయం.)

సద్బ్రహ్మాత్మపదై స్త్రయీ శిరసి యో నారాయణోక్త్యా తథా
వ్యాఖ్యాతో గతిసామ్యలబ్ధవిషయానన్యత్వబోధోజ్జ్వలైః ।
నిస్తుల్యాధిక మద్వితీయ మమృతం తం పుణ్డరీకేక్షణం
ప్రారూఢశ్రియ మాశ్రయే వనగిరేః కుఞ్జోదితం సున్దరమ్ ॥ 16

వేదాంతశాస్త్రంలో **"స దేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, బ్రహ్మ వా ఇద మేక మేవాగ్ర ఆసీత్, ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్"** ఇత్యాది జగత్కారణాన్ని నిరూపించే వాక్యాలలోని (సర్వశాఖాప్రత్యయన్యాయ, సామాన్యవిశేష న్యాయాలద్వారా గమనికల పోలికలనుబట్టి అన్నీ ఒకే విషయానికి చెందినవిగా నిరూపింపబడ్డ సత్,బ్రహ్మ, ఆత్మపదాలచేత జగత్కారణంగా ప్రతిపాదించబడిన ఏ పరతత్త్వం నారాయణనామంతో వ్యాఖ్యానింపబడ్డదో, తనకు సాటి వచ్చేవారు, మించినవారు ఎవరూ లేనివాడు, అమృతంవలె భోగ్యుడు, పుండరీకాక్షుడు, వనగిరిలోని పొందరింటిలో ఆవిర్భవించినవాడు, **"ఆరూఢశ్రీః"**అనే నామాంతరాన్ని కలవాడు అయిన ఆ సుందరబాహుస్వామిని ఆశ్రయిస్తున్నాను. (**"ఆరూఢశ్రీః"** -ఇది తమిళంలోని **"ఏఱు తిరువుడైయాన్"** అనే పేరుకు సంస్కృతీకరణం.)

పతిం విశ్వస్యాత్మేశ్వర మితి పరం బ్రహ్మ పురుషః
పరం జ్యోతి స్తత్త్వం పర మితి చ నారాయణ ఇతి ।
శ్రుతి ర్బ్రహ్మేశాదీం స్తదుదితవిభూతీం స్తు గృణతీ
య మాహాఽఽరూఢశ్రీ స్స వనగిరిధామా విజయతే ॥ 17

వేదం బ్రహ్మ-ఈశ్వరుడు మొదలైనవారంతా నారాయణునివలన వైభవాన్ని పొందారని చెబుతూ ఏ సుందరబాహుస్వామిని 'పతిం విశ్వస్యాత్మేశ్వరమ్' (లోకానికి అంతటికీ ప్రభువు, తనకు తానే ఈశ్వరుడు) అని, "పరం బ్రహ్మ" అని, "నారాయణః

పరం బ్రహ్మ" అని, "విశ్వ మేవేదం పురుషః" (కన్పించే ఈ విశ్వం పురుషుడే) అని, "నారాయణః పరం జ్యోతిః తత్త్వం నారాయణః పరః" అని అంటున్నదో, వనాద్రిని నివాసంగా కల "ఆరూఢశ్రీః" అనే నామాంతరాన్ని కల ఆ సుందరబాహుస్వామి సర్వోత్కర్షతో వెల్లుతున్నాడు.

పృథివ్యాద్యాత్మాన్తం నియమయతి య స్తత్త్వనికరం
తదన్తర్యామీ తద్వపు రవిదిత స్తేన భగవాన్ ।
స ఏష స్త్వైశ్వర్యం న విజహదశేషం వనగిరిం
సమధ్యాసీనో నో విశతు హృదయం సున్దరభుజః ॥ 18

భగవానుడు పృథివిమొదలు ఆత్మవరకుగల తత్త్వాలను అన్నిటినీ నియమిస్తున్నాడు. ఆ పృథివ్యాది ఆత్మపర్యంతతత్త్వాలకు అంతర్యామిగా ప్రేరకుడై, ఆ తత్త్వాలనే శరీరంగా కలవాడై, ఆ తత్త్వాలచేత తెలియబడనివాడై ఉన్నాడు. సమస్తమైన తన ఐశ్వర్యం విడచిపెట్టకుండానే వనాద్రిని చక్కగా అధిష్ఠించి ఉన్నాడు. అటువంటి ఈ సుందరబాహుస్వామి మా హృదయంలో ప్రవేశించాలి. ("యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో, యం పృథివీ న వేద, యస్య పృథివీ శరీరం, యః పృథివీ మంతరో యమయతి", "య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽంతరో య మాత్మా న వేద, యస్యాత్మా శరీరం, య ఆత్మాన మంతరో యమయతి" ఇత్యాది శ్రుతులు భావ్యాలు.)

ప్రత్యగాత్మని కదాఽప్యసంభవద్భూమభూమి మభివక్తి యం శ్రుతిః ।
తం వనాద్రినిలయం సుసున్దరం సున్దరాయతభుజం భజామహే ॥ 19

ఏ స్వామిని జీవాత్మకు మోక్షదశలో సైతం సంభవించని మహత్తుకుసైతం జన్మస్థానంగా వేదం సర్వత్ర చెబుతున్నదో, వనాద్రిని నివాసంగా కల, సుందరమైన, విశాలమైన భుజాలను కల ఆ స్వామిని భజిస్తున్నాను. ("ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" అనే శ్రుతివాక్యం గ్రాహ్యం.)

వన్దేయ సున్దరభుజం భుజగేన్ద్రభోగ -
సక్తం మహావనగిరిప్రణయప్రవీణమ్ ।
యం తం విదు ర్దహర మష్టగుణోపజుష్టమ్
ఆకాశ మౌపనిషదీషు సరస్వతీషు ॥ 20

ఏ భగవానుని ఉపనిషద్వాక్యాలలో చెప్పబడ్డ "అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకోఽ విజిఘత్సోఽ పిపాసః సత్యకామః సత్యసంకల్పః" అని ఎనిమిది గుణాలను కల్గిన వానినిగా, దహరమనబడే హృదయపుండరీకంలో ఉండే ఆకాశనామకుడైన

పరమాత్మగా తెలిసికొంటున్నారో, అటువంటివాడు, ఆదిశేషుని శరీరంలో పరుండి ఉండేవాడు, గొప్ప వనగిరిలో అభిమానించి వేంచేసి ఉండేవాడైన సుందరబాహుస్వామిని నమస్కరిస్తున్నాను. (**"ఆసమంతాత్ కాశతే ఇతి ఆకాశః"** అనే ఆకాశ వృత్పత్తి పరమాత్మ పరంగా వివక్షితం. ఈ శ్లోకంలో దహరవిద్య ప్రస్తావింపబడింది.)

**యత్స్వాయత్తస్వరూపస్థితికృతికనిజేచ్ఛానియామ్యస్వశేషాఽ -**
**నన్తాశేషప్రపఞ్చ స్తత ఇహ చిదివాచిద్వపుర్వాచిశబ్దైః ।**
**విశ్వై శ్శబ్దైః ప్రవాచ్యో హతవృజినతయా నిత్య మేవానవద్యః**
**తం వన్దే సున్దరాహ్వం వనగిరినిలయం పుణ్డరీకాయతాక్షమ్ ॥ 21**

ఏ భగవానుడు తన ఆధీనంలో సమస్తవిశ్వంయొక్క స్వరూపస్థితిప్రవృత్తులను కలవాడై, తన ఇచ్ఛతో నియమించదగినది, తను శేషమై ఉండేది అయిన అశేషమైన ప్రపంచాన్ని కలవాడై, అందువల్లనే ఈ జగత్తులో అచిత్పరిణామరూపాలైన దేవమనుష్యతిర్యగాది శరీరాది శబ్దాలతో చేతనుని నిర్దేశించేటట్లే, సమస్తశబ్దాలచేత అపర్యవసానవృత్తిద్వారా చెప్పదగినవాడై, పాపరహితుడు కనుక నిత్యనిర్దోషుడై ఉంటున్నాడో, గొప్ప పర్వతం అయిన వనాద్రిని నివాసంగా కలవాడు, పుండరీకాక్షుడు అయిన ఆ సుందరబాహుస్వామిని నమస్కరిస్తున్నాను. (**"పరగతాతిశయాధానేచ్ఛయా ఉపాదేయత్వ మేవ యస్య స్వరూపం స శేషః, పరః శేషీ"** అని శ్రీరామానుజులు శేషశేషిభావాన్ని నిర్వచించారు. **"పుమాన్ న దేహో న నరో న తిర్యక్ స్థావరోఽపి వా, జ్ఞానానందమయ స్త్వాత్మా శేషో హి పరమాత్మనః"** అనే పౌరాణిక సూక్తి స్మరణీయం)

**గుణజం గుణినో హి మఙ్గళత్వం**
**ప్రమితం ప్రత్యుత యత్స్వరూప మేత్య ।**
**త మనన్తసుఖావబోధరూపం**
**విమలం సున్దరబాహు మాశ్రయామః ॥ 22**

లోకంలో తేజస్సువల్ల మణికి, కాంతిచేత సూర్యునకు, చంద్రునకు, సుగంధం చేత చందనచంపకాది కుసుమాలకు గొప్పతనం కల్గుతున్నది. అందువల్ల ఆయా గుణాలనుబట్టి ఆ గుణాలను కల వస్తువులకు మంగళత్వం సిద్ధిస్తున్నది. ఇది లోకంలో ప్రసిద్ధమైన విషయంకదా ! కాని, దీనికి విరుద్ధంగా భగవానుని విషయంలో కన్పిస్తున్నది. భగవానుని గుణాలకు మంగళత్వం హేయప్రత్యనీకత్వ- కల్యాణైకతానత్వ రూపమైన భగవత్స్వరూపాన్ని ఆశ్రయించడంచేత కల్గుతున్నది. అటువంటి అంతులేని సుఖరూపజ్ఞానాన్ని స్వరూపంగా కలవాడు, నిర్మలమైనవాడు అయిన సుందరబాహు

స్వామిని ఆశ్రయిస్తున్నాను. ("సత్యస్య సత్యమ్", "జ్యోతిషాం జ్యోతిః", "పవిత్రాణామ్ పవిత్రం యో మంగళానాం చ మంగళమ్", "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ", "విజ్ఞాన మానందం బ్రహ్మ", "అపహతపాప్మా విజరః" ఇత్యాది శ్రుతులు అనుసంధేయాలు.)

అతిపతితావధిస్వమహిమానుభవప్రభవ-
త్సుఖకృతనిస్తరఙ్గజలధీయితనిత్యదశమ్ ।
ప్రతిభట మేవ హేయనికరస్య సదాఽ ప్రతిమం
హరి మిహ సున్దరాహ్వ ముపయామి వనాద్రితటే ॥ 23

ఏ హద్దు లేని తన వైభవాన్ని అనుభవించడంచేత కలిగే ఆనందంతో నిస్తరంగ (అలలు లేని) సముద్రంవలె ఉండే నిత్యదశను కలవాడు, సదా హేయగుణాలకు ప్రతిభటుడు, సాటి లేనివాడు అయిన సుందరబాహుస్వామి అనే పేరును గల హరిని ఈ వనగిరి సానువులో శరణు పొందుతున్నాను. (వరదరాజస్తవంలోని "ప్రశాంతా నంతాత్మానుభవజ" - అనే శ్లోకార్థం స్మరణీయం.)

సదా షాడ్గుణాఖ్యైః పృథులబలవిజ్ఞానశకన-
ప్రభావీర్యైశ్వర్యై రవధివిధురై రేధితదశమ్ ।
ద్రుమస్తోమక్ష్మాభృత్పరిసరమహోద్యాన ముదితం
ప్రపద్యేఽ ధ్యారూఢశ్రియ మిమ మహం సున్దరభుజమ్ ॥ 24

సదా (జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజస్సులనే) షడ్గుణాలనే పేరును కల, హద్దు లేని గొప్ప బలంతో, విశేషమైన విజ్ఞానంతో, శక్తితో, తేజస్సుతో, వీర్యంతో, ఐశ్వర్యంతో వృద్ధి పొందింపబడ్డ దశను కలవాడు, వృక్షసమూహంతో కూడిన వనాద్రియొక్క పరిసరప్రాంతంలోని గొప్ప ఉద్యానవనంలో ప్రీతిని కలవాడు, "అధ్యారూఢశ్రీః" అనే నామాంతరాన్ని కల్గినవాడైన సుందరబాహుస్వామిని నేను శరణు పొందుతున్నాను.

సౌశీల్యాశ్రితవత్సలత్వమృదుతాసౌహార్దసామ్యార్జవైః
ధైర్యస్థైర్యసువీర్యశౌర్యకృతితాగాంభీర్యచాతుర్యకైః ।
సౌన్దర్యాన్వితసౌకుమార్యసమతాలావణ్యముఖ్యై ర్గుణైః
దేవ శ్శ్రీతరుణ్డశైలనిలయో నిత్యం స్థిత స్సున్దరః ॥ 25

సౌశీల్యం, ఆశ్రితవాత్సల్యం, హృదయమార్దవం, సౌహార్దం, సమతాగుణం, ఋజుత్వం, ధైర్యం, స్థైర్యం, మంచి వీర్యం, శూరత్వం, కృతజ్ఞత్వం మనోగాంభీర్యం,

చాతుర్యం మొదలైన ఆత్మగుణాలతో, సౌందర్యంతో కూడిన సౌకుమార్య, సమతా, లావణ్యాది దివ్యమంగళవిగ్రహగుణాలతో కూడినవాడై, క్రీడాదిగుణవిశిష్టుడైన సుందరబాహుస్వామి నిత్యం వృక్షసమూహంతో నిండి ఉండే వనాద్రిలో వేంచేసి ఉన్నాడు.

**యేష్వేకస్య గుణస్య విప్రుడపి వై లోకోత్తరం స్వాశ్రయం**
**కుర్యా త్తాదృశవైభవై రగణితై ర్నిస్సీమభూమాన్వితైః ।**
**నిత్యై ర్దివ్యగుణై స్తతోఽధికశుభత్వైకాస్పదాత్మాశ్రయైః**
**ఇద్ధం సుందరబాహు మస్మి శరణం యాతో వనాద్రీశ్వరమ్ ॥ 26**

భగవానునకు కల కల్యాణగుణాలలోని ఏ ఒక్కగుణంలోని చిన్న కణం అయినా తనకు ఆధారమైన గుణిని లోకోత్తరునిగా చేస్తున్నదో, అటువంటి వైభవాన్ని కల్గినవి, లెక్కకు మిక్కిలిగా ఉన్నది, హద్దు లేని మహిమను కల్గినవి, నిత్యాలైనవి, ఈ గుణాలకంటేకూడా అధికం అయిన ఆశ్రయంగా అయినది శుభత్వానికి ఏకైకఆధారం అయినవి, దివ్యాత్మస్వరూపానికి చెందిన పూర్వం చెప్పబడ్డ జ్ఞానశక్త్యాది ఆత్మగుణాలతో గొప్పగా ప్రకాశించేవాడైన, వనాద్రికి ప్రభువైన సుందరబాహు స్వామిని ఆశ్రయించిన వాడనయ్యాను. ("ఏకస్య యేషు హి గుణస్య" అనే శ్రీవైకుంఠస్తవ శ్లోకం భావ్యం.)

**సదా సమస్తం జగ దీక్షతే హి యః**
**ప్రత్యక్షదృష్ట్యా యుగపద్భువా స్వతః ।**
**స ఈదృశజ్ఞాననిధి ర్నిధి స్తు నః**
**సింహాద్రికుంజేషు చకాస్తి సున్దరః ॥ 27**

ఏ స్వామి సదా సహజమైన, ఏకకాలంలో కల్గిన ప్రత్యక్షమైన జ్ఞానంతో సమస్తప్రపంచాన్ని దర్శిస్తున్నాడో, అటువంటి ఉత్తమజ్ఞానానికి నిధి, మాకు పెన్నిధి అయిన ఆ సుందరబాహుస్వామి వనగిరిలో పూపొదరిండ్లలో ప్రకాశిస్తున్నాడు. ("యుగపద్భువా" అన్నందున చేతనవిశేషవ్యావృత్తి, "స్వతః" అన్నందున యోగిజనవ్యావృత్తి, "సదా" అన్నందున ముక్తపురుషవ్యావృత్తి సూచింపబడింది. లేక, "సదా" అనే పదంద్వారా యోగిముక్తజనవ్యావృత్తి, "స్వతః" అన్నందున సకలనిత్యజ్ఞాన వ్యావృత్తి తెలుపబడినది అని చెప్పవచ్చు.)

**ఐశ్వర్యతేజోబలవీర్యశక్తయః**
**కీదృగ్విధా స్సుందరబాహుసంశ్రయాః ।**
**యోఽసౌ జగజ్జన్మలయస్థితిక్రియాః**
**సఙ్కల్పతోఽల్పా దుపకల్పయ త్యజః ॥ 28**

జన్మరహితుడు అయిన ఏ పరమాత్మ తన స్వల్పమైన సంకల్పంతో జగత్తు యొక్క సృష్టిస్థితిసంహారాలను నిర్వహిస్తున్నాడో, అటువంటి సుందరబాహుస్వామిని ఆశ్రయించి ఉండే జ్ఞానైశ్వర్యతేజోబలవీర్యశక్తులనే ఆఱు గుణాలు ఇంతటి వైభవాన్ని కల్గినవి అని చెప్పడానికి సాధ్యం కాదు.

**యత్కల్పాయుతభోగతోఽపి కృశతాం యాయా న్న తావత్ఫలం**
**యేష్వేకస్య తథావిధై స్తతజై రంహోభి రుత్సీమభిః ।**
**అస్తాదా విహ సంసృతా వుపచితై శ్ఛన్నం సుసన్నం జనం**
**సన్నత్యా క్షమతే క్షణా ద్వనగిరిప్రస్థప్రియ స్సుందరః ॥** 29

ఏ పాపకార్యఫలం పదివేల బ్రహ్మకల్పాల కాలం అనుభవించినా తీఱదో, అటువంటి అంతటి పాపాలను ఒక్కొక్క జన్మలోను చేస్తూ, అవధి లేనివి, సంఖ్యకు మించినవి, ఎపుడు ప్రారంభమైనవో తెలియనివి, సంసారంలో ఈ కర్మభూమిలో సతతం వృద్ధి అవుతున్నవి అయిన ఆ పాపాలచే పూర్తిగా ఆవరింపబడ్డవాడు, అందువల్ల తన స్వరూపాన్ని తాను గుర్తించలేకుండా ఉన్నవాడు, చాలా దుఃఖించినవాడు అయిన సంసారిని తిరుమాలిరుమ్ శోలై పర్వతసానువును వాసస్థానంగా కల సుందరబాహుస్వామి అతడు ఒక్క నమస్కారంమాత్రం చేస్తే చాలు క్షమిస్తున్నాడు. (సన్నత్యా క్షమతే- **"స తం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతమ్, కృపయా పర్యపాలయత్"** ఇత్యాది శ్రీరామాయణ సూక్తిని స్మరించవచ్చు. శ్రీవైకుంఠస్తవంలోని **"యద్బ్రహ్మకల్ప"** అనే శ్లోకార్థం స్మరణీయం)

**యజ్జాతీయో యాదృశో యత్స్వభావః**
**పాదచ్ఛాయాం సంశ్రితో యోఽపి కోఽపి ।**
**తజ్జాతీయ స్తాదృశ స్తత్స్వభావః**
**శ్లిష్యత్యేనం సుందరో వత్సలత్వాత్ ॥** 30

ఏ జాతిలో జన్మించినా, ఏ ఆచారాన్ని కలవాడు అయినా, ఎవడైనా తన పాదాలను అతడు ఆశ్రయిస్తే అతనిని, సుందరబాహుస్వామి వాత్సల్యగుణాన్ని కలవాడు కనుక, అట్టి జాతినే కలవాడై, అటువంటి ఆచారాన్నే కలవాడై, అటువంటి స్వభావాన్నే కలవాడై అతనితో సంశ్లేషిస్తున్నాడు. (**"యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్"** అనే గీతాసూక్తి భావ్యం.)

నిహీనో జాత్యా వా భృశ మకుశలై ర్వా స్వచరితైః
పుమాన్ వై యః కశ్చి ద్బహుతృణమపి స్యాదగుణతః ।
భజన్తం తం పశ్యేద్భుజగపతినా తుల్య మపి యో
వనాద్రిప్రస్థస్థ స్స మమ శరణం సుందరభుజః ॥ 31

జాతిచేగాని, అశుభాలైన తన చరిత్రల (నడతల) చే గాని, చాలా హీనుడైన వాడు ఒకడు గుణాలు లేనివాడు, తృణసమానుడు అయినా, అతడు తనను సేవిస్తే సుందరబాహుస్వామి అతనిని ఆదిశేషునితో సమానునిగా ఆదరిస్తాడు. వనశైల సానువులో వేంచేసి ఉన్న అటువంటి స్వామి నాకు దిక్కు. ("**ఏఱ్ఱై** ఏదలన్ కీఴ్మకన్ ఎన్నాదు ఇరఙ్గి" - ఇత్యాది తిరుమఙ్గైమన్నన్ సూక్తి స్మరణీయం. "యః కశ్చిదేవ" అనే శ్రీవైకుంఠస్తవ శ్లోకభావంతో ఈ శ్లోక భావానికి గల సామ్యం గమనించదగినది.)

ఏకైకమంగళగుణానుభవాభినన్దమ్
ఈదృక్తయా నితి చ సుందరదోష్ణి కృష్ణే ।
తే యే శతం త్వితి నియన్తుమనా శ్రుతి ర్హి
నైవైష వాఙ్మనసగోచర ఇత్యుదాహ ॥ 32

సుందరబాహుస్వామి అనే శ్రీకృష్ణునిలో ఉండే లెక్కకు మించిన కల్యాణ గుణాలలోని ఒక్కొక్క కల్యాణానుభవం వల్ల కలిగే ఆనందం ఇంతటిది అని, ఇటు వంటిది అని కొలవాలని ప్రారంభించిన వేదం "**తే యే శతమ్**" అని అంటూ లెక్కించి, ఆ ఆనందం అపరిచ్ఛిన్నమని, అవాఙ్మానసగోచరమని అన్నది. ఇక అటువంటి సుందరబాహుస్వామి యొక్క సమస్తకల్యాణగుణానుభవంవల్ల కలిగే ఆనందాన్ని ఎవరు వర్ణించగలరు! ("**ఆనందమైశ్వరమ్, త్రయ్యుద్యతా తవ**" అనే శ్రీవైకుంఠస్తవ శ్లోకాల భావం స్మరణీయం.)

అబ్జపాద మరవిందలోచనం పద్మపాణితల మఞ్జనప్రభమ్ ।
సున్దరోరుభుజ మిన్దిరాపతిం వన్దిషీయ వరదం వనాద్రిగమ్ ॥ 33

తామరలవంటి శ్రీపాదాలను కలవాడు, కమలాలవంటి కన్నులను కలవాడు, తామరలవంటి శ్రీకరాలను కలవాడు, కాటుకవంటి కాంతిని కలవాడు, అందమైన పెద్ద భుజాలను కలవాడు, లక్ష్మీనాథుడు, వనాద్రిలో వేంచేసి ఉండే వరదుడైన సుందరబాహుస్వామిని నమస్కరిస్తున్నాను. ("**కైవణ్ణమ్ తామరై వాయ్ కమలమ్‌పోలుమ్ కణ్ణిణైయుమ్ అరవిన్ద మడియు మవఃఱి దే**" అనే తిరుమఙ్గైయాళ్వార్ల ప్రయోగం భావ్యం.)

**కనకమరకతాఞ్జనద్రవాణాం మథనసముత్థితసారమేలనోత్థమ్ ।**
**జయతి కిమపి రూప మస్య తేజో వనగిరినందనసున్దరోరుబాహో॥ 34**

వనాద్రివాసులను సంతోషపెట్టే అందమైన ఆజానుబాహువులను కల సుందరబాహుస్వామియొక్క తేజోరూపం బంగారం, పచ్చ, కాటుక- అనే వీని ద్రవాలను చిలకడం చేత వచ్చిన సారమైన భాగాలను మిశ్రణం చేయడంవల్ల పుట్టినట్లున్నది. ఆ అద్వితీయమైన రూపం సర్వోత్కర్షతో వెలుగొందుతున్నది. (**"ఐన్దీవరీ క్వచిదపి"** అనే శ్రీవైకుంఠస్తవ శ్లోకం కూడా స్మరించదగినది.)

**కిం ను స్వయం స్వాత్మవిభూషణం భవన్**
**అసా వలఙ్కార ఇతీరితో జనైః ।**
**వర్ధిష్ణుబాలద్రుమషణ్డమణ్డితం**
**వనాచలం వా పరితః ప్రసాధయన్ ॥ 35**

ఈ సుందరబాహుస్వామి స్వయంగానే తాను తన దివ్యమంగళవిగ్రహానికి అలంకారమైనందున, తన దివ్యరూపాన్ని దర్శించే భక్తులచేత అలంకారమనే నామంతో పిలువబడ్డాడా ? లేక, ఎల్లప్పుడు వృద్ధిచెందే లేలేత వృక్షసమూహాలచేత అలంకరింపబడ్డ వనగిరిచుట్టూ ఉండే భాగాన్ని అలంకరిస్తూ అలంకారనామంతో చెప్పబడ్డాడా ! (**"అழகన్ అలఙ్కారన్ తిరుమావిరుమ్ శోలైమలైయే"** అనే పెరియాழ్వార్ల సూక్తి స్మరణీయం.)

**సుఖస్పర్శై ర్నిత్యైః కుసుమసుకుమారాంగసుఖదైః**
**సుసౌగంధ్యై ర్దివ్యాభరణగణదివ్యాయుధగణైః ।**
**అలఙ్కార్యై స్సర్వై ర్నిగదిత మలఙ్కార ఇతి యః**
**సమాఖ్యానం ధత్తే స వనగిరినాథోఽస్తు శరణమ్ ॥ 36**

మెత్తని, సుఖమైన స్పర్శను కల్గినవి, పూవువలె సుకుమారమైన, పాదాల మొదలు శిరస్సువరకు గల దివ్యమంగళవిగ్రహానికి సుఖాన్ని కల్గించేవి, సువాసనను కల్గినవి, దివ్యదేహానికి అలంకారాలుగా ఉన్నవి, అన్నివిధాలైనవి అయిన కిరీటహారనూపురాది దివ్యాభరణకోటి, సుదర్శన పాంచజన్యాది దివ్యాయుధగణం- అనే వీటిచేత అలంకారశబ్దవాచ్యుడనే విషయం వ్యక్తం చేయబడే వనాద్రీశుడు మాకు శరణం కావాలి. (**"సర్వజ్ఞాః సముచితశక్తయః"**- ఇత్యాది వరదరాజస్తవశ్లోకంలో (47) కూడా ఆయుధాలకు ఆభరణత్వం వర్ణింపబడింది.)

మకుటమకుటమాలోత్తంసచూడాలలామ -
స్వలకతిలకమాలాకుణ్డలై స్సోర్ధ్వపుండ్రైః ।
మణివరవనమాలాహారకేయూరకణ్ఠ్యైః
తులసికటకకాఞ్చీనూపురాద్యై శ్చ భూషైః ॥ 37

అసిజలజరథాంగై శ్శార్జ్గకౌమోదకీభ్యామ్
అగణితగుణజాలై రాయుధై రప్యథాన్యైః ।
సతతవితతశోభం పద్మనాభం వనాద్రేః
ఉపవనసుఖలీలం సున్దరం వన్దిషీయ ॥ 38

కిరీటానికి చుట్టూ అలంకరింపబడ్డ రత్నమాల (పూలమాల), కిరీటంలోని శిరోరత్నం, గొప్ప శిరస్సుకు అలంకరింపబడ్డ ఆభరణాలు, అందమైన ముంగురులు, ముత్యాలు పొదిగిన బంగారంతో చేయబడ్డ లలాటహారమాల, కర్ణాభరణాలు- అనే వీటిచే, ఊర్ధ్వపుండ్రాలతోపాటు గొప్ప మణి అయిన కౌస్తుభం, వైజయంతీ వనమాల, ముత్యాలహారాలు, భుజకీర్తులు, కంఠసీమను అలంకరించే కంఠికలు- అనే వీటిచే, తులసీమాల, ముంజేతి కంకణాలు, మొలనూలు, నూపురాలు మొదలైన అలంకారాలచే, నందకం అనే ఖడ్గం, పాంచజన్యమనే శంఖం, సుదర్శనమనే చక్రం, శార్జ్గమనే శంఖం, కామోదకి అనే గద- అనే వీటిచే, ఇంకా మిగిలిన ముసలహలాది లెక్క లేనన్ని సద్గుణాలను కల ఆయుధాలచే ఎల్లప్పుడూ అంతటా వ్యాపించిన శోభను కలవాడు, వనాద్రిలో ఉన్న ఉద్యానవనంలో సుఖంగా ఉన్నవాడు, లోకాలకు సుఖాన్ని కల్గించే పలు లీలలను చేసేవాడు, లోకాలకు మూలకారణం అయిన పద్మాన్ని నాభిలో కలవాడు అయిన సుందరబాహుస్వామిని నమస్కరిస్తాము. ("స్ఫురత్కిరీటాంగద" ఇత్యాది స్తోత్ర రత్న శ్లోకం "కిరీటమకుటచూడావతంస" ఇత్యాది గద్యసూక్తి స్మరణీయాలు.)

అజానజస్వగతబన్ధురగన్ధలుబ్ధ -
భ్రామ్యద్విదగ్ధమధుపాళిసదేశకేశమ్ ।
విశ్వాధిరాజ్యపరిబర్హకిరీటరాజం
హై ! సున్దరస్య బత ! సున్దర ముత్తమాఙ్గమ్ ॥ 39

సహజంగా పుట్టుకతో వచ్చిన దట్టమైన సువాసనలో లోభాన్ని (ఆశను) కల్గినవి, ఆ ఆశవల్ల చుట్టూ తిరిగే రాసిక్యాన్ని కల్గినవి అయిన తుమ్మెదల సమూహంతో సాటివచ్చే కేశపాశాన్ని కల్గినది, స్వామి ప్రపంచానికి ప్రభువై ఉండే విషయానికి గుర్తుగా ఉన్న కిరీటాన్ని కల్గినది అయిన సుందరబాహుస్వామియొక్క శిరస్సు ఎంత అందమైనది !

ఆహా ! ("కళివణ్డెఙ్గుమ్ కలన్దాల్పోల్ కముఴ్ పూఙ్కుఴల్కళ్ తడన్దోళ్ మేల్ మిళిర నిన్ఱు" అనే గోదాదేవి సూక్తి స్మరణీయం.)

అన్ధం తమ స్తిమిరనిర్మిత మేవ యత్ స్యాత్
తత్సారసాధితసుతన్తుతివృత్తవార్తమ్ ।
ఈశస్య (కేసరిగిరే) కేశవహరే రళకాళిజాలం
తత్తుల్యకుల్యమధుపాఢ్యమహావనస్య ॥ 40

సుందరబాహుస్వామి ముంగురులతో సాటి వచ్చే తుమ్మెదలతో నిండిన గొప్పదనాన్ని కల్గినది, కేశవస్వామి నివసించేది అయిన వనగిరికి ప్రభువైన సుందరబాహు స్వామియొక్క తుమ్మెదలవంటి ముంగురుల సమూహం, చీకటితో నిర్మించిన దట్టమైన చీకటి ఒకటి ఉంటే, దాని సారంతో చేయబడ్డ చక్కని దారాలను కూడా మించినదిగా తోస్తున్నవి. ("కొళ్కిన్ఱ కోళిరుళై చ్చుకిర్న్దిట్ట ..... అన్ఱు మాయన్కుఴల్" అనే తిరువాయ్మొఴి సూక్త్యనుగుణం ఈశ్లోకం. మూడవ పాదంలో "కేశవగిరేః" అనే పాఠాంతరం ఉన్నది.)

జుష్టాష్టమీకజ్వలదిన్దుసన్నిభం ధృతోర్ధ్వపుణ్డ్రం విలసద్విశేషకమ్ ।
భూమ్నా లలాటం విమలం విరాజతే వనాద్రినాథస్య సముచ్ఛ్రితశ్రియః ॥ 41

"ఏఱు తిరువుడైయాన్" అని కీర్తింపబడే వనాద్రిప్రభువు యొక్క లలాటం అష్టమీతిథినాడు వెలిగే చంద్రునితో సమానంగా ఉన్నది. ఆ లలాటం ఊర్ధ్వపుండ్రాన్ని ధరించినదై. ప్రకాశించే కస్తూరినామంతో వెలిగేదై, దోషరహితమైనదై వెల్గొందుతున్నది.

సుచారుచాపద్వయవిభ్రమం భ్రువోః
యుగం సునేత్రాహ్వసహస్రపత్రయోః ।
ఉపాన్తగం వా మధుపావలీయుగం
విరాజతే సున్దరబాహుసంశ్రయమ్ ॥ 42

సుందరబాహుస్వామిని ఆశ్రయంగా కల కనుబొమల జంట చాలా అందమైన రెండు ధనుస్సుల అందంవంటి అందాన్ని కల్గి, చక్కని కన్నులు అనే తామరపూల జంట సమీపంలో చేరిన తుమ్మెద వరుసల జంటవలె ప్రకాశిస్తున్నది.

అదీర్ఘ మప్రేమదుఘం క్షణోజ్జ్వలం న చోర మన్తఃకరణస్య పశ్యతామ్ ।
అనుజ్జ మజ్జం ను కథం నిదర్శనం వనాద్రినాథస్య విశాలయో ర్దృశోః ॥ 43

విశాలంగా లేనిది, ప్రేమను వర్షించలేనిది, క్షణకాలం మాత్రమే ప్రకాశించేది, దర్శించేవారి మనస్సును దోచలేనిది, వక్రంగా ఉన్నది. అయిన తామరపూవు ఈ దోషాలు ఏవీ లేని సుందరబాహుస్వామియొక్క విశాలనేత్రాలతో ఏవిధంగా సాటివస్తుంది ! (ఉపమేయంకంటే ఉపమానానికి ఆధిక్యాన్ని వర్ణించే రూపంలోని ఈవ్యతిరేకాలం కారాన్ని పంచస్తవాలలో పలు చోట్ల గమనించవచ్చు. దీనికి మూలం దివ్యసూరుల సూక్తులే.)

**ప్రశ్చ్యోతత్ప్రేమసారామృతరసచుళకప్రక్రమప్రక్రియాభ్యాం**
**విక్షిప్తాలోకితోర్మిప్రసరణముషితస్వాన్తకాన్తాజనాభ్యామ్ ।**
**విశ్వోత్పత్తిప్రవృత్తిస్థితిలయకరణైకాన్తశాన్తక్రియాభ్యాం**
**దేవోఽలఙ్కారనామా వృషగిరినిలయో వీక్షతా మీక్షణాభ్యామ్ ॥ 44**

విశేషంగా వ్యక్తం అయే, సారమైన ప్రేమ అనే అమృతరసంయొక్క పుడిసిలివంటి క్రమాన్ని కల్గినవి, చక్కగా నాల్గు వైపుల ప్రసరించే కటాక్షాలనే కెఱటాలు ప్రసరంచడంచేత గోపికల మనస్సులను దోచుకొన్నవి, చేతనాచేతనాత్మకం అయిన ప్రపంచంయొక్క సృష్టి-స్థితి- గతి-నాశాల నిర్వహణలో ఏ అడ్డూ లేని ప్రయత్నాలను కల్గినవి అయిన తిరునేత్రాలను కల వనగిరినివాసి అయిన దేవుడు ఆ నేత్రాలతో నన్ను కటాక్షించాలి. (**"నావేక్షసే యది తతో భువనాన్యమూని"**- ఇత్యాది స్తోత్రరత్నసూక్తి ప్రకృతంలో స్మరణీయం.)

**ప్రేమామృతౌఘపరివాహిమహాక్షిసిన్ధు-**
**మధ్యే ప్రబద్ధసముదఞ్చితసేతుకల్పా ।**
**ఋజ్వీ సుసున్దరభుజస్య విభాతి నాసా**
**కల్పద్రుమాఙ్కురనిభా వనశైలభర్తుః ॥ 45**

వనశైలానికి ప్రభువైన సుందరబాహుస్వామి నాసిక ప్రేమామృతప్రవాహం ప్రవహించే విశాలనేత్రాలనే సముద్రం మధ్యలో చక్కగా నిర్మింపబడ్డ, ఉన్నతమైన సేతువువలె, ఋజువుగా ఉండే కల్పవృక్షంయొక్క చిగురువలె ప్రకాశిస్తున్నది. (**"త్వదీక్షణ సుధాసింధు"** అనే దేవరాజాష్టక శ్లోకం, **"కరుణారసవాహివీక్షణోః"** అనే వరదరాజస్తవ శ్లోకం భావ్యాలు.)

**వ్యాభాషితాభ్యధికనన్దనభన్దనర్ధి-**
**మందస్మితామృతపరిస్రవసంస్తవాఢ్యమ్ ।**

అభాతి విద్రుమసమాధర మాస్య మస్య
దేవస్య సున్దరభుజస్య వనాద్రిభర్తుః ॥ 46

తిరుమాలిరుమ్‌శోలై పర్వతానికి ప్రభువు, సుందరబాహువనే పేరు గల ఈ దేవుని ముఖం - ఇతని పలుకులకంటే ఎక్కువ ఆనందాన్ని కల్గించేది, మంగళకరమైనది, సమృద్ధిని కల్గినది అయిన చిఱునవ్వును కల్గినదై, ఆ చిఱునవ్వు అనే అమృతరస ప్రవాహసంబంధంచేత సుసంపన్నం అయిన పగడంవలె ఎఱ్ఱనిది అయిన అధరాన్ని కల్గినదై - ప్రకాశిస్తున్నది.

యశోదాఙ్గుల్యగ్రోన్నమితచుబుకాఘ్రాణముదితౌ
కపోలా వద్యాఽపి హ్యనుపరతతద్ధర్షగమకౌ ।
విరాజేతే విష్వగ్వితతసహకారాసవరస-
ప్రమాద్యద్భృఙ్గాఢ్యద్రుమవనగిరే స్సుందరహరేః ॥ 47

నాల్గు వైపుల విస్తరించిన తీయమామిడి చెట్లయొక్క మధురమైన రసంవల్ల (మధువును ఆస్వాదించడంవల్ల) మదాన్ని పొందిన తుమ్మెదలతో వనగిరిలోని వృక్షాలు నిండుగా ఉన్నాయి. అటువంటి వనగిరిని నివాసంగా కల సుందరబాహుస్వామి చెక్కిళ్ళు రెండిటిని యశోదాదేవి శ్రీకృష్ణావతారసమయంలో తన చేతివేళ్ళ చివరిభాగాలతో మెల్లగా పైకి ఎత్తి, చుబుకాన్ని ఆఘ్రాణించడం (ముద్దాడడం) చేత కల్గిన సంతోషం ఈ నాటికీ (సుందరబాహు స్వామిగా వెలసి ఉన్నా ఈనాటికీ) ఆ చెక్కిళ్ళలో అనువర్తిస్తున్నది. ఆ హర్షాన్ని సూచించే రోమాంచాన్ని అవి కల్గి ఉన్నవి.

వ్యాలమ్బికుణ్డల ముదగ్రసువర్ణపుష్ప-
నిష్పన్నకల్పలతికాయమలానుకారమ్ ।
యత్కర్ణపాశయుగలం నిగలం ధియాం నః
సోఽయం సుసున్దరభుజో వనశైలభూషా ॥ 48

భుజాలవరకు వేలాడే కర్ణాభరణాలను కల్గినవి, మిక్కిలి గొప్పవి అయిన బంగారు పూలతో ఏర్పడిన కల్పలతలను పోలిన సుందరబాహుస్వామియొక్క రెండు అందమైన కర్ణాలు మన మనస్సులకు సంకెళ్ళుగా తోస్తున్నవి. అటువంటి సుందరబాహుస్వామి ఈ వనగిరికి అలంకారం.

సదంససంసక్తితకుంతలాన్తికాఽవతీర్ణకర్ణాభరణాఢ్యకన్ధరః ।
సుబన్ధురస్కన్ధనిబన్ధనో యువా సుసున్దర స్సున్దరదో ర్విజృంభతే ॥ 49

అందమైన బాహువులను స్పృశించే ముంగురుల సమీపంవరకు కిందకు ఉండే కర్ణకుండలాలతో సుందరమైన కంఠాన్ని కలవాడు, చక్కగా అమరి ఉండే పటిష్ఠమైన బాహుస్కంధబంధాలను కలవాడు, నిత్యయౌవనాన్ని కలవాడు, అందమైన బాహువులను కలవాడు అయిన సుందరబాహుస్వామి వర్ధిల్లుతున్నాడు. ("కలివణ్ణైఞ్గమ్ కలన్దాత్పోల్" ఇత్యాది గోదాసూక్తి, "మైవణ్ణమ్ నఱుఙ్కుఙ్జి" ఇత్యాది తిరుమఙ్గైమన్నన్ సూక్తి భావ్యాలు.)

**వ్యూఢగూఢభుజజత్రు ముల్లసత్కమ్బుకన్ధరధరం ధరాధరమ్ ।**
**వృక్షషణ్డమయభూభృత స్తటే సుందరాయతభుజం భజామహే ॥ 50**

ఏ భారాన్ని అయినా మోయగలిగే సామర్థ్యాన్ని కల్గినది, బలిష్ఠమైనది అయిన భుజజత్రువును (భుజాలకు- కంఠానికి మధ్యన ఉండే భాగాన్ని) కలవాడు, గొప్పగా ప్రకాశించే శంఖంవంటి కంఠాన్ని కలవాడు, ఈ భూమిని ధరించేవాడు, అందమైన, విశాలమైన భుజాలను కలవాడు అయిన స్వామిని వృక్షసమూహాలతో నిండిన వనగిరి సానువులో సేవిస్తున్నాము.

**మన్దరభ్రమణవిభ్రమోద్భటా స్సున్దరస్య విలసన్తి బాహవః ।**
**ఇన్దిరాసమభినన్దచన్దనా శ్చన్దనాగరువిలేపభూషితాః ॥ 51**

మందరపర్వతం అనే కవ్వంతో పాలసముద్రాన్ని మథించినప్పటి భ్రమణమనే లీలలో గొప్ప ఆనందాన్ని కల్గినవి, లక్ష్మీదేవిని ఆనందింపజేయడంలో మంగళకరమైనవి, చందనం- అగరుపూతలచే అలంకరింపబడినవి అయిన సుందరబాహుస్వామి బాహువులు విలసిల్లుతున్నాయి.

**జ్యాకిణాఙ్కపరికర్మధర్మిణో భాన్తి సున్దరభుజస్య బాహవః ।**
**పారిజాతవిటపాయితర్ద్ధయః ప్రార్థితార్థపరిదానదీక్షితాః ॥ 52**

అవతారదశలో శార్ఙ్గమనే వింటిని దాల్చి అసురులతో యుద్ధం చేసినపుడు ఆ వింటినారి (దారం) గట్టిగా తాకడంచేత ఏర్పడ్డ కిణాలు (కాయలు) అనే గుర్తులను అలంకారంగా కల్గినవి, పారిజాతవృక్షశాఖలవలె దానగుణంలో సమృద్ధిని కల్గినవి, ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధపురుషార్థాలను సమగ్రంగా ఇవ్వడం అనే దీక్షను కల్గినవి అయిన సుందరబాహుస్వామియొక్క బాహువులు (గొప్పగా) ప్రకాశిస్తున్నాయి. (**"జ్యాకిణకర్కశైః శుభైః"** అని యామునులు వైకుంఠనాథుని విషయంలో కిణాంకత్వాన్ని అనుసంధించగా కూరేశులు దానిని అర్చావతారవిషయంలో అనుసంధిస్తున్నారు.)

సాగరామ్బరతమాలకాననశ్యామల౯ర్ధయ ఉదారపీవరాః ।
శేషభోగపరిభోగభాగిన స్తన్నిభా వనగిరీశితు ర్భుజాః ॥ 53

(నల్లని) ఆకాశంవలె, సముద్రంవలె, కాటుకచెట్ల అరణ్యంవలె నల్లనివి, సమృద్ధిని కల్గినవి, దానం ఇవ్వడంలో సాటి లేనివి, బలిష్ఠాలైనవి, ఆదిశేషుని శరీరంపై శయనించేవి, ఆ ఆదిశేషుని శరీరంవంటివి అయిన సుందరబాహుస్వామి బాహువులు ప్రకాశిస్తున్నాయి.

అహమహమికాభాజో గోవర్ధనోద్ధృతినర్మణి
ప్రమథనవిధా వబ్ధే ర్లబ్ధప్రబన్ధసమక్రియాః ।
అభిమతబహూభావాః కాన్తాభిరమ్భణసంభ్రమే
వనగిరిపతే ర్బాహా ఞృమ్భన్తి సున్దరదో ర్ద్విషః ॥ 54

గోవర్ధనపర్వతాన్ని చేతితోఎత్తి పట్టుకోవడమనే దివ్యలీలలో "నేను ముందు నేను ముందు" అనే అహమహమిక స్థితిని పొందినవి, పాలసముద్రాన్ని మథించడం అనే ప్రయత్నంలో ఒకే విధమైన వ్యాపారాన్ని కల్గినవి, పత్ని అయిన లక్ష్మీదేవిని ఆలింగనం చేసికోవడంలోని అభినివేశంవల్ల "ఇంకా ఇంకా కొన్ని బాహువులుంటే ఎంత బాగుండును !" అనే భావాన్ని కల్గినవి అయిన సుందరబాహుస్వామి బాహువులు మిన్నగా ప్రకాశిస్తున్నాయి.

శ్రీమద్వనాద్రిపతిపాణితలాబ్జయుగ్మమ్
ఆరూఢయో ర్విమలశఙ్ఖరథాఙ్గయో స్తు ।
ఏకోఽబ్జ మాశ్రిత ఇవోత్తమరాజహంసః
పద్మప్రియోఽర్క ఇవ తత్సమితో ద్వితీయః ॥ 55

తిరుమాలిరుమ్‌శోలైకు ప్రభువైన సుందరబాహుస్వామియొక్క కరతలాలనే రెండు తామరపూలను అధిరోహించిన తెల్లని శంఖం, సుదర్శనం- అనే ఈ రెండిటిలో ఒకటి అయిన శంఖం తామరపూవును చేరిన ఉత్తమరాజహంసవలె, రెండవది అయిన శ్రీ సుదర్శనం తామరపూవుపట్ల గొప్ప ప్రేమను కల సూర్యునివలె విరాజిల్లుతున్నవి.

లక్ష్మ్యాః పదం కౌస్తుభసంస్కృతం చ
శ్రీవత్సభూమి ర్విమలం విశాలమ్ ।
విభాతి వక్షో వనమాలయాఽఽఢ్యం
వనాద్రినాథస్య సుసున్దరస్య ॥ 56

వనాద్రినాథుడైన, గొప్ప అందాన్ని కల సుందరబాహుస్వామియొక్క వక్షఃస్థలం లక్ష్మీదేవికి నివాసస్థానంగా, కౌస్తుభమణిచేత అలంకరింపబడినదిగా, శ్రీవత్సమనే పుట్టుమచ్చకు స్థానంగా, నిర్మలమైనదిగా, విశాలమైనదిగా, వైజయంతి అనే వాడని పూలతో కూర్చబడ్డ వనమాలను ధరించిన మహనీయమైనదిగా ప్రకాశిస్తున్నది.

**సౌన్దర్యామృతసారపూరపరివాహావర్తగర్తాయితం**
**యాతః కిఞ్చ విరిఞ్చసమ్భవనభూమ్యమ్భోజసంభూతిభూః ।**
**నాభి శ్శుమ్భతి కుమ్భికుమ్భనిభనిర్భాతస్తనస్వర్వధూ-**
**సమ్భుక్తద్రుమషణ్డశైలవసతే రారూఢలక్ష్మ్యా హరేః ॥ 57**

ఏనుగు కుంభస్థలంతో పోలిన స్తనాలను కల స్వర్గంలోని రంభ, మేనక, తిలోత్తమాది వధువులచే ఎంతో అభినివేశంతో అనుభవింపబడ్డ వనసమూహాన్ని కల్గిన వనగిరి పర్వతాన్ని వాసస్థానంగా కల్గినవాడు, **"ఏఱు తిరువుడైయాన్"** అనే నామాన్ని కలవాడు అయిన హరియొక్క నాభి సౌందర్యామృతసారప్రవాహంలోని సుడిగుండం వలె ఉన్నది. అంతేకాక, బ్రహ్మకు ఉత్పత్తి స్థానం అయిన నాభీపద్మంయొక్క జన్మస్థానమై ప్రకాశిస్తున్నది.

**సున్దరస్య కిల సున్దరబాహో శ్శ్రీమహాతరువనాచలభర్తుః ।**
**హన్త ! యత్ర నివసన్తి జగన్తి ప్రాపితక్రశిమతత్తనుమధ్యమ్ ॥ 58**

పెద్ద పెద్ద వృక్షాలను కల వనాద్రికి ప్రభువు, సుందరమైన బాహువులను కలవాడైన సుందరబాహువుయొక్క ఏ దివ్యదేహంలో సమస్తలోకాలు నివసిస్తున్నాయో, ఆ తనువు మధ్యభాగం చాలా సన్నంగా ఉన్నదికదా ! ఆహా ! ఇదేమి వింత !

**పిష్టదుష్టమధుకైటభకీటౌ హస్తిహస్తయుగళాభసువృత్తౌ ।**
**రాజతః క్రమకృశౌ చ సదూరూ సున్దరస్య వనభూధరభర్తుః ॥ 59**

దుష్టులైన మధుకైటభులనే అసురులను పిండి చేసినవి, ఏనుగు తొండాల జంటను పోలినవి, చక్కగా వర్తులంగా ఉన్నవి, పైన లావుగా క్రమంగా క్రిందకు సన్నంగా ఉన్నవి అయిన వనగిరీశుని చక్కని ఊరువులు రెండూ వెలుగుతున్నవి.

**యౌవనవృషకకుదోద్భేదనిభం నితరాం**
**భాతి విభో రుభయం జాను శుభాకృతిమ్ ।**
**సున్దరభుజనామ్నో మన్దరమథితాబ్ధేః**
**చన్దనవనవిలసత్కన్దరవృషభపతేః ॥ 60**

మందరపర్వతాన్ని కవ్వంగా చేసికొని సముద్రాన్ని చిలికినవాడు, చందన వృక్షాల వనాలచే ప్రకాశించే (పరిసరప్రాంతాలను కల్గిన) కొండగుహలను కల వనాద్రికి అధిపతి అయిన సుందరబాహుస్వామియొక్క మంగళమైన ఆకారాన్ని కల రెండు మోకాళ్ళు యౌవనం అనే ఎద్దు మూపురాలవలె చాలా గొప్పగా ప్రకాశిస్తున్నాయి.

అధోముఖన్యస్తపదారవిన్దయో రుదఞ్చితోదాత్తసునాలసన్నిభే ।
విలంఘ్య జఙ్ఘే క్వను రంహతో దృశౌ వనాద్రినాథస్య సుసున్దరస్య మే ॥ 61

వనాద్రికి ప్రభువైన సుందరబాహుస్వామియొక్క, అధోముఖంగా నిలుపబడ్డ పదారవిందాల గుండ్రని, విశాలమైన, చక్కని తూడులతో సమానంగా తోచే రెండు పిక్కలను దాటి నా మనస్సు ఎక్కడికీ పోలేదు.

సుసున్దరస్యాఽస్య పదారవిన్దే పదారవిన్దాధికసౌకుమార్యే ।
అతోఽన్యథా తే బిభృయాత్కథం ను తదాసనం నామ సహస్రపత్రమ్ ॥ 62

సుందరబాహుస్వామి పాదారవిందాలు రెండు పద్మపీఠంకంటే చాలా ఎక్కువ సౌకుమార్యాన్ని కల్గినవి. లేకపోతే ఆ పాదపద్మాలను రెండిటిని ఆసనపద్మం అనే పేరును కల సహస్రపత్రం ఏవిధంగా మోస్తుంది !

సౌన్దర్యమార్దవసుగన్ధరసప్రవాహైః ఏతే హి సున్దరభుజస్య పదారవిన్దే ।
అమ్భోజదమ్భపరిరంభణ మభ్యజైష్టాం తద్ధ్వి పరాజిత మిమే శిరసా బిభర్తి ॥ 63

ఈ సుందరబాహుస్వామి పాదారవిందాలు రెండు తమకు ఉండే సౌందర్యం, మార్దవం, సౌగంధ్యం, మకరందరసప్రవాహం- అనే గుణాలతో నీటిలోని తామరపూవు యొక్క గర్వాన్ని జయించాయి. ఓడిపోయిన ఆ తామరపూవు ఈ సుందరబాహుస్వామి శ్రీపాదాలను శిరస్సుతో భరిస్తున్నది. ఇది నిజం.

ఏతే తే బత ! సున్దరాహ్వయజుషః పాదారవిన్దే శుభే
యన్నిర్ణేజనసముత్థితత్రిపథగాస్రోతస్సు కించిత్కిల ।
ధత్తేఽసౌ శిరసా ధ్రువ స్తదపరం స్రోతో భవానీపతిః
యస్యాస్యాలకనందికేతి నిజగు ర్నామైవ మన్వర్థకమ్ ॥ 64

(త్రివిక్రమావతారసమయంలో) సుందరబాహుస్వామి పాదాలను బ్రహ్మ అభిషేకించినపుడు పుట్టిన త్రిపథగ (గంగానది) యొక్క దేవలోక- భూలోక- పాతాళలోకాలనే మూడు లోకాలలో ప్రవహించిన మూడు ప్రవాహాలలో ఒక ప్రవాహాన్ని

జోతిశ్చక్రాన్ని నడిపించే ధ్రువుడు శిరస్సుతో ధరిస్తున్నాడు. ఇంకొక ప్రవాహాన్ని శివుడు తన తలపై ధరిస్తున్నాడు. శివుని తలపైన ఉండే ప్రవాహాన్ని అలకనంద అనే సార్థకమైన పేరుతో మహర్షులు వ్యవహరిస్తారు. ఇటువంటి సుందరబాహుస్వామి శ్రీపాదపద్మాలు మంగళకరాలుగా భాసిస్తున్నాయి. ఆహా ! ఆశ్చర్యం ! (వరదరాజస్తవంలోని "త్వత్పాదాబ్జే" అనే శ్లోకం భావ్యం).

అమ్నాయకల్పలతికోత్థసుగన్ధిపుష్పం
యోగీన్ద్రహార్దసరసీరుహరాజహంసమ్ ।
ఉత్పక్వధర్మసహకారఫలప్రకాణ్డం
వన్దేయ సున్దరభుజస్య పదారవిన్దమ్ ॥ 65

వేదమనే కల్పలతనుండి పుట్టినది, సౌగంధ్యాన్ని కల్గినది అయిన పూవువంటిది, యోగీంద్రులైన పరాంకుశపరకాలాదిమునీంద్రుల, శ్రీనాథయామునయతివరాది మునీంద్రుల హృదయకమలాలలో నివసించే రాజహంసవంటిది, బాగా పండిన ధర్మం అనే తీయమామిడిచెట్టుయొక్క గొప్ప ఫలంవంటిది అయిన సుందరబాహుస్వామి పాదారవిందాల జంటను నమస్కరిస్తున్నాను.

సుసున్దరస్యాస్య తు వామనాకృతేః క్రమత్రయపార్థిని మానసే కిల ।
ఇమే పదే తావదిహాఽసహిష్ణునీ విచక్రమాతే త్రిజగత్పదద్వయే ॥ 66

వామనావతారాన్ని ఎత్తిన ఈ సుందరబాహుస్వామి మనస్సు మహాబలి అనే అసురుని వద్దకు పోయి మూడు అడుగుల నేలను ప్రార్థించగా, అధముడైన అసురునివద్ద ఆ విధంగా యాచన చేయడం సహించలేని (స్వామి) ఈ రెండు పాదాలు (మూడు అడుగులు అక్కర లేదని తలచి) ఈ భూమిలో కేవలం రెండు పాదాలతోనే ముల్లోకాలను విక్రమించాయికదా!

సౌన్దర్యసారామృతసిన్ధువీచిశ్రేణీషు పాదాఙ్గుళినామికాసు ।
న్యక్కృత్య చన్ద్రశ్రియ మాత్మకాన్త్యా నఖావళీ శుమ్భతి సున్దరస్య ॥ 67

వనగిరిలోని సుందరబాహుస్వామియొక్క పాదాల వేళ్ళు అనే పేరును కల సౌందర్యసారామృతసముద్రంలోని కెఱటాల వరుసలలోని నఖసమూహం (అనే అపూర్వమైన చంద్రసమూహం) తమ కాంతితో (ఆకాశంలోని) చంద్రుని శోభను తిరస్కరించి (ఓడించి) శోభిల్లుతున్నాయి.

యో జాతక్రశిమా మలీ చ శిరసా సంభావిత శ్శమ్భునా
సోఽయం యచ్చరణాశ్రయా శశధరో నూనం నఖవ్యాజతః ।
పూర్ణత్వం విమలత్వ ముజ్జ్వలతయా సార్ధం బహుత్వం తథా
యాత స్తం తరుషణ్డశైలనిలయం వన్దామహే సున్దరమ్ ॥ 68

శివునిచే తలపై ధరించి, గౌరవింపబడ్డ ఏ చంద్రుడు కార్శ్యాన్ని పొందిన వాడుగా, మలినాన్ని (మచ్చను) కలవాడుగా అయ్యాడో, ఆ ఈ చంద్రుడు నఖాల పేరుతో సుందరబాహుస్వామి శ్రీపాదాలను ఆశ్రయించి పూర్ణత్వాన్ని, విమలత్వాన్ని పొందాడు. అంతేకాక, మఱింతగా ప్రకాశాన్ని పొందడంతోపాటు బహుత్వాన్నికూడా పొందాడు. ఇది నిశ్చయం. వృక్షసమూహంతో కూడుకొన్న వనగిరిలో అధివసించే ఇటువంటి సుందరబాహుస్వామిని నమస్కరిస్తున్నాము. (వరదరాజస్తవంలోని **"శంభో రంభోరుహముఖ"** ఇత్యాది శ్లోకార్థం స్మరణీయం).

యస్యాః కటాక్షణ మనుక్షణ మీశ్వరాణామ్
ఐశ్వర్యహేతు రితి సర్వజనీన మేతత్ ।
శ్రీ స్సేతి సున్దరనిషేవణతో నిరాహుః
త్వాం హి శ్రియ శ్శ్రియ ముదాహు రుదారవాచః ॥ 69

లక్ష్మీదేవియొక్క కటాక్షం బ్రహ్మరుద్రేంద్రాది దేవతలకు ప్రతిక్షణం వారి వారి ఐశ్వర్యానికి కారణం అన్నది నిజం. అటువంటి లక్ష్మీదేవి ఏసుందరబాహుస్వామివి అయిన నిన్ను ఆశ్రయించడంవల్ల **"శ్రీః"** అని (**"శ్రయతే ఇతి శ్రీః"**) అనబడుతున్నదని అభిజ్ఞులు నిర్వచించారో, అటువంటి నిన్ను ఉదార (గొప్ప) వాక్కులను కల మహర్షులు, దివ్యసూరులు పూర్వాచార్యులు లక్ష్మికే లక్ష్మిగా నిర్వచించారు. (**"ఉదారవాచః"**- **తిరుమఙ్గైయాళ్వార్, ఆళవన్దార్, ఆళ్వాన్, భట్టర్**- అని తిరుప్పావై ఆఱాయిరప్పడి వ్యాఖ్య. **"తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా"** అని తిరుమంగైమన్నన్, **"కః శ్రీః శ్రియః"** అని ఆళవన్దార్ పల్కడం స్మరణీయం. శ్రీవైకుంఠస్తవంలోని **"యస్యాః కటాక్షణమ్"** అనే 29వ శ్లోకం కొద్ది భేదంతో ఇక్కడ స్వీకరింపబడింది.)

దివ్యాచిన్త్యమహాద్భుతోత్తమగుణై స్తారుణ్యలావణ్యక-
ప్రాయై రద్భుతభావగర్భసతతాపూర్వప్రియై ర్విభ్రమైః ।
రూపాకారవిభూతిభి శ్చ సదృశీం నిత్యానపేతాం శ్రియం
నీళాం భూమి మపీదృశీం రమయితా నిత్యం వనాద్రీశ్వరః ॥ 70

అప్రాకృతాలు, ఇంతటివి, ఇటువంటివి అని ఊహించడానికి వీలుకానివి, అత్యాశ్చర్యకరాలైనవి, ఉత్తమమైనవి అయిన జ్ఞానశక్త్యాదులతో, దయావాత్సల్యాది స్వరూపగుణాలతో, తారుణ్యం, లావణ్యం వంటి రూపగుణాలతో, ఆశ్చర్యాన్ని కల్గించే అభిప్రాయాలను కల్గినవి, ఎప్పటికప్పుడు కొత్తగా తోచేవి, ప్రియాలై ఉన్నవి అయిన విలాసాలతో, స్వరూపాలతో, దివ్యమంగళవిగ్రహంతో, సంపదతో, తనకు తగినది, తనను ఏనాడూ విడిచి ఉండనిది అయిన లక్ష్మీదేవిని, ఇటువంటి వారే అయిన భూదేవి, నీళాదేవులను కూడిఉండే వనాద్రి ప్రభువు ఎల్లప్పుడు భక్తులను ఆనందింపజేస్తున్నాడు. (శరణాగతిగద్యలోని **"భగవన్నారాయణాభిమతానురూప...."** ఇత్యాది లక్ష్మీగద్య, **"ఏవం భూతభూమినీళానాయక"** ఇత్యాది శరణాగతిగద్య సూక్తి ఇక్కడ స్మరణీయాలు.)

**అన్యోన్యచేష్టితనిరీక్షణహార్దభావ -**
**ప్రేమానుభావమధురప్రణయప్రభావః ।**
**ఆజస్రనవ్యతరదివ్యరసానుభూతిః**
**స్వాం ప్రేయసీం రమయితా వనశైలనాథః ॥ 71**

పరస్పరం భ్రూభంగమందహాసాది విలాసాలతో, కటాక్షాలతో, తారుణ్య లావణ్యాది హార్దభావాలతో మధురమైన ప్రేమాతిశయాన్ని కలవాడు, నిరంతరం నూతనంగా భాసించే, అప్రాకృతమైన ఆనందానుభవాన్ని కలవాడైన సుందరబాహు స్వామి తనకు ప్రియపత్ని అయిన లక్ష్మీదేవిని ఆనందింపజేస్తున్నాడు. (**"రామ స్తు సీతయా సార్ధం విజహార బహూన్ ఋతూన్, మనస్వీ తద్గత స్తస్యాః నిత్యం హృది సమర్పితః"** ఇత్యాది శ్రీరామాయణసూక్తి అర్చామూర్తి విషయంగా అనుసంధేయం.)

**సున్దరస్య వనశైలవాసినో భోగ మేవ నిజభోగ మాభజన్ ।**
**శేష ఏష ఇతి శేషతాకృతేః ప్రీతిమా నహిపతి స్స్వనామని ॥ 72**

వనశైలవాసి అయిన సుందరబాహుస్వామియొక్క ఆనందానుభవంకోసమే తన శరీరాన్ని వినియోగించడం అనే గొప్పతనాన్ని పొందుతూ సర్పరాజు అయిన ఆదిశేషుడు ఆ భగవానునకు పలు రీతులలో సేవలను చేసే ఆకృతులద్వారా ఇతడు శేషుడు (శేషభూతుడు) అని అంటూ పలువురు వ్యవహరించే తన నామంలో ఎక్కువ ప్రీతిని కల్గి ఉన్నాడు.

**వాహనాసనవితానచామరాద్యాకృతిః ఖగపతి స్త్రయీమయః ।**
**నిత్యదాస్యరతి రేవ యస్య వై హ్యేష సున్దరభుజో వనాద్రిగః ॥ 73**

ప్రయాణానికి సాధనం అయిన వాహనంగా, ఆసీనుడు కావడానికి తగిన ఆసనంగా, మేల్‌కట్టుగా, చామరంగా - ఈవిధంగా పలు రూపాలను పొందిన వేదస్వరూపి, పక్షిరాజు అయిన గరుత్మంతుడు ఏ భగవానునకు ఒక్కనికే నిత్యమైన దాస్యం చేయడంలో అభిరుచిని కల్గినవాడో, ఆ స్వామి సుందరబాహువు వనాద్రిలో వేంచేసి ఉన్నాడు. ఇది ప్రసిద్ధమైన విషయం. (**"దాసస్సఖా"** అనే యామనసూక్తి భావ్యం)

**వనాద్రినాథస్య సుసున్దరస్య వై ప్రభుక్తశిష్టాశ్యథ సైన్యసత్పతిః ।**
**సమస్తలోకైకధురంధర స్సదా కటాక్షవీక్ష్యోఽ స్య చ సర్వకర్మసు ॥ 74**

వనాద్రికి ప్రభువైన సుందరబాహుస్వామి ఆరగించగా మిగిలిన ప్రసాదాన్ని భుజించేవాడైన సేనాధిపతి, సమస్తలోకాల భారాన్ని తానే వహించేవాడై, ఎల్లప్పుడూ అన్ని కార్యాల నిర్వహణకోసం ఈ సుందరబాహుస్వామియొక్క శుభకరాలైన కటాక్షాలచే అనుగ్రహింపబడేవాడై ఉన్నాడు. (స్తోత్రరత్నంలోని **"త్వదీయభుక్తోజ్ఝిత"** ఇత్యాది శ్లోకభావం స్మరణీయం. తిరువాయ్‌మొழிలోని (10-6-1) పాశురానికి ఈడు వ్యాఖ్య గమనించదగినది.)

**ఛత్రచామరముఖాః పరిచ్ఛదాః సూరయః పరిజనా శ్చ నైత్యగాః ।**
**సున్దరోరుభుజ మిన్ధతే సదా జ్ఞానశక్తిముఖనిత్యసద్గుణాః ॥ 75**

భగవత్కైంకర్యాన్ని విడువకుండా నిత్యం చేయడంచేత నిత్యులనబడే నిత్యసూరులు, అనంతగరుడవిష్వక్సేనాది పరిజనులు, ఛత్రచామరాది భోగోపకరణాలు, జ్ఞానం- శక్తి మొదలైన కల్యాణగుణాలు సుందరబాహుస్వామిని ఆశ్రయించి సదా ప్రకాశిస్తున్నాయి.

**ద్వారనాథగణనాథతల్లజాః పారిషద్యపదభాగిన స్తథా ।**
**మామకా శ్చ గురవః పురాతనాః సున్దరం వనమహీధ్రగం శ్రితాః ॥ 76**

చండప్రచండ, జయవిజయాది ద్వారపాలకులు, కుముదకుముదాక్షాది గొప్ప గణనాయకులు, ఆరీతిలోనే పారిషద్యపదవాచ్యులు ప్రాచీనకాలంనుండి కైంకర్యాన్ని చేసే దాసుని ఆచార్యులు, దివ్యసూరులు, వనాద్రిని చేరి నివసించే సుందరబాహుస్వామిని ఆశ్రయించారు.

**ఈదృశైః పరిజనైః పరిచ్ఛదైః నిత్యసిద్ధనిజభోగభూమిగః ।**
**సున్దరో వనగిరే స్తటీషు వై రజ్యతే సకలదృష్టిగోచరః ॥ 77**

ఈ విధంగా తెలుపబడ్డ అనంతగరుడ విష్వక్సేనాది పరిజనాలతో, ఛత్రచామరాది చిహ్నాలతో ఎల్లప్పుడూ ఒకే స్థితిలో ఉండే నిత్యవిభూతి అయిన శ్రీవైకుంఠంలో ఉన్నవాడైన భగవానుడు సుందరబాహుస్వామి అనే పేరుతో వనగిరి సానువులలో ఇపుడు అందఱి జనుల కన్నులకు దర్శనమిస్తూ, ఆనందిస్తున్నాడు.

ఆక్రీడభూమిషు సుగన్ధిషు పౌష్పికేషు
వైకుణ్ఠధామని సమృద్ధసువాపికాసు ।
శ్రీమల్లతాగృహవతీషు యథా తథైవ
లక్ష్మీధర స్సజతి సింహగిరే స్తటీషు ॥ 78

శ్రీవైకుంఠం అనే దివ్యదేశంలో పరిమళాన్ని కల, పూలతో నిండిన క్రీడాప్రదేశాలలో, నిండైన జలసంపదను కల చక్కని దిగుడుబావులలో, అందమైన గొప్ప పూపొదరిండ్లలో ఏవిధంగా విహరిస్తాడో ఆ రీతిలోనే శ్రియఃపతి అయిన, శ్రీవైకుంఠంలో ఉన్నవాడైన భగవానుడు వనగిరి సానువులలో ఇపుడు అందఱి జనుల కన్నులకు కన్పిస్తూ సుందరబాహుస్వామి అనే పేరుతో ఆనందిస్తున్నాడు. (**"పరితః పతితైః పతమానైః పాదపస్థై శ్చ నానాగంధవర్ణైః దివ్యపుష్పైః శోభమానైః దివ్యపుష్పోపవనైః ఉపశోభితే దివ్యోద్యానశతసహస్రకోటిభి రావృతే"** ఇత్యాది శ్రీవైకుంఠగద్యలోని సూక్తి భావ్యం. ఈ సందర్భంలోని పలుశ్లోకాలు శ్రీవైకుంఠగద్యలోని పరమపదవర్ణనను అనుసరించడంవల్ల, వనగిరి, శ్రీవైకుంఠనగర సామ్యాన్ని ధ్వనింపజేయడం కూరేశుల అభిప్రాయమని తోస్తున్నది.)

ఆనన్దమన్దిరమహామణిమణ్టపాన్తః
లక్ష్మ్యా భువాऽప్యహిపతౌ సహ నీళయా చ ।
నిస్సంఖ్యనిత్యనిజదివ్యజనైకసేవ్యో
నిత్యం వసన్ సజతి సున్దరదో ర్వనాద్రౌ ॥ 79

ఆనందనిలయం అనే పేరును కల గొప్ప మణిమంటపంలో ఆదిశేషునిపై లక్ష్మీదేవితోపాటు భూదేవి నీళాదేవులతో వేంచేసి ఉంటూ, లెక్కలేనంతమంది నిత్యసూరులనే తన దాసులచే మాత్రమే సేవింపదగిన భగవానుడు సుందరబాహు స్వామిగా ఇపుడు వనాద్రిలో నిత్యం సన్నిహితుడై ఉన్నాడు.

ప్రత్యర్థిని త్రిగుణకప్రకృతే రసీమ్ని
వైకుణ్ఠధామని పరామ్బరనామ్ని నిత్యే ।

నిత్యం వసన్ పరమసత్త్వమయేஉప్యతీత-
యోగీన్ద్రవాఙ్మనస ఏష హరి ర్వనాద్రౌ ॥ 80

ఉన్నతమైన సత్త్వగుణంతో నిండి ఉన్నది, త్రిగుణాలనబడే సత్త్వరజస్తమో గుణాలు కలిసిన మూలప్రకృతికి విరుద్ధమైనది, పరమాకాశమనబడే పేరును కల్గినది, నిత్యమైనది అయిన శ్రీవైకుంఠనగరంలో నిత్యం వేంచేసి ఉండేవాడు, యోగీంద్రుల వాక్కుకు, మనస్సుకు సైతం అందనివాడైన ఈ హరి, సుందరబాహుస్వామిగా వనగిరిలో అభినివేశాన్ని పొందాడు.

లోకాం శ్చతుర్దశ దధత్కిల సున్దరస్య
పఙ్క్తి గుణోత్తరితసప్తవృతీద మణ్డమ్ ।
అన్యాని చాస్య సుసదృంశి పరశ్శతాని
క్రీడావిధే రిహ పరిచ్ఛదతా మగచ్ఛన్ ॥ 81

పధ్నాలుగు లోకాలను ధరించేది, ఉత్తరోత్తరం ఒకదానికి ఇంకొకటి పది పది రెట్లు హెచ్చింపబడ్డ ఏడు ఆవరణాలను కల్గినది అయిన ఈ బ్రహ్మాండం, దీనితో పోలినవి, వందల సంఖ్యలో ఉన్నవి అయిన వేలు బ్రహ్మాండాలు- అన్నీ ఈ సుందరబాహుస్వామి క్రీడావిలాసంకోసం సాధనాలు అయినవి కదా ! (**"యదండమండాంతరగోచరమ్"** ఇత్యాది స్తోత్రరత్నశ్లోకార్థం భావ్యం.)

సురనరతిర్యగాదిబహుభేదకభిన్న మిదం
జగదథ చాஉణ్డ మణ్డవరణాని చ సప్త తథా ।
గుణపురుషౌ చ ముక్తపురుషా శ్చ వనాద్రిపతేః
ఉపకరణాని నర్మవిధయేஉపి భవన్తి విభో ॥ 82

దేవతలు, మనుష్యులు, తిర్యక్కులు- మొదలైన రీతులలో వేర్వేరుగా ఉండే ఈ జగత్తు, ఈ బ్రహ్మాండం, అదే విధంగా సప్తావరణాలు, త్రిగుణాలనబడే ప్రకృతి, బద్ధజీవులు, ముక్తపురుషులు- ఇవి అన్నీ అందటినీ పాలించే స్వామి అయిన, వనాద్రిలో ఉండే సుందరబాహుస్వామికి లీలకు (క్రీడకు) సాధనాలు అవుతున్నాయి.

జ్ఞానిన స్సతతయోగిన స్తు యే సున్దరాఙ్ఘ్రిపరభక్తిభాగినః ।
ముక్తి మాప్య పరమాం పరే పదే నిత్యకిఙ్కరపదం భజన్తి తే ॥ 83

కర్మయోగాన్ని అనుష్ఠించి, ఎల్లప్పుడూ భగవానునితో యోగాన్ని కోరేవారు, స్వస్వరూపజ్ఞానాన్ని పొంది, తమలో అంతరాత్మగా ఉన్న భగవానుని తెలియడం అనే

జ్ఞానయోగాన్ని అనుష్ఠించే జ్ఞానులు సుందరబాహుస్వామి శ్రీపాదాలలో పరభక్తిని పొందినవారు పరమపదంలో అపునరావృత్తి రూపం అయిన గొప్ప మోక్షాన్ని పొంది నిత్యకైంకర్యాన్ని చేసే స్థితిని పొందుతారుకదా !

దేవస్య సున్దరభుజస్య వనాద్రిభర్తుః
హై శీలవత్త్వ మథవాఽఽశ్రితవత్సలత్వమ్ ।
ఐశస్వభావ మజహద్భి రిహావతారైః
యోఽలంచకార జగదాశ్రితతుల్యధర్మా ॥ 84

ఏ సుందరబాహుస్వామి ఈశ్వరత్వప్రయుక్తం అయిన, తనకే స్వంతం అయిన ఐశ్వర్యాన్ని వీడని పలు అవతారాలలో ఈ ప్రకృతిమండలంలో తనను ఆశ్రయించిన వారి ధర్మాలతో పోలే ధర్మాలను కలవాడై ఈ లోకాన్ని అలంకరించాడో, ఆ దేవుడు, వనాద్రికి ప్రభువు అయిన సుందరబాహుస్వామియొక్క సౌశీల్యగుణం గాని, లేక, ఆశ్రితవాత్సల్యం గాని చాలా ఆశ్చర్యకరం. ("అజోఽపి సన్నవ్యయాత్మా .... సంభవామ్యాత్మమాయయా" ఇత్యాది గీతాశ్లోకార్థం, "ఆదియమ్ శోది యురువై అఙ్గువైత్తిఙ్గు ప్పిఱన్ద" అనే శఠకోపసూరి సూక్త్యర్థం స్మరణీయం. "జగదాశ్రితతుల్య ధర్మా"- "ఆత్మానం మానుషం మన్యే", "అహం వో బాంధవో జాతః" ఇత్యాది సూక్తుల భావాలు స్మరణీయాలు.)

సింహాద్రినాథ ! తవ వాఙ్మనసాతివృత్తం
రూపం త్వతీన్ద్రియ ముదాహ రహస్యవాణీ ।
ఏవం చ న త్వ మిహ చేత్సమవాతరిష్యః
త్వద్జ్ఞానభక్తివిధయోఽద్య ముధాఽభవిష్యన్ ॥ 85

వనగిరినాథా ! నీ దివ్యరూపం వాక్కుకు, మనస్సుకు అందనిది అని, చక్షురాది బాహ్యేంద్రియాలకు అందనిది అని ఉపనిషద్వాణి అన్నది. నీరూపం ఈ విధమైనది అయినా, ఈ ప్రకృతిమండలంలో ఈ సమయంలో నీవు అవతరించి ఉండకపోతే నీదివ్యరూపాన్ని విషయంగా చేసికొని ప్రవర్తించే జ్ఞానయోగ, భక్తియోగాదిశాస్త్రాలు నిర్విషయాలేకదా అయ్యేవి. ("త్వద్జ్ఞానభక్తివిధయః" అన్నపుడు "మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అని, "తా మర్చయేత్, తాం ప్రణమేత్", "నిత్యం ప్రదక్షిణీ కుర్యాత్" ఇత్యాది సూక్తుల భావాన్ని స్మరించడం ఉచితం. వరదరాజస్తవంలోని "వరద ! యది న భువ్యవాతరిష్యః" ఇత్యాది శ్లోకాన్ని, భట్టర్ రచించిన శ్రీగుణరత్నకోశంలోని "అసరస మభవిష్యన్నర్మ నాథస్య మాతః" ఇత్యాది శ్లోకాన్ని దీనికి అనుగుణంగా స్మరించడం

కూడా తగినది. అతిమానుషస్తవంలోని "ఏవం స్థితే" అనే శ్లోకాన్ని "వరద! యది భువి" అనే వరదరాజస్తవ శ్లోకాన్ని స్మరించాలి.)

యే భక్తా భవదేకభోగమనసోఽనన్యాత్మసంజీవనాః
తత్సంశ్లేషణతద్విరోధినిధనాద్యర్థం వనాద్రీశ్వర ।
మధ్యేఽణ్డం యదవాతర స్సురనరాద్యాకారదివ్యాకృతిః
తేనైవ త్రిదశై ర్నరై శ్చ సుకరం స్వప్రార్థితప్రార్థనమ్ ॥ 86

వనాద్రిప్రభూ ! తమ ఆత్మోజ్జీవనానికి భగవానుడవైన నీవు తప్ప వేఱు ఉపాయంలేదని భావించి, నీవల్లనే ఆత్మోజ్జీవనాన్ని పొందినవారు, నిన్ను మాత్రమే సేవించడం అనే విషయంలో అభినివేశాన్ని పొందిన మనస్సును కలవారు అయిన భక్తులతో కలసి వర్తించడం, వారి విరోధులను నిరసించడం మొదలైన ధర్మసంస్థాపనాదుల కోసం దేవతలు, నరులు మొదలైనవారి రూపాలలో దివ్యాకృతిని ధరించి ఈ బ్రహ్మాండంలో నీవు అవతరించినందువల్లనే దేవతలు, నరులు తమ తమ కోరికలను నీవద్ద ప్రార్థించి పొందడానికి వీలయినది. ("భవదేకభోగమనసః" అన్నపుడు "ఉణ్ణుమ్ శోరు పరుకుమ్ నీర్..." ఇత్యాది పాశురార్థం, "తత్సంశ్లేషణ" అన్నపుడు "పరిత్రాణాయ సాధూనామ్" ఇత్యాది శ్లోకార్థం స్మరణీయాలు.)

శ్రీమన్మహావనగిరీశ ! విధీశయో స్తే
మధ్యే తు విష్ణు రితి యః ప్రథమావతారః ।
తేనైవ చే త్తవ మహిమ్ని జనాః కిలాన్ధాః
త్వన్మత్స్యభావ మవగమ్య కథం భవేయుః ॥ 87

గొప్ప పర్వతం అయిన వనగిరికి ప్రభువైన సుందరబాహుస్వామీ ! లక్ష్మీవల్లభా ! బ్రహ్మరుద్రుల మధ్యలో ఎత్తిన విష్ణువు అనే నీ మొదటి అవతారాన్ని చూచి జనులు నిన్ను బ్రహ్మరుద్రులతో సమానంగా తలుస్తూ నీ మహిమలో గుడ్డివారయ్యారు అంటే, ఇక నీ మత్స్యరూపాన్ని చూచి తెలిసికొని ఏ విధంగా కాగలరో కదా ! (గీతా శ్లోకంలో సూచింపబడ్డ సాధుపవిత్రాణమే అవతారాలలోని ప్రధానప్రయోజనం అని, దుష్టశిక్షణ ఆనుషంగికమనే తత్త్వాన్ని ఇక్కడ "తత్సంశ్లేషణ" అని అంటూ ముందుగా సాధుపరిత్రాణాన్ని ప్రస్తావించడం ద్వారా, తరువాత "తద్విరోధినిధన" అని తర్వాత దుష్టశిక్షణను ప్రస్తావించడం ద్వారా కూరేశులు సూచించారు.)

**హే దేవ ! సున్దరభుజ ! త్వ మిహాణ్డమధ్యే**
**సౌలభ్యతో విసదృశం చరితం మహిమ్నః ।**
**అఙ్గీకరోషి యది తత్ర సురై రమీభిః**
**సామ్యా న్నికర్షపరిపాలన మేవ సాధు ॥ 88**

ఓ సుందరబాహుస్వామీ ! దేవా ! నీవు నీ సౌలభ్యగుణంవల్ల నీ మహిమకు తగని ప్రవర్తనను ఈ బ్రహ్మాండంలో అంగీకరిస్తున్నావు. కనుక, ఆ విషయంలో బ్రహ్మరుద్రాదిదేవతలతో సమానుడవనే స్థితికంటే, మత్స్యకూర్మాదిరూపాలలో అవతారాలను ఎత్తడమే మంచిదిసుమా! (వాటివల్ల నీ సౌలభ్యగుణం ప్రకాశిస్తుంది కదా !)

**ఇహావతీర్ణస్య వనాద్రినాథ ! తే నిగూహత స్స్వం మహిమాన మైశ్వరమ్ ।**
**ఉమాపతేః కిం విజయః ప్రియంకరః ప్రియంకరా వేన్ద్రజిదస్త్రబన్ధనా ॥ 89**

వనగిరినాథా ! అన్నిటినీ ఏలే స్థితి (ఐశ్వర్యం) అనే, నీ ఒక్కనికే స్వంతం అయిన గొప్పతనాన్ని నీవు కప్పిపుచ్చుకుంటూ ఈ ప్రకృతిమండలంలో అవతరించిన నీకు శివుడు నిన్ను జయించాడన్నది నీకు ఎక్కువ ఆనందాన్ని కల్గిస్తుందా ! లేక, ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగాస్త్రాలతో నీవు బంధింపబడ్డావన్నది ఎక్కువ ఇష్టమైనదా! (**"కళ్వా ! ఎమ్మైయు ఏ*ழ்*ులకుమ్ .... క*ழ்*ల్ పణిన్దేత్తువరే"** అనే తిరువాయ్మొ*ழி* పాశురభావం ప్రకృతంలో స్మరణీయం.)

**పుచ్ఛోత్పుచ్ఛనమూర్ఛనోద్ధతిధుతవ్యావర్తితావర్తవత్**
**సంవర్తార్ణవనీరపూరవిలుఠత్పాఠీనదివ్యాకృతేః ।**
**సింహాద్రీశ ! న వైభవం తవ కథం స్వాలక్ష్య మాలక్ష్యతే**
**పద్మాక్షస్య జుఘుక్షతోఽపి విభవం లక్ష్మీధరాధోక్షజ ! ॥ 90**

వనగిరిప్రభూ ! అంతరింద్రియాలద్వారా దర్శింపతగినవాడా ! లక్ష్మీధరా ! అవతారాలలో నీ వైభవాన్ని నీవు కప్పిపుచ్చుకోవాలని అనుకున్నా, అది వీలు కాలేదు. మత్స్యరూపుడవైనపుడు నీవు తోకను పైకి కదపడంవల్ల, అడ్డంగా ఆడించడంవల్ల వేగంచేత సముద్రంలోని నీరు కంపించింది, పరిభ్రమించింది. అపుడు సుడులు తిరిగిన ఆ ప్రళయసముద్రంలో నీటిలో ఎంతో సంభ్రమంతో సంచరించే గొప్ప ఆ నీ అప్రాకృతమత్స్యరూపం ఎఱ్ఱతామరలవంటి కన్నులను కల్గినది, మహాత్ములచే సులభంగా సాక్షాత్కరించుకోదగినది. అటువంటి నీ (అప్రాకృతమైన) వైభవం వ్యక్తం

కాకుండా ఏవిధంగా ఉంటుంది? (ఎంతగా కప్పిపుచ్చుకోవాలని నీవు ప్రయత్నించినా మత్స్యావతారుడవైన నీ అసాధారణ దివ్యమంగళరూప వైభవం వ్యక్తం కాకమానదు-అనిభావం ఇందులోని ఉత్తరార్ధంలో గల వృత్త్యనుపాస సౌందర్యంవల్ల శబ్దించే శ్రవణసుభగత్వం గమనించదగినది. ఇటువంటి శబ్దాలంకారాలకు పంచస్తవి గొప్ప ఆకరం. మత్స్యావతార సమయంలోని పుండరీకాక్షత్వం, "మత్స్యః కమలలోచనః", "మీనాయ్ వన్దు వియన్దుయ్యకొణ్డ తణ్డామరైక్కణ్ణన్" ఇత్యాది ప్రమాణాలవల్ల సిద్ధం.)

**సాచలావటతటాకదీర్ఘికాజాహ్నవీజలవివర్ధితః క్షయే ।**
**శృఙ్గసంగమితనౌ ర్మనో రభూ రగ్రతోஉణ్డజవపు ర్హి సున్దర ॥ 91**

సుందరబాహుస్వామీ! ఒక అవాంతర ప్రళయసమయంలో అండంనుండి పుట్టిన మత్స్యరూపంలో నీవు చిన్న నీటిగుంట, తటాకం, దిగుడుబావి, గంగానది, జలధి-అనే వీటిలో క్రమంగా పెరిగావు. నీ కొమ్ముకు కట్టబడ్డ నౌకను కలవాడవై సత్యవ్రత మనువుకు ముందుగా వెళ్ళావుకదా! ("మీనతను స్త్వం నావి నిధాయ"- ఇత్యాది భట్టర్ కృత శ్రీరంగరాజస్తవోత్తరశతకశ్లోకార్థం దీనికి అనుగుణంగా అనుసంధేయం.)

**ప్రళయజనీరపూరపరిపూరితస్వనిలయావసన్నవదన-**
**భ్రమదశరణ్యభూతశరణార్థినాకిశరణం భవన్ స్వకృపయా ।**
**చలదుదధీరితామ్బుకలుషీక్రియాఢ్యగమనస్వపృష్ఠవిధృతా -**
**చలకుల ఏష మీనతను రత్ర సున్దరభుజో వనాద్రినిలయః ॥ 92**

భగవానుని (దయ)వల్ల ప్రళయకాలంలో పుట్టిన జల ప్రవాహంతో దేవతల నివాసాలు సైతం పూర్తిగా నీటిలో మునిగిపోయాయి. అందువల్ల దుఃఖంతో వాడిపోయిన ముఖాలతో వారు తమను రక్షించుకోవడంకోసం తిరిగి తిరిగి, తమను రక్షించేవారు భగవానుడు తప్ప వేఱొకరు లేరని గుర్తించి, ఆ స్వామిని శరణువేడారు. అపుడు భగవానుడు వారికి శరణమై మత్స్యరూపాన్ని ధరించాడు. ఆ మత్స్యం తన కదలికలతో ప్రళయసముద్రంలో అన్నివైపుల అడ్డులేకుండా సంచరిస్తూ నీటిని క్షోభిల్లేటట్లు చేసింది. తన వీపుపై పర్వతాల సమూహాలను చక్కగా ధరించింది. అటువంటి మీనరూపాన్ని ధరించిన ఈ సుందరబాహుస్వామి ఇపుడు భూమండలంలో వనాద్రినిలయుడై ఉన్నాడు. (ఈశ్లోకం పెరియతిరుమొழிలోని "నిలైయిడ మెఙ్గు మిన్ఱి" అనే పాశురానికి అనుకరణం. ఈ శ్లోకంలోని ఓజోగుణం సహృదయావర్జకం.)

**స్వపృష్ఠే ప్రష్ఠాద్రిభ్రమణకరణైః కిఞ్చ ఫణినో**
**వికృష్టివ్యాకృష్టివ్యతివిధుతదుగ్ధాబ్ధిచలితైః ।**

**అవిస్పందో నద్య న్వికసదరవిన్దేక్షణరుచిః**
**పురాఽభూ స్సింహాద్రేః ప్రియతమ ! హరే ! కచ్ఛపవపుః ॥ 93**

సింహాద్రి అనే పేరుగల తిరుమాలిరుమ్‌శోలై పర్వతానికి మిక్కిలి ప్రియమైన వాడా ! హరిశబ్దవాచ్యుడవైన ఓ సుందరబాహుస్వామీ ! నీ వీపుపై గొప్ప మందరపర్వతాన్ని తిప్పడంచేత, వాసుకిని దారంగా చేసి అటుఇటు లాగి విడువడంచేత మిక్కిలి క్షోభను పొందిన పాలసముద్రంలోని కదలికలతో కూడా ఏమీ కొంచెంకూడా కదలకుండా ఉన్నవాడవుగా, శరణాగతరక్షణంవల్ల ఆనందించినవాడవుగా, పుండరీకాక్షుడవుగా పూర్వం ఒకానొక సమయంలోని కచ్ఛపరూపివిగా నీవు అయినావు కదా!

**జగత్ప్రలీనం పునరుద్దిధీర్షతః సింహక్షితిక్షిన్నిలయస్థ ! సుందర !**
**పురా వరాహస్య తవేయ ముర్వరా దంష్ట్రాహ్వయేన్దోః కిల లక్ష్మ లక్షితా ॥ 94**

సింహగిరీశా ! సుందరబాహుస్వామీ ! పూర్వం నీటిలో మునిగిన ఈ లోకాన్ని తిరిగి ఉద్ధరించగోరి వరాహరూపాన్ని పొందినపుడు నీ దంష్ట్ర అనే పేరును కల చంద్రునిలో ఆ దంతంచే ఉద్ధరింపబడ్డ ఈ భూమి మచ్చవలె భాసించిందికదా !

**న వాయుః పస్పన్దే యయతు రథవాఽస్తం శశిరవీ**
**దిశోఽనశ్య న్విశ్వాప్యచల దచలా సాచలకులా ।**
**నభశ్చ ప్రశ్చ్యోతి క్వథిత మపి పాథో నరహరౌ**
**త్వయి స్తంభే శుమ్భద్వపుషి సతి హే సున్దరభుజ ! ॥ 95**

సుందరబాహుస్వామీ! నీవు నృసింహుడవై స్తంభంలో ఉద్భవించినపుడు వాయువు వీచలేదు, చంద్రసూర్యులు అస్తమించారు. దిక్కులు నశించాయి. (కనబడలేదు) కులపర్వతాలతోపాటు సమస్తవిశ్వం చలించిపోయింది. ఆకాశంకూడా కఱగిపోయింది. సముద్రంలోని చల్లని నీరుసైతం సలసల కాగింది. (ఇందులో, తరువాతి శ్లోకంలో వ్యస్త పదాలతోనే అద్భుత - భయానక రసాలను నిర్వహించిన వైఖరి కూరేశులకే స్వంతం అనదగినది.)

**అరాళం పాతాళం త్రిదశనిలయః ప్రాపితలయో**
**ధరిత్రీ నిర్ధూతా యుయు రపి దిశః కా మపి దిశమ్ ।**
**అజృమ్భిష్టామ్భోధి ర్ఘుమఘుమితి ఘూర్ణన్ సురరిపోః**
**విభిన్దానే వక్ష స్త్వయి నరహరౌ సున్దరభుజ ! ॥ 96**

సుందరబాహుస్వామీ ! నీవు నృసింహుడవై, దేవతలకు శత్రువు అయిన హిరణ్యకశిపుని వక్షస్సును బద్దలు చేసినపుడు పాతాళం తల కిందులైనది. దేవలోకం

లయాన్ని పొందింది. భూమి మిక్కిలి కంపించింది. దిక్కులుకూడా అనిర్వచనీయదశను పొందాయి. సముద్రం ఘుమఘుమశబ్దంతో తిరుగుతూ ఉప్పొంగింది.

నఖక్రకచక్రప్రధిక్రథితదైత్యవక్షఃస్థలీ -
సముత్థరుధిరచ్ఛటాచ్ఛురితబిమ్బితం స్వం వపుః ।
విలోక్య రుషితః పునః ప్రతిమృగేన్ద్రశఙ్కావశాత్
య ఏష నరకేసరీ స ఇహ దృశ్యతే సున్దరః ॥ 97

నృసింహస్వామి తన నఖాలనే ఱంపాల అంచులతో దైత్యుడైన హిరణ్యకశిపుని వక్షస్సును నఱికినపుడు, దానినుండి రక్తప్రవాహం పెల్లుబికింది. ఆ ప్రవాహంలో ప్రతిబింబించిన తన రూపాన్ని చూచి నృసింహమూర్తి ఇంకొక సింహం తనతో పోరాడడంకోసం వచ్చిందనే భ్రాంతితో మళ్ళీ తిరిగి కోపాన్ని పొందాడు. అటువంటి సుందరబాహుస్వామి ఇపుడు అందఱి నయనాలకు గోచరుడై ఈ కొండపై వేంచేసి ఉన్నాడు. (ఇప్పటికీ భక్త విరోధినిరసనోద్యుక్తుడై ఉన్నాడు. ఇందులోని ఓజస్సు రౌద్ర - భీభత్స రసానుగుణం.)

క్షితి రియం జనిసంహృతిపాలనైః నిగరణోద్గరణోద్ధరణై రపి ।
వనగిరీశ ! తవైవ సతీ కథం వరద ! వామన ! భిక్షణ మర్హతి ॥ 98

వరదా ! వామనమూర్తి ! వనగిరీశా ! పుట్టుక, లయం, రక్షణ- అనే వీటితో ఒక కాలంలో గ్రసించడం, ఇంకొక కాలంగా వెడలగ్రక్కడం, సూక్ష్మరూపాన్ని ధరించడం, ఉద్ధరించడం మొదలైనవాటితో ఈ భూమి నీకు మాత్రమే శేషమై ఉండగా, నీవు దానిని బలిదగ్గరకు వెళ్ళి యాచించడం ఏవిధంగా తగినది ? ("త్వన్నిర్మితా జఠరగా చ" అనే అతిమానుషస్తవశ్లోకార్థం, "శీరాల్ పిఱన్దు శిఱప్పాల్ వళరాదు" అనే శఠకోపసూరి పెరియతిరువన్దాది సూక్త్యర్థం భావ్యాలు.)

భార్గవః కిల భవన్భవాన్ పురా కున్దసున్దరవనాచలేశ్వర ! ।
అర్జునస్య బలదర్పితస్య తు ఛేత్స్యతి స్మరతి బాహుకాననమ్ ॥ 99

కుందవృక్షాలతో అందమైన వనాద్రికి ప్రభూ ! పూర్వం నీవు ఒకానొక సమయంలోభార్గవరాముడవై బలంతో గర్వించిన కార్తవీర్యార్జునుని బాహువులనే అరణ్యాన్ని ఛేదించావు. నీకు గుర్తున్నది కదా! ("స్మరతి" అనే పదం "కిల" అనే అర్థాన్నిచ్చే అవ్యయంగా, భూతార్థకంగా వ్యాఖ్యానింపబడింది. "కున్ద" అని వ్యస్తంగా సంబోధనాంతంగా చెప్పవచ్చు.)

అజ్ఞా తవాఽత్రభవతీ విదితా త్రయీ సా
ధర్మం తదుక్త మఖిలేన వనాద్రినాథ ।
అన్యూన మాచరితు మాస్తికశిక్షణార్థమ్
అత్రావతీర్య కిల సున్దర ! రాఘవోఽభూః ॥ 100

సుందరబాహుస్వామీ! మిక్కిలి గౌరవించదగిన ఆ ప్రసిద్ధాలైన వేదాలు మూడు నీ ఆజ్ఞ అని పెద్దలచే చెప్పబడింది. ఇది ప్రసిద్ధం. వేదాలలో చెప్పబడ్డ ధర్మం సమస్తం ఏ లోటూ లేకుండా ఆచరించడంకోసం, ఆస్తికులను తీర్చిదిద్దడం కోసం ఈ భూమండంలో శ్రీరాముడవై అవతరించావుకదా! ("నమోనమః సప్తమభూమికాయై" అని కీర్తింపబడే ఏడవ అవతారం అయిన శ్రీరామావతారాన్ని ఈ శ్లోకంనుండి వరుసగా ఏడు శ్లోకాలతో వర్ణిస్తున్నారు. "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే" అనే ప్రమాణం భావ్యం.)

వనగిరిపతి రీశితేతి దేవైః త్రిపురహరత్రిపురఘ్నచాపభఙ్గాత్ ।
వ్యగణి పరశురామదర్శితస్య స్వకధనుషః పరిమర్శదర్శనాచ్చ ॥ 101

త్రిపురాలను దహించిన శివునియొక్క ఆ త్రిపురాలను భగ్నం చేసిన ధనుస్సును భగ్నం చేయడం చూడడంచేత, పరశురామునిచేత చూపబడ్డ తన (వైష్ణవ) ధనుస్సును ఎక్కుపెట్టడాన్ని చూడడంచేత దేవతలు వనగిరిలోని ప్రభువే అందఱినీ పాలించేవాడని లెక్కించారు. ("జృంభితం తద్ధను ర్దృష్ట్వా శైవం విష్ణుపరాక్రమైః, అధికం మేనిరే విష్ణుం దేవా స్సర్షిపురోగమాః" అనే శ్రీరామాయణసూక్తి భావ్యం. "ఆత్మానం మానుషం మన్యే !" అని నీవు నీ మహిమను మఱుగు పఱచుకోవాలని అనుకున్నా, నీ పరత్వం ఆయా లీలలలో దానికి అదే స్ఫుటమైనది.)

అనవాప్త మత్ర కిల లిప్స్యతే జనైః
న చ లబ్ధ మేత దిహ భోక్తు మిష్యతే ।
అనవాప్త మత్ర కిల నాస్తి రామ ! తత్
జగతీ త్వయా తృణ మవైక్షి సున్దర ! ॥ 102

సుందరబాహుస్వామీ ! ఈ లోకంలో ఇంతవరకూ తాము పొందనిదానినికదా ఎవరైనా పొందగోరుతారు. ఒకసారి అనుభవింపబడ్డ ఫలం తిరిగి మళ్ళీ అభిలషింప బడదుకదా ! శ్రీరాముడవై అవతరించిన స్వామీ ! ఈ (రాజ్యాధికారం వంటి) ఫలాలలో నీవు ఇంతవరకు పొందనిది ఏదీ లేదు. అందుచేత నీవు ఈ కోసలసామ్రాజ్యాన్ని తృణంగా భావించావు.

శిఖరిషు విపినేష్వప్యాపగాస్వచ్ఛతోయాసు
అనుభవసి రసజ్ఞో దణ్డకారణ్యవాసాన్ ।
తదిహ తదనుభూతౌ సాభిలాషోఽద్య రామ !
శ్రయసి వనగిరీన్ద్రం సున్దరీభూయ భూయః ॥ 103

శ్రీరామచంద్రా ! పరమరసికుడవైన నీవు చిత్రకూటాది పర్వతశిఖరాలలో, దట్టమైన అరణ్యాలలో, స్వచ్ఛమైన జలాన్ని కల నదులలో, దండకారణ్యంలో నివసించడంవల్ల కల్గిన అనుభవాలతో ఆనందించావు. అందువల్ల ఆ పర్వత, కానన, నదీ ప్రాంతాలలో తిరిగి ఆనందించడంలో కోతికను కలవాడవై, ఈలోకంలో ఈనాడు తిరిగి సుందరబాహుస్వామివై గొప్ప వనగిరిని ఆశ్రయిస్తున్నావు కాబోలు ! (**"చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్, రమ్య మావసథం కృత్వా రమమాణా వనే త్రయః, దేవగంధర్వసంకాశాః తత్ర తే న్యవసన్ సుఖమ్"** - అనే రీతిలోని వనవాససుఖాన్ని అనుభవిస్తున్నావు కాబోలు - అని భావం. **"అనుభవసి"** అనే వర్తమానకాలిక ప్రయోగం ద్వారా ఈ శ్లోకంలో **"చిరనిర్వృత్త మప్యేతత్ ప్రత్యక్ష మివ దర్శితమ్"** అనే రీతిలో భావికాలంకారం వ్యక్తమవుతున్నది.)

ఉపవనతరుషణ్డై ర్మణ్డితే గణ్డశైల -
ప్రణయిభవదుదన్తోద్గాయిగన్ధర్వసిద్ధే ।
వనగిరితటభూమిప్రస్తరే సున్దర ! త్వం
భజసి ను మృగయానానుద్రవశ్రాన్తిశాన్తిమ్ ॥ 104

సుందరబాహుస్వామీ! ఉద్యానవనాలలోని వృక్షసమూహాలతో నిండి, అందంగా ఉండే పర్వతశిలలపై వేంచేసి ఉండడంలో ఆసక్తిని కల నీ చరిత్రలను గానం చేయడం భోగ్యంగా భావించే గంధర్వులు, సిద్ధులు వనగిరిలో నిండి ఉన్నారు. ఆ కొండచరియలలోని పెద్దశిలలలో మారీచునివంటి మృగాలను వెంటబడడంవల్ల కల్గిన అలసటవల్లనా ఏమి నీవు ఇపుడు విశ్రాంతిని తీసికొంటున్నావు ? (**"నడన్ద కాల్కళ్ నొన్దవో"** అనే తిరుచ్ఛన్దవిరుత్తసూక్తి అనుసంధేయం. **"ను"** అనే అవ్యయం ఉత్ప్రేక్షాద్యోతకం.)

కూలేఽబ్ధేః కిల దక్షిణస్య నివసన్ దూరోత్తరామ్బోధిగాన్
దైత్యా నేకపతత్రిణాఽచ్ఛిన ఇతీయం కిం వదన్తీ శ్రుతా ।
తత్రైవేశ్వర మమ్బుసాం వ్యజయథా స్తస్మాద్వనాద్రీశ్వర !
శ్రీమన్ ! సున్దర ! సేతుబన్ధనముఖాః క్రీడా స్తవాఽడమ్బరమ్ ॥ 105

వనాద్రీశ్వరా ! లక్ష్మిని కల ("ఏఱు తిరువుడైయాన్" అనబడే) సుందర బాహుస్వామీ ! దక్షిణసముద్రంయొక్క ఉత్తరతీరంలో నివసిస్తూ అక్కడికి చాలా దూరాన ఉత్తరసముద్రంలో ఉన్న దైత్యులను ఒకే బాణంతో ఖండించావు- అని ప్రసిద్ధమైన నానుడి వినబడుతున్నది. ఆ దక్షిణసముద్రంలోనే జలాధిపతి అయిన వరుణుని జయించావు కదా ! ఆ కారణంవల్ల నీవు చేసిన సేతుబంధనాదులు మొదలైన క్రీడలు అన్నీ కీర్తిని కోరి చేసినవేకదా ! ("త్వం దక్షిణస్య నివసన్" అనే అతిమానుషస్తవ శ్లోకంలోని ప్రశ్నకు సమాధానరూపమే ఈ శ్లోకార్థం.)

**రఘుకులతిలక! త్వం జాతుచిద్యాతుధాన -**
**చ్ఛలమృగమృగయాయాం సంప్రసక్తః పురాఽభూః ।**
**తదుపజనితఖేదచ్ఛేదనాయాఽద్య గాయ-**
**న్మధుకరతరుషండం రజ్యసే కిం వనాద్రిమ్ ॥** 106

రఘువంశానికి తిలకంవంటివాడా ! పూర్వం నీవు ఒకానొక సమయంలో రాక్షసులనే మాయామృగాల వేటలో చాలా ఆసక్తిని కలవాడవయ్యావు. ఆవిధంగా వేటాడినపుడు కల్గిన శ్రమను తీర్చుకోవడంకోసం ఇపుడు తుమ్మెదలు గానం చేసే వృక్షసమూహాన్ని కల వనాద్రిలో అభినివేశాన్ని పొందావా? ఏమి? (104వ శ్లోకానికి ఇది సంవాదం. పూర్వం వలె "కిమ్" కూడా ఉత్ప్రేక్షా ద్యోతకం.)

**హే సుందరైకతరజన్మని కృష్ణభావే**
**ద్వే మాతరౌ చ పితరౌ చ కులే అపి ద్వే ।**
**ఏకక్షణా దనుగృహీతవతః ఫలం తే**
**నీళా కులేన సదృశీ కిల రుక్మిణీ చ ॥** 107

సుందరబాహుస్వామీ! శ్రీకృష్ణునిగా నీవు నిన్ను భావించిన అవతారంలో నీవు దేవకీదేవి, యశోదాదేవి- అని ఇద్దఱు తల్లులను, వసుదేవుడు, నందగోపాలుడు- అని ఇద్దరు తండ్రులను, యాదవ, గోపాలకులాలు- అనే రెండు కులాలను ఒకే క్షణంలో అంగీకరించిన నీకు తత్ఫలంగా (గోపాల, యాదవకులాలకు తగిన) నీళాదేవి, రుక్మిణీదేవి భార్యలయ్యారు.

**త్వం హి సున్దర ! యదా స్తనంధయః పూతనాస్తన మధా స్తదా ను కిమ్ ।**
**జీర్ణ మేవ జఠరే పయోనిషం దుర్జరం వద తదాత్మనా సహ ॥** 108

సుందరబాహుస్వామీ ! నీవు తల్లి దగ్గర పాలు తాగే వయస్సులో ఉన్నవాడవై పూతన అనే రాక్షసిస్తన్యాన్ని తాగావుకదా ! అపుడు ఎవరికీ జీర్ణం చేసికోవడానికి సాధ్యం

కాని చనుబాలురూపంలోని విషం ఆ పూతన ప్రాణాలతోపాటు నీ ఉదరంలో జీర్ణమైపోయిందా ! ఏమి ! నీవే బదులు చెప్పు.

**ఆశ్రితేషు సులభో భవన్ భవాన్ మర్త్యతాం యది జగామ సుందర ! ।**
**అస్తు నామ తదులూఖలే కియద్దామబద్ధ ఇతి కిం తదాఽరుదః ॥ 109**

సుందరబాహుస్వామీ ! నిన్ను ఆశ్రయించినవారి విషయంలో నీవు సులభుడవై, మానవుడవై ఉన్న స్థితిని పొందితే పొందు; సరే. (ఆ సౌలభ్యగుణమే అద్భుతం) కాని నీవు ఆ మానవరూపాన్ని ధరించి వెన్నను దొంగిలించినపుడు యశోదచే రోటికి దారాలతో కట్టబడినావని ఏడ్చావే! ఇదేమి సౌలభ్యపరాకాష్ఠ స్వామీ ! (**"మత్తుఱు కడైవెణ్ణెయ్ కళవినిల్ ఉరవిడై యాప్పుణ్డు ఎత్తిఱ మురలినోడు ఇణైన్దిరున్దు ఏఙ్గియ వెళివే"** అనే నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళి సూక్తి ఇక్కడ భావ్యం.)

**సున్దరోరుభుజ! నన్దనన్దనః త్వం భవన్ భ్రమరవిభ్రమాలకః ।**
**మన్దిరేషు నవనీతతల్లజం వల్లవీధియ ముత వ్యచూచురః ॥ 110**

అందమైన, గొప్ప భుజాలను కల స్వామీ ! నీవు తుమ్మెదలను పోలిన ముంగురులను కలవాడవై, నందుని కుమారుడవై, గోపికల ఇళ్ళలో నవనీతాన్ని దొంగలించావా ? లేక, (ఆ మనోహరరూపంతో) గోపికల మనస్సులను దొంగిలించావా! చెప్పు. (అతిమానుష స్తవంలోని **"కాంతాలకాన్తమ్"** అనే శ్లోకానికి ఇది అందమైన సంవాదం.)

**కాళియస్య ఫణతాం శిర స్తు మే సత్కదమ్బశిఖరత్వ మేవ వా ।**
**వష్టి జుష్టవనశైలసున్దర ! త్వత్పదాబ్జయుగ మర్పితం యయోః ॥ 111**

సుందరబాహుస్వామీ ! వనగిరిలో నివసించేవాడా ! నీ పాదపద్మాల జంట దేనిపై పెట్టబడిందో ఆ కాళియుని పడగల చివరి భాగంగా కాని, (గోపికావస్త్రాపహరణ సందర్భంలోని) ఆ కడిమిచెట్టు కొమ్మ చివరి భాగంగా గాని నా శిరస్సు కావాలి. (**"పత్యుః ప్రజానా మైశ్వర్యం పశూనాం వా న కామయే, అహం కదంబో వా భూయాసం కుందో వా యమునాతటే"** అనే పౌరాణికశ్లోకాన్ని, **"ఆచిన్వతః కుసుమ మంఘ్రిసరోరుహం తే"** అనే అతిమానుషస్తవశ్లోకాన్ని స్మరించాలి.)

**గూహితస్వమహిమాఽపి సున్దర ! త్వం వ్రజే కి మితి శక్ర మాక్రమీః ।**
**సప్తరాత్ర మదధా శ్చ కిం గిరిం పృచ్ఛత శ్చ సుహృదః కి మక్రుధః ॥ 112**

సుందరబాహుస్వామీ ! పూర్వం రేపల్లెలో నీవు నీ మహిమను కప్పిపుచ్చుకొన్న సమయంలోనే ఎందుకోసం ఇంద్రుణ్ణి జయించావు? గోవర్ధనపర్వతాన్ని ఏడు రాత్రులపాటు ఎందుకోసం ధరించావు ? నీవెవరు? దైవమా ? అని ప్రశ్నించిన నీ స్నేహితులను సైతం ఎందుకోసం కోపపడ్డావు ? ("దేవో వా దానవో వా త్వం యక్షో గంధర్వ ఏవ వా" అనే గోపాలుర ప్రశ్నను, అపుడు "క్షణం భూత్వా త్వసౌ తూష్ణీం కించిత్ప్రణయరోషవాన్" అని కృష్ణుడు కోపించిన వృత్తాంతాన్ని స్మరించాలి.)

హే నన్దనన్దన ! సుసున్దర ! సున్దరాహ్వ !
బృన్దావనే విహరత స్తవ వల్లవీభిః ।
వేణుధ్వనిశ్రవణత స్తరుభి స్తదా వై
సగ్రావభి ర్ద్రుతవిలాయ మహో ! విలిల్యే ॥ 113

నందకుమారా ! గొప్ప సౌందర్యాన్ని కల సుందరబాహుస్వామీ ! నీవు అపుడు రేపల్లెలో ఉన్న సమయంలో బృందావనంలో గోపికలతో విహరించేటపుడు నీ వేణురవాన్ని విని రాళ్ళతోపాటు వృక్షాలుకూడా లక్కవలె కఱిగి, ద్రవించాయి. ఎంత ఆశ్చర్యం ! (పెరియాళ్వార్ తిరుమొழிలోని "నావలమ్ పెరియ తీవు" అనే దశకంలోని "మరఙ్గళ్ నిన్ఱు మదుదారైకళ్ పాయుమ్" ఇత్యాదిగా గల పలు హార్దభావాలు అనుసంధేయాలు.)

గాయంగాయం వనగిరిపతే ! త్వం హి బృన్దావనాన్తః
గోపీసఙ్ఘై ర్విహరసి యదా సున్దర ! వ్యూఢబాహో !
రాసారంభోత్సవబహువిధప్రేమసీమన్తినీనాం
చేతశ్చేత స్తవ చ తు తదా కాం దశా మన్వభూతామ్ ॥ 114

సుందరబాహుస్వామీ ! అందమైన, దృఢమైన బాహువులను కలవాడా ! బృందావనంలో మాటిమాటికి గానం చేస్తూ నీవు గోపికాసమూహాలతో క్రీడిస్తున్నపుడు రాసక్రీడ అనే ఉత్సవప్రారంభంలో అనేకవిధాలైన శృంగారాదిరసాలలో ప్రేమను కల గోపికల మనస్సులు, నీ మనస్సు ఎటువంటి దశను అనుభవించాయో కదా ! చెప్పు. (నీకు కూడా అది అనిర్వచనీయమని భావం.)

ఇఙ్గితం నిమిషితం చ తావకం రమ్య మద్భుత మతిప్రియంకరమ్ ।
తేన కంసముఖకీటశాసనం సున్దరాల్పక మపి ప్రశస్యతే ॥ 115

సుందరబాహుస్వామీ ! నీకు సంబంధించిన ఇంగితాలు (భ్రూభంగాదులు), వీక్షణాలు అన్నీ మనోహరాలు, అద్భుతాలు, అత్యంతం ప్రియకరాలునూ. అందువల్ల

కీటకసమానులైన కంసాదుల వధ మొదలైన నీ లీలలు చాలా చిన్నవే అయినా భక్తులచే కీర్తింపబడుతున్నాయి. ("కంసముఖకీటశాసనమ్ అల్పమ్" - "యా కంసముఖ్య నృపకీటనిబర్హణోత్థా సా నిర్జిత త్రిజగత స్తవ నైవ కీర్తిః" అనే అతిమానుషస్తవసూక్తి భావ్యం.)

**వారాణసీదహనపౌణ్డ్రకభౌమభఙ్గ -**
**కల్పద్రుమాహరణశంకరజృమ్భణాద్యాః ।**
**అన్యాశ్చ భారతబలక్రథనాదయ స్తే**
**క్రీడా స్సుసున్దరభుజ ! శ్రవణామృతాని ॥ 116**

సుందరబాహుస్వామీ ! కాశీనగరదహనం, పౌండ్రకవాసుదేవుని, నరకాసురుని వధ, కల్పవృక్షాన్ని స్వర్గంనుండి తీసికొని రావడం, శంకరుని జృంభణాస్త్రంతో నిలువరించడం మొదలైనవి, భారతయుద్ధంలో పద్దెనిమిది అక్షౌహిణుల సంఖ్యలోని సైన్యాన్ని నశింపజేయడం- ఇత్యాది మిగిలిన నీ లీలలు (అన్నీ) శ్రవణామృతాలు. భక్తుల వీనులకు విందులు.

**త్వం హి సున్దర ! వనాద్రినాథ హే ! వేంకటాహ్వాయమహీధ్రమూర్ధని ।**
**దేవసేవితపదామ్బుజద్వయః సంశ్రితేభ్య ఇహ తిష్ఠసే సదా ॥ 117**

వనాద్రిప్రభూ ! సుందరబాహుస్వామీ ! వేంకటాచలమనే పేరును కల పర్వతశిఖరంలో నీవు దేవతలచే ఆరాధింపబడే పాదపద్మాల జంటను కలవాడవై, ఈ కొండపై నీ దాసులకొఱకు ఎల్లప్పుడూ వేంచేసి ఉన్నావు కదా ! (దేవతలచే, నిత్యసూరులచే వేంకటాద్రివిభుడు సేవింపబడుతున్నాడు అనే విషయాన్ని "శురర్కళ్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే", "వన్ది పాయ్ వడవేఙ్గడమామలై వానవర్కళ్ శన్ది శెయ్య నిన్హాన్" - ఇత్యాది దివ్యసూరిసూక్తులు తెలుపుతున్నాయి.)

**హస్తిశైలనిలయో భవన్ భవాన్ సాంప్రతం వరదరాజసాహ్వయః ।**
**ఇష్ట మర్థ మనుకమ్పయా దదత్ విశ్వ మేవ దయతే హి సుందర ! ॥ 118**

సుందరబాహుస్వామీ ! హస్తిశైలాన్ని నివాసంగా కల్గి, వరదరాజస్వామి అనే తిరునామంతో ఎంతో దయతో భక్తులు కోరిన కోరికలను అనుగ్రహిస్తూ, ఇపుడు లోకాన్ని అంతటికీ నీ దయకు లక్ష్యంగా చేస్తున్నావు.

**మధ్యేక్షీరపయోధి శేషశయనే శేషే సదా సున్దర !**
**త్వం తద్వైభవ మాత్మనో భువి భవద్భక్తేషు వాత్సల్యతః ।**

విశ్రాణ్యాఖిలనేత్రపాత్ర మిహ సన్ సహ్యోద్భవాయా స్తటే
శ్రీరంగే నిజధామ్ని శేషశయనే శేషే వనాద్రీశ్వర ! ॥ 119

వనాద్రీశా ! సుందరబాహుస్వామీ ! పాలసముద్రం మధ్యలో శేషశయనుడవై సదా పరుండి ఉంటావు. నీవు నీ అటువంటి ప్రసిద్ధమైన విభవవాతారాలలోని గొప్పతనాన్ని ఈ భూలోకంలో నీ విషయంలో భక్తిని కలవారికి అనుగ్రహించి, ఈ సహ్యాపర్వతంలో పుట్టిన కావేరీనదీతీరంలో అందఱి నేత్రాలకు కన్పిస్తూ, నీ నివాసం అయిన శ్రీరంగంలో శేషశయనంలో పరుండి ఉన్నావు.

కల్కీ భవిష్యన్ కలికల్కదూషితాన్ దుష్టా నశేషా న్భగవన్ ! హనిష్యసి ।
స ఏష తస్యాఽవసర స్సుసున్దరః ప్రశాధి లక్ష్మీశ ! సమక్ష మేవ నః ॥ 120

లక్ష్మీనాథా! జ్ఞానాది షాడ్గుణ్యాన్ని కల భగవన్ ! సుందరబాహుస్వామీ ! కల్కమనబడే తెల్లని గుఱ్ఱాన్ని వాహనంగా కల్గినవాడవు కావడంవల్ల 'కల్కి' అనే పేరును కల్గినవాడవై, కలికాలవశంచేత పాపిష్ఠివారైన దుష్టులను అందఱిని వధించబోతావు. అటువంటి అవతారానికి తగిన సమయం ఇదేసుమా ! మా సమక్షంలోనే దుష్టులను శాసించు.

ఈదృశా స్త్వదవతారసత్తమాః సర్వ ఏవ భవదాశ్రితాన్ జనాన్ ।
త్రాతు మేవ న కదాచిదన్యథా తేన సున్దర ! భవన్త మాశ్రయే ॥ 121

సుందరా! ఇటువంటి నీ గొప్ప అవతారాలు అన్నీ "పరిత్రాణాయ సాధూనామ్" అని అన్నట్లు నిన్ను ఆశ్రయించిన జనులను రక్షించడం కోసమే తప్ప వాటికి ఇంకొక ప్రయోజనం ఏమీ లేదు. అందువల్ల జ్ఞానశక్తి సౌలభ్యాది గుణసంపన్నుడవై నిన్ను శరణు పొందుతున్నాను.

త్వా మామనన్తి కవయః కరుణామృతాబ్ధిం
త్వా మేవ సంశ్రితజనిఘ్న ముపఘ్న మేషామ్ ।
యేషాం వ్రజన్నిహ లోచనగోచరత్వం
హై సున్దరాహ్వ ! పరిచస్కరిషే వనాద్రిమ్ ॥ 122

సుందరుడనే పేరును కల స్వామీ ! యథార్థజ్ఞానాన్ని కల కవులు (ఋషులు), నిత్యసూరులు నిన్ను కరుణాసముద్రుడవని అంటున్నారు. నిన్నే శరణాగతుల జన్మలను నశింపజేసేవాడవని, శరణాగతులకు గొప్ప ఆలంబనమని అంటున్నారు. ఇటువంటి శరణాగతుల కంటికి కన్పించే స్థితిని నీవు ఈ లోకంలో పొందుతూ, వనాద్రిని అలంకరిస్తూ వేంచేసి ఉన్నావు.

అశక్యం నో కిఞ్చి త్తవ న చ న జానాసి నిఖిలం
దయాలుః క్షన్తా చాఽస్యహ మపి న చాఽఽగాంసి తరితుమ్ ।
క్షమోఽత స్త్వచ్ఛేషో హ్యగతి రితి చ క్షుద్ర ఇతి చ
క్షమస్వైతావన్నో బల మిహ హరే ! సున్దరభుజ ! ॥ 123

సుందరబాహుస్వామీ! హరీ ! నీకు అసాధ్యం అనేది ఏ కొంచెంకూడా లేదు. సమస్తాన్ని తెలిసినవాడవు. దయాస్వభావుడవు. క్షమను కలవాడవు. నేనుకూడా బలీయాలైన పాపాలను అనుభవించడంలోగాని, ప్రాయశ్చిత్తాదులలో పోగొట్టు కొనడంలో కాని సమర్థుడను కాను. అందువల్ల నీకు శేషభూతుణ్ణి, నీవు తప్ప వేఱే గతి లేనివాణ్ణి, క్షుద్రుణ్ణి. అయిన నా పాపాలను క్షమించు. ఈ స్థితిలో నీ జ్ఞానం, శక్తి, దయ, మొదలైన కల్యాణగుణాల అనుసంధానం, నా అగతిత్వాన్ని అనుసంధించు కోవడం మాత్రమే నాకున్న బలం.

లఙ్కాయుద్ధహతాన్ హరీన్ ద్విజసుతం శమ్బూకదోషాన్మృతం
సాన్దీపిన్యభిజం మృతం ద్విజసుతాన్ బాలాంశ్చ వైకుణ్ఠగాన్ ।
గర్భం చార్జునిసంభవం వ్యదధరః స్వేనైవ రూపేణ యః
స్వాభీష్టం మమ మద్గురో శ్చ దదసే నో కిం వనాద్రీశ్వర ॥ 124

వనాద్రి అనబడే తిరుమాలిరుమ్‌శోలై పర్వతానికి స్వామీ ! నీవు రామకృష్ణాద్యవతారాలలో -లంకలో యుద్ధంలో వధింపబడ్డ వానరాలను, శంబూకుడనే శూద్రమునిదోషంవల్ల చనిపోయిన బ్రాహ్మణకుమారుణ్ణి, సాందీపిని అనే నీ ఆచార్యుని కుమారుని, చిన్న వయస్సులో కార్యవైకుంఠాన్ని చేరిన వైదికపుత్రులను, అర్జునుని కుమారుడైన అభిమన్యువునకు ఉత్తరాగర్భంలో జన్మించిన గర్భాన్ని (పరీక్షిత్తును) రక్షించావు. అటువంటి నీవు నాకు, నా ఆచార్యులైన భగవద్రామానుజులకు మనోరథపూర్తిని ఎందుకు అనుగ్రహించడంలేదు? (ఇందలి పౌరాణిక వృత్తాంతాలు **"సంజీవయన్నపి"** అనే అతిమానుషస్తవ శ్లోకంలోకూడా ప్రస్తావింపబడ్డాయి.)

అయోధ్యకాన్ సపశుకీటతృణాంశ్చ జన్తూన్
కింకర్మణో ను బత ! కీదృశవేదనాఢ్యాన్।
సాయుజ్యలభ్యవిభవాన్ నిజనిత్యలోకాన్
సాన్తానికా నగమయో వనశైలనాథ ॥ 125

వనగిరిప్రభూ ! అయోధ్యా నగరంలోని పశువులు, కీటకాలు, గడ్డిపోచలతో కూడిన ప్రాణులకు అన్నిటికీ అవి ఏ కర్మయోగాన్ని అనుష్ఠించాయనే భావంతో, ఏ

జ్ఞానయోగాన్ని అనుష్ఠించాయనే భావంతో సాయుజ్యరూపమైన మోక్షంలో పొందదగిన వైభవాన్ని కల్గించావు! నిత్యమైన సాంతానికాలనే నీ లోకాలకు వానిని చేర్పించావు. ఎంత ఆశ్చర్యం నీ లీల ! (**"అన్హు శరాశరజ్గళై వైకున్దత్తేఱ్ఱి"** అనే కులశేఖరుల పాశురం, **"నఱ్పాల్ అయోత్తియిల్ వాழ్ுమ్ శరాశరమ్ ముఱ్ఱవుమ్ నఱ్పాలుక్కుయ్‌త్తనన్"** అనే నమ్మాழ்వార్ల సూక్తి, **"తతః సస్త్రీపుమాంస స్తే సపక్షిపశుబాంధవాః... తిర్యగ్యోనిగతా శ్చైవ సర్వే రామ మనువ్రతాః"** ఇత్యాది శ్రీరామాయణసూక్తి స్మరణీయాలు. **"కింకర్మణః "** అన్నపుడు **"స కింసఖా"** అనే భారవి ప్రయోగం ఉదాహార్యం.)

> **హరితవారణభృత్యసమాహ్వయం**
> **కరిగిరౌ వరద స్త్వ మపూర్వికామ్ ।**
> **దృశ మలమ్భయ ఏవ హి సున్దర !**
> **స్ఫుట మదా శ్చ పరశ్శత మీదృశమ్ ॥** 126

సుందరబాహుస్వామీ ! నీవు హస్తిగిరిలో వరదరాజస్వామివై పచ్చైవారణ దాసులనే పేరును కల భక్తునకు అంతకుముందు అతనికి లేని దృష్టిని కల్గించావు కదా ! ఇటువంటి ఎన్నో వందలకొలది అభీష్టాలను స్ఫుటంగా అందఱికీ తెలిసేటట్లుగా అనుగ్రహించావు. (ఈ పచ్చైవారణదాసుడు తిరుక్కచ్చినంబి పితామహుడు. యామునులీ వృత్తాంతాన్ని **"యస్య ప్రసాదకలయా"** అనే శ్లోకంలో **"అంధః ప్రపశ్యతి"** అని సూచించారు.)

> **ఇహ చ దేవ ! దదాసి పరాన్ వరాన్ వరద ! సున్దర ! సున్దరదోర్ధర ! ।**
> **వనగిరే రభిత స్తట మావస న్నఖిలలోచనగోచరవైభవః ॥** 127

వరదుడవైన స్వామీ ! అందమైన బాహువులను కల సుందరబాహుస్వామీ ! దేవా ! వనగిరికి చుట్టూ గల ఈ కొండచఱియలో నివసిస్తూ, అందఱి కళ్ళకు నీ వైభవాన్ని దర్శనం ఇస్తూ, వారు కోరిన కోరికలను అన్నిటినీ అనుగ్రహిస్తున్నావు.

> **ఇద మిమే శృణుమో మలయధ్వజం**
> **నృప మిహ స్వయ మేవ హి సుందర !**
> **చరణసాత్కృతవా నితి తద్వయం**
> **వనగిరీశ్వర ! జాతమనోరథాః ॥** 128

వనగిరీశా ! సుందరబాహుస్వామీ ! పూర్వం మలయధ్వజుడనే పాండ్యదేశ ప్రభువును నీవు నీ పాదదాసునిగా చేసికొన్నావు- అనే ఈ వృత్తాంతాన్ని పెద్దలవల్ల

వింటున్నాము. అందువల్ల నీ అంతరంగకైంకర్యాన్ని చేయడంలో అభినివేశాన్ని కలవారమై ఉన్నామయ్యా ! (పెరియాళ్వార్ తిరుమొళిలోకూడా ఈ మలయధ్వజ వృత్తాంతం స్మరింపబడింది.)

**విజ్ఞాపనాం వనగిరీశ్వర ! సత్యరూపామ్**
**అంగీకురుష్వ కరుణార్ణవ ! మామకీనామ్ ।**
**శ్రీరఙ్గధామని యథాపుర మేష సోఽహం**
**రామానుజార్యవశగః పరివర్తిషీయ ॥ 129**

కరుణాసింధూ ! వనగిరిప్రభూ ! నేను చేసే ఈ నిజమైన విజ్ఞాపనను అంగీకరించు. శ్రీరంగనగరంలో పూర్వంవలె నేను భగవద్రామానుజుల సన్నిధిలో వారి అధీనంలో ఉండేటట్లుగా అనుగ్రహించు. (**"సుందరోరుబాహుం స్తోష్యే తచ్చరణవిలోకనాభిలాషీ"** అని శ్రీరామానుజులను సేవించాలని ప్రారంభంలో వ్యక్తంచేసిన తమ ఆశను పూర్తిచేయవలసినదంటూ చివరి **4** శ్లోకాలలో కూరేశులు తెలుపుతున్నారు.)

**కిం చేదంచ విరిఞ్చభావన ! వనాద్రీశ ! ప్రభో ! సుందర !**
**ప్రత్యాఖ్యానపరాఙ్ముఖో వరదతాం పశ్యన్నవశ్యం శృణు ।**
**శ్రీరఙ్గశ్రియ మన్వహం ప్రగుణయం స్త్వద్భక్తభోగ్యాం కురు**
**ప్రత్యక్షం సునిరస్త మేవ విదధత్ప్రత్యర్థివాం ప్రార్థనమ్ ॥ 130**

బ్రహ్మను సృష్టించినవాడా ! వనాద్రీశా ! ప్రభూ ! **"అళగర్"** అనే పేరును కలవాడా ! పూర్వం విన్నవించినదానినే కాక, దీనినికూడా కాదనకుండా అనుగ్రహించు. వరదుడవైన నీ స్వభావాన్ని స్మరిస్తూ తప్పకుండా పూర్తిగా కటాక్షించు. ఆశ్రితవిరోధుల ప్రార్థనను మాముందే పూర్తిగా తిరస్కరిస్తూ, నీపట్ల భక్తిని కల భగవద్రామానుజుల వంటివారికి భోగ్యం అయిన శ్రీరంగసంపదను ప్రతిదినం మఱింతగా మఱింతగా వృద్ధి అయేటట్లుగా చేయి.

**కారుణ్యామృతవారిధే ! వృషపతే ! హే ! సత్యసంకల్పన !**
**శ్రీమన్ ! సుందర ! యోగ్యతావిరహితా నుత్సార్య సద్వత్సల ।**
**క్షామ్యన్ సాధుజనైః కృతాంస్తు నిఖిలానేవాపచారాన్ క్షణాత్**
**తద్భోగ్యా మనిశం కురుష్వ భగవన్ ! శ్రీరఙ్గధామశ్రియమ్ ॥ 131**

కరుణ అనే అమృతానికి సముద్రంవంటివాడా ! ధర్మమే మూర్తీభవించి నట్లున్నవాడా ! సత్యసంకల్పాన్ని, (తలచినది తలచినట్లుగా చేయగల శక్తిని) కలవాడా, జ్ఞానాదిషాడ్గుణ్యాన్ని కలవాడా ! లక్ష్మీసహితుడా ! సుందరబాహుస్వామీ ! అయోగ్యులను తఱిమి కొట్టి, సత్పురుషులు ప్రమాదంచేత కాని, తెలియక కాని చేసిన అకృత్యకరణ-కృత్యాకరణ రూపాలైన పాపాలను అన్నిటినీ క్షమించి, శ్రీరంగనగరసంపద అయిన శ్రీరంగనాథుని నిత్యం వారికి అనుభవయోగ్యంగా ఉండేటట్లుగా కటాక్షించు. (**"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే ! సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"** అని, **"ద్వయ మర్థానుసంధానేన సహ సదైవం వక్తా యావచ్ఛరీరపాత మత్రైవ శ్రీరంగే సుఖ మాస్వ"** అని నీవు చేసిన సంకల్పాలను స్మరించు- అని భావం.)

**ఇదం భూయో భూయః పున రపి చ భూయః పున రపి**
**స్ఫుటం విజ్ఞాప్యామీ త్యగతి రబుధోఽ నన్యశరణః ।**
**కృతాగా దుష్టాత్మా కలుషమతి రస్మీత్యనవధేః**
**దయాయా స్తే పాత్రం వనగిరిపతే ! సుందరభుజ ! ॥ 132**

వనగిరినాథా ! సుందరబాహుస్వామీ ! నీవుతప్ప ఇంకొక ఉపాయాన్ని లేనివాడను, జ్ఞానహీనుడను, అనన్యశరణుడను అయిన నేను ఈ విషయాన్నే మాటిమాటికీ మళ్ళీ మళ్ళీ విన్నవించుకుంటున్నాను. (అది ఏమంటే) నేను ఎన్నో పాపాలను చేసినవాడను. దుష్టాత్ముడను. అందువల్లనే నీ అంతులేని దయకు పాత్రంగా ఉన్నాను. కనుక నన్ను కరుణించు- అని. (**''వాచామగోచరమహాగుణదేశికాగ్ర్య-కూరాధినాథకథితాఖిలనైచ్యపాత్రమ్"** అనే వరవరమునుల సూక్తికి ఇటువంటి శ్లోకాలే మూలం. **"పరదుఃఖాసహిష్ణుతా"** రూపమైన నీ కరుణకు పాత్రంగా నన్ను చేసి రక్షించు. అని సారం.)

సుందరబాహుస్తవం సంపూర్ణము.



శ్రీ కూరేశులు అనుగ్రహించిన

# వరదరాజస్తవము

శ్రీవత్సచిహ్న మిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే ।
యదుక్తయ స్త్రయీకణ్ఠే యాన్తి మఙ్గలసూత్రతామ్ ॥

కూరేశులు ఇంతవరకు వైకుంఠస్తవం, అతిమానుషస్తవం, సుందరబాహుస్తవం- అనే మూడు స్తుతులను రచించి, సుందరబాహుస్తవంలో **"హస్తిశైలనిలయో భవన్ భవాన్"** అని ప్రస్తావించిన కంచి వరదరాజస్వామిని శరణాగతిమంత్రార్థానుసారంగా స్తుతిస్తూ, ప్రారంభంలో ఆశీర్వచనరూపమంగళాచరణాన్ని మొదటి శ్లోకంలో చేస్తున్నారు.

స్వస్తి హస్తిగిరిమస్తశేఖర స్సన్తనోతు మయి సంతతం హరిః ।
నిస్సమాభ్యధిక మభ్యధత్త యం దేవ మౌపనిషదీ సరస్వతీ ॥ 1

ఉపనిషత్తులలోని వాక్కు ఏ దేవుని తనకు సాటి వచ్చేవారిని, మించిన వారిని లేనివాడని చెప్పిందో, హస్తిగిరిశిఖరానికి ఆభరణంగా ఉండే ఆ ప్రణతార్తి హరుడైన వరదుడు (దాసుడనై) నాకు ఎల్లప్పుడూ మంగళాన్ని విస్తరింపజేయాలి. (భగవానుని నిస్సమాభ్యధికత్వాన్ని సంస్కృతవేదం "న తత్ సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే" అని, ద్రావిడవేదం **"ఒత్తార్ మిక్కారై ఇలైయాయ మామాయా"** అని తెలిపింది. దేవశబ్దానికి గల క్రీడావిజిగీషాది పది అర్థాలను ప్రకృతంలో అన్వయించడంవల్ల వరదరాజస్వామి యొక్క సకలకల్యాణగుణాకరత్వం వ్యక్తమవుతుంది.

శ్రీనిధి నిధిం మపార మర్థినా మర్థితార్థపరిదానదీక్షితమ్ ।
సర్వభూతసుహృదం దయానిధిం దేవరాజ మధిరాజ మాశ్రయే ॥ 2

శ్రియఃపతి, ప్రార్థించేవారికి అపారమైన నిధి, భక్తులు అర్థించిన విషయాన్ని అనుగ్రహించడమే దీక్షగా- వ్రతంగా కలవాడు, సమస్తప్రాణులపట్ల స్నేహాన్ని కలవాడు, కరుణానిధి, రాజాధిరాజు అయిన వరదరాజస్వామిని ఆశ్రయిస్తున్నాను. (ఈ శ్లోకం ద్వయపూర్వఖండార్థ ప్రతిపాదకమని పూర్వాచార్యాభిప్రాయం. **"వైత్త మా నిధి"**, **"నిధి రవ్యయః"**, **"త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్"** ఇత్యాది ప్రమాణాలు ఈ శ్లోకార్థానికి అనుగుణంగా అనుసంధేయాలు.)

నిత్య మిన్ద్రియపథాగతిం మహో యోగినా మపి సదూరగం ధియః ।
అప్యనుశ్రవశిరస్సు దుర్గ్రహం ప్రాదురస్తి కరిశైలమస్తకే ॥ 3

శాశ్వతమైనది, చక్షువు మొదలైన బాహ్యేంద్రియాల మార్గాన్ని దాటినది, (అందనిది) యోగుల బుద్ధికి సైతం చాలా దూరంలో ఉన్నది, వేదాంతాలలో కూడా దుర్గ్రహమైనది అయిన వరదరాజస్వామి అనే తేజస్సు హస్తిగిరిశిఖరంలో ప్రకాశిస్తున్నది. (**"ఇంద్రియపథాతిగమ్"** - అనే ప్రయోగానికి అనుగుణంగా **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** అనే శ్రుతి స్మరణీయం)

వల్లికాశ్రుతిమతల్లికామయీ యేన పల్లవితవిశ్వశాఖయా ।
స్వశ్రియా కరిగిరే రనుక్రియాం వష్టి మృష్టవరదం త మాశ్రయే ॥ **4**

గొప్పదైన వేదం అనే లత వరదరాజస్వామి అనే చిగిర్చిన, సకలశాఖలతో వృద్ధిచెందిన (కాణ్వ, కాఠక, కాలాపాది శాఖలను కల) తన శోభతో హస్తిగిరియొక్క అనుకరణాన్ని కోరుతున్నదో, అటువంటి పూర్ణవరప్రదుడైన (అడిగిన దానికంటే ఎక్కువ ఇచ్చే) వరదుని ఆశ్రయిస్తున్నాను. (**"యేన పల్లవితవిశ్వశాఖయా"** అనే ప్రయోగానికి అనుగుణంగా **"వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః", "సర్వే వేదా యత్పద మామనంతి"** ఇత్యాది ప్రమాణాలు భావ్యాలు)

యం పరోక్ష ముపదేశత స్త్రయీ నేతి నేతి పరపర్యుదాసతః ।
వక్తి య స్తమపరోక్ష మీక్షయత్యేష తం కరిగిరిం సమాశ్రయే ॥ 5

వేదం (బృహదారణ్యకాదులు) "పరమాత్మ స్వరూపం ఇంత మాత్రమే కాదు, ఇంత మాత్రమే కాదు" అని పైపైన మఱుగుపరుస్తూ పలికే ఉపదేశంతో (పర్యుదాస ప్రక్రియలో) ఏ వరదరాజస్వామిని ఇంద్రియాలకు అందనివాడు- అని చెబుతున్నదో, ఆ వరదుని ఈ హస్తిగిరి సాక్షాత్తుగా దర్శింపజేస్తున్నది. అటువంటి ఈ హస్తిగిరిని ఆశ్రయిస్తున్నాను. (**"ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చామూర్తం చ సత్యం చానృతం చ", "అథాత ఆదేశో నేతి నేతి. న హ్యేతస్మాదితి నేత్యన్య త్పర మస్తి, అథ నామధేయం సత్యస్య సత్యం ప్రాణా వై సత్యమ్ తేషా మేష సత్యమ్"** అనే శ్రుతులు, **"ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ"** అనే బ్రహ్మసూత్రం, దాని వ్యాఖ్యానం స్మరణీయాలు.)

ఏష ఈశ ఇతి నిర్ణయం త్రయీ భాగధేయరహితేషు నో దిశేత్ ।
హస్తిధామని న నిర్ణయేత కో దేవరాజ మయ మీశ్వర స్త్వితి ॥ 6

"ఈ వరదరాజస్వామే సర్వేశ్వరుడు" అనే నిర్ణయాన్ని వేదార్థం చక్కగా విచారించి తెలియలేని దౌర్భాగ్యులకు వేదం తెలుపకపోతే పోనీ. హస్తిగిరి అనే స్థానంలో మాత్రం

వరదరాజస్వామిని సేవించి, "ఇతడే సర్వేశ్వరుడు'' అనే నిశ్చయాన్ని ఎవడు పొందడు. (అందఱూ వరదరాజస్వామిని హస్తిగిరిలో సేవించి ఇతడే ఈశ్వరుడనే నిశ్చయాన్ని పొందుతున్నారు. "యత్కేచిదత్ర భవతీమ్" ఇత్యాది శ్రీవైకుంఠస్తవ శ్లోకార్థం (13) గమనించదగినది.)

హై! కుదృష్ట్యభినివిష్టచేతసాం నిర్విశేషసవిశేషతాశ్రయమ్ ।
సంశయం కరిగిరిర్నుదత్యసౌ తుఙ్గమఙ్గళగుణాస్పదే హరౌ ॥ 7

సమస్తకల్యాణగుణాలకు నిలయుడైన భగవానుని (హరి) విషయంలో కుదృష్టిని కల దుర్వాదులకు ఇతడు గుణాలను కలవాడా? లేనివాడా ! అని కలిగే రెండు విధాలైన సందేహాలను ఈ హస్తిగిరి పోగొడుతున్నది. ఈ విషయం ప్రసిద్ధం.

న్యాయతర్కమునిముఖ్యభాషితైః శోధితై స్సహ కథంచన త్రయీ ।
జోషయేద్ధరి మనంహసో జనాన్ హస్తిధామ సకలం జనం స్వయమ్ ॥ 8

వేదం చక్కగా శోధింపబడ్డ మీమాంసాన్యాయాలు, తర్కం, వ్యాస పరాశరాది మునుల వాక్కులైన పురాణాలు- అనే వీటితో కలసి అతికష్టం మీద పుణ్యాత్ములైన కొందఱికి మాత్రం భగవత్తత్త్వాన్ని బోధిస్తుంది. ఈ హస్తిగిరి అయితే, తానే స్వయంగా పాపిష్ఠివారు, పుణ్యాత్ములు అనే భేదం లేకుండా అందఱికీ భగవానుని దర్శింపజేస్తున్నది. ("పర్వతో వహ్నిమాన్ ధూమాత్" అనే అనుమానంలో "ధూమోఽస్తు వహ్ని ర్మాస్తు" అనే శంకాపరిహారంకోసం "యది వహ్ని ర్న స్యాత్ తర్హి ధూమోఽపి న స్యాత్" అన్నది అనుకూలతర్కం, "జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాధిభిః నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే", "వేదశాస్త్రరథారూఢాః న్యాయఖడ్గధరా ద్విజాః, క్రీడార్థ మపి యద్బ్రూయుః స ధర్మం వేద నేతరః", "ధర్మే ప్రతీయమానే తు వేదేన కరణాత్మనా, ఇతి కర్తవ్యతాభాగం మీమాంసా పూరయిష్యతి", "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్, బిభేత్యల్పశ్రుతా ద్వేదో మా మయం ప్రతరిష్యతి", "యస్మిన్ కల్పే తు యత్ ప్రోక్తం పురాణం బ్రహ్మణా స్వయమ్, తస్య తస్య తు మాహాత్మ్యం తత్స్వరూపేణ వర్ణ్యతే, అగ్నే శ్శివస్య మాహాత్మ్యం తామసేషు ప్రకీర్తితమ్, రాజసేషు చ మాహాత్మ్య మధికం బ్రాహ్మణో విదుః, సంకీర్ణేషు సరస్వత్యాః పితౄణాం చ నిగద్యతే, సాత్త్వికేష్వథ కల్పేషు మాహాత్మ్య మధికం హరేః, తేష్వేవ యోగసంసిద్ధాః గమిష్యంతి పరాం గతిమ్" ఇత్యాదులు శ్లోకం ఉత్తరార్ధానుగుణంగా భావ్యాలు.)

అద్భుతం మహ దసీమభూమకం కించి దస్తి కిల వస్తు నిలయమ్ ।
ఇత్యఘోషి యదిదం తదగ్రత స్తథ్య మేవ కరిధామ్ని దృశ్యతే ॥ 9

ఆశ్చర్యకరమైనది, అపరిచ్ఛిన్నమైన స్వరూపాన్ని కల్గినది, ఎల్లలేని వైభవాన్ని కల్గినది, ఈ విధమైనది కావడంవల్లనే సాటి లేనిదై ఏ వస్తువు ఉన్నదని వేదాదులలో ఘోషింపబడుతున్నదో, ఆ ఈ వస్తువు హస్తిగిరిలో ఇదిగో కంటి ముందు వాస్తవంగానే సేవింపబడుతున్నది. (**"యతో వా ఇమాని భూతాని జాయంతే.....", "తదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్ ఏక మేవాద్వితీయం బ్రహ్మ", "యః సర్వజ్ఞః సర్వవిత్", "పరాఽస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ", "న తత్సమశ్చాభ్యధిక శ్చ దృశ్యతే", "ఏష సర్వభూతాంతరాత్మా... దేవ ఏకో నారాయణః"** ఇత్యాది శ్రుతులు భగవద్వైభవ ప్రతిపాదకాలు.)

**సంవదేత కిల యత్ప్రమాన్తరై స్తత్ప్రమాణ మితి యే హి మేనిరే ।**
**తన్మతేఽపి కిల మానతాం గతా హస్తినాఽద్య పరవస్తుని త్రయీ ॥ 10**

"ప్రమాణంగా అభిమానింపబడేది (చెప్పబడేది) ఏదయినా వేఱు ప్రమాణాలతో పొసగినపుడేకదా అది ప్రమాణం అవుతుంది.''- అని ఈవిధంగా వేదబాహ్యులు భావించే మతంలోకూడా ఇపుడు హస్తిగిరిలో వేదం పరవస్తువు అయిన భగవానుని విషయంలో ప్రామాణ్యాన్ని పొందుతున్నది కదా! (వేదబాహ్యులు కూడా వేదంలో ప్రతిపాదింపబడ్డ పరవస్తువును హస్తిగిరిలో ప్రత్యక్షంగా దర్శించగల్గడంవల్ల ఆ వేదాన్ని ప్రమాణంగా అంగీకరిస్తున్నారు. "హస్తినా" - హస్తిగిరి అనే పేరుతో అని అర్థం. ఇది నామ్ని నామైక దేశగ్రహణం.)

**గుణాయత్తం లోకే గుణిషు హి మతం మంగళపదం**
**విపర్యస్తం హస్తిక్షితిధరపతే ! తత్త్వయి పునః ।**
**గుణా స్సత్యజ్ఞానప్రభృతయ ఉత త్వద్గతతయా**
**శుభీభూయం యాతా ఇతి హి నిరణైష్మ శ్రుతివశాత్ ॥ 11**

లోకంలో గుణాలను కలవారి విషయంలో- "వీరు మంచివారు'' అనే ప్రసిద్ధి వారిలో ఉండే గుణాలనుబట్టేకదా కల్గుతున్నది. హస్తిగిరినాథా ! ఆ మంగళపదం నీ విషయంలో అయితే, వ్యత్యస్తంగా ఉన్నది. (నీ గుణాలనుబట్టి కాదు నీకు మంగళత్వం. అది నీకు సహజం.) ఎందుకు! అని అంటే, సత్యం, జ్ఞానం మొదలైన గుణాలు నిన్ను పొందినందువల్లనే మంగళస్వభావాన్ని పొందుతున్నవి- అని వేదాలనుబట్టి నిర్ణయించాము. అందువల్ల నీ సంబంధంవల్ల గుణాలకు మంగళత్వమే కాని, గుణాలవల్ల నీకు మంగళపదం రాలేదు. (**"సత్యస్య సత్యం జ్యోతిషాం జ్యోతిః** - ఇత్యాదులు ప్రకృతంలో భావ్యాలు.ఇంతవరకు మంత్రరత్నంలోని నారపదార్థాన్ని

కరిగిరివర్ణనద్వారా తెల్పి, అయనపదార్థాన్ని భగవద్వైభవప్రతిపాదనంద్వారా ఈ శ్లోకంనుండి కూరేశులు ఆరంభిస్తున్నారు. శ్రీ వైకుంఠ స్తవంలోని "సర్వస్వ చైవ" అనే శ్లోకం, "గుణజం గుణినో హి" అనే సుందరబాహు స్తవ శ్లోకం స్మరణీయాలు.)

**నిరాబాధం నిత్యం నిరవధి నిరంహో నిరుపమం**
**సదా శాన్తం శుద్ధం ప్రతిభట మవద్యస్య సతతమ్ ।**
**పరం బ్రహ్మాఽఽమ్నాతం శ్రుతిశిరసి యత్తద్వరద ! తే**
**పరం రూపం సాక్షా త్తదిద మపదం వాఙ్మనసయోః ॥ 12**

వికారాలు వేటినీ లేనిది, కాలపరిచ్ఛేదం లేనిది, దేశపరిచ్ఛేదం లేనిది, వస్తుపరిచ్ఛేదం లేనిది, హేయగుణాలు లేనిది, ఎల్లప్పుడు అనుకూలమైనది, (నిత్యభోగ్యమైనది) రజస్సు, తమస్సులు కలువని శుద్ధసత్త్వమయంగా ఉన్నది, సదా హేయప్రతిభటమైనది అయిన ఏ పరబ్రహ్మ వేదాంతాలలో అభ్యసింపబడుతున్నదో, ఓ వరదరాజస్వామీ! గొప్పది అయిన ఆ నీ స్వరూపం వాక్కుతో వర్ణించడానికి, మనస్సుతో భావించడానికి సాధ్యం కానిది. ("న చక్షుషా గృహ్యతే నాపి వాచా", "యత్తద్రేశ్య మగ్రాహ్యమ్", "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ", "అపహతపాప్మా విజరో విమృత్యుః..." ఇత్యాది వేదాంతవాక్యాలు ఇక్కడ స్మరణీయాలు)

**ప్రశాన్తానన్తాత్మాఽనుభవజమహానందమహిమ-**
**ప్రసక్తస్తైమిత్యానుకృతవితరంగార్ణవదశమ్ ।**
**పరం యత్తే రూపం స్వసదృశదరిద్రం వరద ! తత్**
**త్రయీ పిస్పృక్షన్తీ పరనిరసనే శ్రామ్యతి పరమ్ ॥ 13**

వరదరాజస్వామీ! మిక్కిలి అనుకూలంగాను, అపరిచ్ఛిన్నంగాను ఉండే ఆత్మస్వరూపంయొక్క అనుభవంవల్ల కలిగే మహానందాతిశయంచేత ఏర్పడిన నిశ్చలస్థితి కారణంగా తరంగాలు లేని సముద్రంయొక్క స్థితిని అనుకరించేది, తనతో సాటి వచ్చేది వేఱొకటిని లేనిది, సర్వోత్తమమైనది అయిన ఏ స్వరూపం నీకు ఉన్నదో, ఆ స్వరూపాన్ని స్పర్శించాలని (వర్ణించాలని) ఆశించే వేదం "నిష్కలం నిష్క్రియం", "యత్తదద్రేశ్య మగ్రాహ్యమ్" ఇత్యాదిగా పల్కుతూ నీవు హేయగుణాలు లేనివాడవు- అని అంటూ హేయగుణరాహిత్యాన్ని చెప్పడంలో మాత్రమే విశ్రమిస్తున్నది. (అంతే తప్ప, నీ భోగ్యమైన స్వరూపాన్ని నోరార పొగడి ఆనందించలేకపోయింది. - అని భావం. సుందరబాహుస్తవం లోని "అతిపతితావధి" (23) ఇత్యాది శ్లోకభావం అనుసంధేయం.)

న వక్తుం న శ్రోతుం న మనితు మథో పాసిసిషితుం
న చ ద్రష్టుం ప్రేమ్ణా తదను న చ భోక్తుం హి సుశకమ్ ।
పరం యద్వస్తూక్తం నను వరద ! సాక్షాత్తదసి భోః !
కథం విశ్వస్మై త్వం కరిగిరపుర స్తిష్ఠస ఇహ ॥ 14

వరదరాజా ! ఏ పరతత్త్వం ఉపదేశించడానికి సాధ్యం కానిదిగా, వినడానికి సాధ్యం కానిదిగా, **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** అన్నట్లు భావించడానికి సాధ్యం కానిదిగా, అంతేకాక, ఉపాసించడానికి వీలు కానిదిగా, **"న చక్షుషా గృహ్యతే నాపి వాచా"** అన్నట్లు దర్శించడానికి సాధ్యం కానిదిగా, స్పృశించడానికి వీలు కానిదిగా, అంతకుమించి అనుభవించడానికి సాధ్యం కానిదిగా వేదాలలో చెప్పబడిందో, ఆ పరతత్త్వం సాక్షాత్తు నీవేకదా ! ఈ విధంగా అన్నివిధాలా దుర్లభుడవుగా చెప్పబడ్డ నీవు ఈలోకంలో హస్తిగిరిపై ఎదురుగా కంటిముందు ఏవిధంగా అందఱి జనులకు తమ మాంసచక్షువులతో దర్శించగలిగేటట్లు వ్యక్తమై ఉన్నావు ? (**"విశ్వస్మై తిష్ఠసే"**- జనులందఱికీ భక్తులను నేను రక్షిస్తాననే నీ అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ నిలచి ఉన్నావు.)

ప్రకృష్టం విజ్ఞానం బల మతుల మైశ్వర్య మఖిలం
విమర్యాదం వీర్యం వరద ! పరమా శక్తి రపి చ ।
పరం తేజ శ్చేతి ప్రవరగుణషట్కం ప్రథమజం
గుణానాం నిస్సీమ్నాం గణనవిగుణానాం ప్రసవభూః ॥ 15

వరదరాజస్వామీ ! గొప్పదైన జ్ఞానం, సాటి లేని బలం, అవధి లేని ఐశ్వర్యం, ఎల్ల లేని వీర్యం, శ్రేష్ఠమైన శక్తి, ఉత్కృష్టమైన తేజస్సు- అనే ఇవి మొదటిమూర్తి అయిన పరవాసుదేవరూపంలో ఉండే ఆఱు గుణాలు. ఆ ఆఱు అవధి లేని, సంఖ్యలో లెక్కలేనన్ని కల్యాణగుణాలకు జన్మస్థానం.

గుణై ష్షడ్భి స్త్వేతైః ప్రథమతరమూర్తి స్తవ బభౌ
తత స్తిస్ర స్తేషాం త్రియుగ ! యుగళై ర్హి త్రిభి రభుః ।
వ్యవస్థా యా చైషా నను వరద ! సాఽఽ విష్కృతివశాత్
భవాన్ సర్వత్రైవ త్వగణితమహామఙ్గళగుణః ॥ 16

మూడు రెళ్ళ (ఆఱు) గుణాలను కల వరదరాజస్వామీ ! నీ మూర్తులు అన్నిటిలోను మొదటిది అయిన పరవాసుదేవమూర్తి పూర్వం తెల్పిన ఆఱు గుణాలతో

ప్రకాశించింది. ఆ తరువాత గల సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధమూర్తులు- ఒక్కొక్క మూర్తిలో రెండు రెండు గుణాలతో ప్రకాశిస్తున్నాయి. (సంకర్షణమూర్తిలో జ్ఞానం, బలం -ప్రద్యుమ్నమూర్తిలో ఐశ్వర్యం, వీర్యం- అనిరుద్ధమూర్తిలో శక్తి, తేజస్సు ప్రకాశిస్తున్నవి) ఇటువంటి వ్యవస్థ గుణాల ఆవిష్కరణకోసమే నీవు అన్ని మూర్తులలోను లెక్క లేనన్ని గొప్ప కల్యాణగుణాలను కలవాడవై ఉన్నావు. (**"షాడ్గుణ్యాత్ వాసుదేవః"** - ఇత్యాది శ్రీరంగరాజస్తవ ఉత్తరశతక శ్లోకార్థం భావ్యం.)

**ఇయం వైయూహీ వై స్థితి కిలేచ్ఛావిహృతయే**
**విభూతీనాం మధ్యే సురనరతిరశ్చా మవతరన్ ।**
**సజాతీయ స్తేషా మితి తు విభవాఖ్యా మపి భజన్**
**కరీశ ! త్వం పూర్ణో వరగుణగణై స్తాన్ స్థగయసి ॥ 17**

ఓ హస్తిగిరినాథా! పూర్వం చెప్పబడ్డ ఈ వ్యవస్థ వ్యూహరూపానికి సంబంధించినది. ఆతరువాత నీవు యథేచ్ఛావిహారంకోసం నీ విభూతి అయిన దేవతల, మానవుల, తిర్యక్కుల నడుమ అవతరిస్తూ, విభవావతారాలనే పేరును కలవాడవై, గొప్ప కల్యాణగుణసమూహాలతో పూర్ణుడవై ఉన్నా, ఆ దేవతలకు, మానవులకు, తిర్యక్కులకు సజాతీయుడవనే కారణంతో ఆ కల్యాణగుణాలను మఱుగుపఱచు (దాచు) కొంటున్నావు. (**"సజాతీయస్తేషామ్"** - **"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్", "అహం వో బాంధవో జాతః"** ఇత్యాదులు భావ్యాలు.)

**పరో వా వ్యూహో వా విభవ ఉత వాఽర్చావతరణో**
**భవన్వాఽన్తర్యామీ వరవరద ! యో యో భవసి వై ।**
**స స త్వం స న్నైశాన్వరగుణగణాన్ బిభ్ర దఖిలాన్**
**భజద్భ్యో భాస్యేవం సతత మితరేభ్య స్త్వితరథా ॥ 18**

గొప్ప గొప్ప వరాలను ఇచ్చే వరదరాజస్వామీ ! నీవు పరవాసుదేవుడవు గానో, వ్యూహమూర్తివిగానో, విభవావతారాలను ఎత్తినవాడవుగానో, లేక, అర్చామూర్తిగా అవతరించినవాడవుగానో, అంతర్యామిరూపివిగానో- ఏ యే విధంగా ఉన్నావో, ఆవిధంగానే ఉంటూ సర్వేశ్వరునకు ఉండవలసిన గొప్ప కల్యాణ గుణసమూహాలను అన్నిటినీ నీలో కలవాడవై, సకలగుణవిశిష్టుడవుగానే అన్ని అవస్థలలోను భీష్మాది భక్తులకు దర్శనమిస్తావు. నిన్ను భజించని (శిశుపాల - బాహ్యకుదృష్టులవంటి) వారికి మాత్రం వేఱే రీతిలో (గుణశూన్యుడవుగా) తోస్తావు.

దయాక్షాంత్యౌదార్యప్రదిమసమతాసౌహృదధృతి-
ప్రసాదప్రేమాజ్ఞాఽఽశ్రితసులభతాద్యా వరగుణాః ।
తథా సౌందర్యాద్యా స్తవ వరదరాజోత్తమగుణాః
విసీమానోఽ సంఖ్యాః ప్రణతజనభోగం ప్రసువతే ॥ 19

వరదరాజస్వామీ ! నీకు గల (వైభవంలో) అంతు లేని, లెక్క లేనన్ని దయా, క్షాంతి, ఔదార్యం, సౌకుమార్యం, సమత, సుహృత్త్వం, ధృతి, ప్రసాదం, ప్రేమ, ఆజ్ఞ, ఆశ్రితసౌలభ్యం- మొదలైన గొప్ప దివ్యాత్మగుణాలు, అటువంటివే అయిన సౌందర్యం మొదలైన దివ్యరూపగుణాలు ఆశ్రితులకు ఆనందాన్ని కల్గిస్తున్నవి.

అనన్యాధీనత్వం తవ కిల జగు ర్వైదికగిరః
పరాధీనం త్వాం తు ప్రణతపరతంత్రం మనుమహే ।
ఉపాలంభోఽయం భోః! శ్రయతి బత! సార్వజ్ఞ్య మపి తే
యతో దోషం భక్తేష్విహ వరద! నైవాఽఽకలయసి ॥ 20

వరదరాజస్వామీ! ఇతరులకు వేఱెవ్వరికీ వశమై ఉండకపోవడమనే స్వాతంత్ర్యాన్ని నీకు వేదవాక్కులు చెబుతున్నవి. కాని, మేము నిన్ను ఆశ్రిత పరతంత్రుడవనే భావిస్తున్నాము. మీరు చేసేది దూషణం కదా! అని అంటే, ఈ దూషణం నీ సర్వజ్ఞత్వాన్నికూడా ఆశ్రయిస్తున్నది. ఎంత ఆశ్చర్యం! ఎందుకంటే, ఈ లోకంలోని భక్తుల దోషాలను కొంచెం కూడా నీవు చూడడం లేదు కదా ! ("న తస్యేశే కశ్చన", "తస్య నామ మహద్యశః", "త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్" ఇత్యాదులు పరమాత్మయొక్క నిరంకుశస్వాతంత్ర్యాన్ని తెలుపగా, "భక్తిప్రీతో జనార్దనః", "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్", "ఇమౌ స్మ మునిశార్దూల! కింకరౌ సముపస్థితౌ" ఇత్యాది ప్రమాణాలు, యథోక్తకారివంటి భగవన్నామాలు స్వామి భక్తపారతంత్ర్యాన్ని తెలుపుతున్నాయి. **"దోషో యద్యపి తస్య స్యాత్", "కుట్టనైయ కుర్ఱమ్ శెయినుమ్ కుణమ్ కొళ్ళుమ్"** వంటి సూక్తులు, **"భక్తవత్సలః"** వంటి నామాలు శ్లోకంలోని నాల్గవపాదంలో ప్రసక్తమైన వాత్సల్యాన్ని తెలుపుతున్నది)

పాణిపాదవదనేక్షణశబ్దై రమ్బుజా న్యపదిశన్వరద! త్వమ్!
బాహుభి స్తృతివిశాలతమాలా నాఞ్జనం కరిగిరే రసి శృంగమ్ ॥ 21

వరదా! నీ శ్రీహస్తాలు, శ్రీచరణాలు, తిరుముఖం, తిరునేత్రాలు- అనే నామాలతో తామరపూవులను, భుజాలతో మిక్కిలి గొప్ప తమాలశాఖలను మఱగు

పరచుకొంటున్నావు. హస్తిగిరికి ఒక కాటుకకొండ శిఖరంగా భాసిస్తున్నావు. (ఇంతవరకు మంత్రరత్నం పూర్వఖండంలోని శ్రీమత్పదార్థాన్ని "శ్రీనిధిమ్" అని ప్రారంభించి తెలిపి, నారపదార్థాన్ని కరిగిరివర్ణనద్వారా, నారాయణ పదార్థాన్ని కల్యాణగుణవర్ణనద్వారా తెలిపి, దివ్యమంగళవిగ్రహం కూడా నారాయణశబ్దార్థమే కనుక, చరణశబ్దార్థంచేతకూడా అది ఆక్షిప్తం కనుక, ఇక 40 శ్లోకాలతో వరదరాజస్వామిదివ్యమంగళవిగ్రహ వర్ణనను కూరేశులు చేస్తున్నారు.)

**త్వా ముదారభుజ మున్నస మాయతకర్ణపాశపరికర్మసదంసమ్ ।**
**ఆయతాక్ష మభిజాతకపోలం పారణీయతి వరప్రద ! దృఙ్మే ॥ 22**

వరదరాజస్వామీ! దాసుని నేత్రాలు, ఔదార్యాన్ని కల బాహువులను కల్గినవాడవై, ఉన్నతమైన నాసికను కలవాడవై, విశాలమైన గొప్ప చెవులను అలంకారంగా కల చక్కని భుజాలను కలవాడవై, ఆకర్ణాంతం విశాలమైన నేత్రాలను కలవాడవై, శ్రేష్ఠమైన కపోలాలను కలవాడవైన నిన్ను పూర్ణంగా దర్శించాలని ఆశపడుతున్నవి.

**నీలమేఘనిభ మఞ్జనపుఞ్జశ్యామకున్తల మనంతశయం త్వామ్ ।**
**అబ్జపాణిపద మమ్బుజనేత్రం నేత్రసాత్కురు కరీశ ! సదా మే ॥ 23**

హస్తిగిరినాథా! నల్లని మేఘంవంటివాడవై, కాటుక రంగును కల నల్లని కేశపాశాన్ని కలవాడవై, అనంతునిపై శయనించినవాడవై, తామరలవంటి శ్రీహస్తాలను, శ్రీపాదాలను కలవాడవై, తామరలవంటి నేత్రాలను కలవాడవైన నిన్ను ఎల్లప్పుడు దాసుని నేత్రాలకు విషయమై ఉండేటట్లు అనుగ్రహించు.("సదా పశ్యంతి సూరయః" అన్నట్లు సదా నీ దర్శనభాగ్యాన్ని ప్రసాదించు)

**త్వక్చ దృక్చ నిపిపాసతి జిహ్వా విహ్వలా శ్రవణవత్పరవృత్తౌ ।**
**నాసికా త్వయి కరీశ ! తథేతి పాప్నుయాం కథ మిమాం స్విదవస్థామ్ ॥ 24**

హస్తిగిరినాథా! నా త్వగింద్రియం, చక్షురింద్రియాన్ని చాలా ఎక్కువగా పానం చేయాలని కోరుతున్నది. రసనేంద్రియం -శ్రోత్రేంద్రియంతో సమానంగా ఇంద్రియాంతరాల వ్యాపారంలో చాపల్యాన్ని కల్గినది అవుతున్నది. ఘ్రాణేంద్రియం కూడా అదే రీతిలో ఇంద్రియాంతరాల వ్యాపారాన్ని ఆశపడుతున్నది- అని ఈ విధంగా చెప్పదగిన, ముక్తిదశలో కలుగడానికి వీలయిన ఈ అవస్థను నేను ఈ విభూతిలోనే నీ విషయంలో ఏవిధంగా పొందగలనయ్యా ! ("పశ్యత్యచక్షుః శ్రుణోత్యకర్ణః", "విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖః" ఇత్యాదిగా ప్రతిపాదింపబడ్డ భగవానుని సార్వపథీన

ప్రత్యక్షాన్ని కూరేశులు ఇందులో పొందాలని ఆశపడుతున్నారు. "ముడియానే" అనే తిరువాయ్‌మొழி దశకం యొక్క అర్థం ప్రకృతంలో అనుసంధేయం.)

**ఆధిరాజ్య మధికం భువనానా మీశ ! తే పిశునయన్నికల మౌళిః ।**
**చూళికామణిసహస్రమరీచే ర్హస్తిభూషణ ! భవత్యుదయాద్రిః ॥ 25**

హస్తిగిరి అలంకారంగా ఉండే దేవాధిరాజా ! లోకాలకు అన్నిటికీ అధిపతివై ఉండే నీ స్వభావాన్ని స్పష్టంగా ప్రకటించే నీ కిరీటం తన శిఖరంలో ఉండే రత్నం అనే సూర్యునకు ఉదయపర్వతంగా భాసిస్తున్నది. ("ముற்ற విమ్మూవులకుమ్ విరికిన్ఱ శుడర్ ముడిక్కే" ఇత్యాది దివ్యప్రబంధసూక్తులు భావ్యాలు.)

**ఉద్ధరత్యుపరి భక్తజనా నిత్యూర్ధ్వతాశ్రయణసూచితశక్తిమ్ ।**
**ఊర్ధ్వపుణ్డ్రతిలకం బహుమానా త్కిం బిభర్షి వరద ! స్వలలాటే ॥ 26**

వరదరాజస్వామీ ! ఈ ఊర్ధ్వపుండ్రతిలకం భగవద్భక్తులకు ఊర్ధ్వగతిని (ఉత్తమగతిని) పొందిస్తున్నది అనే విషయాన్ని తాను ఊర్ధ్వాకారంతో కూడుకొని ఉండడంద్వారా సూచిస్తున్నది. ఇటువంటి శక్తిని కల నీ ఊర్ధ్వపుండ్రతిలకాన్ని లలాటంలో "నా భక్తులు అభిమానించినది కదా ఇది'' అనే ప్రీతివిశేషంతో ధరిస్తున్నావా ఏమి! ("ఊర్ధ్వం ప్రాపయతి ఇతి ఊర్ధ్వపుండ్రమ్" అనే వివరణం ప్రకృతంలో వివక్షితం.)

**కర్ణికా తవ కరీశ ! కి మేషా కర్ణభూషణ ముతాంసవిభూషా ।**
**అంసలంబ్యలకభూషణ మాహో! మానసస్య మమ వా పరికర్మ ॥ 27**

హస్తిగిరినాథా ! నీ ఈ కర్ణభూషణం చెవులకు అలంకారమా ? లేక, భుజాలకు అలంకారమా ! అదీకాక, భుజాలపై అల్లల్లాడే కేశాలకు అలంకారమా ? లేక, దాసుని హృదయానికి అలంకారమా ? ("ముడిచ్చోదియాయ్" అనే తిరువాయ్‌మొழி పాశురంలో(3-1-1) వలె కోటిచతుష్టయాత్మక సందేహం ఇందులో చెప్పబడింది.)

**పారిజాతవిటపా నభితో యా పుష్పసమ్ప దుదియా త్కరినాథ ! ।**
**తాం విడమ్బయతి తావకబాహుష్వాతతా తు కటకాంగదలక్ష్మీః ॥ 28**

హస్తిగిరీశా! నీ భుజాలలో వ్యాపించి ఉండే వలయాలు, బాహుపురులు- అనే వీటి శోభ అయితే కల్పవృక్షాల శాఖలను చుట్టి ఒక పుష్పసంపద ఉంటే దానిని అనుకరిస్తున్నట్లున్నది. ("బాహుషు" అనే బహువచనం భగవానుని చతుర్భుజత్వానికి సూచకం.)

**మథ్యమానచలఫేనిలసిన్ధుప్రోత్థితక్షణదశాం గమితౌ తే ।**
**వక్షసి స్ఫురితమౌక్తికహారే కౌస్తుభ శ్చ కమలా చ కరీశ ! ॥ 29**

కరిగిరినాథా! తళతళమని మెరిసే ముత్యాలహారాలను కల నీ వక్షస్సులో ఉండే శ్రీకౌస్తుభమణి, లక్ష్మీదేవి (వీరంతా ఏవిధంగా ఉన్నారంటే,)- చిలుకబడుతున్నది, అందువల్లనే కదలాడే నుఱుగును కల్గినది అయిన సముద్రంయొక్క దశను స్మరింపజేస్తున్నవి.

**అఞ్జనక్షితిభృతో యది నామ ఉపత్యకా వరద ! హేమమయీ స్యాత్ ।**
**తాదృశీ తవ విభాతి తు లక్ష్మీ రమ్బరీ బత ! విడమ్బితవిద్యుత్ ॥ 30**

వరదరాజస్వామీ ! మెఱుపును పోలిన నీ పీతాంబరశోభ కాటుక నిండిన ఒక పర్వతంయొక్క చఱియ ఒకటి స్వర్ణమయంగా ఉంటే, దానివలె వెలుగుతున్నది. ఎంత ఆశ్చర్యం! ఆహా! (మాఘకావ్యంలోని **"పతత్పతంగ"** ఇత్యాది శ్లోకంలోవలె ఇక్కడ కూడా అపూర్వోపమ)

**పరభాగ మియా ద్రవే స్తమిస్రా**
**వరదాఽద్య త్వయి తన్నిశామయామః ।**
**గమితా తవ వక్త్రచిత్రభానోః**
**పరభాగం నను కౌన్తలీ తమిస్రా ॥ 31**

వరదరాజా! రాత్రి సూర్యునకు పరభాగాన్ని పొందవచ్చు. (సూర్యుని అనంతరం రాత్రి వస్తుందనే క్రమం ఉండవచ్చు) ఆ పరభాగాన్ని ఇపుడు నీ విషయంలో దర్శిస్తున్నాము. ఏ విధంగా అంటే, నీ కేశపాశంలో ఉండే చీకటి నీ తిరుముఖమండలం అనే సూర్యునకు పరభాగశోభను కల్గిస్తున్నది కదా ! (రాత్రి పక్షంలో పరభాగశబ్దానికి పశ్చాద్భాగం - అంటే- అనంతరం అని అర్థం. వర్ణాంతరసాన్నిధ్యంచేత కలిగే శోభ అనే అర్థం వరదరాజస్వామి పక్షంలో అర్థం.)

**ఉభయో రపి పక్షయో స్తిథి ర్యా విషమీభావనిరాసదాఽష్టమీతి ।**
**ఉపమానజసమ్పదే హి సేన్దోః వరదాఽభూద్భవతో లలాటలక్ష్మ్యా॥ 32**

వరదరాజస్వామీ! శుక్లపక్షం, కృష్ణపక్షం - అనే రెండు పక్షాలలో ఉండే అష్టమి అనే ఏ తిథి చంద్రునకు వైషమ్యాన్ని పోగొట్టగల్గినదో, ఆ అష్టమీతిథి ఆ చంద్రునకు నీ లలాటంలోని అందంతోపాటు, ఉపమించడంవల్ల కలిగే సంపదను కల్గించడంలో కారణం అయినది.

**అలకాళిచికీర్షయా కిలాత్తా సుపరీచిక్షిషయా లలాటపట్టే ।**
**సుమషీ నికషీకృతా భ్రువౌ తే వరద ! స్యాదకృతత్వత స్తు నైవమ్ ॥ 33**

వరదరాజస్వామీ! బ్రహ్మ కేశపాశం నిర్మించాలనే కోటికతో నలుపును చేతిలో గ్రహించి, దాని నల్లదనాన్ని బాగా పరీక్షించి చూడాలనే కోటికతో లలాటం అనే గీటురాయిపై గీయగా, ఆ నలుపు నీ కనుబొమలుగా అయినది- అని ఈ విధంగా ఉత్ప్రేక్షించే అవకాశం ఉన్నా నీ తిరుమేని సృష్టింపబడినది (కృతకం) కాదు కనుక ఈ విధంగా భావించడం తగదు. ("విధాతా" అనే పదం శ్లోకంలో అధ్యాహార్యం. భగవానుని దివ్యరూపం కృతకం కాదనే అంశాన్ని "న తస్య ప్రాకృతా మూర్తిః", "ఇచ్ఛాగృహీతాభిమతోరు దేహః", "ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా", "ఆదియమ్ శోదియురువై అఙ్గు వైత్తిఙ్గు ప్పిఱన్ద" ఇత్యాది శ్రుతి స్మృత్యాది సూక్తులు స్పష్టం చేస్తున్నాయి.)

**శ్రవస శ్చ దృశ శ్చ శబ్దరూపగ్రహణే తే న హి జీవవద్వ్యవస్థా ।**
**ఉభయో రఖిలేక్షణక్షమత్వా ద్వరదాత శ్శ్రవణాశ్రయౌ దృశౌ తే ॥ 34**

వరదరాజస్వామీ! నీ కర్ణాలకు, నేత్రాలకు శబ్దాన్ని, రూపాన్ని గ్రహించే విషయంలో జీవాత్మకుండే "ఈ ఇంద్రియం ఈ గుణాన్నే గ్రహించగలదు''- అనే విషయవ్యవస్థ లేదుకదా ! ఆ రెండు ఇంద్రియాలు అన్నిటినీ ప్రత్యక్షంగా గ్రహించడంలో సమర్థాలు కనుక నీ నేత్రాలు కర్ణాలను ఆశ్రయంగా కల్గినవి అయినవి.

**కరుణారసవాహివీక్షణో ర్మే ర్వరద ! ప్రేమమయప్రవాహభాజః ।**
**తతతీరవనావలీ భ్రువౌ దృక్చలసింధో స్తవ నాసికైవ సేతుః ॥ 35**

వరదా! కృపారసం ప్రవహించే కటాక్షాలనబడే అలలను కల్గినది, ప్రేమరూపమైన ప్రవాహాన్ని కల్గినది అయిన నీ తిరునేత్రాలనే కదిలే సముద్రానికి నీ కనుబొమలు వ్యాపించిన, తీరంలో ఉన్న తోటలవలె, నాసిక వారిధి వలె ఉన్నవి. ("ప్రేమామృతౌఘ" ఇత్యాది సుందరబాహుస్తవ శ్లోకం భావ్యం).

**విభవం వివృణోతి విస్తృణీతే రుచ మావిష్కురుతే కృపా మపారామ్ ।**
**అభివర్షతి హర్ష మార్ద్రభావం తనుతే తే వరదైష దృష్టిపాతః ॥ 36**

వరదా! నీ ఈ కటాక్షం ఉభయవిభూతి సార్వభౌమత్వాన్ని వ్యక్తం చేస్తున్నది. శోభను వ్యాపింపజేస్తున్నది. అంతు లేని కృపను వెలువరిస్తున్నది. ఆనందాన్ని వృద్ధి చేస్తున్నది. మనస్సులో ఆర్ద్రతను కల్గిస్తున్నది. ("విస్తృణీతే రుచమ్" అన్నపుడు "తస్య

యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ", "రామో రాజీవలోచనః", "కృష్ణం కమలపత్రాక్షమ్" ఇత్యాది ప్రమాణాల భావాలు అనుసంధేయాలు.)

**అరుణాధరపల్లవే లసన్తీ వరదాఽసౌ ద్విజచన్ద్రచన్ద్రికా తే ।**
**అధివిద్రుమమస్తనిస్తలాళీరుచ మావిష్కురుతే హి పుష్కరాక్ష ! ॥ 37**

తామరలవంటి కన్నులను కలవాడా! వరదా! నీ ఎఱ్ఱని, చిగురువంటి అధరంలో ప్రకాశించే చంద్రునివంటి ముత్యాల కాంతి పగడంపై పొదిగిన ముత్యాల వరుస శోభను ప్రకాశింపజేస్తున్నట్లున్నది (పోలి ఉన్నది.) ("నిస్తల" శబ్దం మౌక్తికవాచకం. "నిస్తలం వర్తులే ముక్తాఫలే చ చపలేఽపి చ" అని నిఘంటువు)

**స్మితనిర్ఝరికా వినిష్పతన్తీ తవ వక్షస్థ్సలభూతలే వికీర్ణా ।**
**వరద ! ప్రబిభర్తి హారలక్ష్మీ మపి ముక్తావళికా నదీవ తజ్జా ॥ 38**

వరదా ! ముఖం అనే ఉన్నతస్థానంనుండి కిందకు పాఱే నీ చిఱునవ్వు అనే కొండవాగు (జలపాతం) వక్షఃస్థలం అనే భూమిపైకి దిగి, పాయలుగా చీలి నూఱు పేటలను కల హారశోభను ధరిస్తున్నది. ఏకావళీహారం ఆ కొండ జలపాతంనుండి పుట్టిన నదివలె భాసిస్తున్నది. ("హారలక్ష్మీమ్"- నూఱు పేటలను, వేయి పేటలను కల ముత్యాలహార శోభను అని భావం.)

**పరిమండితరాసమండలాభి ర్వరదాఘ్రాత మభీష్టగోపికాభిః ।**
**అనువర్తితదాతనప్రహర్షా దివ ఫుల్లం హి కపోలయో ర్యుగం తే ॥ 39**

వరదా ! రాసగోష్ఠిని అలంకరించేవారైన, నీకు ఇష్టమైన గోపికాస్త్రీలతో ఆఘ్రాణించబడ్డ నీ కపోలద్వయం ఇప్పటికికూడా అనువర్తిస్తూ వచ్చే అప్పటి హర్షప్రకర్షంవల్లనా! అన్నట్లు వికసిస్తున్నది. (ఇందులో భావికాలంకార పూర్వకమైన ఉత్ప్రేక్ష)

**ముఖ మున్నస మాయతాక్ష ముద్యత్స్మితదన్తం రుచిరాధరం నతభ్రు ।**
**లసదంసవిలమ్బికర్ణపాశం మయి తే నిశ్చల మస్తు హస్తినాథ ! ॥ 40**

హస్తిగిరినాథా! ఉన్నతం అయిన నాసికను కల్గినది, వ్యక్తం అవుతున్న మందహాసాన్ని కల దంతాలను కల్గినది, అందమైన అధరాన్ని కల్గినది, అందంగా వంగిన కనుబొమలను కల్గినది, శోభిల్లే, భుజాలవరకు వేలాడే అందమైన చెవులను కల్గినదిగా ఉండే నీ ముఖమండలం దాసునకు నిత్యం దర్శనమివ్వాలి.

పద్మాయాః ప్రణయరసాత్సమాసజన్త్యాః
స్వం బాహుం సుబహుమతో భుజేన తేన ।
కాం నామాన్వభవ దహో! దశాం తదాత్వే
కంఠ స్తే కరిగిరినాథ ! కమ్బుకాన్తః ॥ 41

హస్తిగిరీశా ! శంఖంవలె అందమైన నీ కంఠం ఆనందానుభవంచేత అటువంటి నీ భుజాలతో తన భుజాలను కలిపి ఆలింగనం చేసికొనే లక్ష్మీదేవికి చాలా ఆదరపాత్రమై, ఆ ఆలింగనసమయంలో ఎటువంటి దశను అనుభవించిందో కదా ! ఆహా ! (ఇచటి ఆలింగనం క్షీరాబ్ధిమథనసమయంలోని- "క్షీరోదాచ్చీ సముద్భూతా సర్వభూషణభూషితా, దివ్యమాల్యాంబరధరా మాధవం పరిషస్వజే" అనే ఆలింగనం కాని, "త్వం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్, బభూవ హృష్టా వైదేహీ రాఘవం పరిషస్వజే" అని చెప్పబడ్డ ఖరదూషణాదివధ సమయంలో చేసికొన్న ఆలింగనం కాని కావచ్చు.)

సాయామా ధృతపరిణద్ధయోఽబ్ధయో వా
తాదృశ్య స్ఫుట మథవా దిశ శ్చతస్రః ।
చత్వారో వరద ! వరప్రదా స్త్వదీయాః
భాసన్తే భుజపరిఘా స్తమాలనీలాః ॥ 42

వరదరాజస్వామీ ! తమాలవృక్షంవలె నల్లనివై, దాసులు అభిలషించే వరాలను ఇచ్చేవై, నాల్గు సంఖ్యలో ఉన్న, పరిఘలవంటి నీ భుజాలు వైశాల్యాన్ని కల్గినవై, చుట్టూ విస్తరించిన సముద్రం అని కాని, లేక, అంతటి విస్తృతిని కల నాల్గు దిశలు అని కాని ఉత్ప్రేక్షించేటట్లుగా ఉన్నాయి. (సముద్రం నల్లనిదని ప్రసిద్ధి. దిశలు కూడా ఆకాశవిశేషాలే కనుక నల్లనివి)

ఆశ్లేషే వరద ! భుజా స్తవేన్దిరాయాః
గోపీనా మభిమతరాసబన్ధనే వా ।
బన్ధే వా ముద మధికాం యశోదయాఽఽహో
సంప్రాప్తా స్తవ నవనీతమోషదోషాత్ ॥ 43

వరదరాజస్వామీ! నీ భుజాలు లక్ష్మీదేవి ఆలింగనంలోనా ? గోపికలకు అభిమతం అయిన రాసక్రీడలోనా !, లేక, నీవు వెన్నను దొంగిలించిన దోషంవల్ల యశోదచేత కట్టబడినపుడా ! - అధికమైన ఆనందాన్ని పొందాయి? (నాకు తెలియజెప్పు)

సాలీయా ఇవ విటపా స్వపల్లవాగ్రాః కల్లోలా ఇవ జలధే స్వవిద్రుమాగ్రాః ।
భోగీంద్రా ఇవ చ ఫణామణీద్ధవక్త్రా భాసన్తే వరద ! భుజా స్తవారుణాగ్రాః ॥ **44**

వరదరాజస్వామీ ! ఎఱ్ఱని అగ్రభాగాలను (వేళ్ళను) కల నీ భుజాలు, చిగురుతో కూడిన అగ్రభాగాలను కల్గినవి అయిన సాలవృక్షంయొక్క శాఖలవలె, పగడాలతో కూడిన అగ్రాలను కల్గినవి అయిన సముద్ర తరంగాలవలె, పడగలలో ఉండే మణులచేత ప్రకాశించే ముఖాలను కల ఆదిశేషుడు, వాసుకి మొదలైన సర్పాలవలె భాసిస్తున్నాయి.

అంభోధే స్త్వయ మభిమన్థనం చకర్థ
క్షోణీధ్రం పున రబిభశ్చ సప్తరాత్రమ్ ।
సప్తానాం వివలయసిస్మ కణ్ఠ ముక్ష్ణామ్
అమ్లానా వరద ! తథాఽపి పాణయ స్తే ॥ **45**

వరదరాజస్వామీ ! నీవేకదా సముద్రాన్ని చిలికావు. ఏడు దినాలపాటు గోవర్ధనగిరిని ఏకధాటిగా ధరించావు. ఏడు వృషభాల కంఠాలను నప్పిన్నైపిరాట్టి చిఱునవ్వుకోసం మర్దించావు. ఇన్ని చేసినా నీ భుజాలు కొంచెంకూడా వాడలేదు సుమా!

రింఖాతో వ్రజసదనాఙ్గణేషు కిం తే
గోయష్టిగ్రహణవశా న్ను గోపగోష్ఠ్యామ్ ।
ఆలంబాద్దయనయసూత్రతోత్రయో ర్వా
పాణీనాం వరద ! తవారుణత్వ మాసీత్ ॥ **46**

వరదరాజస్వామీ ! రేపల్లెలో ఉండే గోపాలుర ముంగిళ్ళలో దోగాడుతూ సంచరించినందువల్లనా, లేక, గోపాలుర సమూహంలో పశువులను అదిలించి, మేపే చేతికర్రను ధరించినందువల్లనా ?, లేక, నీవు పార్థునకు సారథివై ఉన్నపుడు రథాశ్వాలను అదలిస్తూ, నడిపేటపుడు సాధనాలై ఉండే పగ్గాలను పట్టిలాగినందువల్లనా ? - నీచేతులు ఎఱ్ఱగా అయినవి? (కందిపోయాయి) ("బాలానాం హస్తపాదగమనం రింఖా"- చిన్నపిల్లలు పాకుతూ, దోగాడుతూ పోయే గమనానికి రింఖ అని పేరు. ఈ శ్లోకంలో హేతూత్ప్రేక్ష.)

సర్వజ్ఞా స్సముచితశక్తయ స్సదైవ
త్వత్సేవానియమజుష స్త్వదేకభోగాః ।
హేతీనా మధిపతయ స్సదా కి మేతాన్
శోభార్థం వరద ! బిభర్షి హర్షతో వా ॥ **47**

సర్వజ్ఞులు, ఆ జ్ఞానానికి తగిన శక్తిని కలవారు, నిన్ను తప్ప ఇంక దేనినీ కోరనివారు, అందువల్లనే నిత్యం నిన్ను సేవించడంలో నియతిని కలవారు అయిన ఈ ఆభరణాల రూపంలోని ఆళ్వార్లను నీవు అందం కోసమా లేక, సంతోషంవల్లనా ? ఎల్లప్పుడూ ధరిస్తున్నావు. ("స్ఫురత్కిరీటాంగద"- ఇత్యాది స్తోత్రరత్నశ్లోకం అనుసంధేయం. **"సుఖస్వైః"** ఇత్యాది సుందరబాహు స్తవశ్లోకం కూడా స్మరణీయం.)

**కిం ధాతుర్గగనవిధానమాతృకాఽభూత్**
**వక్ష స్తే వరదవరేణ్య ! యత్ర నామ ।**
**పద్మాయా ముఖ మథ కౌస్తుభ శ్చ జాతౌ**
**చంద్రార్కా వుడునికరాయతే తు హారః ॥ 48**

వరాలను అనుగ్రహించే దేవతలలో గొప్పవాడవైన ఓ వరదరాజస్వామీ ! నీ వక్షఃస్థలంలో ఉండే లక్ష్మీదేవిముఖం, కౌస్తుభమణి-ఈరెండు చంద్రుడు- సూర్యుడువలె భాసించాయా ? నక్షత్రసమూహంవలె శోభిల్లాయా ? అటువంటి నీ వక్షస్సు ఆకాశం (గొప్ప) అనే పంచభూతాలలో ఒక భూతాన్ని సృష్టించడంలో మాతృక అయినదా ! (ఆకాశంవలె వక్షస్సు విశాలమని భావం. నీలంగా ఉండడంవల్ల, వక్షస్సులోని లక్ష్మీవదనం, కౌస్తుభరత్నం, ముక్తావళిహారం - వరుసగా చంద్రసూర్యనక్షత్రాలవలె ఉండడంవల్ల, నిత్యమైనందువల్ల స్వామి వక్షస్సు అంతరిక్షానికి మాతృక అయినదని ఇక్కడి ఉత్ప్రేక్ష.)

**అణ్డానాం త్వదుదర మామనన్తి సంతః**
**స్థానం తద్వరద ! కథన్ను కార్శ్య మస్య ।**
**మాహాత్మ్యం స్వత ఇహ యేషు నూన మేషామ్**
**ఋద్ధి స్స్యా న్మహిమకరీ న హీతరేషామ్ ॥ 49**

వరదరాజస్వామీ! నీ ఉదరాన్ని సమస్తబ్రహ్మాండాలకు వాసస్థానంగా బ్రహ్మ విదులైన పరాశరాదిమహర్షులు చెబుతున్నారు. అదే నిజమయితే, నీ నడుము అంత సన్నగా ఎందుకు ఉన్నది? ఈలోకంలో ఏ వస్తువులలో ఉండే గొప్పతనం స్వతస్సిద్ధమో, ఆ వస్తువులకు ఉండే సమృద్ధి మాత్రమే గొప్పతనాన్ని కల్గిస్తుంది. సహజమైన గొప్పతనం లేని మిగిలిన వస్తువులకు ఉండే సమృద్ధి వాటికి మహిమను కల్గించగల్గినది కాదు కదా!

**సౌన్దర్యామృతరసవాహవేగజ స్స్యాత్**
**ఆవర్త స్తవ కిల పద్మనాభ ! నాభిః ।**

**తత్పద్మం వరద ! విభాతి కాన్తిమయ్యాః**
**లక్ష్మ్యా స్తే సకలవపు ర్జుషో ను సద్మ ॥** **50**

పద్మనాభుడవైన వరదరాజస్వామి! నీ నాభి తిరుమేనిసౌందర్యం అనే అమృతరసప్రవాహంయొక్క వేగంచేత ఏర్పడ్డ సుడి అయి ఉంటుంది. ఆ నాభిలో ఉండే తామరపూవు నీ తిరుమేని అంతా వ్యాపించి ఉండే కాంతి అనే లక్ష్మికి వాసస్థానంగా ప్రకాశిస్తున్నది. ("పద్మనాభ" అనే సంబోధన సాభిప్రాయకం. అత్యంతం రస్యం కనుక సౌందర్యం అమృతంగా రూపింపబడింది. "ఆవర్త స్తవ కిల" అన్నప్పుడు ఉత్ప్రేక్ష.)

**యా దామోదర ఇతి నామదా తవాఽసీత్**
**సా దామా కిల కిణకారిణీ బభూవ ।**
**తన్మానం వరద ! వళిత్రయచ్ఛలేన**
**త్వన్మధ్యప్రథమవిభూషణీ బభూవ ॥** **51**

వరదరాజస్వామీ ! ఏ దారం నీకు దామోదరనామాన్ని కల్గించిందో, ఆ దారమేకదా కిణాన్ని (కాయను) కూడా కల్గించింది. ఆ కిణం త్రివళి (ఉదరభాగంలో ఉండే మూడు మడుపులు) అనే నెపంతో నీ నడుముకు మొట్టమొదటి అలంకారం అయినది. ("దామ్నా చైవోదరే బద్ధ్వా ప్రత్యబధ్నా దులూఖలే" అనే పౌరాణిక వచనం గ్రాహ్యం.)

**యాదృగ్బీజాధ్యుషితభువి యద్వస్తు హస్తీశ ! జాతం**
**తత్తాదృక్షం ఫలతి హి ఫలం త్వయ్యపీక్షామహే తత్ ।**
**యస్మాదణ్డాధ్యుషిత ఉదరే తావకే జాయమానం**
**పద్మం పద్మాసన ! కిల ఫలత్యణ్డషణ్డా నఖణ్డాన్ ॥** **52**

తామరపూవువంటి తిరుముఖాన్ని కల హస్తిగిరినాథా ! ఏవస్తువు ఏ విత్తనం వల్ల పుడుతుందో, ఆ పదార్థం ఆ విత్తుకు తగిన ఫలాన్నే కదా ఇస్తుంది. అదే రీతిని నీవిషయంలోకూడా చూస్తున్నాము. ఏవిధంగా అంటే- బ్రహ్మాండాలుండే నీ ఉదరంలో పుట్టిన నాభీకమలం అసంఖ్యేయబ్రహ్మాండాలను సృష్టిస్తున్నదికదా ! ("ఉదరే జాయమానః" ఇది పంచమ్యర్థంలో సప్తమీ ప్రయోగం. "ఉదరాత్ జాయమానః" అని భావం.)

**అజ్ఞే యజ్ఞేశ్వర ! కిల జనే క్వాప్యదర్శం విమర్శం**
**విశ్వాధీశః కతమ ఇతి తన్నిర్ణయం వర్ణయామః ।**
**వ్యావక్రోశీ నృషు సముదితా యానుపాశ్రిత్య తేఽపి**
**బ్రహ్మాద్యా స్తే వరద ! జనితా స్తున్దకన్దారవిన్దే ॥** **53**

సర్వయజ్ఞసమారాధ్యుడవైన ఓ వరదరాజస్వామీ! నేను "అన్ని లోకాలకు ప్రభువు ఎవరు?'' అని విమర్శించి చూచాను. ఆ విమర్శవల్ల సిద్ధించిన నిర్ణయం ఏమంటే, చెబుతున్నాను. ఏ బ్రహ్మాదుల పరత్వవిషయంలో కల్గిన సందేహమనే కోలాహలం దేవతాంతరాలను భజించే మానవులకు కల్గిందో, ఆ బ్రహ్మాదిదేవతలు కూడా నీ నాభిని మూలకందంగా కల తామరపూవులో నుండి పుట్టినవారే- అనేదే ఆ నిర్ణయం. (శ్రీమన్నారాయణుని సర్వజగత్కారణత్వాన్ని నాభీ కమలం నిరూపిస్తున్నది అని భావం. **"యే యజంతి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్, సర్వభూతాంతరాత్మానం విష్ణు మేవ యజంతి తే"** ఇత్యాదులు భగవానుని సర్వకర్మసమారాధ్యత్వాన్ని తెలుపుతున్నాయి. **"హిరణగర్భ స్సమవర్తతాఒగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్"** అని, **"యదా తమ స్త న్న దివా న రాత్రి ర్న సన్న చాస చ్ఛివ ఏవ కేవలః"** అని, **"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే"** అని గల శ్రుతివాక్యాల ఆపాతప్రతీతివల్ల బ్రహ్మ-రుద్ర -ఇంద్రులు పరతత్త్వమని వాదించేవారి వాదనలను **"బ్రహ్మణః పుత్రాయ జ్యేష్ఠాయ విరూపాక్షాయ"** ఇత్యాది శ్రుతులు, బ్రహ్మకు జన్మస్థానం అయిన నాభీపద్మం ఉపశమింపజేసి, జ్ఞానహీనులైన మనకు కూడా శ్రీమన్నారాయణుడే పరతత్త్వమనే నిర్ణయాన్ని కల్గిస్తున్నవి.)

**ముష్ణన్ కృష్ణః ప్రియనిజజనై ర్గవ్య! హైయఙ్గవీనం**
**దామ్నా ధూమ్నా వరద ! హి యయా త్వం యశోదాకరాభ్యామ్ ।**
**బద్ధో బన్ధక్షపణకరణీం తాం కిలాద్యాపి మాతుః**
**ప్రేమ్ణా గాత్రాభరణ ముదరాబంధనాఖ్యం బిభర్షి ॥** **54**

భక్తపరతంత్రుడవైన వరదరాజస్వామీ ! శ్రీకృష్ణావతారాన్ని ఎత్తిన నీవు వెన్నను నీ స్నేహితులతో కలసి దొంగిలించి, యశోద చేతులచేత ఏదారంతో **"దామ్నా చైవోదరే బద్ధ్వా"** అన్నట్లు రోటికి కట్టబడ్డావో, సంసారబంధాన్ని విడిపించగల ఆ దారాన్ని నీవు వరదరాజస్వామిగా సేవను అనుగ్రహించే ఈ సమయంలోకూడా ఆ యశోదాదేవి పట్ల నీకుండే ప్రేమచేత ఉదరబంధం అనే పేరును గల దేహభూషణ రూపంతో ధరిస్తున్నావు కదా!.

**సౌన్దర్యాఖ్యా సరిదురసి విస్తీర్య మధ్యావరుద్ధా**
**స్థానాల్పత్వా ద్విషమగతిజావర్తగర్తాభనాభిః ।**
**పాప్య ప్రాప్తప్రథిమజఘనం విస్మృతా హస్తినాథ !**
**స్రోతోభేదం భజతి భవతః పాదదేశాపదేశాత్ ॥** **55**

ఓ హస్తిగిరినాథా! వక్షఃస్థంలో విస్తరించి ప్రవహిస్తూ వచ్చి, మధ్యదేశంలో (నడుములో) అడ్డగింపబడి, అక్కడ అవకాశం స్వల్పంగా ఉండడంచేత ఏర్పడ్డ విషమగమనంవల్ల పుట్టిన సుడివంటి నాభిని కల్గిన, సౌందర్యమనే పేరును కల నది విశాలమైన జఘనప్రదేశంలో విస్తృతిని పొంది (వ్యాపించి), అంతకు ముందు వక్షఃస్థలంలో వలె విస్తరిస్తూ సాగి, రెండుగా చీలి శ్రీపాదాలనే పేరుతో ప్రవాహభేదాన్ని పొందింది. (రెండు కాళ్ళుగా ప్రవహిస్తున్నది).

**రమ్భాస్తమ్భాః కరివరకరాః కారభా స్సారభాజో**
**వేషాశ్లేషా అపి మరకతస్తంభముఖ్యా స్తులాఖ్యాః ।**
**సామ్యం సమ్యగ్వరద ! న దధు స్సర్వ మూర్వో స్త్వదూర్వోః**
**న హ్యైశ్వర్యం దధతి న తథా యౌవనారమ్భజృంభాః ॥ 56**

వరదరాజస్వామీ ! బలిష్ఠాలైన అరటిబోదెలు, గొప్ప ఏనుగుతొండం, కరభమనే (చేతి చిటికెనవేలు చివరనుండి మణికట్టువరకు ఉండే భాగం) ప్రదేశం, మరకతమణిమయం అయిన స్తంభాలు- అనేవి అన్నీ నీ ఊరువుల ఆకారం వంటి ఆకారంయొక్క సంబంధాన్ని కల్గినవి. అందువల్లనే ఉపమానాలుగా చెప్పబడే ప్రసిద్ధిని కల్గినవి. అయినా, బాగా బలిష్ఠాలైన నీ తొడలతో అన్నివిధాలైన, సర్వాత్మనా సామ్యాన్ని సరిగా అవి పొందలేదు. ఎందుకు? అంటే, పూర్వం చెప్పిన అరటిబోదెలు మొదలైన వానికి నీ ఊరువులకు గల శక్తివిశేషం లేదు. ఎల్లప్పుడూ యౌవనారంభాన్నే కల, అనిర్వచనీయం అయిన అందాన్ని అవి కల్గినవికావు కదా ! (లేక, యౌవనారంభంలో ఉండదగిన అటువంటి అనిర్వచనీయాలైన వికాసాలను కల్గినవి కావుకదా! అనికూడా భావం.)

**యా తే గాత్రే వరద ! జనితా కాంతిమయ్యాపగాఽభూత్**
**తస్యా స్స్రోతోయుగళ మిహ యద్యాతి పాదప్రవాదమ్ ।**
**తజ్జాతోర్ధ్వభ్రమియుగ మివోద్భానునీ జానునీ తే**
**స్యాదుక్ష్ణో ర్వా కకుదయుగళం యౌవనైశ్వర్యనామ్నోః ॥ 57**

వరదరాజస్వామీ ! నీ తిరుమేనినుండి కాంతిరూపంలో ఉండే ఏ నది పుట్టినదో, ఆ నదియొక్క రెండు భాగాలైన ప్రవాహం నీ తిరుమేనిలోని శ్రీపాదాలనే వ్యాజాన్ని (రూపాన్ని) పొందింది. ఊర్ధ్వముఖంగా ప్రసరించే శోభను కల నీ ముంగాళ్ళు, నీ పాదాలనే పేరును పొందిన ఆ రెండు ప్రవాహాలవల్ల ఏర్పడిన రెండు నీటి సుడులవలె ప్రకాశిస్తున్నవి. లేక, యౌవనం, ఐశ్వర్యం- అనే పేర్లను కల రెండు ఎద్దుల మూపురాలుగా శోభిస్తున్నవి.

**ప్రేమ్ణాఽఽఘ్రాతుం కరిగిరిశిరోఽధోముఖీభావభాజోః**
**అంఘ్రిద్వంద్వాహ్వయకమలయో ర్దణ్డకాండాయమానే ।**
**అద్రిస్పర్శోద్భవసుఖత ఉత్కణ్టకే రోమహర్షాత్**
**ద్రష్టు ర్దృష్టి ర్వరద ! కిమలం లంఘితుం జంఘికే తే ॥ 58**

వరదరాజస్వామీ ! హస్తిగిరియొక్క శిఖరాన్ని, అందులోగల భోగ్యతాతిశయం వల్ల కల్గిన ప్రీతిచేత, ఆఘ్రాణించడంకోసం అధోముఖంగా ఉండే స్థితిని (నీ) శ్రీపాదాలనే తామరపూవులు పొందాయి. ఆ తామరల నాళాల కాడలవలె నీ జంఘలు (పిక్కలు) ఉన్నాయి. ఆ హస్తిగిరి స్పర్శవల్ల కల్గిన సుఖంచేత పుట్టిన గగుర్పాటు రూపంలో పైకి వ్యక్తం అయిన కంటకవ్యాప్తిని (గగుర్పాటును) కల నీ జంఘలను సేవించే (నా) కళ్ళు ఆ జంఘలను వదలిపెట్టి దృష్టి వేశే ఏ వస్తువు మీదకు అయినా పోగలవా! (పోలేవు)

**భక్తానాం యద్వపుషి దహరం పణ్డితం పుండరీకం**
**యచ్చావ్లానం వరద ! సతతాధ్యాసనా దాసనాబ్జమ్ ।**
**ఆమ్నాయానాం యదపి చ శిరో యశ్చ మూర్ధా శఠారేః**
**హస్త్యద్రే ర్వా కి మతి సుఖదం తేషు పాదాబ్జయో స్తే ॥ 59**

వరదరాజస్వామీ ! భక్తులైన యోగుల శరీరంలో జ్ఞానవికాసాన్ని కల్గినదై, దహరమనే పేరు కల్గినదైన పుండరీకం, నీవు పరమపదంలో ఎల్లప్పుడూ వేంచేసి ఉన్నా ఏమాత్రం వాడని ఆసనపుండరీకం, వేదాంతాలు, నమ్మాళ్వార్ల శిరస్సు, ఈ హస్తగిరిశిఖరం- అనే ప్రసిద్ధాలైన ఈ అయిదు స్థానాలలో నీ శ్రీపాదాలకు మిక్కిలి సుఖకరం అయిన స్థానం ఏది ? (**"దహ్రం విపాప్మం పరవేశ్మ భూతం యః పుండరీకం పురమధ్యసంస్థమ్, తత్రాపి దహ్రం గగనం విశోక స్తస్మిన్ యదంత స్తదుపాసితవ్యమ్"** అనే శ్రుత్యర్థం భావ్యం. **"ఆమ్నాయానాం శిరః"- "సర్వే దేవా యత్పద మామనంతి", వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః", "శుడర్మికు శురుదియుళ్ ఇవై యుణ్డ శురనే"** ఇత్యాది ప్రమాణాలు భావ్యాలు. నమ్మాళ్వార్ల శిరస్సులో అన్నపుడు **"తిరుప్పాఙ్కడలే ఎన్ తలైయే"** అనే సూక్తి భావ్యం.)

**పద్యాస్వద్యాఽంగులిషు వరద ! ప్రాంతతః కాంతిసింధోః**
**వీచీవీథీవిభవ ముభయీష్వంభసో లంభితాసు ।**
**విందన్నిందుః ప్రతిఫలనజాం సమ్పదం కిమ్పదం తే**
**ఛాయాచ్ఛద్మా నఖవితతితాం లమ్భిత శ్శుమ్భిత స్సన్ ॥ 60**

ఓ వరదరాజస్వామీ ! కాంతి అనే సముద్రతీరంలోని అలల వరుసలవలె శోభిల్లే నీ శ్రీపాదాలలోని (కుడి ఎడమలుగా ఉండే) రెండు విధాలైన వేళ్ళలో ప్రతిఫలించినందువల్ల కల్గిన శోభను ఇపుడు పొందుతున్నవాడై, అందువల్లనే ప్రతిచ్ఛాయను పొందిన చంద్రుడు ఆ కాలిగోళ్ళ పంక్తిగా ఉండే స్థితిని పొంది, నీ శ్రీపాదాలను ప్రకాశింపజేస్తున్నాడా ! ఏమి ?

**శమ్భో రమ్భోరుహముఖ ! సఖా సన్ సహాఙ్క శ్శశాఙ్కః**
**కుర్వన్ సేవాం వరద ! వికలో వృత్తహీన స్సువక్రః ।**
**త్వత్పాదాబ్జే ప్రియముఖ ! నఖచ్ఛద్మనాఽఽశ్రిత్య నిత్యం**
**సద్వృత్తోఽభూత్స చ దశగుణః పుష్కలో నిష్కలంకః ॥** 61

తామరపూవువంటి ముఖాన్ని కలవాడవై, యజ్ఞప్రియుడవైన వరదరాజస్వామీ ! ఇంతకుముందే మచ్చను కల (పాపాన్ని కల) ఆ చంద్రుడు రుద్రునకు సఖుడై ఉంటూ, అతని శిరోభూషణంగా సేవచేస్తూ, కళావిహీనుడై, విద్యావిహీనుడై, వలయాకారరూపాన్ని (గుండ్రని రూపాన్ని) పోగొట్టుకొన్నవాడై (సదాచారహీనుడై), వక్రంగా ఉండే ఆకారాన్ని కలవాడై, (కుటిలహృదయుడై) పోయాడు. ఇపుడు నఖాలనే మిషతో నీ పాదపద్మాలను నిత్యంగా ఆశ్రయించి, ఆ కళంకాన్ని (పాపాన్ని) పోగొట్టుకొని, నిత్యపూర్ణుడై, సద్వృత్తాన్ని (గుండ్రని ఆకారాన్ని, మంచినడతను) కలవాడై, (పది నఖాల రూపంలో) పదిరెట్లు వృద్ధి చెందినవాడైనాడు. (**"యో జాతక్రశిమా"** అనే సుందరబాహుస్తవ శ్లోకార్థం స్మరణీయం. శ్లోకంలోని విశేషణాలు శ్లిష్టాలు)

**త్వత్పాదాబ్జే ప్రజాతా సురసరిదభవ త్త్వా కృతుర్ధా తతస్తా-**
**స్వేకాం ధత్తే ధ్రువ స్సా త్రిభువన మపునా త్త్రీన్ పథో భావయన్తీ ।**
**తత్రైకా ఖం వ్రజన్తీ శివయతి తు శివం సా పున స్సప్తధాఽభూత్**
**తాస్వేకా గాం పునానా వరద ! సగరజస్వర్గసర్గం చకార ॥** 62

వరదరాజస్వామీ ! నీ శ్రీపాదపద్మాలనుండి పుట్టిన గంగానది ముందుగా నాల్గు విభాగాలుగా అయినది. తరువాత ఆ నాల్గింటిలో ఒక భాగాన్ని ధ్రువుడు ధరించాడు. ధ్రువుడు ధరించిన ఆ భాగం మూడు దారులను పొందుతూ స్వర్గ-అంతరిక్ష - పాతాళాలనే ముల్లోకాలను పవిత్రం చేసింది. మూడు పాయలుగా ప్రవహించే వాటిలో అంతరిక్షం వైపు పోయిన ఒక భాగం రుద్రుని పరిశుద్ధుని చేస్తున్నది. శివునిచేత ధరింపబడ్డ ఆ గంగ ఏడు విభాగాలు అయినది. వాటిలో భూమిని పరిశుద్ధం చేసే ఒక విభాగం సగరపుత్రులకు స్వర్గప్రాప్తిని కల్గించింది. (సుందరబాహు స్తవంలోని

"ఏతే తే బత" అనే శ్లోకార్థం భావ్యం. "భేదం చాలకనందాఖ్యం యస్యాః శర్వోఽపి దక్షిణమ్, దధార శిరసా భక్త్యా వర్షాణా మధికం శతమ్", అనే విష్ణుపురాణ వచనాలు, "విససర్జ తతో గంగాం హరో బిందుసరః ప్రతి, తస్యాం విసృజ్యమానాయాం సప్త స్రోతాంసి జజ్ఞిరే, .... సప్తమీ చాన్వగా త్తాసాం భగీరథమతో నృపమ్" ఇత్యాది శ్రీరామాయణవచనాలు, "యచ్చౌచనిఃసృతసంరిత్ప్రవరోదకేన తీర్థేన మూర్ధ్ని విధృతేన శివ శ్శివోఽభూత్", ఇత్యాది ప్రమాణాలు భావ్యాలు. ఈ వృత్తాంతాన్ని తిరుమழிశై ఆழ்వార్లు నాన్ముకన్ తిరువన్దాదిలోని "కుఱై కొణ్డు నాన్ముకన్" అనే పాశురంలో ప్రస్తావించారు. ఈ శ్లోకంనుండి నానావృత్తదశకం ప్రారంభం అయినది.)

పరిజనపరిబర్హా భూషణాన్యాయుధాని
ప్రవరగుణగణా శ్చ జ్ఞానశక్త్యాదయ స్తే ।
పరమపద మథాణ్డా న్యాత్మదేహ స్తథాఽఽత్మా
వరద ! సకల మేతత్సంశ్రితార్థం చకర్థ ॥ 63

వరదరాజస్వామీ ! శేషశేషాశనాదిపరిజనాలు, ఛత్రచామరాది చిహ్నాలు, కిరీటం, కుండలాలు మొదలైన ఆభరణాలు, సుదర్శనం, పాంచజన్యం మొదలైన దివ్యాయుధాలు, జ్ఞానం, శక్తి మొదలైన ప్రసిద్ధాలైన గొప్ప గుణాలు, పరమపదం, బ్రహ్మాండాలు, నీ అసాధారణ దివ్యమంగళవిగ్రహం, దివ్యాత్మస్వరూపం- వీటిని అన్నిటినీ భక్తులకోసం ఏర్పఱచావు. ("తథా ఆత్మా" - అన్నపుడు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ", "ఆనందో బ్రహ్మ", "అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా", "ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాపా దివ్యో దేవ ఏకో నారాయణః" ఇత్యాద్యుక్తస్వరూపాన్ని కల ఆత్మ - అని అర్థం. "తథాఽపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే" అనే జితంతే స్తోత్ర సూక్తి స్మరణీయం. ఈ శ్లోకంనుండి భగవానుని విభవావతారవైభవం 71వ శ్లోకంవరకు ప్రస్తుతింపబడుతున్నది.)

అనాప్తం హ్యాప్తవ్యం న తవ కిల కిఞ్చిద్వరద ! తే
జగజ్జన్మస్థేమప్రళయవిధయో ధీవిలసితమ్ ।
తథాఽపి క్షోదీయ స్సురనరకులేష్వాశ్రితజనాన్
సమాశ్లేష్టుం పేష్టుం తదసుఖకృతాం చాఽవతరసి ॥ 64

వరదా! నీవు ఇంతకు ముందు పొందనిది, ఇక సృష్టింపబడి పొందవలసినది ఏదీ లేదు కదా! ఎందుకంటే, జగత్తుల సృష్టి- స్థితి- సంహారకార్యాలు అన్నీ నీ సంకల్పంయొక్క విలాసాలు కదా ! అయినా, ఆవిధంగా అవాప్తసమస్తకాముడవు అయినా,

నీ విరహాన్ని సహించలేని భాగవతులను సంశ్లేషించడంకోసం, ఆ భక్తులకు కష్టాలను కల్గించే దుష్టులను హింసించడంకోసం, (ఆ భక్తులకు కష్టాలను కల్గించే దుష్టులను పిండిచేయడం కోసం) అతిక్షుద్రాలు అయిన దేవమనుష్యాది జాతులలో అవతరిస్తున్నావు. (**"పరిత్రాణాయ సాధూనామ్"** అని మొదట సాధుపరిత్రాణం అవతార ప్రయోజనాలలో మున్ముందుగా చెప్పబడినందున అదే ముఖ్య ప్రయోజనం. దుష్కృద్వినాశం ఆనుషంగికం. "యే భక్తా" అనే సుందరబాహు స్తవ శ్లోకార్థంలోని **"తత్సంశ్లేషణతద్విరోధినిధన"** ఇత్యాది ప్రయోగం భావ్యం.)

**వివేకధియ మేకతో హ్యభినివేశలేశో హరేత్**
**మహత్త్వభినివేశనం కిముత తన్మహిమ్న స్త్వవ ।**
**అహో ! విసదృశే జగత్యవతతర్థ పార్థాదికం**
**నిజం జన ముదఞ్చయన్ వరద ! తం సమాశ్లేషకః ॥ 65**

వరదరాజస్వామీ ! ఒక వస్తువులో కలిగే ఆశాలేశమే (కొద్దిపాటి ఆశ) ఇది తగినది- ఇది తగనిది అనే వివేకాన్ని హరిస్తుందికదా ! ఇక అధికమైన ఆశ అయితే వివేకాన్ని పూర్తిగా నశింపజేస్తుంది అనడంలో ఏమి సందేహం ? అందువల్ల నీ గొప్పతనానికి తగనివారైన ఈలోకంలోని అర్జునాదులను నీవు నీ బంధువులుగా గౌరవిస్తున్నావు. ఆ విధంగా అర్జునాదులతో నీవు ఒకటిగా ఏభేదం లేకుండా కలసిపోతూ, వరిస్తున్నావు. నీ సౌశీల్యం ఉన్న తీరు ఎంత గొప్పది. ఆహా ! (**"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః... విష్ణో ర్యత్పరమం పదమ్", "తే హ నాకం మహిమాన స్సచంతే యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః", "వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతై స్సహ"** అని కీర్తింపబడే వైకుంఠంలో ఉండే నీకు ఈ నికృష్టభూలోకం తగదని తాత్పర్యం. పార్థాదులన్నపుడు ఆదిశబ్దం చేత మాలాకార, అక్రూర, విదురాదులు గ్రాహ్యులు. **"మమ ప్రాణాహి పాండవా!"** అని అంటూ పాండవులను తన ప్రాణాలతో సమానంగా స్వామి భావించాడు కదా!)

**సంశ్లేషే భజతాం త్వరాపరవశః కాలేన సంశోధ్య తాన్**
**ఆనీయ స్వపదే స్వసంగమకృతం సోఢుం విలమ్బం బత !**
**అక్షామ్యన్ క్షమిణాం వరో వరద ! సన్నత్రాఽవతీర్ణో భవేః**
**కిం నామ త్వ మసంశ్రితేషు వితరన్వేషం వృణీషే తు తాన్ ॥ 66**

వరదా! ఓర్పును కలవారిలో గొప్పవాడవైనా నీవు భక్తులను కలవడంలో చాలా తొందరను కలవాడవై, కాలక్రమంలో ఆ భక్తుల కర్మజ్ఞానరూపసంపదతో శోధించి,

నీస్థలం అయిన పరమపదానికి తీసికొనిపోయి (లేక, నీ శ్రీపాదాలను చేర్చి) వారిని నీతో సంశ్లేషింపచేయడంలో కలిగే ఆలస్యాన్ని సహించే శక్తి లేనివాడవై, ఈ తమోమయప్రపంచంలో జన్మిస్తే జన్మించు. దానినిగూర్చి నేనేమీ ప్రశ్నించడం లేదు. కాని, ఆశ్రితులు కానివారికికూడా నీ దివ్యవిగ్రహాన్ని అనుభావ్యవిషయంగా అనుగ్రహించేవాడవై, వారినికూడా వరిస్తున్నావే! ఇదేమి! ఆశ్చర్యం! (**"కాలేన సంశోధ్య"**- అన్నపుడు **"ఏష ఏవ సాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి"**, **"తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః, నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా"** ఇత్యాది ప్రమాణాలు స్మరణీయాలు. **"జన్మాంతరసహస్రేషు తపోధ్యాన సమాధిభిః"**, **"నరాణాం క్షీణపాపానామ్ కృష్ణే భక్తిః ప్రజాయతే"** అనే సూక్త్యర్థం కూడా అర్థసిద్ధం. శిశుపాలాదులను భగవానుడు తన సౌందర్యంతో మోహింప జేసిన విషయం ఈ శ్లోకార్థానికి అనుగుణంగా అనుసంధేయం. **"పల పల నాழమ్ శొల్లి పழித్త శిశుపాలన్ తన్నై అలవలైమై తవిర్త్త అழకన్"** అనే పెరియాழ్వార్ల సూక్తి స్మరించదగినది.)

**వరద ! యది న భువ్యవాతరిష్యః**
**శ్రుతివిహితా స్త్వదుపాసనార్చనాద్యాః ।**
**కరణపథవిదూరగే సతి త్వయి**
**అవిషయతా నికృతాః కిలాऽభవిష్యన్ ॥ 67**

ఈలోకంలో నీవు అవతరించి ఉండకపోతే, పర-వ్యూహ- అంతర్యామి ఆకారుడవై ఉండే నీవు ఇంద్రియాలకు అందనివాడవై అయిపోతావు. అందువల్ల వేదాలలో విధింపబడ్డ నిన్ను ఉపాసించడం, ఆరాధించడం మొదలైన క్రియలు నిర్విషయాలు, అందువల్ల తిరస్కృతాలు అయి ఉండేవిసుమా ! (సుందరబాహు స్తవంలోని **"సింహాద్రినాథ"**, అతిమానుష స్తవంలోని **"ఏవం స్థితే"** అనే శ్లోకాలు స్మరణీయాలు.

**యదపరాధసహస్ర మజస్రజం త్వయి శరణ్య ! హిరణ్య ఉపావహత్ ।**
**వరద ! తేన చిరం త్వ మవిక్రియః వికృతి మర్భకనిర్భజనా దగాః ॥ 68**

సర్వరక్షకుడవైన ఓ వరదరాజస్వామీ ! హిరణ్యకశిపుడు నీ విషయంలో నిత్యం ఎన్నో అపరాధాలను చేశాడు. అయినా, ఆ వేలాది అపరాధాలవల్లకూడా చాలా కాలంవరకు ఏమాత్రం వికారాన్ని (కోపాన్ని) పొందని నీవు చిన్నకుఱ్ఱవాడైన ప్రహ్లాదుని బాధించినందువల్ల మనోవికారాన్ని (ఆగ్రహాన్ని) పొందావు. (భక్తుల పట్ల చేసే అపచారాలను భగవానుడు ఎంతమాత్రం సహించడు అని తాత్పర్యం. "ఈశ్వరన్

**పణ్ణిన ఆనైతొట్రికళెల్లామ్ భాగవతాపచారమ్ పొఱామైయాలే"** అనే నంజీయర్ సూక్తికి ఈ శ్లోకం మూలం అని చెప్పవచ్చు. నామ్ని నామైకదేశగ్రహణ న్యాయంలో హిరణ్యకశిపు నామంలోని ఏకదేశమైన హిరణ్యశబ్దం హిరణ్యకశిపు పరంగా ప్రయోగింపబడింది.)

**త్వా మామనంతి కవయః కరుణామృతాబ్ధే !**
**జ్ఞానక్రియాభజనలభ్య మలభ్య మన్యైః ।**
**ఏతేషు కేన వరదోత్తరకోసలస్థాః**
**పూర్వం సదూర్వ మభజన్త హి జన్తవ స్త్వామ్ ॥ 69**

కరుణ అనే అమృతానికి సముద్రంవంటి వరదరాజస్వామీ! పరాశర పారాశర్యాది మహనీయులు నిన్ను జ్ఞానయోగ- కర్మయోగ- భక్తియోగాల ద్వారా పొందడానికి వీలయినవాడవని, వేఱు ఉపాయాలతో పొందడానికి సాధ్యం కానివాడవని అంటున్నారు. పూర్వం, శ్రీరామావతారంలో ఉత్తరకోసలదేశంలోని జీవులు గడ్డిపఱకతో సహా అందఱు నిన్ను పొందారే ! ఆ విధంగా నిన్ను పొందడానికి వారు పూర్వం చెప్పిన కర్మజ్ఞానభక్తి యోగాలలో దేనిని అనుష్ఠించారు! (**"యే ధర్మ మాచరితుమ్"** అనే అతిమానుషస్తవ శ్లోకం సంవాదంగా స్మరణీయమ్. **"జ్ఞానక్రియా భజనలభ్యమ్"- "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః", "వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్, విష్ణు రారాధ్యతే పంథా నాన్య స్తత్తోషకారకః", "భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్, సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి", "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్, దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే"** ఇత్యాది పలు ప్రమాణాలు భగవానుని కర్మజ్ఞానభక్తి యోగలభ్యత్వాన్ని చాటుతున్నాయి.)

**భజత్సు వాత్సల్యవశాత్సముత్సుకః**
**ప్రకామ మత్రావతరేర్వరప్రద !**
**భవే శ్చ తేషాం సులభోఽథ కిం న్విదం**
**యదజ్ఞ దామ్నా నియతః పురాఽరుదః ॥ 70**

వరదరాజస్వామీ ! నీవు భక్తుల విషయంలో గల ప్రీతివిశేషంచేత చాలా ఔత్సుక్యాన్ని (ఆశను) కలవాడవై ఈ విభూతిలో నీకిష్టం వచ్చిన రీతిలో అవతరించు. ఆ భక్తులకు సులభుడవై ఉండు. సరే ! పూర్వం కృష్ణావతారంలో యశోదచే దారంతో కట్టబడినవాడవై (వెక్కివెక్కి) ఏడ్చావు అన్నది మాత్రం అర్థంకాకుండా ఉన్నదే. (నీ భక్తసౌలభ్యపరాకాష్ఠ వాచామగోచరం అని తాత్పర్యం.)

**నరసింహతను రగౌణీ సమసమయసముద్భవ శ్చ భక్తగిరః ।**
**స్తంభే చ సంభవ స్తే పిశునతి పరేశతాం వరద ! ॥ 71**

వరదరాజస్వామీ ! భక్తుడైన ప్రహ్లాదుడు "అంతటా భగవానుడున్నాడు" అని నోఱుతెరచి పల్కిన మఱుక్షణంలోనే అప్రాకృతం అయిన నృసింహరూపంతో నీవు అవతరించడం, స్తంభంలో అవతరించడం కూడా నీ పరమేశ్వరత్వాన్ని సూచిస్తున్నది. (మాతృగర్భంలో నవమాసాలు ఉండకుండా సద్యః స్తంభంలో ఆవిర్భావం- **"న తస్య ప్రాకృతా మూర్తిః"** అనే నీ అప్రాకృతరూపాన్ని, **"త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్, తం దేవతానాం పరమం చ దైవతమ్"** ఇత్యాదిగా ఘోషింపబడే నీ సర్వేశ్వరత్వాన్ని నిరూపిస్తున్నదని భావం. శ్లోకంలో పరేశత్వమన్నపుడు **"పరః ఈశః యస్య సః"** అనే వ్యుత్పత్తిని చెప్పి భక్తపరాధీనత్వమని చెప్పడం కూడా సరసమే. ఇంతవరకు శ్రీమన్నారాయణశబ్దార్థభూతుడైన వరదరాజస్వామిని వర్ణించి, కూరేశులు ఇక ఎనిమిది శ్లోకాలతో ప్రపత్తి చేయగోరి ముందుగా తమ దోషభూయస్త్వాన్ని తెలుపుతున్నారు.)

**తాపత్రయీమయదవానలదహ్యమానం**
**ముహ్యన్త మన్త మవయన్త మనన్త ! నైవ ।**
**స్థాతుం ప్రయాతు ముపయాతు మనీశ మీశ !**
**హస్తీశ ! దృష్ట్యమృతవృష్టిభి రాభజేథాః ॥ 72**

సర్వస్వామివై, అపరిచ్ఛిన్నస్వరూపుడవైన హస్తిగిరీశా ! తాపత్రయం అనే కార్చిచ్చుచేత తపింపబడినవాడనై, అందువల్లనే మోహాన్ని పొందినవాడనై, ఈ ఆర్తియొక్క ఎల్లను తెలియనివాడనై, నిలవడానికి, వెళ్ళడానికి, సమీపించడానికి కూడ శక్తి లేనివాడనైన నన్ను నీకటాక్షామృతవర్షాలతో చుట్టుముట్టాలి. (తడపాలి) (**"ఏవం సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాఽప్యుపజాయతే"** అని కీర్తింపబడే నిర్హేతుకకృపతో రక్షించాలని ప్రార్థిస్తున్నారు. **"త్వదీక్షణసుధాసింధు"** ఇత్యాది దేవరాజాష్టక శ్లోకభావం అనుసంధేయం.)

**నానావిరుద్ధవిదిశాసు దిశాసు చాఽహో**
**వన్ధ్యై ర్మనోరథశతై ర్యుగపద్వికృష్టః ।**
**త్వత్పాదయో రనుదితస్పృహ ఏష సోఽహం**
**న స్వస్తి హస్తిగిరినాథ ! నిశామయామి ॥ 73**

హస్తిగిరినాథా ! మూగవాడు కన్న కలవలె వ్యర్థమైపోయే పలు కోరికలతో విరుద్ధాలైన పలు వక్రమార్గాలలోను, మంచిదారులలోను ఏక కాలంలో బలంగా

లాగబడ్డవాడనై, (ఆకర్షింపబడ్డవాడనై), నీ శ్రీపాదాలలో భక్తిని లేనివాడనై ఉండే నేను మంచిని ఏమీ చూడలేకున్నాను. ("వంధ్యైః మనోరథైః"- "ఉత్పద్యంతే విలీయంతే దరిద్రాణాం మనోరథాః" అనికదా సూక్తి. పూర్వశ్లోకంలోని "స్థాతుం ప్రయాతు ముపయాతు మునీశమ్" అనే స్థితికి కారణం ఇందులో వివరింపబడింది.)

హైః! నిర్భయోఽస్మ్యవినయోఽస్మి యత స్త్వదంఘ్రౌ
లిప్సా మలబ్ధవతి చేతసి దుర్వినీతే ।
దుష్కర్మవర్మపరికర్మిత ఏష సోఽహమ్
అగ్రే వరప్రద ! తవ ప్రలపామి కించిత్ ॥ 74

వరదా ! ఈ దాసుడు (నేను)ఏమీ భయం లేనివాడనై ఉన్నాడు. అయ్యో ! ఎందుకు ! అని అంటే, దుర్వినీతిని కల నా మనస్సు నీ శ్రీపాదాలలో ఆశను పొందనందువల్ల దుష్కర్మలనే కవచాలను తొడుగుకొన్న నేను నీ ఎదురుగా నోటికి వచ్చినట్లు వదరుతున్నాను. (ప్రలపిస్తున్నాను.)

సవ్యాధి రాధి రవితుష్టి రనిష్టయోగః
స్వాభీష్టభంజన మమర్షకరో నికర్షః ।
కృన్తన్తి సన్తత మిమాని మనో మదీయం
హస్తీశ ! న త్వదభిలాషనిధిప్రహాణిః ॥ 75

హస్తిగిరినాథా! శరీరవ్యాధులతో కూడిన మనోవ్యాధి, చిరకాలం అనుభవించినా తృప్తిని పొందకపోవడం, అనిష్టాలు కల్గడం, కోరుకొన్నవి పొందలేక పోయే రీతిలో అడ్డు రావడం, కోపాన్ని కల్గించ గల నైచ్యం- అనే ఇవి అన్నీ నా మనస్సును ఎల్లప్పుడు చీల్చి చెండాడుతున్నవి. నీ విషయంలో భక్తిని కల్గి ఉండడం అనే నిధిని నేను కోల్పోవడాన్నిగూర్చి మాత్రం కొంచెం కూడా బాధలేదే ! (నీ పట్ల భక్తి లేదే ! అనే దుఃఖం ఏ మాత్రం నాకు లేదు.)

విద్వేషమానమదరాగవిలోభమోహ -
ద్యాజానభూమి రహ మత్ర భవే నిమజ్జన్ ।
నిర్ద్వంద్వ ! నిత్య ! నిరవద్య ! మహాగుణం త్వాం
హస్తీశ ! క శ్శ్రయితు మీక్షితు మీప్సితుం వా ॥ 76

జ్ఞాన-అజ్ఞానాలు, సుఖ-దుఃఖాలు- అనే ద్వంద్వాలను లేనివాడవై, సహజసిద్ధంగానే హేయప్రతిభటుడవై ఉండే వరదరాజస్వామీ ! ఒకరి విషయంలో

అకారణంగా పగను కల్గి ఉండడం, ఆభిజాత్యాదుల కారణంగా అహంకారాన్ని పొందడం, విషయలాభంచేత గర్వించి ఉండడం, లౌకికవిషయాల ప్రాప్తిని కోరడం, విశేషమైన లోభం (తనకు ప్రాప్తించిన దానిని యోగ్యులకు వినియోగించడంలో అడ్డువచ్చే అభినివేశం), మోహం (కృత్యాకృత్యాలనుగూర్చిన జ్ఞానం లేకపోవడం)- ఈ మొదలైన దుర్గుణాలకు జన్మభూమినై, ఈ సంసారంలో మునిగి ఉండే నేను గొప్ప గుణాలను కలవాడనైన నిన్ను ఆశ్రయించడానికి, దర్శించడానికి, ఆశించడానికి ఎంతవాడను?

**పుత్రాదయః కథ మమీ మయి సంస్థితే స్యుః**
**ఇత్యప్రతిక్రియనిరర్థకచిన్తనేన ।**
**దూయే న తు స్వయ మహం భవితాఽస్మి కీదృక్**
**ఇత్యస్తి హస్తిగిరినాథ ! విమర్శలేశః ॥** 77

వరదరాజస్వామీ! "నేను చనిపోయిన తరువాత ఈ నా సంతానం మొదలైనవారు ఏమయిపోతారో? ఏమో?" అనే ప్రతీకారం లేనిది, అందువల్లనే వ్యర్థమైనది అయిన చింతతో నేను పరితపిస్తున్నాను. నేను ఏమవుతున్నాను? అనే చింతమాత్రం కొంచెంకూడా నాకు లేదే!

**శమ్పాచలం బహుళదుఃఖ మనర్థహేతుః**
**అల్పీయ ఇత్యపి విమృష్టిషు దృష్టదోషమ్ ।**
**దుర్వాసనాద్రఢిమత స్సుఖ మిన్ద్రియోత్థం**
**హాతుం న మే మతి రలం వరదాధిరాజ ! ॥** 78

వరదరాజస్వామీ ! బాగా విమర్శించి చూస్తే మెఱపువలె క్షణికమైనదని, దుఃఖ మయం అని, అనర్థాలకు మూలం అని, చాలా క్షుద్రమైనదని- ఈ విధంగా దర్శింపబడ్డ దోషాలను కల్గిన, ఇంద్రియజన్యం అయిన సుఖాన్ని నా బుద్ధి దుర్వాసనా (సంస్కార) బలంవల్ల విడువలేకుండా ఉన్నదయ్యా!

**బుద్ధ్వా చ నో చ విహితాకరణై ర్నిషిద్ధ -**
**సంసేవనై స్త్వదపచారశతై రసహ్యైః ।**
**భక్తాగసా మపి శతై ర్భవతాఽ ప్యగణ్యైః**
**హస్తీశ ! వాక్తనుమనోజనితై ర్హతోఽస్మి ॥** 79

వరదరాజా! తెలిసి తెలియక వాక్కు- శరీరం- మనస్సు- అనే త్రికరణాలతో చేసినవి, సర్వశక్తివి అయిన నీచేకూడా లెక్కపెట్టడానికి సాధ్యం కానివి, విధింపబడ్డ

కర్మలను అనుష్ఠించకపోవడం, శాస్త్రనిషిద్ధకర్మలను చేయడం- అనే పాపాలవల్ల, నీ విషయంలో చేసే పలు పలు అపచారాలవల్ల, అన్నిటినీ సహించే స్వభావాన్ని కల నీవు కూడా సహించ లేని పలు భాగవతాపచారాలవల్ల నేను చెడిపోయాను. (**"సత్యం వద, ధర్మం చర, అహ రహ స్సంధ్యా ముపాసీత"** ఇత్యాదిగా విధింపబడ్డ కర్మలను చేయకపోవడం, **"న కలంజం భక్షయేత్, న సురాం పిబేత్"** ఇత్యాదిగా నిషేధింపబడ్డ కర్మలను విధిగా చేయడం, భగవద్భాగవతాచార్యుల విషయంలోని అపచారాలు- ఇత్యాదులు భావ్యాలు.)

**త్వద్దాస్య మస్య హి మమ స్వరసప్రసక్తం**
**తచ్చోరయన్నయ మహం కిల చస్థల ప్రాక్ ।**
**త్వం మామకీన ఇతి మా మభిమన్యసే స్మ**
**హస్తీశ ! సంశమయ న స్తమిమం వివాదమ్ ॥** 80

వరదరాజస్వామీ ! ఇటువంటి మహాపాపిని అయిన నాకు నీ విషయంలో దాసుణ్ణిగా ఉండడమే కదా స్వతస్సిద్ధమైనది. సరసమైనది. నేను పూర్వం ఆ స్వతస్సిద్ధమైన దాస్యాన్ని **"చోరేణాత్మాపహారిణా"** అన్నట్లు దొంగలిస్తూ, పతనం చెందానుసుమా! **"నడువే వన్దు ఉయ్య క్కొళ్ళుకిన్ఱ నాదన్"** గా కీర్తింపబడే నీవు ఇటువంటి నన్ను "ఇతడు మనవాడు'' అని అభిమానించి, నీకు మాకు మధ్యలో ఉండే- "నేను నీకు దాసుడను కాను'' అని నేను నీ చేయి దాటిపోవడం, "నీవు నాకు దాసుడవు''అని నన్ను నీవు వెంబడించడం- అనే రూపంలోని మన మధ్యగల విసంవాదాన్ని ఇక ఏనాటికీ తల ఎత్తకుండా ఉండేటట్లు సమూలంగా పోగొట్టి అనుగ్రహించు. (**"దాసభూతా స్స్వత సర్వే హ్యాత్మానః పరమాత్మనః, నాన్యథా లక్షణం తేషాం బంధే మోక్షే తథైవ చ"** అనే స్వరూప సత్తారూపమైన దాస్యాన్ని అనుగ్రహించు అనిభావం. శ్రీపరాశరభట్టర్ **"త్వం మేఽహం మే''** అనే ముక్తకాన్ని రచించడానికి ఈ శ్లోకమే మూలం.)

**భోగా ఇమే విధిశివాదిపదం చ కించ**
**స్వాత్మానుభూతి రితి యా కిల ముక్తి రుక్తా ।**
**సర్వం తదూషజలజోష మహం జుషేయ**
**హస్త్యద్రినాథ ! తవ దాస్యమహారసజ్ఞః ॥** 81

హస్తిగిరినాథా ! నీ దాస్యంలోని గొప్ప రసాన్ని తెలిసిన నేను ఐహికాలైన ఈ భోగాలు కాని, సృష్టికర్త అయిన బ్రహ్మ, లయకర్త అయిన శివుడు మొదలైనవారి

పదవులు గాని, ఇంకా కైవల్యం (ఆత్మానుభూతి) అని చెప్పబడే మోక్షం కాని - వీటిని అన్నిటినీ ఉప్పునీటితో సమానంగా, అంటే, అసారాలుగా భావిస్తున్నాను.

**విషయవిషధరవ్రజవ్యాకులే జననమరణనక్రచక్రాస్పదే ।**
**అగతి రశరణో భవాబ్ధౌ లుఠన్ వరద ! శరణ మిత్యహం త్వాం వృణే ॥ 82**

వరదా ! శబ్దాదివిషయాలు అనే సర్పసమూహంతో నిండిన జననం, మరణం- అనే మొసళ్ళ సమూహాలకు జన్మస్థానం అయిన సంసారసాగరంలో పొర్లే నేను నిన్ను తప్ప వేటే ఉపేయాన్ని లేనివాడను, వేటే ఉపాయాన్ని లేనివాడను- అనే కారణం చేత నిన్ను శరణు పొందుతున్నాను. (ఈ శ్లోకంలో, తర్వాతి శ్లోకంలో శరణాగతి చేయబడు తున్నది. **"దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులే"** అనే ముకుందమాలా శ్లోకం భావ్యం.)

**అకృతసుకృతక స్సుదుష్కృత్తరః శుభగుణలవలేశదేశాతిగః ।**
**అశుభగుణపరస్సహస్రావృతః వరద మురుదయం గతిం త్వాం వృణే ॥ 83**

కొంచెంకూడా సుకృతాన్ని (మంచిపనిని) చేయనివాడనై, పాపిష్ఠులలో అగ్రగణ్యుడనై, మంచిగుణంలో లవలేశానికికూడా చాలా దూరంలో ఉన్నవాడనై (మంచి గుణాన్ని ఏ కొంచెం అయినా లేనివాడనై) కామక్రోధాది పలువేల దుర్గుణాలచేత ఆవరింపబడ్డవాడనైన నేను గొప్ప దయను కలవాడవై, వరాన్ని ఇచ్చేవాడవై ఉన్న నిన్ను ఉపాయంగా వరిస్తున్నాను. (**"అకృతసుకృతకః"** - అన్నపుడు అల్పార్థంలో **"క"** ప్రత్యయంవచ్చింది. నిర్హేతుకమైన భగవత్కృపమాత్రమే రక్షకం అనే దానికి- **"వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్", "నిన్నరుళే పురిన్దిరున్దేన్", "కృపయా కేవలమ్", "దయయైవ దయైకసింధో!"** ఇత్యాదులు ప్రమాణాలు. **"షడ్విధా శరణాగతిః"** అని చెప్పబడ్డ శరణాగతి యొక్క ఆఱు అంగాలలో గోప్తృత్వవరణమే ప్రధానమనే అంశం ఈ శ్లోకంవల్ల నిరూపితమైనది.)

**శరణవరణవా గియం యోఽ దితా న భవతి బత సాఽ పి ధీపూర్వికా ।**
**ఇతి యది దయనీయతా మయ్యహో ! వరద ! తవ భవే త్తతః ప్రాణిమి ॥ 84**

వరదరాజస్వామీ ! నా ఈ శరణాగతివచనంకూడా (నేను నిన్ను శరణు పొందడం కూడా) బుద్ధి పూర్వకంకాదు. అయ్యో ! అని మనస్సులో భావించి, దాసునిపై జాలి నీకు కల్గితే దానివల్ల అయినా బ్రతుకుతాను. (**"ప్రాణిమి"**- భవిష్యత్కాలార్థంలో వర్తమానకాల ప్రయోగం ఇది.)

**నిరవధిషు కృతేషు చాऽऽగస్స్వహో మతి రనుశయినీ యది స్యాత్తతః ।**
**వరద ! హి దయసే న సంశేమహే నిరనుశయధియో హతా హ్యై వయమ్ ॥ 85**

వరదరాజస్వామీ! ఇపుడు ఈ శరణాగతి వాక్కుతప్ప దానికి మించి సుకరమైన, అపేక్షితాన్ని ప్రసాదించే గొప్ప వేఱొక సాధనం ఏదీ నాకు లేదు. ఈ విధంగా నేను నిన్ను తప్ప వేఱొక ఉపాయాన్ని లేనివాడనై ఉండడంవల్ల ఈ సమయమే నీ దయకు తగిన సమయం. (**"కృతే పాపేऽనుతాపో వై యస్య పుంసః ప్రజాయతే, ప్రాయశ్చిత్తం తు తస్యైకం హరిసంస్మరణం పరమ్"** ఇత్యాదులు పశ్చాత్తాపంకూడా భగవద్దయోన్మేషక మనే అంశానికి ప్రమాణాలు. **"పాపే కృతే యది భవంతి భయానుతాపలజ్జాః పునః కరణ మస్య కథం ఘటేత"** అని అన్నట్లు పశ్చాత్తాపం కల్గితే మళ్ళీ పాపం చేయరు. ఆ పశ్చాత్తాపం కూడా నాకు లేదని భావం.)

**శరణవరణవాగియం యాऽద్య మే వరద ! తదధికం న కించిన్మమ ।**
**సులభ మభిమతార్థకం సాధనం తదయ మవసరో దయాయా స్తవ ॥ 86**

వరదరాజస్వామీ ! ఇపుడు నేను పలికే శరణాగతివచనంకంటే, అధికమైనది, సులభమైనది, అభిమతం అయిన నీ దాస్యాన్ని ప్రసాదించేది అయిన వేఱొక సాధనం ఏదీ నాదగ్గరలేదు. అందువల్ల నీ కృపకు తగిన సమయం ఇదే సుమా !

**విషయవిషయిణీ స్పృహా భూయసీ**
**తవ తు చరణయో ర్న సాऽల్పాపి మే ।**
**వరద ! నను భర స్తవైవ త్వయం**
**యదుత తవ పదస్పృహా జన్మ మే ॥ 87**

వరదరాజస్వామీ ! దాసునకు శబ్దాదిలౌకికవిషయాలలోని ఆశ చాలా అధికంగా ఉన్నది. నీ శ్రీచరణాలలో ఆ ఆశ కొంచెంకూడా లేదు. నీ శ్రీపాదాలలో నాకు భక్తి కల్గించడం అనేది నీ బాధ్యతేసుమా! (**"ఉదీర్ణసంసారదవాశుశుక్షణిమ్"** అనే స్తోత్రరత్నశ్లోకార్థం ఇక్కడ భావ్యం. ఈ శ్లోకం నుండి ద్వయంలోని ఉత్తరఖండార్థం వివరింపబడుతున్నది.)

**ఇయ మిహ మతి రస్మదుజ్జీవనీ**
**వరద ! తవ ఖలు ప్రసాదాదృతే ।**
**శరణ మితి వచోऽపి మే నోదియాత్**
**త్వ మసి మయి తతః ప్రసాదోన్ముఖః ॥ 88**

వరదా ! విషయాలలో అనురాగాన్ని కల నాకు 'శరణు' అనే మాట అయినా నీ అనుగ్రహం లేకపోతే కలుగదుకదా ! అందవల్ల (నీ అనుగ్రహంవల్లనే నేను శరణు అనే మాటను పల్కగల్గుతున్నందున) దాసునిపట్ల అనుగ్రహాన్ని చూపడంలో ఆసక్తిని కలవాడవై ఉన్నావు- అనే ఈ భావన ఇపుడు దాసులమైన మేము ఉజ్జీవించడానికి హేతువు అవుతున్నది.

**వరద ! యదిహ వస్తు వాఞ్ఛామ్యహం తవ చరణలాభావిరోధ స్తతః ।**
**యది న భవతి తచ్చ దేహి ప్రభో ! ఝడితి వితర పాద మేవాఽన్యథా ॥ 89**

వరదరాజా ! దాసుడనైన నేను ఇక్కడ ఈ లోకంలో ఏ వస్తువును కోరుతున్నానో, ఆవస్తువాంఛ నీ శ్రీపాదాలను పొందడానికి ప్రతిబంధకం కాకపోతే ఆ వస్తువును అనుగ్రహించు. నేను ఒక వస్తువును కోరడం నీ పదకమల ప్రాప్తికి అడ్డు అయితే నీ శ్రీపాదాలను వెంటనే అనుగ్రహించు. (ఇందులోని సంబోధనలు సాభిప్రాయకాలు.)

**తదపి కి మపి హంత! దూర్వాసనాశతవివశతయా యదభ్యర్థయే ।**
**తదతులదయ! సార్వ ! సర్వప్రద ! ప్రవితర వరద ! క్షమామ్భోనిధే ॥ 90**

సాటి లేని మేటి దయను కలవాడా ! క్షమకు సముద్రంవంటివాడా ! సర్వజనుల హితాన్ని కోరేవాడా ! అన్నిటినీ అనుగ్రహించేవాడా ! ఇదంతా స్ఫురించేటట్లుగా వరదుడనే తిరునామాన్ని కలవాడా ! నీ శరణాగతికి విరుద్ధమైనా, నేను పలు పలు దుర్వాసనాదులకు వశమై ఉండడంవల్ల ఏదో ఒకదానిని నేను ప్రార్థిస్తున్నాను. దానిని నీవు అనుగ్రహించు. నీవు క్షమానిధివి. కనుక నా అజ్ఞానాన్ని క్షమించు.

**ప్రియ మితరదథాఽపి వా యద్యథా**
**వితరసి వరద ప్రభో ! త్వం హి మే ।**
**తదనుభవన మేవ యుక్తం హి మే**
**త్వయి నిహితభరోఽస్మి సోఽహం యతః ॥ 91**

వరదరాజా ! ఈ విధంగా దాసుడు ప్రార్థించినా, స్వతంత్రుడవైన నీవు ఇష్టమైనదైనా, అనిష్టమైనదైనా, దేనిని ఏవిధంగా నాకు అనుగ్రహిస్తావో ఆవిధంగానే దానిని అనుభవించడమేకదా పరతంత్రుడనైన నాకు తగినది. ఎందుకంటే, నేను నీసన్నిధిలో నా రక్షణభారాన్ని సమర్పించానుకదా !

**యథాఽసి యావానసి యోఽసి యద్గుణః**
**కరీశ ! యాదృగ్విభవో యదింగితః ।**

**తథావిధం త్వాఽహ మభక్తదుర్గ్రహం**
**ప్రపత్తి వా చైవ నిరీక్షితుం వృణే ॥ 92**

హస్తిగిరినాథా ! నీవు ఎవడవై ఉన్నావో, ఏగుణాలను కలవాడవై ఉన్నావో, ఏ ప్రకారాన్ని కలవాడవై ఉన్నావో, ఎంతటివాడవై ఉన్నాడో, ఎటువంటి వైభవాన్ని కలవాడవై ఉన్నావో, ఎటువంటి వ్యాపారాన్ని కలవాడవై ఉన్నావో, అటువంటివాడవై, భక్తులకుతప్ప మిగిలినవారికి దుర్లభుడవైన నిన్ను నేను శరణం అనే మాట మాత్రంతోనే సాక్షాత్కరింప జేసికోవాలని ఆశపడుతున్నాను. (1. **"యోఽసి"** - **"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ", "హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ"** - ఇత్యాదులచే చెప్పబడ్డ సత్యత్వజ్ఞానత్వానందత్వాదులు, లక్ష్మీపతిత్వాదులు. 2. **"యద్గుణోఽసి"- "పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** ఇత్యాదిగా చెప్పబడ్డ జ్ఞానశక్త్యాదులు, 3. **"యథాసి" - "యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి"** ఇత్యాదిగా చెప్పబడ్డ జగజ్జన్మాది కారణత్వాదులు. 4. **"యావానసి", "అణో రణీయాన్ మహతో మహీయాన్", "అంతర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"**- ఇత్యాదిగా తెలుపబడ్డ అణో రణుత్వ, మహతో మహత్త్వాదులు, 5. **"యాదృగ్విభవోఽసి"** - **"పతిం విశ్వస్యాత్మే శ్వరమ్", "త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్, తం దేవతానాం పరమం చ దైవతమ్"** - ఇత్యాదిగా చెప్పబడ్డ పరమైశ్వర్యం, 6. **"యదింగితః"- "అంతఃప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా", "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివీ మంతరో యమయతి"** ఇత్యాదులచే చెప్పబడ్డ చేతనాచేతన నియమనాదులు భావ్యాలు.)

**అయే ! దయాళో ! వరద ! క్షమానిధే ! విశేషతో విశ్వజనీన ! విశ్వద !**
**హితజ్ఞ ! సర్వజ్ఞ ! సమగ్రశక్తిక ! ప్రసహ్య మాం ప్రాపయ దాస్య మేవ తే ॥ 93**

ఓ వరదరాజస్వామీ ! క్షమకు (ఓర్పుకు) నిధివంటివాడా ! విశేషించి అందఱి జనుల హితాన్ని కోరేవాడా ! అన్నిటినీ అందఱికీ ఇచ్చేవాడా ! దాసుల హితాన్ని తెలిసేవాడా ! అన్నిటినీ తెలిసినవాడా ! పరిపూర్ణశక్తిని కలవాడా ! వరాన్ని అనుగ్రహించే వాడవనే పేరును కలవాడా ! నాకు నీ దాస్యాన్నే ఏవిధంగా అయినా అనుగ్రహించాలి. (**"దయాళో, క్షమానిధే"** - అని ద్వయంలోని శ్రీమచ్ఛబ్దం, **"సర్వజ్ఞ, సమగ్రశక్తిక"** అని నారాయణశబ్దార్థం, **"దాస్యం ప్రాపయ"** అని చతుర్థీవిభక్త్యర్థం, **"ప్రసహ్య"** - అని నమశ్శబ్దార్థం- ఈ విధంగా సంగ్రహంగా ద్వయంలోని ఉత్తరఖండార్థ ప్రతిపాదకం ఈ శ్లోకం.- అని పూర్వాచార్య నిర్వాహం.)

స్వైర్గుణై స్స్వైశ్చరితై స్స్వవేదనాత్
భజన్తి యే త్వాం త్వయి భక్తితోఽథవా ।
కరీశ ! తేషా మపి తావకీ దయా
తథా త్వక్పృత్యైవ తు మే బలం మతమ్ ॥ 94

కరిగిరినాథా ! ఏ చేతనులు తమ గుణాలతో గాని, తమ కర్మయోగంతో కాని, జ్ఞానయోగంతో గాని, లేక ఆయా విషయాలకు సంబంధించిన భక్తి యోగంతోగాని నిన్ను కొలుస్తున్నారో వారికికూడా నీ గొప్ప కృప ఆ నిత్యకైంకర్యస్థితిని కల్గిస్తున్నది. ఆదయేకదా దాసునకు ముఖ్యసాధనంగా, బలంగా నిశ్చయింపబడింది.

యది త్వభక్తోఽప్యగుణోఽపి నిష్క్రియో
నిరుద్యమో నిష్కృతదుష్కృతో న చ ।
లభేయ పాదౌ వరద ! స్ఫుటా స్తతః
క్షమాదయాద్యా స్తవ మంగళా గుణాః ॥ 95

వరదా ! భక్తిశూన్యుడను అయినా, దానికి అంగం అయిన జ్ఞానయోగం లేనివాడను అయినా, కర్మయోగశూన్యుడను అయినా, ఆనుకూల్యసంకల్పం లేనివాడను అయినా, ప్రాయశ్చిత్తంతో నశింపజేసికోలేని ప్రబల పాపాలను కలవాడను అయినా, దాసుడనైన నేను తమ శ్రీపాదాలను ఆశ్రయిస్తే, అందువల్ల క్షమ, దయమొదలైన తమ కల్యాణ గుణాలు ప్రకాశిస్తాయి.

విలోకనై ర్విభ్రమణై రపి భ్రువోః స్మితామృతై రింగితమంగళై రపి ।
ప్రచోదిత స్తే వరద ! ప్రహృష్టధీః కదా విధాస్యే వరివస్యనం తవ ॥ 96

వరదా ! తమ కటాక్షవీక్షణాలతో, కనుబొమల విభ్రమాలతో, పరమభోగ్యం అయిన చిఱునవ్వుతో, అందమైన హస్తచేష్టాదులతో దాసుడనైన నేను ప్రేరేపింపబడ్డ వాడనై, అందువల్లనే ఆనందించిన మనస్సుతో తమకు పరిచర్యను నిరంతరం ఎపుడు చేయగలనో కదా !

వివిశ్య విశ్వేన్ద్రియతర్షకర్షణీః
మనఃస్థలే నిత్యనిఖాతనిశ్చలాః ।
సుధాసఖీ ర్హస్తిపతే ! సుశీతలాః
గిర శ్శ్రవస్యా శ్శృణుయామ తావకీః ॥ 97

హస్తిగిరినాథా ! లోపల ప్రవేశించి, అన్ని ఇంద్రియాల ఆర్తిని తీర్చేవై, మనస్సులో ఎల్లప్పుడు ప్రతిష్ఠింపబడి స్థిరంగా ఉండేవై, అమృతంవంటివై, చాలా చల్లనివై, వినడానికి తీయనివైన నీ సూక్తులను మేము వినాలి.

**అశేషదేశాఖిలకాలయోగినీషు అహం త్వవస్థా స్వఖిలా స్వనన్యధీః ।**
**అశేషదాస్యైకరతి స్తవాఽచరన్ కరీశ ! వర్తేయ సదా త్వదన్తికే ॥ 98**

కరిగిరినాథా! సర్వదేశసర్వకాలాలలోను, సర్వావస్థలలోను, సకల విధకైంకర్యాలలో ఎంతకూ తృప్తిచెందని (తీరని) భక్తిని కల నేను అశేషమైన దాస్యాన్ని ఇంకొక ఆలోచన ఏదీ లేకుండా అనుష్ఠిస్తూ ఎల్లప్పుడూ నీ పరిసరంలోనే వర్తిస్తాను. (**"అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే", "ఒழிవిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని వழுవిలా వడిమై శెయ్యవేణ్డుమ్ నామ్"** ఇత్యాదుల భావాలు అర్చామూర్తి పరంగా, అనుసంధింపబడ్డాయి.)

**ఇమం జనం హంత! కదాఽభిషేక్ష్యతే త్వదక్షినద్యో ర్వరద ! శ్రమాపహా !**
**అకృతిమప్రేమరసప్రవాహజా విసృత్వరీ వీక్షణవీచిసన్తతిః ॥ 99**

వరదరాజాస్వామీ! నీ తిరునేత్రాలనే స్వాభావికం అయిన ఆనంద రస నదీప్రవాహంలోనుండి పుట్టినవి, అందువల్లనే ఆర్తిని తీర్చగల్గినవి, అంతటా వ్యాపించ గల్గినవి అయిన కటాక్షాలనే తరంగాల వరుస నన్ను ఎపుడు స్నానం చేయిస్తుంది ? (కైంకర్యసామ్రాజ్యానికి చక్రవర్తిగా ఎపుడు నన్ను పట్టాభిషేకం చేస్తుంది?) (**"య శ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి, నిందితః స భవేల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే"** అన్నట్లు భగవత్కటాక్షం అత్యంత అభిలషణీయం కదా. **"త్వదీక్షణసుధాసింధు వీచివిక్షేపశీకరైః, కారుణ్యమారుతానీతైః శీతలై రభిషించ మామ్"** అనే దేవరాజాష్టకశ్లోకం భావ్యం.)

**సదాతనత్వేఽపి తదాతనత్వవత్ నవీభవత్ప్రేమరసప్రవాహయా ।**
**నిషేవితం త్వాం సతతోత్కయా శ్రియా కరీశ ! పశ్యేమ పరశ్శతం సమాః ॥ 100**

కరిగిరినాథా! నిత్యం పరిచయం అయినది అయినా ఎప్పటికప్పుడు నూతనంగా తోచే ప్రణయరసపరంపరలను కల్గినది, అందువల్లనే, నిత్యం ఉత్సుకతను కల్గినదై ఉండే లక్ష్మీదేవిచేత నిత్యం సేవింపబడే నిన్ను మంగళాన్ని ఆశాసిస్తూ దర్శించాలి.

**సమాహితై స్సాధు సనన్దనాదిభిః**
**సుదుర్లభం భక్తజనై రదుర్లభమ్ ।**

**అచిన్త్య మత్యద్భుత మప్రతర్క్యణం**
**వరప్రద ! త్వత్పద మాప్నుయాం కథమ్ ॥** 101

కరిగిరీశా ! చక్కని సమాధినిష్ఠను కల సనకసనందనాది మునులచేతకూడా పొంద సాధ్యం కానిదై, భక్తిని కలవారికి అత్యంతం సులభమై, అమానసగోచరమై, ఊహకు అందనిదై, అందువల్లనే చాలా ఆశ్చర్యకరమయిన నీనివాసం పరమపదాన్ని ఏవిధంగా స్వప్రయత్నంతో పొందగలను? (నీ కృప వల్లనే అది సాధ్యం.)

**రామానుజాఙ్ఘ్రిశరణోఽస్మి కులప్రదీపః**
**త్వాఽఽసీ త్స యామునమునే స్స చ నాథవంశ్యః ।**
**వంశ్యః పరాంకుశమునే స్స చ సోఽపి దేవ్యాః**
**దాస స్తవేతి వరదాఽస్మి తవేక్షణీయః ॥** 102

హస్తిగిరినాథా ! వరదరాజస్వామీ ! దాసుడనైన నేను భగవద్రామానుజుల శ్రీచరణాలను శరణంగా కలవాడను. ఆ రామానుజులు శ్రీయామునుల విద్యావంశానికి దీపంవంటివారు. ఆ యామునులుకూడా విద్యాసంబంధాన్నిబట్టి, దేహసంబంధాన్ని బట్టి శ్రీమన్నాథమునుల వంశానికి చెందినవారు. ఆ నాథమునులు సైతం నమ్మాళ్వార్ల వంశంలోనివారు. ఆ నమ్మాళ్వార్లు లక్ష్మికి దాసులు- అనే ఈ పరంపరద్వారా నన్ను నీవు కటాక్షించు. (శ్రీ రామానుజుల అభిమానంలో ఒదిగే ఉండే నన్ను నీవు తప్పక కటాక్షించు అని భావం.) ("**పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్త మచింతయిత్వా**" అనే యామునసూక్తికి ఒక అందమైన అనుకరణం ఈ శ్లోకం.)

వరదరాజస్తవం సంపూర్ణము.



శ్రీ కూరేశులు అనుగ్రహించిన

# శ్రీస్తవము

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే ।
యదుక్తయ స్త్రయీకణ్ఠే యాన్తి మఙ్గలసూత్రతామ్ ॥

---

సకల శ్రుత్యంతరహస్యార్థాలను భగవద్రామానుజుల సన్నిధిలో అధికరించిన శ్రీవత్సాంకులు శ్రీవైకుంఠస్తవం, అతిమానుషస్తవం, సుందరబాహుస్తవం, వరదరాజస్తవం- అనే నాల్గు స్తోత్రాలతో భగవానుని స్తుతించి, తరువాత చివరగా ఈ శ్రీస్తవంలో లక్ష్మీదేవిని స్తుతిస్తున్నారు. శ్రీయామునులు కూడా స్తోత్రరత్నంలో భగవానుని కీర్తించి, తరువాత చతుఃశ్లోకితో లక్ష్మిని స్తుతించారు. పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మీదేవిని ఇందులో 11 శ్లోకాలతో స్తుతించే కూరేశులు ముందుగా మొదటి శ్లోకంలో మంగళకరం అయిన స్వస్తి శబ్ద ప్రయోగంలోను, ఆశీర్వచన రూపంతోను మంగళాచరణం చేస్తున్నారు.

---

స్వస్తి శ్రీ ర్దిశతా దశేషజగతాం సర్గోపసర్గస్థితీః
స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్హరిః ।
యస్యా వీక్ష్య ముఖం తదిఙ్గితపరాధీనో విధత్తేఽఖిలం
క్రీడేయం ఖలు నాన్యథాఽస్య రసదా స్యాదైకరస్యాత్తయా ॥ 1

సమస్తలోకాల సృష్టిసంహారరక్షణాలు, స్వర్గమోక్షప్రదానాలు మొదలైనవానిని అన్నిటినీ హరి అనబడే శ్రీమన్నారాయణుడు ఏ శ్రీదేవియొక్క ముఖాన్ని చూచి, ఆమె కనుబొమల కదలికల సూచనలకు పరతంత్రుడై చేస్తున్నాడో, ఆవిధంగా కాకపోతే, శ్రీ హరి ఆ శ్రీదేవితో ఐకరస్యాన్ని కలవాడు కనుక ఈ సృష్ట్యాది క్రీడ అతనికి ఆనందాన్ని ఇచ్చేది కాదో, అటువంటి శ్రీదేవి అన్నిలోకాలకు శుభాన్ని కల్గించుగాక.

హే శ్రీ ర్దేవి ! సమస్తలోకజననీం త్వాం స్తోతు మీహామహే
యుక్తాం భావయ భారతీం ప్రగుణయ ప్రేమప్రధానాం ధియమ్ ।
భక్తిం భన్ధయ నన్దయాశ్రిత మిమం దాసం జనం తావకం
లక్ష్యం లక్ష్మి ! కటాక్షవీచివిసృతే స్తే స్యామ చామీ వయమ్ ॥ 2

ఓ శ్రీదేవీ ! (అందఱిచే ఆశ్రయింపబడుతూ, భగవానుని ఆశ్రయిస్తూ ఉన్న తల్లీ!) క్రీడాదిగుణవిశిష్టురాలా ! దేవీ ! మేము లోకాలకు అన్నిటికీ తల్లివి అయిన నిన్ను స్తుతించాలని ప్రయత్నిస్తున్నాము. ఆ స్తుతికి తగిన వాక్కును మాకు అనుగ్రహించు. నీ పట్ల ప్రీతిని ప్రధానంగా కల బుద్ధిని మాకు వర్ధిల్లచేయి. నిన్ను ఆశ్రయించిన, నీకు చెందినవాడనైన ఈ దాసుని (నన్ను) సంతోషపెట్టు. మేము నీ కటాక్షాలనబడే కెఱటాల పొంగుకు లక్ష్యంగా కావాలి.

స్తోత్రం నామ కిమామనన్తి కవయో యద్యన్యదీయాన్గుణాన్
అన్యత్ర త్వసతోఽధిరోప్య ఫణితి స్సా తర్హి వన్ధ్యా త్వయి ।
సమ్యక్సత్యగుణాభివర్ణన మథో బ్రూయుః కథం తాదృశీ
వాగ్వాచస్పతినాఽపి శక్యరచనా త్వత్సద్గుణార్ణోనిధౌ ॥ 3

కవులు స్తోత్రమని దేనిని అంటున్నారు? ఒకరిలో లేనివి, ఇంకొకరిలో ఉన్నవి అయిన గుణాలను లేనివారిలో ఆరోపించి చెప్పడమే స్తోత్రం అయితే, ఆ విధంగా స్తుతించడం సమస్తకల్యాణగుణనిధివి అయిన నీ విషయంలో దుస్సాధం. ఎందుకంటే, నీలో లేని సద్గుణం అన్నది లేదుకదా ! ఇక విధంగా కాకుండా ఉన్నగుణాలను ఉన్నట్లు చక్కగా వర్ణించడమే స్తుతి అని అంటే, సద్గుణసముద్రడవు అయిన నీ విషయంలో అటువంటి స్తుతిని పూర్ణంగా చేయడం బృహస్పతికికూడా ఏ విధంగా సాధ్యం? సాధ్యం కాదుకదా !

యే వాచాం మనసాం చ దుర్గ్రహతయా ఖ్యాతా గుణా స్తావకాః
తానేవ ప్రతి సామ్బుజిహ్వా ముదితా హై మామికా భారతీ ।
హాస్యం తత్తు న మన్మహే న హి చకోర్యేకాఖిఽలాం చన్ద్రికాం
నాలం పాతు మితి ప్రగృహ్య రసనా మాసీత సత్యాం తృషి ॥ 4

నీకు సంబంధించిన ఏయే గుణాలు వాక్కులకు, మనస్సుకుకూడా గ్రహించడానికి సాధ్యం కానివిగా ప్రసిద్ధిజెందాయో, వాటిని నా వాక్కు రసం ఊఱే జిహ్వతో (ఆనందంగా) వర్ణించాలని ప్రవర్తిస్తున్నది. ఎంత ఆనందం ! ఇటువంటి ప్రయత్నం పరిహాసాస్పదం అని మేము అనుకోము. ఎందుకంటే, ఆడచకోరపక్షి తనకు దాహం కల్గినపుడు వెన్నెలను అంతటినీ నేను తాగలేనుకదా అని భావించి, నాలుకను ముడుచుకొని ఊరికే ఉండలేదుకదా ! (ఆవిధంగా నేనుకూడా నిన్ను స్తుతించకుండా ఊరికే ఉండలేను)

క్షోదీయా నపి దుష్టబుద్ధి రపి నిస్స్నేహోఽ ప్యనీహోఽపి తే
కీర్తిం దేవి ! లిహ న్నహం న చ బిభేమ్యజ్ఞో న జిహ్రేమి చ ।
దుష్యేత్సా తు న తావతా న హి శునా లీఢాఽపి భాగీరథీ
దుష్యేచ్ఛ్వాఽపి న లజ్జతే న చ బిభేత్యార్తి స్తు శామ్యే చ్ఛునః ॥ 5

దేవీ ! ఏమీ తెలియని అజ్ఞుడనైన నేను చాలా నీచుడను అయినా, దుష్టబుద్ధిని అయినా, భక్తి లేనివాడను అయినా, ఏవిధమైన మంచి ప్రయత్నాన్ని లేనివాడను అయినా, నీకీర్తిని నోరారా స్తుతించడంద్వారా ఆనందం అనుభవిస్తూ ఏమాత్రం భయపడడం లేదు. సిగ్గుపడడమూ లేదు. నాచే వర్ణింపబడే నీ కీర్తి నా చేత కీర్తింపబడినంతమాత్రంచేత చెడిపోదు. ఏవిధంగా అంటావా- గంగాతీర్థం కుక్కచేత స్పృశింపబడినా (నాకబడినా) చెడిపోదు కదా ! దాని పవిత్రతకు భంగం రాదుకదా ! ఆ కుక్కకూడా గంగాజలాన్ని స్పృశించడానికి సిగ్గుపడడం లేదు. భయపడడమూ లేదు. కాని, ఆ కుక్క దాహం మాత్రం శాంతిస్తుందికదా ! (శ్రీవైకుంఠస్తవంలోని **"జానన్నపీహ"** అనే ఎనిమిదవ శ్లోకం భావ్యం.)

ఐశ్వర్యం మహ దేవ వాఽల్ప మథవా దృశ్యేత పుంసాం హి యత్
తల్లక్ష్మ్యా స్సముదీక్షణా త్తవ యత స్సార్వత్రికం వర్తతే ।
తేనైతేన న విస్మయేమహి జగన్నాథోఽపి నారాయణోః
ధన్యం మన్యత ఈక్షణా త్తవ యత స్స్వాత్మాన మాత్మేశ్వరః ॥ 6

మానవులకు ఈలోకంలో, పైలోకంలో అన్నిచోట్ల లభించే ఐశ్వర్యం అది కొంచెంగా అయినా, ఎక్కువగా అయినా, నీ కటాక్షంవల్లనే కలుగుతున్నది. అటువంటి ఈ నీ కటాక్షాన్ని చూచి మేము ఏమీ ఆశ్చర్యపడడం లేదు. ఎందుకంటే, జగన్నాథుడు, తనకు తానే ప్రభువు అయిన శ్రీమన్నారాయణుడుకూడా నీకటాక్షంవల్లనే తనను ధన్యునిగా భావిస్తున్నాడు. ("ఆత్మేశ్వరః" - "పతిం విశ్వస్యాత్మేశ్వరమ్" ఇత్యాది శ్రుతులు భావ్యాలు. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని "ఆనందో బ్రహ్మ" అని అని ఈ రీతిగా వైలక్షణ్యాన్ని కలవాడుగా చెప్పబడ్డ తనను కూడా స్వామి నీ వీక్షణాలవల్ల ధన్యునిగా భావిస్తున్నాడు.)

ఐశ్వర్యం యదశేషపుంసి యదిదం సౌన్దర్యలావణ్యయోః
రూపం యచ్చ హి మఙ్గళం కి మపి యల్లోకే సదిత్యుచ్యతే ।
తత్సర్వం త్వదధీన మేవ యదత శ్రీ రిత్యభేదేన వా
యద్వా శ్రీమదితీదృశేన వచసా దేవి ! ప్రథా మశ్నుతే ॥ 7

ఓ లక్ష్మీదేవీ ! చేతనులందఱివద్ద ఉండే సంపద కాని, అవయవశోభ అనే సౌందర్యం కాని, సముదాయశోభ అయిన లావణ్యం కాని, లోకంలోని మంగళమనే పేరు కల్గినది కాని, ఇంకా సచ్ఛబ్దవాచ్యమైనది మంచిది ఏదయినా కాని, ఆ ఐశ్వర్యం మొదలైనవి అన్నీ నీ ఆజ్ఞకు అణగినవై ఉన్నాయి. అందువల్ల అవి అంతా "శ్రీ" అని అభేదనిర్దేశంతో గాని, లేక, "శ్రీమత్" అనే పదంతో కాని ప్రసిద్ధిని పొందుతున్నవి. (లోకంలోని మంగళకరమైన వస్తువుకాని, వ్యక్తికాని శ్రీఅని, లేక, శ్రీమత్ అని విశేషణం ప్రయోగంతో వ్యవహరింపబడతాయి కదా)

**దేవి! త్వన్మహిమావధి ర్న హరిణా నాపి త్వయా జ్ఞాయతే**
**యద్యప్యేవ మథాపి నైవ యువయో స్సర్వజ్ఞతా హీయతే ।**
**యన్నాస్త్యేవ తదజ్ఞతా మనుగుణాం సర్వజ్ఞతాయా విదుః**
**వ్యోమామ్భోజ మిదన్తయా కిల విదన్భ్రాన్తోఽయ మిత్యుచ్యతే ॥ 8**

ఓ దేవీ! నీ మహిమయొక్క అవధిని తెలియడం హరికికూడా సాధ్యం కాదు. నీవల్లనూ కాదు. ఈవిధంగా నీమహిమ ఎవరికీ తెలియరానిది అయినా మీ ఇద్దఱి సర్వజ్ఞత్వానికి భంగం ఏమాత్రం రాదు. ఎందుకు ? అని అంటే, ఏవస్తువు లోకంలో బొత్తిగా అసలు లేనే లేదో, ఆ అసద్వస్తువును తెలియకుండా ఉండడం అన్నది సర్వజ్ఞత్వానికి అనుగుణమని తెలివైనవారు అంటారు. (లేనిదానిని ఉన్నదని తెలియడం భ్రాంతి. కనుక లేనిదానిని లేనిదిగా తెలియడం సర్వజ్ఞత్వమే అవుతుంది.) ఆకాశపద్మం ఇటువంటిది అని ఎవడైనా తెలిసికొంటే వాడు భ్రాంతుడని అనబడుతున్నాడుకదా! (**"సో అంగ వేద యది వా న వేద"** అనే శ్రుత్యర్థం లక్ష్మీవిషయంగా సంభావించబడింది.)

**లోకే వనస్పతిబృహస్పతితారతమ్యం**
**యస్యాః ప్రసాదపరిణామ ముదాహరంతి ।**
**సా భారతీ భగవతీ తు యదీయదాసీ**
**తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః ॥ 9**

లోకంలో ఒకడు వృక్షంవలె జడుడై పుట్టడం, ఒకడు బృహస్పతివలె మహావిద్వాంసుడై పుట్టడం- అనే హెచ్చు తగ్గులు ఏ సరస్వతీదేవికటాక్షంయొక్క ఫలంగా చెబుతున్నారో, భగవతి అయిన ఆ సరస్వతికూడా లక్ష్మీదేవికి దాసురాలు. అటువంటి దేవదేవుని మహిషి అయిన శ్రీదేవిని నేను ఆశ్రయిస్తున్నాను.

**యస్యాః కటాక్షమృదువీక్షణదీక్షణేన**
**సద్య స్సముల్లసితపల్లవ ముల్లలాస ।**
**విశ్వం విపర్యయసముత్థవిపర్యయం ప్రాక్**
**తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః ॥ 10**

ప్రళయకాలంలో ఏ లక్ష్మీకటాక్షం లేనందువల్ల వాడిపోయిన (నిశ్శ్రీకమైన) జగత్తు ఆ లక్ష్మీదేవి కటాక్షాల ప్రసరణం (అనే సంకల్పం) కాగానే మఱుక్షణంలో చిగిర్చి వృద్ధిచెందిందో అటువంటి దేవదేవదివ్యమహిషి అయిన శ్రీదేవిని ఆశ్రయిస్తున్నాము.

**యస్యాః కటాక్షవీక్షాక్షణలక్ష్యం లక్షితా మహేశా స్స్యుః ।**
**శ్రీరంగరాజమహిషీ సా మామపి వీక్షతాం లక్ష్మీః ॥ 11**

ఏ లక్ష్మీదేవియొక్క కటాక్ష వీక్షణాలకు క్షణకాలం లక్ష్యమైనవారుకూడా గొప్ప సంపదను కలవారు (మహేశ్వరునివంటివారు) అవుతున్నారో, శ్రీరంగనాథుని పట్టమహిషి అయిన ఆ లక్ష్మి నన్నుకూడా కటాక్షించాలి.

శ్రీస్తవం సంపూర్ణము.



# శ్లోకానుక్రమణిక


| శ్లోకం | స్తవం | శ్లోకసంఖ్య |
|---|---|---|
| అకృతసుకృతక స్సుదుష్కృదుత్తరః | వర | 83 |
| అక్షుణ్ణయోగపథ మగ్ర్య | అతి | 18 |
| అజ్ఞే యజ్ఞేశ్వర కిల | వర | 53 |
| అంజనక్షితిభృతో | వర | 30 |
| అణ్డానాం త్వదుదర | వర | 49 |
| అతిపతితావధి | సున్ద | 23 |
| అతిమానుషశీల | అతి | 1 |
| అదీర్ఘ మప్రేమదుఘం | సున్ద | 43 |
| అద్భుతం మహ దసీమ | వర | 9 |
| అద్యాపి నాస్త్యుప | అతి | 59 |
| అధోముఖన్యస్త | సున్ద | 61 |
| అనన్యాధీనత్వం తవ | వర | 20 |
| అనవాప్త మత్ర కిల | సున్ద | 102 |
| అనాప్తం హ్యాప్తవ్యం | వర | 64 |
| అన్తర్హితో నిధి రసి | వైకు | 12 |
| అన్ధన్తమ స్తిమిరో | సున్ద | 40 |
| అన్యత్ర తు క్వచన | వైకు | 18 |
| అన్యోన్యచేష్టిత | సున్ద | 71 |
| అబ్జపాద మర | సున్ద | 33 |
| అబ్ధిం న తేరిథ | అతి | 24 |
| అమ్భోదనీల మర | అతి | 48 |
| అమ్భోధేః స్వయ మభి | మక | 45 |
| అమ్భోరుహాక్ష మర | వైకు | 68 |
| అయే దయాలో వరద | వర | 93 |

| | | |
|---|---|---|
| అరాలం పాతాలం | సున్ద | 96 |
| అరుణాధరపల్లవే | వర | 37 |
| అలకాలిచికీర్షయా | వర | 33 |
| అశక్యకం నో కిఞ్చిత్ | సున్ద | 123 |
| అశేషదేశాఖిల- | వర | 98 |
| అసిజలజరథా | సున్ద | 38 |
| అస్తం యదుద్యదుప | వైకు | 54 |
| అహమహమికాభాజః | సున్ద | 54 |
| అంహః ప్రసహ్య విని | వైకు | 84 |
| ఆక్రీడభూమిషు సుగంధిషు | సున్ద | 87 |
| ఆజ్జీ నిసర్గనియతా | వైకు | 73 |
| ఆచిన్వతః కుసుమ | అతి | 52 |
| ఆజానజ స్వగత | సున్ద | 39 |
| ఆజ్ఞా తవాత్ర భవతీ విదితా త్రయీ సా తాం హి | వైకు | 11 |
| ఆజ్ఞా తవాత్ర భవతీ విదితా త్రయీ సా ధర్మం | సున్ద | 100 |
| ఆత్మేశ్వరోఽసి న పరో | వైకు | 20 |
| ఆధిరాజ్య మధికం | వర | 25 |
| ఆనన్దమన్దిర | సున్ద | 79 |
| ఆనన్ద మైశ్వర | వైకు | 24 |
| ఆమ్నాయకల్పలతి | సున్ద | 65 |
| ఆమ్నాయ మూర్ధని చ | వైకు | 7 |
| ఆయోధ్యగాన్పశు | సున్ద | 125 |
| ఆశ్రయేషు సులభో | సున్ద | 109 |
| ఆశ్లేషే వరద భుజా | వర | 43 |
| ఇఙ్గితం నిమిషితం చ | సున్ద | 115 |
| ఇచ్ఛాత ఏవ తవ | వైకు | 36 |
| ఇచ్ఛావిహారవిధయే | వైకు | 40 |

| | | |
|---|---|---|
| ఇద మిమే శ్రుణుమో | సున్ద | 128 |
| ఇదమ్భూయో భూయః పున | సున్ద | 132 |
| ఇమం జనం హన్త కదా | వర | 99 |
| ఇయ మిహ మతి రస్మత్ | వర | 88 |
| ఇయం వైయూహీ వై | వర | 17 |
| ఇహ చ దేవ దదాసి | సున్ద | 127 |
| ఇహావతీర్ణస్య | సున్ద | 89 |
| ఈదృశా స్త్వదవతార | సున్ద | 121 |
| ఈదృశైః పరిజనైః | సున్ద | 77 |
| ఉదిధిగమన్దరాద్రి | సున్ద | 4 |
| ఉద్ధరత్యుపరి భక్త | వర | 26 |
| ఉన్నిద్రపత్రశత | వైకు | 72 |
| ఉపవనతరుషణ్డైః | సున్ద | 104 |
| ఉభయో రపి పక్షయోః | వర | 32 |
| ఏకస్య యేషు హి | వైకు | 47 |
| ఏకాన్త మఙ్గలగుణా | అతి | 7 |
| ఏకైకమంగలగుణా | సున్ద | 32 |
| ఏతత్కథం కథయ | అతి | 26 |
| ఏతే తే బత సున్దర | సున్ద | 64 |
| ఏతేన వై సువిదితం | వైకు | 97 |
| ఏవం తయా చతురయా | వైకు | 52 |
| ఏవం భగో ఇహ | వైకు | 33 |
| ఏవం స్థితే త్వదుప | అతి | 9 |
| ఏష ఈశ ఇతి | వర | 6 |
| ఐన్దీవరీ క్వచిదపి | వైకు | 75 |
| ఐశం హి శైశవ | అతి | 37 |
| ఐశ్వర్యతేజోబల | సున్ద | 28 |

| | | |
|---|---|---|
| ఐశ్వర్యవీర్య కరుణా | వైకు | 98 |
| ఐశ్వర్యం మహదేవ వా | శ్రీస్త | 6 |
| ఐశ్వర్యం యదశేష | శ్రీస్త | 7 |
| కనకమరతకా | సున్ద | 34 |
| కరుణారసవాహి | వర | 35 |
| కర్ణికా తవ కరీశ | వర | 27 |
| కల్కీ భవిష్య న్కలి | సున్ద | 120 |
| కాన్తాలకాన్త మమలం | అతి | 42 |
| కారుణ్యామృతవారిధే | సున్ద | 131 |
| కాలియస్య ఫణాతాం | సున్ద | 111 |
| కిఞ్చేదఞ్చ విరిఞ్చి | సున్ద | 130 |
| కిన్ను స్వయం స్వాత్మ | సున్ద | 35 |
| కిం ధాతు ర్గగనవిధాన | వర | 48 |
| కిం భూయసా ప్రలపితేన | వైకు | 89 |
| కిం సాధనః క్వ నివసన్ | వైకు | 38 |
| కూలే<u>ఽ</u>బ్ధేః కిల దక్షి | సున్ద | 105 |
| కైఙ్కర్య నిత్యనిరతైః | వైకు | 77 |
| క్రీడావిధేః పరి | అతి | 12 |
| క్వచిత్త్వరితగామినీ | సున్ద | 3 |
| క్షాన్తి స్తవేయ మియ | వైకు | 62 |
| క్షితి రియం జని | సున్ద | 98 |
| క్షోదీయా నపి దుష్ట | శ్రీస్త | 5 |
| గర్భేషు నిర్భర | వైకు | 91 |
| గాయం గాయం వనగిరి | సున్ద | 114 |
| గుణజం గుణినో హి | సున్ద | 22 |
| గుణాయత్తం లోకే | వర | 11 |
| గుణై ష్షడ్భి స్త్వేతైః | వర | 16 |

| | | |
|---|---|---|
| గూహితస్వమహిమాపి | సున్ద | 112 |
| గోపాలపోతకతయా | అతి | 44 |
| గోపాలవేషపరి | అతి | 55 |
| గోవర్ధనో గిరివరో | అతి | 49 |
| చిత్రం విధే ర్విలసితం | వైకు | 13 |
| ఛత్రచామరముఖాః | సున్ద | 75 |
| జగత్ప్రలీనం పున | సున్ద | 94 |
| జనిజీవనాప్యయ | సున్ద | 15 |
| జాతం కుత స్తదకృతజ్ఞ | అతి | 57 |
| జానన్నపీహ కిల | వైకు | 8 |
| జానేఽథ వా కిమహ | వైకు | 86 |
| జుష్టాష్టమీకజ్వల | సున్ద | 41 |
| జ్ఞానం బలం విపుల | అతి | 6 |
| జ్ఞానాత్మన స్తవ తదేవ | వైకు | 50 |
| జ్ఞానిన స్సతత | సున్ద | 83 |
| జ్యాకిణాఙ్కపరి | సున్ద | 52 |
| జ్యోతిః పరం పరమ | వైకు | 26 |
| తత్త్వార్థతత్పరపర | వైకు | 17 |
| తదపి కిమపి హన్త | వర | 90 |
| తద్వై తథాఽస్తు కత | వైకు | 66 |
| తాదృగ్గుణో నను బభూ | అతి | 32 |
| తాపత్రయీమయదవా | వర | 72 |
| తేభ్యః కృతీ న కిల | అతి | 47 |
| త్వక్ చ దృక్ చ నిపి | వర | 24 |
| త్వత్కీర్తనస్తుతి | వైకు | 96 |
| త్వద్దాస్య మస్య హి | వర | 80 |
| త్వద్దృష్టిజుష్ట | వైకు | 32 |

| | | |
|---|---|---|
| త్వన్నిర్మితా జఠర | అతి | 16 |
| త్వత్పాదసంశ్రయణ | వైకు | 99 |
| త్వత్పాదాబ్జే ప్రజాతా | వర | 62 |
| త్వత్సామ్య మేవ | వైకు | 65 |
| త్వం దక్షిణస్య నివ | అతి | 25 |
| త్వం హి సున్దర యదా | సున్ద | 108 |
| త్వం హి సున్దర వనాద్రి | సున్ద | 117 |
| త్వా మన్యగోపగృహ | అతి | 40 |
| త్వా మామనన్తి కవయః కరుణామృతాబ్ధిః | సున్ద | 122 |
| త్వా మామనన్తి కవయః కరుణామృతాబ్ధేః | వర | 69 |
| త్వా ముదార భుజ | వర | 22 |
| త్వా సేవితం జలజ | వైకు | 76 |
| త్రయ్యుద్యతా తవ యువ | వైకు | 51 |
| త్రైవిక్రమక్రమకృతా | వైకు | 71 |
| త్రైవిద్యవృద్ధజన | వైకు | 2 |
| దయాక్షాన్త్యౌదార్య | వర | 19 |
| దాస స్సఖా సమభవ | అతి | 20 |
| దివ్యాచిన్త్యమహా | సున్ద | 70 |
| దూరే గుణా స్తవ తు | వైకు | 49 |
| దేవ త్వదీయచరణ | వైకు | 90 |
| దేవస్య దైత్యమథ | వైకు | 9 |
| దేవస్య సున్దరభుజస్య | సున్ద | 84 |
| దేవి త్వన్మహిమావధిః | శ్రీస్త | 8 |
| ద్వారనాథగణనాథ | సున్ద | 76 |
| ధన్యైః శ్రుతం తదిహ | అతి | 46 |
| నఖక్రకచచక్రధి | సున్ద | 97 |

| | | |
|---|---|---|
| నరసింహతను రగౌణీ | వర | 71 |
| న వక్తుం న శ్రోతుం | వర | 14 |
| న వాయుః పస్పన్దే యయతు | సున్ద | 95 |
| నానావిరుద్ధవిదిశాసు | వర | 73 |
| నిత్య మిన్ద్రియపథా | వర | 3 |
| నిత్య స్సమాభ్యధిక | వైకు | 21 |
| నిత్యా తవాన్యనిర | వైకు | 46 |
| నిత్యేషు వస్తుషు భవ | వైకు | 35 |
| నిరవధిషు కృతేషు | వర | 85 |
| నిరాబాధం నిత్యం | వర | 12 |
| నిర్బన్ధ ఏష యది | వైకు | 101 |
| నికల్మషై ర్నిహ | వైకు | 45 |
| నిహీనో జాత్యా వా | సున్ద | 31 |
| నీలమేఘనిభ మంజన | వర | 23 |
| నీలాఞ్జనాద్రినిభ- | వైకు | 67 |
| నైవ హ్యవాప్య మన | వైకు | 57 |
| న్యాయతర్కమునిముఖ్య | వర | 8 |
| న్యాయస్మృతిప్రభృతి | వైకు | 15 |
| పతిం విశ్వస్యాత్మే | సున్ద | 18 |
| పద్మాయాః ప్రణయ | వర | 41 |
| పద్యాస్పద్యాఙ్గులిషు | వర | 60 |
| పరిజనపరిబర్హా | వర | 63 |
| పర భాగ మియాత్ | వర | 31 |
| పరిమణ్డితరాస | వర | 39 |
| పరో వా వ్యూహో వా | వర | 18 |
| పశ్యత్సు సూరిషు | అతి | 35 |

| | | |
|---|---|---|
| పాణిపాదవద | వర | 21 |
| పాపీయసోఽపి శర | అతి | 61 |
| పాపై రనాదిభవ | వైకు | 58 |
| పారిజాతవిటపా | వర | 28 |
| పిష్టదుష్టమధు | సున్ద | 59 |
| పీతామ్బరం... కర్ణపాశమ్ తన్మేఘమేచక | వైకు | 5 |
| పీతామ్బరం... కర్ణపాశమ్ శ్రీమన్మహావన | సున్ద | 14 |
| పుచ్ఛోత్పుచ్ఛనమూర్ఛ | సున్ద | 90 |
| పుత్రాదయః | వర | 77 |
| పృచ్ఛామి కించన | అతి | 17 |
| పృథివ్యాద్యాత్మానం | సున్ద | 18 |
| ప్రకృష్టం విజ్ఞానం | వర | 15 |
| ప్రత్యగాత్మని కదా | సున్ద | 11 |
| ప్రత్యర్థిని త్రిగుణక | సున్ద | 80 |
| ప్రలయజనీరపూర | సున్ద | 92 |
| ప్రశాన్తానన్తాత్మా | వర | 13 |
| ప్రశ్చ్యోతత్ప్రేమసారా | సున్ద | 44 |
| ప్రియ మితర దథాపి | వర | 91 |
| ప్రేమామృతౌఘపరి | సున్ద | 54 |
| ప్రేమార్ద్రవిహ్వల | వైకు | 10 |
| ప్రేమ్ణాఽఘ్రాతుం కరిగిరి | వర | 58 |
| బాహ్యాః కుదృష్టయ | వైకు | 14 |
| బుద్ధ్వా చ నో చ | వర | 79 |
| బృన్దావనే స్థిర | అతి | 50 |
| బ్రహ్మేశ మధ్యగణనా | అతి | 15 |
| భక్తానాం యద్వపుషి | వర | 59 |

| | | |
|---|---|---|
| భక్తిప్రభావభవ | వైకు | 3 |
| భజత్సు వాత్సల్య | వర | 70 |
| భార్గవః కిల భవన్ | సున్ద | 99 |
| భావై రనుక్షణ మపూర్వ | వైకు | 83 |
| భావై రుదారమధురైః | వైకు | 82 |
| భూయ శ్చ జన్మసమ | వైకు | 92 |
| భూయాంసి భూయ ఉప | వైకు | 93 |
| భృఙ్గీ గాయతి హంస | సున్ద | 13 |
| భోగా ఇమే విధి | వర | 81 |
| భూవిభ్రమేణ మృదు | వైకు | 69 |
| మకుటమకుటమాలో | సున్ద | 37 |
| మథ్యమానచలఫేనిల | వర | 29 |
| మధ్యే క్షీరపయోభి | సున్ద | 111 |
| మన్దరభ్రమణవిభ్ర | సున్ద | 51 |
| మాత్రా యది త్వమసి | అతి | 41 |
| మానుష్యకశ్చరిత | అతి | 22 |
| మాయా త్వయా గుణమయీ | వైకు | 30 |
| ముఖ మున్నస మాయ | వర | 40 |
| ముగ్ధ శ్శిశు ర్వట | అతి | 14 |
| ముష్ణన్ కృష్ణ ప్రియ | వర | 54 |
| యజ్జాతీయో యాదృశో | సున్ద | 30 |
| యత్కల్పాయుతభోగ | సున్ద | 29 |
| యత్కిఞ్చిదుజ్జ్వల | వైకు | 78 |
| యత్తత్త్వమక్షర | వైకు | 6 |
| యత్త్వత్ప్రియం తదిహ | అతి | 53 |
| యత్త్వం కృతాగసమ్ | అతి | 33 |

| | | |
|---|---|---|
| యత్తాదృశాగసమ్ | అతి | 27 |
| యత్తుఙ్గశృంగవిని | సున్ద | 6 |
| యత్సంవృతం దశగుణో | వైకు | 39 |
| యత్స్వయత్తస్వరూప | సున్ద | 21 |
| యథాసి యావా నసి | వర | 92 |
| యదపరాధసహస్ర | వర | 68 |
| యది త్వభక్తోఽప్యగు | వర | 95 |
| యదీయశిఖరాగతాం | సున్ద | 7 |
| యద్బ్రహ్మకల్పనియుతా | వైకు | 61 |
| యద్బ్రహ్మ రుద్ర | వైకు | 42 |
| యద్వా మృగం మృగయు | అతి | 21 |
| యద్వృద్ధ్యపక్షయ | వైకు | 44 |
| యద్వై జరాసుతభయా | అతి | 56 |
| యద్వైష్ణవం హి పరమం | వైకు | 41 |
| యన్నాభవామ భవ | వైకు | 87 |
| యన్నామ నాథ నవ | అతి | 39 |
| యన్మఙ్గలాయ మహతే | వైకు | 4 |
| యన్మూలకారణ మబుద్ధ్యత | వైకు | 25 |
| యల్లక్ష్మణ స్త్వదనుజః | అతి | 28 |
| యశోదాఙ్గుల్యాగ్రోన్నమిత | సున్ద | 47 |
| యస్యాత్మతాం త్రిపుర | అతి | 13 |
| యస్యాః కటాక్షణ మను | సున్ద | 69 |
| యస్యాః కటాక్షణమను | వైకు | 29 |
| యస్యాః కటాక్షమృదు | శ్రీస్త | 10 |
| యస్యాః కటాక్షవీక్షా | శ్రీస్త | 11 |
| యం దుర్గహం సుమనసో | అతి | 36 |

| | | |
|---|---|---|
| యం పరోక్ష ముపదేశ | వర | 5 |
| యం పాతకా త్పుమహతో | అతి | 11 |
| యం భూతభవ్య భవ | వైకు | 22 |
| యః కశ్చిదేవ యది | వైకు | 64 |
| యః ఖల్వణో రణుతరో | వైకు | 19 |
| యః స్థావర క్రిమి | వైకు | 31 |
| యా కర్మణా మధి | వైకు | 100 |
| యా కంసముఖ్యాన్నృప | అతి | 54 |
| యా తే గాత్రే వరద | వర | 57 |
| యా దామోదర ఇతి | వర | 51 |
| యాదృగ్భ్రూజాధ్యుషిత | వర | 52 |
| యా బిభ్రతీ స్థిర | వైకు | 81 |
| యా వై త్వయాప్యదధి | వైకు | 79 |
| యే తు త్వదంఘ్రిసరసీ | వైకు | 16 |
| యే త్వత్కటాక్షలవ | వైకు | 34 |
| యే ధర్మ మాచరితు | అతి | 31 |
| యే భక్తా భవదేక | సున్ద | 86 |
| యే వాచాం మనసాఞ్చ | శ్రీస్త | 4 |
| యేష్వేకస్య గుణస్య | సున్ద | 26 |
| యో జాతక్రశిమా | సున్ద | 68 |
| యో నిత్య మచ్యుత | వైకు | 1 |
| యో విక్రమేణ మను | అతి | 23 |
| యౌవనవృషకకుదో | సున్ద | 60 |
| రఘుకులతిలక త్వం | సున్ద | 106 |
| రమ్భాస్తమ్భాః కరి | వర | 56 |
| రామానుజాంఘ్రిశరణః | వర | 102 |

| | | |
|---|---|---|
| రింఖాతో వ్రజసదనా | వర | 46 |
| రూపప్రకారపరి | వైకు | 55 |
| రూపశ్రియా గుణగణైః | వైకు | 80 |
| రూపశ్రియా పరమయా | వైకు | 28 |
| రూపేణ సద్గుణగణైః | వైకు | 43 |
| లక్ష్మ్యాః పదం కౌస్తుభ | సున్ద | 56 |
| లజ్జాయుద్ధహతాన్ | సున్ద | 124 |
| లభ్యేషు దుర్లభ | వైకు | 95 |
| లోకాం శ్చతుర్దశ | సున్ద | 81 |
| లోకే వనస్పతి | శ్రీస్త | 9 |
| లోలద్భి రిన్ద్రియ | వైకు | 94 |
| వకులధరసరస్వతీ | సున్ద | 12 |
| వజ్రధ్వజాఙ్కుశ | అతి | 4 |
| వజ్రాఙ్కుశధ్వజ | వైకు | 70 |
| వనగిరిపతి | సున్ద | 101 |
| వనాద్రినాథస్య | సున్ద | 74 |
| వన్దేయ సున్దర | సున్ద | 20 |
| వరద యది న | వర | 67 |
| వరద యదిహ | వర | 89 |
| వల్లికాశ్రుతిమత | వర | 4 |
| వంశం రఘో రను | అతి | 30 |
| వారాణసీదహన | సున్ద | 116 |
| వాహనాసనవితాన | సున్ద | 73 |
| విజ్ఞాపనామ్ | సున్ద | 129 |
| విద్వేషమానమద | వర | 76 |
| విభవం వివృణోతి | వర | 36 |

| | | |
|---|---|---|
| విలోకనై ర్విభ్రమ | వర | 96 |
| వివిశ్య విశ్వేన్ద్రియ | వర | 97 |
| వివేకధియ | వర | 65 |
| విశ్వస్య విశ్వవిధ | వైకు | 37 |
| విశ్వం ధియైవ విర | వైకు | 63 |
| విషయవిషధర | వర | 82 |
| విషయవిషయిణీ | వర | 87 |
| విస్రమ్భణం త్వయి | అతి | 60 |
| వృషగిరి రయ | సున్ద | 10 |
| వేణుక్వణప్రణయిని | అతి | 45 |
| వ్యాభాషితాభ్యధిక | సున్ద | 46 |
| వ్యాలమ్బికుణ్డల | సున్ద | 48 |
| వ్యూఢగూఢభుజజత్రు | సున్ద | 50 |
| శబ్దాది హేయ ఇహ | అతి | 8 |
| శమ్పాచలం బహుల | వర | 78 |
| శమ్భో రమ్భోరుహ | వర | 61 |
| శరణవరణవాగియం యాऽద్య మే | వర | 86 |
| శరణవరణ వాగియం యోऽదితా | వర | 84 |
| శశధరరింఖణా | సున్ద | 5 |
| శాస్త్రై రనాదినిధ | వైకు | 59 |
| శిఖరిషు విపినే | సున్ద | 103 |
| శీలః క ఏష తవ | అతి | 10 |
| శ్రవస శ్చ దృశ శ్చ | వర | 34 |
| శ్రీనిధిం నిధి మపార | వర | 2 |
| శ్రీమత్పరాంకుశ | అతి | 3 |
| శ్రీమద్వనాద్రిపతి | సున్ద | 55 |

| | | |
|---|---|---|
| శ్రీమన్తౌ హరిచరణౌ | సున్ద | 1 |
| శ్రీమన్మహావనగిరి | సున్ద | 87 |
| శ్రీరంగరాజచరణౌ | అతి | 5 |
| శ్రీవత్సకౌస్తుభ | వైకు | 74 |
| శ్రేయః కిరన్తు కిరణాః | అతి | 2 |
| స ఏష సౌన్దర్య | సున్ద | 9 |
| సఞ్జీవయన్నపి | అతి | 58 |
| సత్కర్మ నైవ కిల | వైకు | 88 |
| సత్యేవ గవ్యనిహవే | అతి | 38 |
| సదంససంసజ్జిత | సున్ద | 49 |
| సదాతనత్వేఽపి | వర | 100 |
| సదా షాడ్గుణ్యాఖ్యైః | సున్ద | 24 |
| సదా సమస్తం జగత్ | సున్ద | 27 |
| సద్బ్రహ్మాత్మపదైః | సున్ద | 16 |
| సన్తిదృశః శ్రుతి | వైకు | 27 |
| సమాహితైః స్సాధు | వర | 101 |
| సర్వజ్ఞా స్సముచిత | వర | 47 |
| సర్వశ్రుతిష్వనుగతం | వైకు | 23 |
| సర్వస్య చైవ గుణతః | వైకు | 48 |
| సర్వం గుణాయ గుణినామ్ | అతి | 43 |
| సవ్యాధిరాధిరవి | వర | 75 |
| సంవదేత కిల | వర | 10 |
| సంవర్తవర్తి నిఖి | వైకు | 53 |
| సంవర్తసంభృత | వైకు | 56 |
| సంశ్లేషే భజతాం | వర | 66 |
| సాగరామ్బరతమాల | సున్ద | 53 |
| సాచలావటతటాక | సున్ద | 91 |

| | | |
|---|---|---|
| సా పూతనా శకట | అతి | 34 |
| సాయామా ధృత పరి | వర | 42 |
| సాలా న్వి సప్త సగిరీన్ | అతి | 19 |
| సాలీయా ఇవ విటపా | వర | 44 |
| సింహాద్రినాథ తవ | సున్ద | 85 |
| సుఖస్పర్శై ర్నిత్యైః | సున్ద | 36 |
| సుచారుచాపద్వయ | సున్ద | 42 |
| సున్దరదోర్ద్విర్వ్యాజ్ఞా | సున్ద | 8 |
| సున్దరస్య కిల సున్దర | సున్ద | 58 |
| సున్దరస్య వనశైల | సున్ద | 72 |
| సున్దరాయతభుజం | సున్ద | 2 |
| సున్దరోరుభుజ | సున్ద | 110 |
| సురనరతిర్యగాది | సున్ద | 82 |
| సుసున్దరస్యాస్య తు వామ | సున్ద | 66 |
| సుసున్దరస్యాస్య పదార | సున్ద | 62 |
| సౌన్దర్యమార్దవ | సున్ద | 63 |
| సౌన్దర్యసారామృత | సున్ద | 67 |
| సౌన్దర్యాఖ్యా సరిత్ | వర | 55 |
| సౌన్దర్యామృతరస | వర | 50 |
| సౌన్దర్యామృతసార | సున్ద | 57 |
| సౌశీల్యాశ్రిత | సున్ద | 25 |
| స్తోత్రం నామ కిమామ | శ్రీస్త | 3 |
| స్మితనిర్ఝరికా | వర | 38 |
| స్వకై ర్గుణై స్స్వైః | వర | 94 |
| స్వపృష్ఠే ప్రష్ఠాద్రి | సున్ద | 93 |
| స్వస్తి శ్రీ ర్దిశతాత్ | శ్రీస్త | 1 |

| | | |
|---|---|---|
| స్వస్తి హస్తిగిరి | వర | 1 |
| హరికుల మఖిలం | సున్ద | 11 |
| హరితవారణభృత్య | సున్ద | 126 |
| హస్తిశైలనిలయో | సున్ద | 118 |
| హా జన్మ తాసు సిక | అతి | 51 |
| హా హన్త హన్త భవత | అతి | 29 |
| హా హన్త హన్త హతకో | వైకు | 84 |
| హే దేవ సున్దరభుజ | సున్ద | 88 |
| హే నన్దనన్దన | సున్ద | 113 |
| హే శ్రీ దేవి సమస్త | శ్రీస్త | 2 |
| హై కుదృష్ట్యభినివిష్ట | వర | 7 |
| హై నిర్భయోఽస్మ్యవి | వర | 74 |
| హై సున్దరైకతర | సున్ద | 107 |
| హై హన్త జన్తుషు | వైకు | 60 |




## అనుబంధం
## దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో, అరుంబదవివరణాలలో
## పంచస్తవి ప్రమాణాలు, వాటి ఆకరాలు

| | | | | |
|---|---|---|---|---|
| పెరియాళ్వా | – | 1-2-1 | | అతి-14 |
| పెరియాళ్వా | – | 2-1-7 | – | వరదరాజ-23 |
| పెరియాళ్వా | – | 4-2-1 | – | సుందర-3 |
| పెరియాళ్వా | – | 4-3-11 | – | వరద-16 |
| కణ్ణినుణ్ | – | 8 | – | శ్రీవైకుంఠ-2 |
| ఇరామానుశ | – | 70 | – | వైకుంఠ-90 |
| తిరుప్పావై | – | 7 | – | వైకుంఠ-77 |
| తిరుప్పల్లాండు | – | 4 | – | వైకుంఠ-77 |
| తిరుప్పావై | – | 28 | – | సుందర-107 |
| తిరువాయ్ | – | 1-5-1 | – | సుందర-107 |
| పెరియాళ్వా | – | 4-9-10 | – | వరద-63 |
| తిరుప్పావై | – | 28 | – | అతి-61 |
| తిరుప్పావై | – | 2-3-2 | – | అతి-14 |
| తిరుప్పావై | – | 1-2-10 | – | వైకుంఠ-36 |
| తిరుమాలై | – | 4 | – | వైకుంఠ-61 |
| తిరువాయ్ | – | 10-10-2 | – | వైకుంఠ-27 |
| తిరువాయ్ | – | 3-7-5 | – | శ్రీస్తవ-1 |
| తిరువాయ్ | – | 3-10-8 | – | శ్రీస్తవ-1 |
| పెరియాళ్వా | – | 4-2-5 | – | సుందర-8 |
| అమల | – | 3 | – | వరద-55 |
| తిరువాయ్ | – | 3-7-5 | – | శ్రీస్తవ-1 |
| తిరువాయ్ | – | 1-5-1 | – | సుందర-107 |
| తిరువాయ్ | – | 2-3-5 | – | వైకుంఠ-36 |
| తిరువాయ్ | – | 3-5-6 | – | వరద-18 |
| తిరువాయ్ | – | 1-5-1 | – | సుందర-107 |
| తిరువాయ్ | – | మహాప్రవేశం | – | వైకుంఠ-14 |

| | | | | |
|---|---|---|---|---|
| తిరువాయ్ | - | మహాప్రవేశం | - | వరద- |
| తిరువాయ్ | - | 1-1-1 | - | వరద-11 |
| తిరువాయ్ | - | 1-2-5 | - | వరద-81 |
| తిరువాయ్ | - | 1-3-1 | - | అతి-40 |
| తిరువాయ్ | - | 1-3-7 | - | వైకుంఠ-28- |
| తిరువాయ్ | - | 1-5-4 | - | అతి-15 |
| తిరువాయ్ | - | 1-5-6 | - | అతి-2 |
| తిరువాయ్ | - | 1-6-7 | - | అతి-32 |
| తిరువాయ్ | - | 1-8-4 | - | వరద-63 |
| తిరువాయ్ | - | 1-8-8 | - | సుందర-30 |
| తిరువాయ్ | - | 1-9-7 | - | వరద-25 |
| తిరువాయ్ | - | 2-1-2 | - | వరద-81 |
| తిరువాయ్ | - | 2-2-5 | - | వైకుంఠ-37 |
| తిరువాయ్ | - | 2-3-4 | - | వైకుంఠ-37 |
| తిరువాయ్ | - | 2-5-2 | - | వైకుంఠ-30 |
| తిరువాయ్ | - | 2-6-4 | - | వైకుంఠ-28 |
| తిరువాయ్ | - | 2-10-2 | - | వరద-78 |
| తిరువాయ్ | - | 2-10-4 | - | సుందర-5 |
| తిరువాయ్ | - | 2-10-5 | - | అతి-56 |
| తిరువాయ్ | - | 3-1-1 | - | వరద-25 |
| తిరువాయ్ | - | 3-1-1 | - | సుందర-63 |
| తిరువాయ్ | - | 3-1-2 | - | శ్రీస్తవ-8 |
| తిరువాయ్ | - | 3-1-2 | - | శ్రీస్తవ-3 |
| తిరువాయ్ | - | 3-1-5 | - | వైకుంఠ-36 |
| తిరువాయ్ | - | 3-2-ప్రవేశం | - | వరద-18 |
| తిరువాయ్ | - | 3-2-10 | - | వరద-77 |
| తిరువాయ్ | - | 3-4-3 | - | వరద-25 |
| తిరువాయ్ | - | 3-4-7 | - | వరద-81 |

| | | | | |
|---|---|---|---|---|
| తిరువాయ్ | - | 3-4-7 | - | వైకుంఠ-37 |
| తిరువాయ్ | - | 3-5-ప్రవేశం | - | వరద-78 |
| తిరువాయ్ | - | 3-5-6 | - | వరద-17 |
| తిరువాయ్ | - | 3-5-6 | - | సుందర-127 |
| తిరువాయ్ | - | 3-5-8 | - | వరద-63 |
| తిరువాయ్ | - | 3-8-ప్రవేశం | - | వరద-34 |
| తిరువాయ్ | - | 4-5-8 | - | సుందర-63 |
| తిరువాయ్ | - | 4-7-3 | - | వైకుంఠ-61 |
| తిరువాయ్ | - | 4-7-6 | - | వరద-23 |
| తిరువాయ్ | - | 4-10-ప్రవేశం | - | సుందర-16 |
| తిరువాయ్ | - | 4-10-5 | - | వైకుంఠ-14 |
| తిరువాయ్ | - | 4-10-9 | - | వైకుంఠ-14 |
| తిరువాయ్ | - | 5-1-11 | - | వరద-23 |
| తిరువాయ్ | - | 5-5-3 | - | సుంధర-36 |
| తిరువాయ్ | - | 5-5-4 | - | వరద-25 |
| తిరువాయ్ | - | 5-5-9 | - | వరద-25 |
| తిరువాయ్ | - | 5-5-9 | - | వైకుంఠ-28 |
| తిరువాయ్ | - | 6-5-8 | - | వైకుంఠ-49 |
| తిరువాయ్ | - | 6-9-8 | - | వరద-83 |
| తిరువాయ్ | - | 6-10-10 | - | శ్రీస్తవ-1 |
| తిరువాయ్ | - | 7-5-1 | - | అతి-17 |
| తిరువాయ్ | - | 9-2-3 | - | వరద-63 |
| తిరువాయ్ | - | 10-10-2 | - | వరద-63 |
| అమల-2 | - | వరద-25 | | |
| తిరువాయ్ | - | 1-2-10 | | వైకుంఠ-36 |
| తిరువాయ్ | - | 3-5-6 | | వరద-18 |
| పల్లాణ్డు | - | వైకుంఠ-77 | | |
| తిరువాయ్ | - | కణ్ణినాణ్-4 | - | వైకుంఠ-2 |
| తిరుప్పావై-7 | - | వైకుంఠ-77 | | |



# రహస్యగ్రంథ వ్యాఖ్యానాలలో ఉట్టంకింపబడ్డ పంచస్తవి శ్లోకాలు, వారి ఆకరాలు

శ్రీవచన -17 సూ - వరద -79
శ్రీవచన - 145 - అతిమానుష -53
శ్రీవచన- 291 - వైకుంఠ - 88
శ్రీవచన - 358 - వరద -76
తత్త్వత్రయ చిత్ ప్రకరణ వ్యాఖ్యానం - 39 - వైకుంఠం 74
తత్త్వత్రయ చిత్ ప్రకరణ వ్యాఖ్యానం- 45 - సుందర-3
తత్త్వత్రయ అచిత్ ప్రకరణ వ్యాఖ్యానం- 3 - శ్రీస్తవం -3
తత్త్వత్రయ అచిత్ వ్యాఖ్యానం - ఈశ్వర - 8 - సుందర -26
తత్త్వత్రయ చిత్ వ్యాఖ్యానం - ఈశ్వర - 9 - వరద-15
తత్త్వత్రయ చిత్ వ్యాఖ్యానం - ఈశ్వర - 11 - వరద- 63
తత్త్వత్రయ చిత్ వ్యాఖ్యానం - ఈశ్వర - 22 - వైకుంఠ -55
తత్త్వత్రయ చిత్ వ్యాఖ్యానం - ఈశ్వర - 33 - వరద - 17
తత్త్వత్రయ చిత్ వ్యాఖ్యానం - ఈశ్వర - 45 - వరద - 16
తత్త్వత్రయ చిత్ వ్యాఖ్యానం - ఈశ్వర - 54 - వరద - 17
తత్త్వత్రయ చిత్ వ్యాఖ్యానం - ఈశ్వర - అతి-9
తత్త్వత్రయ చిత్ వ్యాఖ్యానం - ఈశ్వర - 55 - సుందర - 86
రహస్యత్రయ సారం - ప్రధానప్రతి తంత్రార్థం - వైకుంఠ -36
రహస్యత్రయ సారం - తత్త్వత్రయచింతనాధికారం - వరద-16
రహస్యత్రయ సారం - పరదేవతా పారమార్థ్యాధికారం - వైకుంఠ- 55
రహస్యత్రయ సారం - అధికారి విభాగాధికారం - అతిమా - 61
రహస్యత్రయ సారం - అధికారి విభాగాధికారం - వరద -84
రహస్యత్రయ సారం - ఉత్తరకృత్యాధికారం - వైకుంఠ -61, 77
రహస్యత్రయ సారం - సిద్ధోపాయశోధనాధికారం - వైకుంఠ - 36
రహస్యత్రయ సారం - సిద్ధోపాయశోధనాధికారం - శ్రీస్తవ- 1, 8
రహస్యత్రయ సారం - సిద్ధోపాయశోధనాధికారం - అతిమానుష- 61
రహస్యత్రయ సారం - సిద్ధోపాయశోధనాధికారం - వరద - 84, 88, 92, 81

